# తంజావూరు తెలుగుకవులు

గ్రంథకర్త

శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి
అష్టావధాని

పబ్లిషర్స్

శ్రీ అరుణా బుక్ హౌస్
103, నారాయణ మొదలి వీధి
మద్రాస్-600001

# ముందు మాట

విజయనగర సమ్రాట్టుల సామంత నృపాలురనదగిన నాయక రాజుల చరిత్ర దక్షిణ భారత దేశచరిత్రలోనే కాక తెలుగు సాహిత్య చరిత్రలో కూడ మరచిపోదమన్నను మరపునకు రాని మధురాధ్యాయము! 'మేరు సమానధైర్య యశస్తిలకులు', బాహుబల సంపన్నులు నైన ఆ తెలుగు దొరల యేలుబడిలో దక్షిణాపథమున తెలుగువాణి స్వైరవిహారము సలుపుటయేకాక ఆమెకు పెండ్లి పందిళ్లు సైతము వెలసినవి. ముఖ్యముగా తంజావూరు మధుర మున్నగు ప్రాంతములలో తెలుగు మాటకు తెలుగు పాటకు నొక క్రొత్త చెలువము నొక క్రొత్త చక్కదనము చేకూడినవి. సరస సంగీత సాహిత్యములను సమాదరించి సాహితీ ప్రపంచమున యశోవిశాలురై ప్రతిభాసించిన గరీయః ప్రతిభులు నాయక రాజులు. శిల్ప చిత్రలేఖనాది సుకుమార కళలకు పాదులు పెట్టి, పెంచి పెద్దచేసిన ప్రముఖ కళారాధకులు వారు. ప్రజోపయోగార్థము తటాక కూపాది సప్తసంతానములు వెలయించి మహిత యశస్సు సముపార్జించిన మహనీయులు వారు. సంగ్రహముగా పేర్కొన వలెనన్నచో వారెంత కళాహృదయులో అంత ప్రజాహితైషులు; ఎంత సాహిత్యాభిమానులో అంత రసహృదయులు. కనుకనే వారు విశాలమైన మత సహిష్ణుతను ప్రదర్శింపగలిగినారు. సహనమే సంస్కృతి అను నిర్వచనమునకు లక్ష్యముగా వారు తమ జీవితములను తీర్చి దిద్దుకొన గలిగినారు. అట్టి మహనీయులు చరిత్ర వినువీథిలో ధ్రువతారలై ద్యోతించుటలో ఆశ్చర్యము ఆవంతయు లేదు!

ఈ నాయకరాజులు దొరతనము సాగించిన ఆ నాళ్ళలో— అనగా క్రీస్తుశకము 15, 16, 17 శతాబ్దులలో— తెలుగువారనేకులు దక్షిణా పథమునకు తరలిపోయిరి. వారిలో కొందరు కోదమ సింగమునైనను అదలింపగల వీర యోధులు. మరికొందరు కమనీయ

కవితా మూర్తు లనదగిన కవిశేఖరులు. ఇంకను కొందరు సరస్వతిని
సాక్షాత్కరింపజేసికొన్న పండితులు; వేదశాస్త్రములను ఆపోశనము
పట్టిన పురోహితులు; కమనీయ గాంధర్వ విద్యలో గడితేరిన
గాయనీ గాయకులు; చూపరను సంభ్రమాశ్చర్య చకితులనుగా
చేయజాలిన నట్టువ కత్తెలు. ఒకరా యిద్దరా! వివిధ రంగములలో
విలక్షణమైన శక్తిని సముపార్జించిన ప్రముఖు లెందరెందరో తరలి
పోయిరి. వారిలో పలువురు దక్షిణభారతములోనే వివిధప్రాంతములలో
స్థిరనివాసము లేర్పరచుకొనిరి. తమిళ సాహిత్యమునకు శ్రీకారము
చుట్టిన సంగయుగములో వర్ధిల్లిన ఒక కవి పేర్కొనినట్లుగా, తమిళ
నాడునకు తరలిపోయిన తెలుగువారు 'అన్నియు మనవూళ్ళే' అని
విశ్వసించినారు. వారి సంతతులకు తమిళనాడే పుట్టిల్లయినది; స్థానికు
లతో సన్నిహిత సంబంధము సైతము ఏర్పడినది. అయినను స్వభా
షను మాత్రము వారు విస్మరింపలేదు. ఉగ్గుతో అలవడిన తమ
భాషలో కొందరు కవిత లల్లినారు; కొందరు గీత రచన కావించి
నారు. అన్య భాషాద్వేషదూషితము కాని స్వభాషాభిమానము
వారిది!

నేటికిని తమిళనాడులో తెలుగు మాటయు పాటయు శ్రవో
యుగళిలో మారుమ్రోగుచున్నదనగా, తెలుగు కుటుంబములు తమ
సంస్కృతిని సంరక్షించుకొనుచు నివసించుచున్న వనగా, అందుకు
ప్రధానహేతువు ఆ నాళ్ళలో తెలుగువారు దక్షిణభారతమునకు
తరలిపోవుటయే అనవచ్చును. తెలుగు వ్యవహరించువారు కొన్ని
లక్షలమంది తమిళదేశపు జనపదములందును పట్టణములందును నివ
సించుచున్నట్లు భావింపబడుచున్నది. భారతావనిలో ఆంధ్ర ప్రదేశ
మును పరిహరింపగా, తమిళనాడులో ఉన్నంతమంది తెలుగువారు
మరి యే యితర రాష్ట్రము నందును లేరనుట సత్య సన్నిహితము!

మధుర నాయక రాజులు తటాక కూపములు, గుళ్ళు గోపు
రములు, సత్రములు చావడులు మున్నగు వానిని నిర్మించి చరిత్రలో
స్థానము సంపాదించుకొనగా, తంజాపురాంధ్ర నాయకరాజులు
ఆలయ నిర్మాణముతోపాటు సంగీత సాహిత్యములను బహుధా ఆద

రించి లబ్ధప్రతిష్ఠులయిరి. చిత్రమేమనగా, తంజాపురాంధ్ర నాయక రాజులకు పిమ్మట తంజ నగరము నేలిన మహారాష్ట్ర నృపతులు సైతము తెలుగుభాషా సాహిత్యములను యథాశక్తిని పోషించిరి; కవిపండితులను ఆదరించిరి. అంతేకాదు; మహారాష్ట్రులు కొందరు తెలుగులో కృతికర్తలై తెలుగు సాహిత్యమును సుసంపన్న మొనర్చుటకు తోడ్పడినారు. అనగా, చొక్కపు తెలుగు పలుకు తెలుగ్గులు కాని వారిని కూడ ఎంతగానో అలరింప గలిగినదన్నమాట!

తంజాపు రాంధ్రకవులలో ప్రముఖుడైన కామరసు వేంకటపతి సోమయాజి తంజాపురమును చోళదేశపు మంజీరమనియు, భూరమణీ మణిహార మనియు, సంపదల కొటార మనియు అభివర్ణించినాడు. విద్యాభోజులు విలసిల్లిన పురమది! నాటకశాలలు నెలకొన్న పట్టణ మది! చరిత్ర ప్రసిద్ధిగన్న అట్టి చోళమండలమును (తంజావూరు) తెలుగు భాషాసాహిత్యములకును తెలుగు సంస్కృతికిని రంగస్థలముగా తీర్చిదిద్దిన అలనాటి ప్రభువులు పండితులు కవులు మున్నగు వారందరు ప్రభాతస్మరణీయులు. వారి కృషివలన దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము వెలుగు చూడగలిగిన దనుట నిర్వివాదము. ఈ వాఙ్మయము తెలుగు సాహిత్య చరిత్రమున కొక విశిష్టత నాపాదించినది. అంతకు పూర్వము తెలుగు సాహిత్యములో వెలువడని యక్షగాన, నాటక, వచన, గేయరచనా ప్రక్రియలు ఈ దక్షిణదేశాంధ్ర వాఙ్మయములో వెలువడి సంగీతసాహిత్య మర్మజ్ఞుల నలరించుటయే కాక వారి ఆదరాభిమానములను కూడ చూరగొనగలిగినవి. కవయిత్రులు పలువురు రంగస్థలము నలంకరించుటతో దక్షిణాంధ్ర వాఙ్మయమున కొక ప్రత్యేకత కలుగుటయేకాక ఆంధ్రసాహిత్యమునకే అపూర్వశోభ కలిగినట్లయినది. కాగా తంజావూరు తెలుగు కవులను గురించి తెలిసికొనుట అవశ్య కర్తవ్యమే కాదు అభిలషణీయముకూడ. అందుకు ప్రకృత గ్రంథము బహుధా ఉపకరించు ననుట నిస్సందేహము. ఈ ప్రశస్త రచనమును పండితపామర రంజకముగ వెలయించిన విద్వద్వరేణ్యులు అష్టావధానులు నైన శ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారి కృషి కొనియాడదగినది.

తంజావూరు తెలుగు కవులు పదునొకండు అధ్యాయముల గ్రంథము. కవితా మమదేవతా అను ప్రథమాధ్యాయములో ఆది కవి నన్నయ మొదలుకొని ఆంధ్ర కవితా పితామహ ఖ్యాతిని పొందిన పెద్దనవరకు సాగిన తెలుగుకవిత దిఙ్మాత్రముగ అభివర్ణితము. పూర్వాంధ్రకవుల తీరు తెన్నులను గ్రహించుటకు ఈ అధ్యాయము తోడ్పడు ననుటలో సందేహము లేదు. అభినవ కృష్ణదేవ రాయ లనదగు రఘునాథ నాయకుని కావ్య విమర్శ రెండవ అధ్యాయములోని యితివృత్తము. ఆ తరువాతి అధ్యాయములో సాహితీ భోజుడైన రఘునాథనాయకుని కొలువుకూటములో సాగిన కవితా గోష్ఠి కనులకు కట్టినట్లు వర్ణింపబడినది. 'ఇంటిపేరు నస కవిత్వము పస' అను నానుడికి కారణభూతుడైన చేమకూర వేంకటరాజ కవికి సంబంధించిన చర్చ నాలుగవ అధ్యాయములో అందాలు దిద్దుకొనినది. ఆ తరువాతి అధ్యాయములో కృతికర్తయు కృతిభర్తయునైన విజయరాఘవ నాయకుని సాహిత్యసేవ వివరింపబడినది. ఆరవ అధ్యాయమున అతులితాష్ట భాషాకవితా విశారద అయిన పసుపులేటి రంగాజమ్మ కమ్మని కవిత ముచ్చటింపబడినది. సంస్కృతాంధ్రముల లోనేకాక ఛందశ్శాస్త్రమునందును ప్రజ్ఞాధురీణుడైన చెంగల్వ కాళ కవిని మనము ఏడవ అధ్యాయములో దర్శింపవచ్చును. ఎనిమిదవ అధ్యాయములో ముద్దుపళని కవిత చర్చనీయాంశము. ఆ తరువాతి అధ్యాయత్రయములో తంజావూరు తెలుగుకవుల రచనా వైలక్షణ్యము, యక్షగానములు, వైష్ణవమత ప్రభావము మొదలైన పెక్కు విషయములు చర్చింపబడినవి. అలవోకగా నైనను పదునొకండు అధ్యాయముల యీ గ్రంథమును పరిశీలించినచో తంజావూరు తెలుగుకవులు చేపట్టిన వివిధ సాహిత్య ప్రక్రియల స్వరూపమును పాఠకుడు గ్రహించుననుట చర్వితచర్వణము.

తంజావూరి తెలుగుకవుల రచనా వైలక్షణ్యమును బాగుగా గ్రహింపవలెనన్నచో అంతకుపూర్వము వెలువడిన సాహిత్యమును విమర్శాత్మకముగా పరిశీలింపవలెను. అప్పుడే ఆ వైలక్షణ్యము స్పష్ట మగును. కేవలము ఆ యా కవుల రచనలను పరిశీలించిన,

వారి పాండిత్య ప్రతిభావిశేషములు బయల్పడునేకాని వారిలోని విశిష్టత అంతగా బయల్పడదు. విశిష్టత లోపించిన రచన వాసనారహిత ప్రసూన మగుటయేకాక దానికి సాహిత్యచరిత్రలో సముచితమైన స్థానము లభింపదు. ఈ విషయమును గ్రహించిన వారగుటచే, రచయిత అవకాశము లభించినప్పుడెల్ల తులనాత్మక పరిశీలన మొనర్చి కావ్యగత విశిష్టతను పాఠకుని మనస్సులో హత్తుకొనునట్లుగా వివరించుట ఎంతయు ముదావహము. గ్రంథకర్త అవలంబించిన యీ విధానము ప్రశంసార్హము.

'తెనుగు కవితకు నిజమగు తెనుగుతనము కలిగించినవారు తంజావూరు నాయకరాజులు; వారి కవులు'—ఇది గ్రంథకర్త అభిప్రాయము. ఈ యభిప్రాయమును సోపపత్తికముగ నిరూపించుటయు జరిగినది. తంజావూరు తెలుగు కవులు కొందరికి సమకాలికులైన తెలుగు దేశపు కవుల రచనలను గ్రహించి వానిలో తెనుగుతన మెట్లు లోపించినదో రచయిత స్పష్టము చేసినారు. ఒక ఉదాహరణము: నాయక రాజులకు పిమ్మట మహారాష్ట్రులు తంజాపురము నేలిరి. పాలకుల భాషయా మహారాష్ట్రము. దేశభాషయా తమిళము. ఆ పరిస్థితిని చక్కగా గ్రహించి ముద్దుపళని ఆ నాటి వ్యావహారిక భాషకు తెలుగు దేశీయతను జతపరచినది; నలుగురికి తేటతెల్లమగు శైలిలో రచన సాగించినది. కాని ఆమెకు కొంచెె మించుమించు సమకాలికులైన తెలుగుదేశపు కవులు తాము వ్రాయునది తెలుగు భాషా కవిత్వమను విషయమునే విస్మరించి తమ సంస్కృత భాషా పాండిత్యమును ప్రదర్శించిరి. తత్ఫలితముగా '...సంత్రాస మదేభ కుంభ పిసిత గ్రహాలాలస శీల సాగ్రహోగ్రేసర భాసమాన...' వంటి దీర్ఘ సమాసములతోడి పద్యరచనను పండితలోకము వరించినది. ఈ కోవకు చెందిన సమాసములు సంస్కృత కావ్యములలో గోచరించునో లేదో అను సందేహమును సంస్కృతాంధ్ర విద్వాంసులైన శ్రీ శాస్త్రిగారు వెలిబుచ్చిరి. సంస్కృత భాషాప్రియులైన తెలుగు కవులు సమాస భూయిష్ఠమైన పద్యరచన చేయగా తంజావూరు తెలుగుకవులు తమ కవితను తెనుగుతనముతో రంగరించి స్వభావాభి

మానము ప్రకటించుకొనుట నిజముగానే పేర్కొనదగిన గొప్ప విషయము. కనుక వారు తెలుగు సాహిత్యమునకు చేసిన యుప కారము విస్మరింపరానిదని రచయిత భావించుట అసమంజసము కాదు.

అటులనే రఘునాథ నాయకుని గురించి ప్రస్తావించుచు రచయిత తమ అభిప్రాయము నిట్లు స్పష్టము చేసిరి. ''వీని రచనలో పూర్వకవుల ముమ్మరంబులగు సంస్కృత సమాసముల యాడంబరంపు వాద్యఘోషములను దిగవిడిచి, తెనుగు కవిత, తెనుగుతనమును అలవరచుకొనినది. వ్యావహారికము లయిన వాడుకపదముల పొందికతో విసర్గమైన మృదుత్వమును వహించినది.''

ఈ సందర్భమున రచయిత దర్శించిన నన్నయను కూడ పరిశీలించుట అవసరము. ఆదికవి రచనలో దీర్ఘములగు సంస్కృత సమాసములు తత్సమములును చుబ్బన చూరలు. నన్నయ నాటి కాశైలి అనివార్యమయినది. శబ్దప్రియులైన శాస్త్ర పండితులను సంస్కృత విద్వాంసులను మెప్పించుటకై ఆయన అక్షర రమ్యతను ఆదరింపవలసి వచ్చినది. అయినను తాను వ్రాయుచున్నది తెనుగు భారతమను మాటను మరచిపోలేదు. నన్నయ లోకజ్ఞుడు! కనుకనే సమయము వచ్చినప్పుడెల్ల ఆయన దేశీయమైన తెలుగు కవితలోని తీయందనమును తెలియజేసి తరువాతి వారికి తెలుగునందు ఆదరాభిమానములు కలిగించినాడు. అంతే కాక నన్నయభట్టు సమాస రచనలో శ్రవణ సుభగత్వ మున్నది. అది మువ్వల సవ్వడిని తలపించును; పాఠకలోకమును మురిపించును. సంస్కృత పదభూయిష్ఠమైన శైలిని ఉపయోగించినందుకు నన్నయను విమర్శించువారు కొందరు లేకపోలేదు. కాని ఆ కాలపు పరిస్థితులను మనసునందుంచుకొని విమర్శకు దిగుట సమంజసము. ఏది యెట్లున్నను, శ్రీ లక్ష్మీకాంత శాస్త్రిగారు నుడివినట్లుగా ''కవితాపాకమునకు సంస్కృత తత్సమములు లవణప్రాయములు. వానిని తగుమాత్రముగా వాడినచో కావ్యము మధురాతి మధురముగా నుండును. పరిమితిని మించినపుడు వెగటుగా నుండును. మానవలోకము పరిహసించును. తక్కువయి

నప్పుడు రుచికి లోపము కలుగును.'' కాగా సంస్కృత సమాసముల తోడి పద్యరచనయు అలరింపలేదు; అటులనే అచ్చతెనుగు మాటల కూర్పు సైతము రుచింపదు. ఈ విషయాదికమును పురస్కరించుకొని చూచినప్పుడు తంజావూరు తెలుగు కవుల రచనా వైలక్షణ్యము కొట్టవచ్చినట్లు తెలియగలదు. చవీ చక్కన కల దేశీయములతో గుచ్చెత్తిన శైలి వారిది. కనుకనే వారి కృతులు ఒకపాటి అక్షరాస్యులకును ప్రీతిపాత్రము లగుచున్నవి.

శ్రీ శాస్త్రిగారి పరిశీలన మెంత నిశితమో, ఆయన దృక్పథ మంత విశాలము. రంగాజమ్మ వేశ్య అనియు, విజయరాఘవ నాయకుని యుంపుడుకత్తె అనియు సాహితీ వేత్తల అభిప్రాయము. విద్యా వివేక సంపన్నురాలు, రాజనీతి విశారదయునైన ఆమె కులముచేత వేశ్య కావచ్చునేమో కాని విజయరాఘవ నాయకుని యుంపుడు కత్తె కాదనియు, యధాశాస్త్రీయముగ అత డామెను పరిణయ మాడెననియు, కనుక ఆమె అతని ధర్మపతి అగుటలో సందేహము లేదనియు శ్రీ శాస్త్రిగారి అభిప్రాయము. అందుకు సాక్ష్యముగా రాజకుల గురువగు శ్రీనివాస తాతాచార్యులవారి మాటలు నుట్టంకించినారు. అదియు చాలదనుకొని కాబోలు ధర్మపత్ని అన్నంత మాత్రమున పట్టమహిషి కానక్కరలేదనియు, శాస్త్రవిధిగా పరిణీత అగుచో చాలుననియు పేర్కొనిరి. అటులనే ముద్దుపళనిని గురించి వ్రాయుచు, వేశ్య అయినంత మాత్రమున ఆమెను నిరసింప పని లేదనియు, కులమునకును విద్వత్తునకును సంబంధము లేదనియు రచయిత సహేతుకముగ పేర్కొనుట గమనింపదగిన అంశము.

తంజావూరు తెలుగు కవులు వెలయించిన కృతులలో తల మానికము విజయవిలాసము. తత్కర్త చేమకూర వేంకటరాజకవి వేశ్యాతనయుడను అపప్రథ ఒకటి పండిత లోకములో కలదు. కాని అది అసమంజసమని శ్రీ శాస్త్రిగారి మతము. తలిదండ్రుల పేర్లు తెలుపని కవుల కులమును శంకింపనట్లే, కుల గోత్రములు తెలుపని వేంకటకవి కులమును కూడ శంకింపరాదని ఆయన యుక్తి యుక్తముగ పేర్కొనిరి. కాని పోతన అతి లౌక్యుడనియు, రామభక్తుడు

కాడనియు, అతడు రసికాగ్రగణ్యుడనియు రచయిత అభిప్రాయము. అటులనే తిక్కనగారి హరిహర స్వరూప కల్పనము ఊహామనోహర మయినను శాస్త్రవిరుద్ధ మని ఆయన అభిప్రాయపడిరి. నేడు వ్యవహారము నందున్న అభిప్రాయముల కివి విరుద్ధముగా నున్నను, ప్రతి రచయితయు కొన్ని అభిప్రాయములు కలిగియుండుననుటలో విప్రతిపత్తి లేదు కనుక, వీనిని పర్యాప్తముగ పరిశీలించుట అవసరము.

రమారమి 90 పుటలలో సాగిన రఘునాథనాయకుని కావ్యచర్చ గ్రంథకర్త నిశిత దృష్టికిని తులనాత్మక పరిశీలనమునకును ఒక నిదర్శనము. తంజావూరు నాయక రాజులలో అగ్రగణ్యుడైన రఘునాథ నాయకుని కొలువు కూటములో విదుషీమణులకు స్థానము లభించెను; కనకాభిషేక గౌరవము కూడ లభించెను. ఆ రాజకవి రామాయణము రచించెను. ఎవరు రామాయణము వెలయించినను వారికి మాతృక వాల్మీకమే. తెలుగులో రామాయణము లెన్నో వెలసినను, వానిలో దేనికిని వాల్మీకి రామాయణమునకున్న గౌరవము రాలేదనుట నిజమునకు దగ్గరి చుట్టము. ఈ విషయమునే గ్రంథకర్త స్పష్టము చేయుచు, "ఎవరెన్ని విధముల పాటుపడినను సంస్కృతమున వాల్మీకి రామాయణమున కున్న గౌరవము తెనుగు భాషయందు రాలేదు. రాదు. రాబోదు" అని పేర్కొనిరి. కొంచెము గట్టిగానే చెప్పినట్లు నేను తలచుచున్నాను. ఆశావాదినైన నేను 'భవిష్యత్తులో రావచ్చునేమో' అని అభిప్రాయపడుచున్నాను.

వాల్మీకము ననుసరించి వ్రాయబడినను, రఘునాథ రామాయణము స్వతంత్రకావ్యమని నుడువ దగును. అది వాల్మీకి రామాయణాంతర్గతమైన కథకు అనువాదమే కాని ఆంధ్రీకరణము కాదని రచయిత సహేతుకముగ పేర్కొనిరి. రఘునాథుని కృతిలో ఒక్కొక్కచోట కథ కూడ సందర్భానుసారముగ మార్చబడినది. అటువంటి సన్నివేశములను రచయిత మూలమును తెలుగు సేతను ఉదాహరించి వివరించినారు. కొన్నిచోట్ల రఘునాథుడు కథను పెంచి వ్రాసినాడు. మొత్తము మీద రఘునాథుని రచన నన్నయాదులు వేసిన త్రోవలో సాగినట్లు స్ఫురించకపోదు.

ఈ సందర్భమున ఒక్క విషయమును మనము స్ఫురణకు తెచ్చుకొనుట అవసరము. మన పూర్వకవు లెవ్వరును యథాను వాదములు చెయ్యలేదు. అసలు వారా ప్రయత్నము చేసినట్లును కనిపించదు. కథను మాత్రము యథామాతృకముగా అనువదించిరి. కడమ విషయములందు స్వాతంత్ర్యము వహించిరి. భావప్రధానమైన కవితను పరివర్తించుటకు ఈ విధానము సర్వవిధముల అర్హమైనదని భావింపదగును. కనుక నే నన్నయాదుల రచనలు మూలవిధేయముగా నున్నట్లు కనిపించుచు పఠన యోగ్యములై పాఠకలోకమును అల రించుచున్నవి. పఠనయోగ్యత లోపించిన రచన నిర్గంధ కుసుమము!

రఘునాథ రామాయణము స్వతంత్ర కావ్యమనియు, అందులో వాల్మీకమునందు కానరాని స్వతంత్ర కల్పనలు పెక్కు కలవనియు రచయిత ఉదాహరణ పూర్వకముగ తెలియజేసిరి. ముఖ్యముగా ఋష్యశృంగుని వృత్తాంతము మధుర మోహనమైన రచన. అది రసవద్రచన మన్నను సాహసము కాదు. హాస్యమునకు హాస్యము, కల్పనలకు కల్పనలు మున్నగునవి అందాలు దిద్దుకొన్న యీ కథా ఘట్టము వాల్మీకములో లేకపోవుట ఆ కృతికొక లోపమని శ్రీ శాస్త్రిగారు తెలియజేసినారు. రఘునాథనాయకుని యీ రసవంత మైన రచన మూలమునకు మెరుగుపెట్టినట్లు ఆయన అభిప్రాయము. ఈ కథాఘట్టమును భారతాంధ్రీకరణముతో పోల్చుచు, నన్నయా దులు ఉన్నదానికి వన్నెచిన్నెలు దిద్ది మూలమునకు మెరుగుపెట్టినా రనియు, ఆధారము లేనిచోట అందమైన కల్పనలుచేసి మూలమును మించిపోయిన రాజకవి రఘునాథనాయకు డనియు రచయిత తమ అభిప్రాయమును సుస్పష్ట మొనర్చినారు. కాని మన దురదృష్టము! పాత్రపోషణకు ప్రాధాన్య మొసగిన రఘునాథనాయకుడు తన రామాయణమును పూర్తిచేయలేక పోయెను. అది కనుక పూర్తియై యున్నచో, దానికి భారతమునకు లభించినంత ప్రచారము లభ్యమై యుండెడి దనియు, తెలుగులో రామాయణ లోపము తీరియుండెడి దనియు గ్రంథకర్త అభిప్రాయము. ఉన్నంతలో రఘునాథరామా యణము ప్రశస్తమైన రచన మనుట పొల్లుకాదు. ఇతర తంజా

వూరు తెలుగుకవుల కృతులలో వలె, అందులోను పెక్కు మాండలికములును దేశీయములును తావు కల్పించుకొన్నవి. ఆ రాజకవి కావ్యములలో వాల్మీకి చరిత్రము కూడ ప్రశస్తమైనదే. రసము ననుసరించి భావప్రకటనయు, భావము ననుసరించి పద్యరచనయు సాగుటచే ఆ కృతికి చిరంజీవిత్వము చేకూరినది. కాని వాల్మీకి చరిత్రములో వర్ణనలకు అధిక ప్రాధాన్యము లభించినది. కథయేమో అత్యల్పము! ఈ విషయమునుకూడ శ్రీ శాస్త్రిగారు స్పష్టముచేసి, కావ్య విమర్శలో గుణదోషముల చర్చకు సమప్రాధాన్యము కలదను అంశమును సమర్థించిరి.

కావ్య విమర్శచేయుచు నడుమ నడుమ శ్రీ శాస్త్రిగారు పెక్కు విషయములు చర్చించినారు. అటుల చర్చకు గురి అయిన అంశములలో ఒకటి తెలుగుకవుల స్వప్నవృత్తాంతము. కవులకు స్వప్నములలో వారి యిష్టదైవములు ప్రత్యక్షమై ఒకానొక కావ్యము వ్రాయుమని కోరుటను ప్రాచీనాంధ్ర కావ్యములు కొన్నిట మనము చూడవచ్చును. ఇది కాళిదాసాది సంస్కృత మహాకవుల కృతులలో కనిపించదు. ఈ విషయమై ప్రస్తావించుచు శ్రీ శాస్త్రిగారు "...దైవము కృతినర్థించుట వలననే కావ్యమునకు ఘనత రానేరదు. రసవత్తరమైన కవిత యుండవలయును" అని మొగమోటము లేకుండ తమ మనసులోని మాటను తెలియజెప్పిరి. ఇట్టివే మరి కొన్ని అభిప్రాయములీ గ్రంథమున కలవు. సందర్భము ననుసరించి తగుమాత్రముగా రచయిత అలంకార చర్చ చేసినారు; ఛందో వ్యాకరణాదుల ప్రశంస కావించినారు. స్వానుభవమునుండి రుచికరములైన కొన్ని విషయములు తెలియజేసినారు. ఇవియన్నియు సాహిత్య జిజ్ఞాసువులకు గోరుముద్దలు.

సరళ సుందరము సలక్షణమునైన భాషలో సాగిన యీ విమర్శక గ్రంథమున తంజావూరు తెలుగుకవులలో ప్రముఖులైన వారిని గురించి సాధికారముగా చెప్పబడినది. ఒకవిధముగ చూచినచో దీనిని ప్రాచీనాంధ్రకవిత్వపు సంగ్రహచరిత్ర మనవచ్చును. నన్నయనుండి ముద్దుపళనిదాక వెలువడిన తెలుగు కవిత్వపు తీరు

తెన్నులు స్థూలారుంధతీ న్యాయముగా తులనాత్మకముగా ఈ గ్రంథమున పరిశీలింపబడుటయే ఇట్లనుటకు ప్రధాన హేతువు. ఈ కారణము వలన ఈ రచనకు విశిష్టత కలిగినది.

మరియొక విశిష్టతయు ఈ గ్రంథమునకు కలదు. తులనాత్మకముగా రచన సాగుటచే, ఆ యా కవుల రచనములలోని మంచి సెబ్బరలు వివరింపబడినవి. ప్రాచీనులని నన్నయాదులను పొగడలేదు; నవీనులని రఘునాథ నాయకాదులను తెగడలేదు. రచయిత సమదృష్టి అవలంబించుటవలన, విమర్శ సహేతుకముగా సరసముగా సాగినది. "పూర్వకృతులలోని మంచి చెడుపుల కన్నిటికి తలయూపుట నా పద్ధతి కాదు. లోపములు వెలిబుచ్చుటలో తప్పు లేదు" అని రచయిత పేర్కొన్న మాటలు ఆయన సత్యదృష్టిని స్పష్టము చేయుచున్నవి. విమర్శకుడు దోషైకదృక్కు కాకూడదు; గుణములను మాత్రమే భూషించు భట్రాజును కాకూడదు. గుణదోషములు రెంటిని ప్రదర్శించి పాఠకునిలో ఉత్తమాభిరుచి కలిగించుటకు విమర్శకుడు తోడ్పడవలెను.

కథలు కాకరకాయలే సాహిత్యమని కొందరు భావించుచున్న యీ నాళ్ళలో ఒక ఉత్తమ విమర్శక గ్రంథమును—అందును ప్రాచీనాంధ్ర సాహిత్యమునకు సంబంధించిన దానిని—ప్రకటించుటకు సాహసించిన శ్రీ అరుణా బుక్ హౌస్ అధిపతులు సాహిత్యోపాసకులునైన మిత్రులు శ్రీ యన్. వి. రత్నం గారిని అభినందింపక తప్పదు. వారింకను ఇట్టి ఉత్తమసాహిత్య గ్రంథములను ప్రకటింపగలరని నా నమ్మకము. రసహృదయులైన తెలుగు పాఠకులు శ్రీ రత్నంగారి కృషిని సముచిత రీతిని ప్రోత్సహింతురనియు నా నమ్మకము.

—డా॥ చల్లా రాధాకృష్ణశర్మ,
యం.ఏ.,యం.లిట్.,పిహెచ్.డి.
Regional Secretary
Sahitya Akademi

# మనవి

సమకాలీన సామాజిక జీవనానికి సాహిత్యం దర్పణం వంటిది కావటంవల్లనూ; ఆయా భాషాజన ఆచార వ్యవహారాల్ని, నాగరకతా సంస్కృతుల్ని మననం చేసుకోవటానికి వారి భాషాసాహిత్యాలే ప్రధానాధారం కావటంవల్లనూ; సమాజానికీ సాహిత్యానికీ మధ్య అత్యంత సాన్నిహిత్యం ఏర్పడిందనీ; అందువల్లనే తరతరాలుగా గ్రంథరచన వాటి ముద్రణ అవిచ్ఛిన్నంగా సాగుతోందనీ; సాహితీ ప్రియులకు మేము సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాం.

సాహితీ సమరాంగణ సవ్యసాచి శ్రీకృష్ణదేవరాయలుచే 'దేశభాషలందు తెలుగు లెస్స' అని కీర్తింపబడిన మన తెలుగుభాష విశిష్ట గ్రంథాల ప్రచురణ విషయంలో సాటి భాషలతో పోల్చుకున్నపుడు ఒకడుగు వెనుగ్గానే వుండటం అత్యంత శోచనీయం.

సాంఘిక ప్రయోజనాన్ని కల్గిస్తూ - మానవ జీవితానికి సార్థకత్వాన్నీ, పరమార్థాన్నీ, శాశ్వతానందాన్నీ కల్గించే మహత్తర ప్రాచీన తెలుగు గ్రంథాల్ని ప్రచురించి కొందరు ప్రచురణ కర్తలు విపరీతంగా నష్టపడిపోయి, విఫలురై, విరమించుకున్న సంగతీ మీకు తెలిసిందే!

అయినా - అణగారిపోతున్న ఆంధ్ర భాషాజిజ్ఞాసను పునరుద్ధరించటానికీ; తెలుగు హృదయాలలో ఏ మారుమూలలనో దాగియున్న భాషాభిమానాన్నీ; అభిలాషనూ వెలికి తీయాలనీ; సత్సంకల్పంతో, సంపూర్ణ విశ్వాసంతో, సాహసంతో, శ్రేయోభిలాషుల ప్రోత్సాహ సహకారాలతో, తెలుగు సాహితీ నందనంలో మంచి గంధపు చెట్లుగా భాసిల్లిన కొన్ని ఉత్తమ సాహితీ గ్రంథాల ప్రచురణకు పూనుకున్నాం.

మొట్టమొదటి ప్రచురణగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతిని పొందిన శ్రీ శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారి రచన

'తిరుపతి కవుల సాహిత్య సమీక్ష'ను వెలువరించాం. దానికి కళా ప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్.డి., గారు పీఠికను, ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ బాపుగారు త్రివర్ణ ముఖపత్రాన్నీ అందించి మాకెంతో సహకరించారు. తెలుగు పాఠకలోకం మా మొదటి గ్రంథాన్ని ప్రశంసిస్తూ తమ అభిప్రాయాల్ని తెలుపటం మాకెంతో హర్షాన్ని కల్గించింది.

రెండవ ప్రచురణగా శ్రీ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారి దే 'తంజావూరు తెలుగు కవులు' వెలువరిస్తున్నాం. దీనికి అర్థశతాధిక గ్రంథకర్తగా, పండితులుగా, పరిశోధకులుగా ప్రసిద్ధులైన డా॥ చల్లా రాధాకృష్ణశర్మ ఎం.ఏ., ఎం.లిట్., పి. హెచ్.డి. గారు విపులంగా పీఠికను వ్రాసి యిచ్చినందుకు మా హృదయపూర్వక అభివందనాలు తెలుపుకుంటున్నాం. ముద్దులొలికే త్రివర్ణ ముఖచిత్రాన్ని అలంకరించిన శ్రీ బాపుగారికి మా ధన్యవాదాల్ని సమర్పించుకుంటున్నాం.

మూడవ ప్రచురణగా రామరాజ భూషణ విరచిత 'వసు చరిత్ర'ను సవ్యాఖ్యంగా వెలువరించబోతున్నాం. ముందు ముందు మరికొన్ని ఉత్తమ సాహితీ గ్రంథాల్ని ప్రకటించాలన్న దే మా ఏకైక ధ్యేయం అని మనవి చేసుకుంటున్నాం.

సకాలంలో, చక్కగా మా గ్రంథాల్ని ముద్రించి యిస్తున్న క్రాంతి ప్రెస్ యాజమాన్యం వారికి మా మనఃపూర్వక కృతజ్ఞతల్ని తెలుపుకుంటున్నాం.

మా యీ బృహత్తర పథకానికి సముచితంగా సలహాలనిస్తూ మమ్మల్ని ఉత్సాహపరచే మిత్రబృందానికీ, ఆంధ్రపాఠక లోకానికీ, భాషాభిమానులకూ కృతజ్ఞతలు తెలుపుకుంటూ, వారి ఆశీస్సులకై అభ్యర్థిస్తూ సెలవు తీసుకుంటున్నాం.

ఇట్లు,

మద్రాసు-1
25-3-1981

ప్రకాశకులు.

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | కవితామమదేవత | ... | 1 |
| 2. | రఘునాథనాయకుడు | ... | 32 |
| 3. | కవితాగోష్ఠి | ... | 120 |
| 4. | చేమకూర వేంకటరాజకవి | ... | 126 |
| 5. | విజయరాఘవ నాయకుడు | ... | 218 |
| 6. | రంగాజమ్మ | ... | 242 |
| 7. | చెంగల్వ కాళకవి | ... | 265 |
| 8. | ముద్దుపళని | ... | 289 |
| 9. | రచనా వైలక్షణ్యము | ... | 333 |
| 10. | యక్షగానములు | ... | 359 |
| 11. | వైష్ణవ మతప్రభావము | ... | 372 |

శ్రీ
బాలాత్రిపురసుందర్యైనమః

# తంజావూరు తెలుగు కవులు

## ౧

## కవితా మమ దేవతా

అని చేతపట్టినాడు గంటమును నన్నయ పురుడు కొట్టిన పసిబిడ్డ పదునొకండవ శతాబ్దమునాటికి తెనుగు సారస్వత వాణి. తమిళ కన్నడ భాషల సంపర్కమున రూపు కోల్పోయినది. పలుకుబడి పాడయినది. తెనుగుతన మంతరించినది. అందము డిందుపడినది.

విపుల శబ్దశాసనుడు నన్నయ. బహు పురాణవేత్త. ఉభయ భాషా కావ్య రచనాభిశోభితుడు. లోకజ్ఞుడు. బుద్ధికి బృహస్పతి. ఒక్కసారి పరిశీలించి నా డాపాద మస్తకము తెనుగు వాణిని. 'స్వస్థానవేష భాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధ ధియః' దరికి చేరదీసి యాదరించినాడు. ఉగ్గుపెట్టి నిగ్గు తేర్చినాడు. తెరగులు మార్చి మెరుగులు పెట్టినాడు. తీర్పులు దిద్ది కూర్పులు కూర్చినాడు. సర్వాంగ సుందరిని గావించినాడు. పలుకులో మారందరసము తొణికిసలాడినది. నడకలో రాయంచగతుల యొయ్యారము వియ్యమందినది. ప్రౌఢతనంబులో నిండు ప్రాయపు జవరాలి గబ్బి గుబ్బల బెడంగు పొడసూపినది. మురిసి ముప్పందుమైనాడు నన్నయభట్టు. సాలంకృతను గావించినా డా లోకసుందరిని. బంగారు చిరుమువ్వ గజ్జెల మంజీరము పాదముల తొడిగించినాడు. 'విజయతే వాణీ' యని భారత కథా వేదిక నెక్కించినాడు. ఆనాడు నాట్యకళా ప్రదర్శన మహోత్సవము. కొలువుకూటము క్రిక్కిరిసిపోయినది. మంత్రి సామంత పురోహిత దండనాథాదు లొకవంక నాసీనులయిరి. కవి[illegible]

పండిత నాట్యకళా కోవిదు లింకొక వంక నుపవిష్టులైరి. పౌర ప్రము ఖులు బారులుతీరి మరొక వైపున కూర్చుండిరి. వెండి సింగంపు దలల దండములు చేత ధరించి రాజభటులు బరాబరు లొనరించుచుండిరి.

మహారాజు రాజరాజ నరేంద్రుడు, తూర్పుచాళుక్య చక్ర వర్తి. రత్నసింహాసన మలంకరించెను. మౌళినున్న జిగి మెరుంగు మగరాల తురాయి కాంతులు ముత్యాల వెల్లగొడుగుతో మేల మాడుచుండెను. ఇరు వలంకులందుండి యూడిగంపు విరిబోడులు వింజామరములు వీచుచుండిరి. సూది క్రిందపడిన చప్పుడు వినిపించు చుండెను. స్నిగ్ధ గంభీర మగు ముఖమండల మెగయించి మహారాజు వంక పరికించినాడు నన్నయభట్టు. మందహాసము మారు పలికినది. రాజరాజ నరేంద్రుడు రాజకులైక భూషణుడు. అర్థ, ధర్మ శాస్త్ర ముల తెరం గెరింగినవాడు. కావ్య నాటక క్రమములు పెక్కు చూచినవాడు. ఈశ్వరాగమములందు బుద్ధి నిలిపినవాడు. పాండవ వంశీయుడు. భారత మాయనకు ప్రాణపదము. పరహృదయము ప్రత్యక్షముగా నవగతము గావించుకొనగలడు. మందహాసములోని మర్మము గ్రహించుకొనినాడు నన్నయ. సభికులవంక కన్ను మలిపి నాడు. 'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు' అనుచు నాందిశ్లోక మారంభించినాడు. నన్నయ వా గనుశాసనుడు. పద సంపుటి రాగ తాళ లయాన్వితముగా తీగెలు సాగి వచ్చుచుం డును. మేఘ గంభీరము కంఠరావము. మయూరములై పురులు విచ్చి నాట్య మొనరించినవి సభికులయంతరంగములు. వేదాంతులు వహావ్వా యని తలయూచినారు. నన్నయ వేదబ్రాహ్మణుడు. మహారాజు వేదవిదుడు. వేదప్రమాణము కలది కాలము. ''తే వేదత్రయ మూర్తయ శ్శ్రేయసే భూయాసుః'' అని పురుషోత్త మాంబుజభవ శ్రీకన్ధరులకు చేయెత్తి నమస్కరించినాడు. విరామము లేదు. కాలి యందె ఘల్లుమన్నది. కేలి కడెములు గలుఘల్లుమన్నవి. వలిపెంపు మేలి ముసుంగు తెర తొలంగదీసికొని ముందరి కరుదెంచినది తెలుంగు భారతవాణి. పాద మంజీర కాంచీగుణ కింకిణీ కర కంకణ

ఝణం ఝణ ఝణ ఝణత్కారములతో నాట్య మారంభించినది. అది లోకోత్తర కవితా గానము. మందాకినీ మధుర కల్లోలినీ కల్లోల మాలికా వీథుల సంచార మొనరించినది. ఆ పద విన్యాసము లలంకార సహితములు. తాళ మాన గతులను దలపించినవి. మార్దంగిక ధ్వానులను మరపించినవి. భావములు రసోపేతములు. మానసిక ప్రవృత్తికి మధురసము పోసినవి. గుక్క తిరుగ లేదు సభికులకు. ఎత్తిన తల లెత్తినట్లే నిలిచిపోయినవి. నిగిడిన చెవులు నిగిడినట్లే నెగడినవి. చూపులలో నచ్చెరుపాటు, మనసులో నబ్బురపాటు, శ్వాస పీల్చుటకైన సావకాశము లభింపలేదు. పద్యముల వెంట పద్యములు నడచినవి. ఆది పర్వ మంతరించినది. సభాపర్వము సాగిపోయినది. అరణ్య పర్వ మవతరించినది. పలుకుబడిలో నమృతము జాలువారినది. అలంకారములలో మినుకులు నివ్వటిల్లినవి. కథా కవితార్థ యుక్తిలో రసము వెల్లివిరిసినది. అక్షర రమ్యత కంతులేదు. పండితులు ప్రశంసించిరి. కవులు కైవార మొనరించిరి. గాయకులు కరతాళములు వెలయించిరి. ముందున్న రాజనర్తకి సంవర్తిత భ్రూలతా విక్షేపముతో మంజీర శింజా నినాదంబు మెరయ చరణములు జళిపించినది. రత్నసింహాసన మందుండి చాళుక్య చక్రవర్తి ''వందే ఆంధ్రకవితా గురవే'' యని యిరుకరములు శిరమునం దిడుకొని నమస్కరించినాడు. నన్నయ కనులనుండి యానందాశ్రువులు జడివారినవి. నిమీలిత నయన కమలుండయి జన్మ చరితార్థమైనదని లోలోన నుప్పొంగినాడా మహనీయుడు. తెనుగు భారత కవితావాణి యశము నిండు జాబిల్లి వెన్నెలలు కాయించినది.

వికస న్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచి పూరము లంబర పూరితంబు
లయినవి.

శ్రేయాంసి బహు విఘ్నాని నన్నపార్యుడు కన్ను మూసినాడు. చాళుక్య చక్రవర్తి స్వర్గస్థుడైనాడు. కడవల తరబడి కన్నీరు

కార్చినది తెనుగువాణి. రాజమహేంద్రవరమునం దామె కాలు నిలువలేదు. 'విపులా చ పృథ్వీ' యని బయలుదేరినది. వేగి మండలము వీగినది. తెలుగునాడు తరించినది. రెండువందల సంవత్సరములు ఇల్లనక వాకిలి యనక పల్లెలు పురములు పర్యటించినది. పుట్టిన కవులు పుట్టుచుండిరి. గిట్టిన కవులు గిట్టుచుండిరి. ఆమెను కన్నవారు విన్నవారు తల లొగ్గి ప్రణతులు గావించిరేగాని నిలువరించి పలుకరించినవారు లేరు. నన్నెచోడుని కన్ను కొలిపినది. సోమనాథుని మీద చూపు నిలిపినది. భాస్కరుని పలుకరించి చూచినది. నన్నయ కున్న తపశ్శక్తి వారికి లేకపోయినది. ఆ యవిరళ ధారాశుద్ధి యంతకంటె లేకపోయినది. అసలు రహస్య మర్థము చేసికొనినవారు కనిపించలేదు. విసిగి వేసారినది. నెల్లూరుసీమ చేరినది.

మనుమసిద్ధి మండలాధిపతి. అతడు కవితారస పిపాసి. పెండ్లి కుమారుడయి సింహాపీఠము మీద కూర్చుండెను. కరగ్రహణము జరుగుచుండెను. తిక్కనగారు కన్యాదాత. ఆయన మనుమసిద్ధికి మంత్రి, ఆస్థాన విద్వాంసుడు, మహాకవి. నిర్వచనోత్తర రామాయణము కృతి సమర్పించుచుండెను. చవిచూచిన దా కవనంపు తెరగులలోని తియ్యదనము. పడిగాపులు కాచినది. కాలమునకై నిరీక్షించినది. తిక్కన వైదిక మార్గనిష్ఠమగు వర్తన కలవాడు. అసాధారణ ధిషణా ధురంధరుడు. చూచినా డా భారత కవితావాణి దివ్య సుందర విగ్రహమును. గీర్వాణవాణి రాణివాసంపు గాంభీర్యమా రూపులో మూడుమూర్తుల గోచరించినది. బెడగారు నొయ్యారంపు నడకల తీరులందు తెలుగుతనము తలపించినది. పదముల పొందికలో వినూతనత్వము కనిపించినది. ఆలోచించినాడు తిక్కన మహాకవి. అవగతమయినది రచనా చమత్కారము. ఆనందాతిశయమున బ్రహ్మ కూకటి ముట్టినాడు. 'శిరసా ప్రణమామి ఆంధ్ర కవితా విశారదాయ విద్యాదయితాయ మహాత్మనే నన్నయాయ' అని వినుతించినాడు. నానా రసాభ్యుద యోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడగాఁ బదియేనింటిఁ దెనుంగు బాస రచి

యించు టొప్పగు-నని నిశ్చయించుకొనినాడు. లేఖిని నందుకొని శ్రీయన గౌరినాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవించు హరిహర నాథుని ప్రార్థించినాడు. ఇంక గంట మాగలేదు. కాగితముల వెంట కాగితములు తిరిగిపోయినవి. పర్వముల వెంట పర్వములు పరువు లెత్తినవి. పదునైదు పర్వములు పూర్తియైనవి.

తిక్కనచూపు మిగుల వాడియైనది. బుద్ధి సూక్ష్మాతి సూక్ష్మ మయినది. భారతము సకల మానవ సమాదరణీయము కావలయు నని యాయన తలంపు. ఆ మహామహుని యాదరాభిమానములలో తెనుగు భారత కవితాసరస్వతి వినూతనమగు శోభ వహించినది. అది సృష్టికి ప్రతిసృష్టి. కళలు మారినవి. నడకలు నవీనములైనవి. అతడు శిల్పకవి. వాని గంటము సునిశితమైనది. పోకడలు విచిత్రము లైనవి. వర్ణనా విషయములందు మూర్తి కన్నులకు కట్టినట్టులు తోపించును. అందును స్త్రీలను వర్ణించుటలో తిక్కన యందెవేసిన చేయి. ఏ స్థితియం దే యవయవ మెంతవరకు కదులునో వాని గంటము చక్కగా చిత్రింపగలదు. దానిలో ప్రాణమున్నది.

కావ్యంపు రచనా పద్ధతులకు దారి తీసినవాడు తిక్కన. అతడు రసిక శేఖరుడు. నిండారవిచ్చిన నెత్తమ్మి పూరేకుల మెత్త మ్మ్మలు పరచి తెనుగు సాహితీ సరస్వతికి అడుగు లొత్తనీయని మెత్తనగు రాజబాట కల్పించినాడు తిక్కన. ఆమెను మానవలోక సంచారిణి గావించినాడు. రెండు విభిన్నాకృతులతో భారత కథా వేదికమీద నృత్య మొనరించిన నన్నయ తిక్కనల కవితా సరస్వ తులకు చేతులు కలిపి చుట్టరికము కుదిర్చినవాడు శంభుదాసు. ఆయన ప్రతిభ యిరువురను మించినది. నన్నయలో మునిగి తిక్కనలో తేలినాడు.

భారతము పూర్తియైనది. కవితా సరస్వతికి స్వాతంత్ర్య మల వడినది. దిట్టతనము చేకూరినది. ఆమె యిప్పుడు సర్వలక్షణ సంపన్ను రాలు. అందచందములందు తోడి భాషాయువతులకు శిరోవిభూ షణ మయినది. నలువురిలో నామె యాడినది యాట, పాడినది

పాట. ఆమెవాక్కు వేదవాక్కు. దానిని కాదనగలవారు లేరు. దేశదేశములు తిరుగ నారంభించినది. ఆమెను గౌరవింపని రాజులు లేరు. చేరతీయని కవులులేరు. పొగడని పండితులు లేరు. ఒక్కొక్క పట్టునందు సంస్కృత భారతమునకు చక్కతనంపు తీరులు దిద్దినది. తిరిగి తిరిగి కొండవీటి మండలము చేరినది.

కొండవీటి ప్రభువులు వీరాధివీరులు. శాస్త్రవిదులు. సాహిత్య తత్పరులు. లలితకళలు వారికి ప్రాణపదములు. చిగురాకు తొగరు ముంగాలి మొన యటుమోపి తొంగిచూచినది భారత కవితావాణి. గజ్జెల యందె ఘల్లుమన్నది. గిరుక్కుమని వెనుకకు మరలి చూచినాడు శ్రీనాథుడు. బ్రహ్మానందము పొందినాడు. అతడు లోకోత్తర సాహితీచక్రవర్తి. బ్రాహ్మీదత్త వరప్రసాద కవితావేశుడు. తర్క వ్యాకరణ శాస్త్రములు వానికి కరతలామలకములు. వివాద ప్రౌఢి యందు గౌడ డిండిమభట్టు కంచుఢక్కా పగులగొట్టించిన యుద్దండ పండితుడు. ఫాలాక్షునైన పరిగణింపని దిట్ట.

నే
వలచుటకేమి శంకరుని వంటి మహాత్ముఁడు లింగరూపియై
కులుకుమిటారి గబ్బి చనుగుబ్బల సందునఁ దాండవింపఁగన్

అని శంకరునంతవానిని చేయెత్తి చూపిన అగతాయి. అతని వంటివాడు తెలుగులోకమున 'నభూతో నభవిష్యతి'. భారతము పురాణవాణి. పుట్టి నాలుగు శతాబ్దములు గడచినది. అయినను ప్రాయంపు బిగువు సడలలేదు. నిత్య యౌవనవతి. చూచినకొలంది యపూర్వములగు వినూతన విలాసము లామెయందు పొడకట్టును. లాక్షణికులే యీ మాట నంగీకరించిరి. శ్రీనాథుని చిత్త మూరకుండు నదికాదు. ప్రాతలో క్రొత్తలు సృజింపగలశక్తి దానికున్నది. తెన్నులు మార్చినది. వన్నెలు పెంచినది. నవీనంపు బోకడలు మైగొలిపినది. క్రొత్తదారులకు మలిపి కావ్యంపు నెరసీటుకత్తెనుగా తయారుచేసినది. తనలో విలీనము గావించుకొనినా డా వినూతన కావ్య కళావతిని శ్రీనాథమహాకవి. వేగినాడు మొదలు తమిళనాడు వరకు గల

యాంధ్రదేశము నలుమూలలందు నూరూర బంగారు పల్లకీల నెక్కించి యూరేగించినాడు. జను లామెను బూజించిరి. కానుక లర్పించిరి. బ్రహ్మరథము పట్టిరి. కర్పూర నీరాజనము లొసంగిరి. మహారాజులు గజారోహణ మహోత్సవము లొనరించిరి. ముత్యాల శాలలలో దీనారటంకాల తీర్థమాడించిరి. ఆ మహావైభవమున కంతు లేదు.

శ్రీనాథునితోడి పొందికవలన తెనుగు సాహితీసరస్వతి యనుభవింపని యానందము లేదు. చవి చూడని సుఖము లేదు. ఆంధ్ర సారస్వత చరిత్రమునందది సువర్ణయుగము. మందహాసంపు వికాసము ముఖారవిందంబులందు తళుకొత్త జవాది మైపూతల వలపులు దిశల నలముకొన కర్పూర తాంబూల చర్వణంబు గావించుకొనుచు, బంగారు సరిగంచు పట్టుసాలువలు భుజములందు వల్లెవాటు లమరించి కవులు పురవీథులందు తిరుగాడు దినములవి. పోతన భాగవతము రచించెను.

సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణరాయలు. విజయనగర రాజ్యాధినేత. కత్తిపట్టి యరాతివీర ధరాధిపతుల తలలు సమరావని సముత్తరించిన చేతితో గంటముపట్టి యాముక్తమాల్యద యందు కవితాసీమంతవతికి వినూతన కళావిలాసములు పట్టుపరచి లాస్యమాడించిన యాంధ్ర భోజభూపతి యా వీరాధివీరుడు. కవి మాన్యుల కగ్రహారము లిచ్చి యామరణాంతము పోషించిన మహాదాత. 'దేశభాషలందు తెలుగు లెస్స' యని గుర్తించిన మహాపురుషుడు.

సంస్కృతాంధ్ర భాషా యోషామణుల పాదాంభోజములకు మగరాల పసిండి గజ్జెల జోడందెలు తొడిగించి ధిమిద్ధిమి ధిమింధిమి నాదంబులు మార్దంగిక ధ్వనులయి పొడమ నాశుపద్ధతి రాయల సభాంగణమున నృత్యమాడించినవాడు అలసాని పెద్దన. అడుగు దమ్ములకు మహారాజుచేత గండపెండేరము తొడిగించుకొనినవాడా కవితాపితామహుడు. మనుచరిత్ర గ్రంథకర్త. నన్నయ శ్రీనాథుల

మూర్త్యంతరము, ధూర్జటి. తిమ్మనార్యులమాట చెప్పనక్కరలేదు. ''స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనీ యతులిత మాధురీ మహిమ'' యని రాయలంతవా డాశ్చర్యపోయెను. తిమ్మన పారిజాతములో తేనెలు పోసినవాడు. కాలము తీరినది. రాయలు లోకాంతర్గతు డయ్యెను. అంతటితో తెనుగు కవితామతల్లి వైభవ మంతరించినది. అందందు కవులు మరికొంద రున్నను కావ్యరచనా పద్ధతులందు రసపోషణమునందు నవీనత నాపాదించినవారు లేరు. కాదంబరిని కన్నులలోపెట్టుకొని కళాపూర్ణోదయము కల్పించినవాడు పింగళి సూరనగారు. కథాకల్పనలో గడుసుతనమే కాని కవనంపు పోకడలలో క్రొత్తదారులు త్రొక్కినజాడ లంతగా నగుపించవు.

'నిరవధిః కాలః' కాలము నిరవధికమయినది. అది మహా ప్రవాహమువంటిది. అనివార్యమగు శరవేగముతో ప్రవహించుచుండును. పరిస్థితులనుబట్టి మలుపులు తిరిగి మార్పులు చెందుచుండును. దాని తరంగ గర్భములనుండి మహారాజులు జన్మింతురు. మతకర్తలు పుట్టుదురు. కవులు ప్రభవింతురు. మహారాజులు శాసనకర్తలు. వారు కల్పతరువుల వంటివారు. చల్లని వారి కడకంటి చూపునీడలందుండి గురువులు మతబోధ కావింతురు, కవులు కావ్య ప్రపంచములను సృష్టింతురు. వారి యూహాగానములలో ప్రకృతి వినూతన సౌందర్యములతో గోచరించును. మత సాంఘిక పరిస్థితులు సన్నని సున్నితంపు మంచుతెర మరుంగులోని జాబిల్లి వెలుంగువలె వ్యక్తావ్యక్తరూపములతో నగుపించును. నాటి యాచార వ్యవహారములు అనుభవమునకు తెచ్చుచుండును. వారి రచనలు కాలాభిహితములు. 'కవిః కాలః' వారి కల్పన లతి విచిత్రములు. అవి సత్యములని పాఠకు లుప్పొంగి పోవుచుందురు. కవి నమ్మకమయిన యసత్యవాది అని యొక పాశ్చాత్య పండితుడు విమర్శించినాడు. అది నిజము. వారు ఉప్పుసముద్రముల యొడ్డున నేలకీ లతలు లవంగపు తీగెలు మొలిపింతురు. అవి తరంగ సంఘట్టనలచేత మనోహర కళా

విలాసములతో లాస్యమొనరించు చుండును. కద్రూ వినతలు సముద్రతీరమున కరిగిరి. వారు

> వివిధోత్తుంగ తరంగ ఘట్టన చల ద్వేలా వనై లావలీ
> లవలీ లుంగ లవంగ సంగత లతాలాస్యంబు లీక్షించుచున్

చనిరట. ఇది నన్నయగారి కల్పన. ఆయన కంటె నొకాకు కెక్కువ చదివినవాడు అలసాని పెద్దనగారు. మలబారు ప్రాంతములోని పోక క్రమాకులను హిమాలయంపు లోయలలో నాటించినాడు. దానికి కారణము లేకపోలేదు. వరూధిని

> పూచిన యొక్క పోక నును బోదియ చేరి విలోకన ప్రభా
> వీచికలం దదీయ పదవీ కలశాంబుధి వెల్లి గొల్పు

టకు వీలుగా నుండవలయును. కొమ్మలు రెమ్మలు నున్నచో నడ్డము వచ్చును. నన్నయ లతలచేత నాట్యమాడించినాడు. మృదంగ నాదములేని లాస్య మందముగా నుండదని

> అంబర చుంబి శిర స్సర జ్ఝరీ
> పటల ముహుర్ముహు ర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్వన
> స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాల

ములను కల్పించినాడు. ఇరువురు గానకళా కోవిదులే. పద సంపుటిలో తాళగతులు పొడసూపుచుండును. మార్దంగిక నాదములు మారు పలుకుచుండును. నన్నయగారి మూర్త్యంతరము పెద్దనగారు. సమాసంపు టల్లికల జిగిబిగువులం దొకరిని మించినవా రింకొకరు. శ్రీనాథునిలో సగమంశ పెద్దనగారి యందున్నది. నన్నయ శ్రీనాథుల కవనంపు సమ్మేళనము మనుచరిత్ర.

కావ్యములు నిగ్గుటద్దములు. వానియం దాయాకాలముల లోని సాంఘిక మతాచార వ్యవహారములు పరిస్థితులు ప్రతిబింబించు చుండును.

జిలుగు సంధ్యారాగ చీనాంబరము దాల్చి
కొప్పుపైఁ జిన్నిపూ గుస్తరించి
నదట వేదపురాణ శాస్త్ర పదవీ నదవీయసిమైన పెద్దముత్తైదువ.
తత నితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావి రంగువలన
జాజువారగ చంద్రకాంత శిలావేదిక నాసీన మైనదట వరూధిని.
చందిర కావిపావడ పిసాళి రుచుల్ సరిగంచుఁజీరపైఁ
జిందులు ద్రొక్క
వచ్చినదట సుభద్ర
వలిపె చెంగావి పావడ కొసల్ బిగియించి
కుంకుమ పువ్వంచు కోకగట్టి
నారట యిళకు. ఇది యువతుల వేషధారణము. ఆ యాకాలము లందలి ముసలి ముత్తైదువలు ప్రాయంపుఁ గన్నియలు కావ్య కథా సరణిని బట్టి వివిధ పాత్రలుగా నమరుచుందురు.

ప్రవరుడు నిత్యము
వరణా తరంగిణీ దర వికస్వర నూత్న
కమల కషాయ గంధమువహించి
ప్రత్యూష పవనాంకురములు పైఁగొను వేళ
వామనస్తుతి పరత్వమున లేచి
సచ్ఛాత్రుఁ డగుచు నిచ్చలు నేగి యయ్యేట
నఘమర్షణ స్నాన మాచరించి
సాంధ్య కృత్యము తీర్చి సావిత్రి జపియించి
సైకతస్థలి కర్మసాక్షి కెఱఁగి
ఫల సమిత్కుశ కుసుమాది బహు పదార్థ
తతియు నుడికిన మడుఁగు దోవతులు గొంచు
బ్రహ్మచారులు వెంటరా

నింటికి వచ్చుచుండునట. రాయల కాలమునందు విజయనగరములోని ఆహితాగ్ని బ్రాహ్మణ కుటుంబములందలి నిత్యకృత్యమయిన యాచార మిది. నదీ తీరమునం దున్న కొన్ని కొన్ని గ్రామములలో నీ యలవాటు ఆహితాగ్ని కుటుంబములం దిప్పటికీ నున్నది. విజయనగరమునకు ప్రక్కనే తుంగభద్రానది కలదు. ప్రత్యేకించి యిది పెద్దనగారి యలవా టనవలయును. అందుకనే "వామన స్తుతి పరత్వమున లేచి" యని నుడివెను. పెద్దనగారు మొదట అద్వైతి. శఠకోప యతికి శిష్యుడయి వైష్ణవమును స్వీకరించెను. కవుల యనుభవములు కావ్యవాహినిలో జాతిరత్నములవలె మెరయుచుండును. ప్రవరుడు ఏ భూపాలుండీ వచ్చినను సాలగ్రామము మున్నుగా గొనడట. మాన్యక్షేత్రములు పెక్కు చందాలం బండునట. అందు మూలమున నొకప్పుడుం దరుగ దింటం బాడియుం బంటయున్ -దీనికి పెద్దనగారి జీవితమే తార్కాణము.

రాయలు కోకటాద్యనేకాగ్రహారములు పెద్దనగారికి దానముచేసెను. రాయలు మహాదాత. ఆయన చేయని దానములు లేవు. బ్రాహ్మణు లాయన కాలమునందు సకల సుఖము లనుభవించిరి. విష్ణుచిత్తీయము చదివినవారి కిందలి సత్య మవగతము కాకపోదు. ప్రవరుని భార్య

వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియా నతని గృహిణి
యతిథు లేతేర నడికి రేయైనఁ బెట్టు
వలయు భోజ్యము లింట నవ్వారిగాఁగ.

ఇది స్త్రీల పద్ధతి. ఈ పద్యము "నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూపో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యం" అను విష్ణుచిత్తీయములోని విష్ణుచిత్తునింట అర్ధరాత్రి సమయమందైన వినిపించు నతిథులయెడ నాదరింపు బలుకులు చెవులలో మ్రోయించును. ఆ కాలమునందలి యతిథి మర్యాద లట్టివి. మను

చరిత్రలోని మొదటి యాశ్వాసము రాయల కాలమునందలి బ్రాహ్మణ కుటుంబములలోని యాచార వ్యవహారములకు ప్రతి బింబము. విష్ణుచిత్తీయములోని సాంఘిక పరిస్థితుల వర్ణనాంశము లొకొక్కప్పుడు వానికి వ్యాఖ్యానము లనిపించును. రాయలు మహా రాజయ్యును లోకానుభవము కలవాడు. విష్ణుచిత్తీయమునందు ఆరె కులు మొదలుకొని మహారాజుల వరకును, పూజారి మొదలుకొని రాజ పురోహితునివరకును యథాతథముగా సాంఘిక పరిస్థితుల నున్నవి యున్నటుల వర్ణింప గలిగెను. వైష్ణవ శైవ మతాచారము లను పూస గ్రుచ్చినటుల మనోనయనమునకు గోచరించునటుల చిత్రింప గలిగెను. పలువురు కవులు పలుకావ్యములను రచించిరి.

మనుచరిత్ర విష్ణుచిత్తీయము వైజయంతీవిలాసములందు ప్రద ర్శింపబడిన సాంఘిక వ్యవస్థలు మరే యితర కావ్యములందును ప్రదర్శింపబడి యుండలేదు. కావుననే వానిలో వినూతనత్వము తెర మాటునందుండి ప్రాయంపుఁ బెండిలి కూతురువలె తొంగి చూచు చుండును.

వైజయంతీ విలాసము పచ్చి బూతుల బుంగ యని యనాలో చితముగా విమర్శించినవారు గలరు. అది యాకాలమునందలి సాంఘిక దురాచారములను మూఢ నమ్మకములను లోకమునకు బహిర్గతము గావించిన యుత్తమ కావ్యమని గ్రహించుకొనలేకపోవుట వారి లోపము. కావ్యములందు వైవిధ్యమునకు సాంఘిక దృష్టి యొక కారణము. రస విభేద మింకొక కారణము. కవి యేదృష్టితో కావ్య మును రచించెనో పాఠకుడు ముందు గ్రహించి తరువాత విమర్శనకు పూనుకొనవలయును. వైజయంతీ విలాసము కృతికర్త కాలమునందు వైష్ణవ మతములో నంకురించిన దురాచారములను, వేశ్యల దురా గతములను, మూఢనమ్మకములను విమర్శించిన చక్కని సాంఘిక శృంగార ప్రబంధము. భారత రామాయణములు ఆ యా కాలము లందలి సాంఘిక ప్రవృత్తులను మనసున కవగతము గావించు చిత్ర

ములు. కావుననే యవి సారస్వత చరిత్రమునందు ప్రధాన స్థానము నాక్రమించినవి. అవి చిరంజీవములు.

కాళిదాసు శాకుంతలమునకు జీవము పోసినది యా సాంఘిక ప్రదర్శనమే 'తత్ర శ్లోక చతుష్టయం' అనుటలో నదియే రహస్యము. పాశ్చాత్య కవుల రచనలలో నిగూఢముగా నిమిడియున్న ప్రాణ మా లోక ప్రవృత్తియే. షేక్స్పియరు నాటకముల కనంత మగు యశము నాపాదించిన దా ప్రదర్శనమే. అది కావ్య దర్పణమునందు పాఠకుని యాంతరంగిక దృష్టికి అవగత మగుచుండవలయును. అప్పుడే యందము కలదు. అది దూరమయిన కొలందియు కావ్యము నందు శోభ సన్నగిల్లుచుండును. దానిని దాపునకు తెచ్చినకొలందియు తల కంటగించుచుండును. విముఖత్వము కలుగుచుండును. వాస్తవిక వాదుల రచనలు లోకాదరణీయములు కాకుండుటకు కడపటిదే కారణము. ఇది ప్రపంచ మంగీకరించిన సత్యము. సంఘమునందు, కావ్యములందు మతమునకు ప్రధాన స్థానముకలదు. మతమున కను గతమయి కావ్యమునందలి యితివృత్త ముండును. దాని ననుసరించి రసముండును. రసానురూపము కవిత్వము, నన్నయభట్టు భారతాది యందు "తే వేదత్రయ మూర్తయ శ్శ్రేయసే భూయాసుః" అని వేదములందు ప్రతిపాదింపబడిన పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరుల నేక ముఖముగా నమస్కరించినాడు. వారు ముగ్గురు సకల భువన సంరక్షణ ప్రభువులు. తత్ప్రసాద సమాసాదిత నిత్య ప్రవర్ధమాన మహామహీ రాజ్య విభవుండు రాజరాజ నరేంద్రుడు. అతడు వివిధా గమ పరిశ్రముడు. ఆ కాలమునందు వేదములకు త్రిమూర్తులకు నాంధ్రలోకమునం దింటింట పూజాపీఠము కలదు.

కుమారిలభట్టు మహా పండితుడు. ఏడవ శతాబ్దములోని వాడు. జైమిని సూత్రములకు భాష్యము వ్రాసెను. దానిని పూర్వ మీమాంస యందురు. అది వేదకర్మలను బోధించు గ్రంథము. కపి లుని సాంఖ్యము దానియం దిమిడియున్నది. కుమారిలభట్టు జైన బౌద్ధ పండితులతో వాగ్వాద మొనరించెను. వారి నోడించి యా

మతముల నడుగంట విధ్వంసము గావించెను. వేదములు ప్రమాణ మగు బ్రాహ్మణ మతము నిలువబెట్టెను. వేదములు కర్మావబోధ కములు. బ్రాహ్మణులు కర్మానుబద్ధులు. కుమారిలభట్టు అను యాయులు, మూర్తిత్రయోపాసకులు. నన్నయ వేదబ్రాహ్మణుడు. అవిరళ జపహోమ తత్పరుడు. సంహితాభ్యాసుడు. భారతము పంచమ వేదము. నిష్కామకర్మను బోధించు గ్రంధము. "స్వభావో దురతి క్రమః". భారతాంధ్రీకరణమునందు నన్నయ శరీర ముప్పొంగినది. మనస్సు రసావేశము చెందినది. కవిత్వ మేకధాటిగా పరుగెత్తినది. ఆది సభా పర్వములు వేదవిహిత కర్మలను బోధించు ఘట్టములు. వానిని వర్ణించునప్పుడు కవితావాహిని యొడ్డు నొరసి నురుగులు గ్రక్కుచు దుముకులు పెట్టినది. శబ్దజాలము మహోత్తుంగాభంగ తరంగ మాలికలవలె నొండొంటి యొడళ్ళు కలుపుకొని యనుప్రాస లతో లయా సహితముగా ముందునకు దొరలి వచ్చినది. ఆ సమాస ఘటనములో మృదంగనాదము లుప్పతిల్లినవి. పద సంపుటిలో తాళ గతులు తాండవించినవి. జనమేజయుని సర్పయాగము, ధర్మ రాజు రాజసూయము. ఉదంకుడు నాగరాజులను స్తుతించుట—మొద లగు కథా భాగములు చదువునప్పుడు మనస్సున కమితానందము కలుగును.

బహు వన పాదపాబ్ధి కులపర్వత పూర్ణసర స్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి

ఇత్యాది పద్యములు విద్వత్కవులకు శ్రవణ రసాయనములు. పోతన సమాస ఘటనమునకును నన్నయ సమాస ఘటనమునకును తారతమ్యము కలదు. అది వీణా తంతువుల విశ్రుత వినాదము. ఇది చిరు మువ్వగజ్జెల ఘులం ఘుల రావము. ఈ తాళగతి దానియం దుండదు.

నన్నయ దుష్యంతోపాఖ్యానమునందు కణ్వమహర్షి యాశ్ర మము వర్ణించెను. పోతన భాగవతమునందును కణ్వాశ్రమమును వర్ణించెను. అందు నన్నయ చాయలే గోచరించును. కాని యా.

ప్రసన్నత యీ యర్థగాంభీర్యము పోతనలో తడిమి చూచినను కనిపించవు. కాని, లుంఠించి గుణ నినాదము కంఠమ్మున తవతవ గదురమరుడు బాల నేసిన కుసుమాస్త్ర నినాదము విశదముగా వినిపించును. పోతన రసికాగ్ర గణ్యుడు. నన్నయ వేదవిప్రుడు. ఆ తారతమ్యము వారి రచనలో నడుగడుగునకు నగుపించును. తిక్కనగారు కూడా ఆ రసికత కొంత అప్పు తెచ్చుకొనవలసినదే. ఆయన కవితాశిల్పి. మాట చమత్కారము కలవాడు. పోతన రచనా ప్రగల్భి. పదములలో నందచందములు కలవాడు. పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు శృంగార శాకుంతలము రచించెను. అందు కణ్వాశ్రమము వర్ణించెను. ఎవరెన్ని విధముల వర్ణించినను నన్నయ రచనలోని యీ మలయ మారుతము లతా లలనలు రాల్చిన కుసుమాక్షతావళులు, ఏచి తనర్చి తలిర్చిన క్రోవులు, పూచిన మంచి యశోకములు, సురపొన్నలు, పొన్నలు, గేదగులు, ఆజ్య హావిర్ధృత సౌరభ ధూమలతా తతులం బెనంగిన మ్రాకులు గోచరింపవు. అవి యాశ్రమ సహజములు. ఆ వర్ణన చదువునప్పుడు నిజముగా నచట నున్నటులనే తోచును. ఆ వాతావరణమును బట్టి వృత్తములు గూడ మారినవి. అది యాయన రచన. ఇంక ధర్మ వ్యతిరిక్తత వాటిల్లినప్పుడు వీరావేశమో కోపావేశమో చెప్పలేముగాని "కురువృద్ధుల్ గురు వృద్ధ బాంధవులు" వంటి పద్యములు వరుసలుకట్టి పరంపరలుగా దొరలుకొని వచ్చును. ఆది సభా రణ్య పర్వములు ఆ మహాకవిచేత నాంధ్రీకరింపబడుట యాంధ్రుల సుకృతము. ఆయన కవిత

ధవళ విభూషణ ధామానులేప నా
మలినాంగి సిత పుష్ప మాల చేతఁ
గొని పుష్పసాయకు కుసు మేతరం బైన
యారవ సాయకం బనఁగ

ముగ్ధ మోహన కళ్యాణ మూర్తియై వెలుగొందినది. అది పౌరాణిక సుందరి.

కాలము గడచినది. భావములు మారినవి. బ్రహ్మకు స్థాన చలనము కలిగినది. శివ కేశవులకు భేదము వాటిల్లినది. 'శివ మయం జగత్సర్వం' అని కొందరు, 'విష్ణుమయం జగత్సర్వం' అని మరి కొందరు. ఇరు పక్షము లేర్పడినవి. శివుడు యోగి. విష్ణువు భోగి. శివ భక్తులు శైవులు. వారికి వైరాగ్యము ప్రధానము. విష్ణు భక్తులు వైష్ణవులు. వారికి భక్తి ప్రధానము. ఇరు తెగలవారికి రవరవలు పొడమినవి.

మల్లికార్జున పండితారాధ్యుడు మహాపండితుడు. వేదములకు శివపరముగా శ్రీకర భాష్యము రచించెను. అది శైవులకు ప్రమాణ గ్రంథము. బసవేశ్వరుడు నందీశ్వరుని యవతారమని జనులలో ప్రతీతి కలిగినది. అతడు వీరశైవ మతమును ప్రచారములోనికి తెచ్చెను. కళ్యాణపురాధీశ్వరుడగు బిజ్జలుడు బసవేశ్వరుని మంత్రిగా నియమించుకొనెను. మతావేశమున మహారాజును వధించి బసవేశ్వరుడు రాజయ్యెను. కాని యాతడు బహుకాలము జీవింపలేదు. అతని మేనల్లుడు చెన్నబసవేశ్వరుడు మంత్రియై వీరశైవమును కట్టు దిట్టముగా నభివృద్ధిలోనికి తెచ్చెను.

పండ్రెండవ శతాబ్దమునందు వీరశైవమత మొక మూల నుండి యావేశమున కట్టుత్రాళ్ళు త్రెంచుకొని పరవళ్ళు త్రొక్కుచు తెనుగు దేశమును ముంచెత్తివైచుచుండెను. చాలవరకు రాజులు వీరశైవ మతావలంబకులైరి. కవులు వీరశైవులైనారు. ప్రజలలో వీరశైవ మతము ప్రాకిపోయినది. గ్రంథములు వాని ప్రతిబింబము లైనవి. నన్నెచోడుడు కుమారసంభవమను స్వతంత్ర కావ్యము రచించెను. అది శివుని గాథ. పాల్కురికి సోమనాథుడు దేశీయచ్ఛందమగు ద్విపదయందు బసవపురాణము, పండితారాధ్య చరిత్ర వ్రాసెను. అవి శైవమత ప్రచార గ్రంథములు. మత కల్లోలముల మాట యెట్లున్నను కావ్య రచనకు ద్విపదకు దారి చూపినవారు వీరశైవులు. వారి గ్రంథము లుద్రేక పూరితములు. రచనలు వారి హృదయములవలెనే యావేగ సహితములు. పాల్కురికి సోమ

నాథుడు ఆంధ్ర సారస్వతాకాశమున ధ్రువతారయై వెలుగుల నొలయించెను. వాని కావ్యము లొకవిధముగా సాంఘికములు, మరొకవిధముగా చారిత్రకములునయి కవిత్వమును నూతన మార్గమును త్రొక్కించినవి. తరువాతి కవుల కవి యాదర్శప్రాయము లైనవి.

శఠకోపుడు – నాథముని – పుండరీకాక్షుడు – రామమిశ్రుడు–యామునాచార్యుడు మొదలగువారు వైష్ణవమతమును ప్రచారములోనికి తెచ్చిరి. శైవమతమునందువలెనే వైష్ణవ మతమునందును వర్ణ భేదములు లేవు. తక్కువ జాతివారు కూడ వైష్ణవమును స్వీకరించిరి. భగవద్భక్తులయి యున్నత స్థితికి వచ్చిరి. పరమ భాగవతుల పూజ లందుకొనిరి. దివ్యప్రబంధములను తమిళ భాషయందు వ్రాసిరి. అవి వైష్ణవులకు శిరోధార్యములు. రామానుజుడు శంకరుని యద్వైత మతమును ఖండించి విశిష్టాద్వైత మతమును నెలకొల్పెను. దానిని శ్రీవైష్ణవమందురు శైవ వైష్ణవములకు సంఘర్షణము సాగినది. దిశలు ప్రాకినది. తెలుగుదేశ మల్లకల్లోలమయినది. ప్రజలలో నైకమత్యత నశించినది. పరమత సహనము రూపుమాసినది. పదమూడవ శతాబ్దమునాటికి మత వైషమ్యములు పెరిగి పెద్దవయినవి. పాదులు కట్టుకొని బలిష్ఠములయినవి. చూచినాడు తిక్కన మహాకవి. దేశమునందు శాంతి భద్రతలు నెలకొల్ప తలంచినాడు. శైవ వైష్ణవములకు సమైక్యత కల్పింప నెంచినాడు. కుమారిల శంకర రామానుజ సిద్ధాంతములకు పరస్పర సంబంధము కుదుర్ప నూహించినాడు. భారతమును సాధనగా గ్రహించినాడు. భారతము వేదముల సారము. నిష్కామ కర్మను బోధించునది. భక్తి వైరాగ్యముల సమ్మేళనము. వివిధ ధర్మములు నందు నంతర్భూతములు. జ్ఞానము మూలాధారముగా గలది. ఇరు మతములవారికి నాదర్శప్రాయుడు నుపదేష్టయు గాదలంచి నాడు తిక్కన. మొదట యజ్ఞ మొనరించి పవిత్రుడయినాడు. ఆయన మహామంత్రి. అధికారమునందున్నవాడు, లోకము కన్ను తెరచి చూచినది తిక్కనను. అబ్బురపోయినది. తన తప్పు తాను గ్రహించినాడు. వేదముల ప్రామాణ్యము గ్రహించినది. లోకము

వంక కన్ను మలిపి చూచినాడు తిక్కన. తన యభిమతము కొంత వరకు నెరవేరినదని గ్రహించినాడు. 'అథాతో బ్రహ్మ జిజ్ఞాస' యని లేఖని నందుకొనినాడు. ధర్మాద్వైతమును బోధింపబూనినాడు.

శ్రీయన గౌరినాఁ బరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము

ను కల్పించినాడు. అదియొక వింత స్వరూపము 'శివమయో విష్ణుః' వంటిది కాదు. శివ కేశవుల రూప సమ్మేళనము. ఇది వినూతనాకృతి. అదివరకు విన్నది కన్నది కాదు. శైవ వైష్ణవులకు చుట్టరికము కలుపుటకు నిర్మింపబడినది. వాని యిల్లాలు శ్రీయనినను గౌరి యనినను 'ఓ' యని పలుకును. తిక్కన మిగుల ఆలోచనాపరుడు. మతములో మంత్రాంగము చొనిపించినాడు.

విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వ

మా హరిహరమూర్తి. శైవులకు వైరాగ్యము ప్రధానము. దానికి జ్ఞాన ధ్యాన సమాధులు అంగములు. వైష్ణవులకు భక్తి ప్రధానము.

తను హృద్భాషల సఖ్యముఁ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను

నవి భక్తిమార్గములు. భక్తివినా వైరాగ్యముగాని, వైరాగ్యము వినా భక్తిగాని నిష్ప్రయోజనమని నిరూపించుచు 'భక్తజనంబు వైదిక ధ్యాయితకు' అని భక్తి ధ్యానముల రెంటిని నిర్దేశించినాడు. ధ్యానమునకు భక్తి వైరాగ్యములు చేరి యుండవలయును. ఆ ధ్యానము వైదికము కావలయును. అనగా వేదహితమయి యుండవలయునని వైదిక శబ్దము చేర్చినాడు తిక్కన. వైదిక మనగా నిత్య నైమిత్తిక యజ్ఞ యాగాదులైన కర్మకాండ లని భావము.

ఇందుమూలమున భక్తి ప్రధానమగు రామానుజము జ్ఞానప్రధాన మయిన శాంకరము కర్మ ప్రధానమయిన కుమారిల భాట్ట మతములు నిరూపింపబడినవి. పూర్వోత్తర మీమాంసా వాదములకు సమైక్యత కల్పింపబడినది. తిక్కన తోణికిసలాడని వేదాంత హృదయుడు. కావుననే హరిహరనాథుడు

వైదిక మార్గ నిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేని భక్తి మది నిర్మల వృత్తిగ జేయుచుం

డువని వినుతించెను. ఈ పద్యభావమునకును పై పద్య భావమునకును చక్కని సంబంధ మున్నది. హరిహరంబగు నా పరతత్త్వము విష్ణు రూపాయ నమః అనినను, శివాయ నమః అనినను ఇచ్చ మెచ్చు కొనునట. పరతత్త్వము బ్రహ్మపదార్థము. అది నిర్గుణము. దానికి రూప రస గంధాదులు లేవు. 'అనంత మాకాశం బ్రహ్మ'యని బ్రహ్మ పదార్థమంతము లేనిది. అవకాశము లేనిది. ఆకాశమువలె రూపము లేనిది. ఇది శంకర మతము. నిర్గుణోపాసనను బోధించునది అద్వైతము. తిక్కన యీ పరతత్త్వము హరిహరంబయినదని నిరూపించెను. ఇది సగుణోపాసన. 'సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం' అని విశిష్టాద్వైతము. గీతలు బోధించు విరాట్స్వరూపము అది. వైష్ణవుల కది భగవత్స్వరూపము. వారు సగుణోపాసకులు. ఇచ్చటనే అద్వైత విశిష్టాద్వైతములకు భేదాభిప్రాయము కలదు. తిక్కన పరతత్త్వ మనుటచేత అనంతమయి బ్రహ్మపదార్థము సర్వ వ్యాపక మయినదనియు, అది హరిహరంబగు రూపమనియు నిర్దేశించెను. అందుమూలముననే నపుంసక లింగమును వాడెను. ఇది తిక్కనగారి ధర్మాద్వైతము. ఆ పరతత్త్వమును సన్నిధిగావించుకొని

కిమస్తిమాలాం కిం కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం
కిం కాలకూటః కిముపా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో! మే

యని ప్రశ్నించినాడు. దాని కా హరిహర పరతత్త్వమమితానందము పొందినదట. ఆ విరాట్స్వరూపమును గురించి ప్రచారము సాగించినాడు. కలలు కనినాడు, హరిహరనాథుడు కలలో సాక్షాత్కరించినాడు. మన్నామాంకితముగా భారత మాంధ్రీకరింపు మని సెలవిచ్చినాడు. తిక్కన కోరిక పండినది. 'యద్భావం తద్భవతి' కార్యాచరణమునకు పూనుకొనినాడు తిక్కన. ధర్మాద్వైతమత ప్రచారము సంగతి దైవమెరుగును. భారతము విరాటమాది పదునైదు పర్వములు పరిపూర్తియైనవి. శంకరాదులందున్న తపశ్శక్తి ప్రతిభావిశేషము తిక్కనయందు లేవు. అతడు మహాకవి. మంత్రి. మతకర్త కాలేకపోయినాడు. ధర్మాద్వైత మాయనతోడనే యంతరించినది. తరువాత హరిహర పరతత్త్వమును ఒకరిద్దరుతప్ప అంతగా తలంచినవారు లేరు. కాని యాయన కవిత్వము తలంపనివారు లేరు. తిక్కన యొక్క యపూర్వమగు వ్యక్తి. లొక్యుడు. కళా వైదగ్ధ్యముచేత కలలు కనును. ఆ కనినదానిని కన్నుల యెదుట నిలుపుకొనును. బుద్ధిసూక్ష్మతకు మానసిక దృష్టిని జోడించి తీవ్రముగా పరిశీలన గావించును. లేఖినికి పని చెప్పును. తలంపునకు సరియైన దృశ్యము తయారుచేయును. దాని ఫలితమే

కరుణా రసము దొంగి తొరఁగెడు చాడ్పున
శశిరేఖ నమృతము జాలువార
హరినీల పాత్రిక సురభి చందన మున్న
గతి నాభి ధవళ పంకజము నెఱయ
గుఱియైన చెలువున నెఱసిన లోక ర
క్షణ మన గరళంబు చాయ దోపఁ
బ్రథమాద్రిఁ దోతెంచు భాను బింబమునా ను
రమ్మునఁ గౌస్తుభ రత్న మొప్ప
సురనదియును గాళిందియు బెరసినట్లు
కాంతి పూరంబు శోభిల్ల శాంతమూర్తి

వెలుగొందు హరిహర రూప విశేషము. ఆయన శిల్పకవి. వాని శిల్పములో ప్రాణమున్నది. వాని కవిత యొక ప్రత్యేకమగు వినూతన మార్గమున

అడుగుల నునుఁ గాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టు కరణి నొప్పఁ
బాలిండ్లు తను వెడ ప్రాలింపఁ జెన్నొందు
నసదుఁ గ్రొందీగె యల్లాడుచుండఁ
దరి వేచి వెనువెంటఁ దగులు కామాంధకా
రము లీలఁ గ్రొవ్వెద కొమరు మిగులఁ
గర్ణభూషణ మౌక్తిక ప్రభా డోలన
మీక్షణ దీప్తుల నినుమడింప

నందియల మొరపమ్మున కరుగు దెంచి
ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమునఁ దోన
చనఁగ

నొయారంపు నడకలతో భారతోద్యానవనమునందు సంచారము గావించినది. దాని ననుకరింప వలయునని యెవరెన్ని విధముల ప్రయత్నించినను సాధ్యముకాని పని. బిరుదులకు తిక్కన్నలు కావచ్చును. కవితకు కాజాలరు. అది నవ నాగరికాంగన. జాణతనము నేర్చిన పురాణంపు తెనుగు దేశీయ ప్రబంధ కన్యక. నిండు జవ్వనంపు మిటారికత్తియ. ఆమెయందు రజోగుణమున్నది. కావున నారికేళ పాకమున పడినది.

తిక్కన్నగారి ధర్మాద్వైత మెవరియందు పనిచేసినను చేయక పోయినను కొంతవరకు కవుల విషయమై ఫలకారి యైనది. ఎఱ్ఱా ప్రగడ, శంభుదాసుడు, నృసింహపురాణము, హరివంశము నాంధ్రీకరించెను. అవి విష్ణుకథలు. పోతన శివపూజా తత్పరుడు. భాగవత మాంధ్రీకరించెను. అది విష్ణుగాథ. కారణములేమైన నుండవచ్చును.

అవి నిమిత్త మాత్రములు. పరిగణనీయములు గావు. పదునాలుగు పదునైదు శతాబ్దములందు గంగా యమునల వలె శైవ వైష్ణవము లొండొంటి నొరసికొనుచు నాంధ్ర దేశమున పొరలి ప్రవహించుచునే వచ్చినవి. కాని శైవమునకు జనసామాన్యమునందున్న పలుకుబడి వైష్ణవమునకు లేదు. దాని ధాకకు వైష్ణవ మాగలేకపోయినది. శ్రీనాధునివంటి వీరశైవ కవులు కాశీఖండము, భీమఖండము, హర విలాసము, శివరాత్రిమహాత్మ్యమువంటి శైవకావ్యములు రచించుచు వచ్చిరి. హరుడు చితా భస్మధారి. మరుడన్న వానికి మనసు కొలు పదు. నుదుటి కంటిమంటలు భస్మ మొనరించును. ఆయన పాద భక్తులు వీరశైవులు. వారికి శృంగారమనిన గిట్టదు. భస్మావలేపన మనిన పరమానందము. వారి ప్రబంధములు తదనుగుణములు. వీర శైవుల కరములందు చిక్కిన కవితాలతాంగి వైరాగ్య మవలంబించి

ముత్యాల మొలనూలు మురువు చూపెడునట్టి
 జఘనంబుపై మౌంజి సంతరించెఁ
గందుకక్రీడపై గారాబు పచరించు
 హస్తాబ్జములఁ బూనె నక్షమాల
కస్తూరి కాంగరాగములతో విలసిల్లు
 తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మ పెండిలి పాటఁ బ్రొద్దుపుచ్చు వెలుంగు
 నీలకంఠ స్తోత్ర నియతిఁ గూర్చెఁ
బసిడి కమ్ముల యందంపుఁ బట్టుచేలఁ
గరము రాణించు మేనెల్లఁ గగురుపొడువ
గంతగా వైచెఁ బులితోలు కళవసంబు

పదునైదవ శతాబ్దము వచ్చినది. వైష్ణవము నాలుగు పాయ లుగా చీలినది. ఆళ్వారుల చేతులలో వైష్ణవము పౌరాణికమతమయి ద్రావిడ ప్రబంధ రూపముగా పరిణమించినది. వారికి శ్రీకృష్ణుడు పరతత్త్వము. నీల వాని దేవేరి. ఈ మతమును గురించి ముందు

సమగ్రముగా చర్చింపబడును. విశిష్టాద్వైతము రెండవది. దీనికి శ్రీవైష్ణవమని నామాంతరము గలదు. దీనిని రామానుజులవారు స్థాపించిరి. ఇది వేదప్రమాణమైన మతము. మహాపండితులు దీని నంగీకరించిరి. రామానుజుని శిష్యులలో నొకడు రామతత్త్వము ప్రచారములోనికి తెచ్చెను. వాని యనుయాయులకు రామాయణము పరమ ప్రమాణము. వల్లభస్వామి శ్రీకృష్ణతత్త్వమును బోధించెను. ఆయన శ్రీకృష్ణ జన్మకాండకు భాష్యము వ్రాసెను. చైతన్యుడు జయదేవుడు లీలాశుకుడు వల్లభస్వామి మతావలంబకులు. వీరికి గర్గ వ్యాస భాగవతములు బ్రహ్మకైవర్తక పురాణము ప్రమాణ గ్రంథములు. శ్రీకృష్ణుడు పరతత్త్వము. రాధ యాయన దేవేరి. ప్రకృతి స్వరూపిణి. దీనిని రాధాకృష్ణ మతమందురు. సాంప్రదాయ మొక్కటయినను భావభేదములచేత నీ నాల్గు మతముల వారికి నొండొరులలో రవరవలు పొడమినవి. ఇవి గృహకల్లోలముల వంటివి. ఆళ్వారులు రాము నెడ పెడమొగము గలవారు. శ్రీకృష్ణ పరముగా రంగని భక్తి గావించిరి. రాము డేకపత్నీవ్రతుడు. అది వారికి గిట్టలేదు. శ్రీకృష్ణుడు గోపికాలోలుడు. ఆళ్వారులు స్త్రీవద్భావముతో గోపికలవలె శ్రీకృష్ణుని సేవించి తరించిరి. గోదాదేవియు నట్లే కావించెను. కాని యామె స్త్రీయగుటచేత సహజమగు కామవికారమును బొందినది. రంగని పరిణయమాడినది. దాంపత్యఫలము ననుభవించినది.

జయదేవుడు శ్రీకృష్ణభక్తుడు. ఆయనకు కోదండపాణియై శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమయ్యెను. హింసాకరమగు నీ కోదండముతో నిన్ను చూచుటకు నే నిచ్ఛగింపను. వేణుగోపాలమూర్తివై నాకు సాక్షాత్కరింపుమని యర్థించెను. 'గోవు వెంటఁ దగులు కోడె భంగి' యను భాగవతసూక్తిని ప్రత్యక్షర సమన్వితముగా తమ యందు సార్థకము గావించుకొనినవారు శ్రీకృష్ణ తత్త్వోపాసకులు. శ్రీకృష్ణుడు పరమ పురుషుడు. తాము గోపికలు. దీనిని వైష్ణవ మందు మధురభక్తి యందురు. వారి కవితలు మధురప్రబంధములు.

శైవ వైష్ణవ ద్వేషములకీ యంతర్ద్వేషములు తోడయినవి. సంఘము విచ్ఛిన్నమయినది.

కవులు శాంతి ప్రియులు. దేశాభ్యుదయమునకై తమ లేఖినిని వినియోగింతురు. పోతన తెనుగుదేశమునందు మతకల్లోలములను మాటుమడంప తలంచెను. దాని కుపాయ మాలోచించెను. సర్వమత సామరస్యముగల శ్రీమన్నారాయణ కథాప్రపంచ రచనా కుతూహలుం డయ్యెను. పోతన తాత తండ్రులు శైవశాస్త్రమతానుగాములు. తల్లి లక్కమాంబ సదాశివ పాద యుగార్చనానుకంపానయ వాగ్భవాని. పోతన మహేశ్వరపూజా ధురంధరుడు. పంచాక్షరీ మంత్రోపాసకుడు. అయినను శివ కేశవుల భేదమాయనకు లేదు. రాకానిశా కాలంబున సోమోపరాగంబు రాక గని గంగకుం జనినాడు. మహనీయ మంజుల పులిన తలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచు కించి దున్మీలిత నయనుండయి యుండెను. శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించెను. నేను రామభద్రుండను. మన్నామాంకితముగా శ్రీమహాభాగవతమును తెనుంగు సేయుము. నీకు భవబంధంబు తెగునని యానతిచ్చి యంతర్హితుం డయ్యెను. చేసినది శివధ్యానము. సాక్షాత్కరించినది శ్రీరామచంద్రుడు. ఇది పరస్పర విరుద్ధము. లోకమునందు జరుగనిది.

పోతన యతిలాక్ష్యుడు. అంద రనుకొనునట్లు శ్రీరామభక్తుడు కాడు. ఈ విషయమున సారస్వతోపాసకు లందరు పొరపడిరి. లోకమును పెడదారికి మళ్ళించిరి. 'గతానుగతికో లోకః' శివునకు శ్రీమన్నారాయ ణావతారుండగు రామచంద్రునకు భేదములేదు. ఎవరిని ధ్యానించినను ఫలిత మొకటే. శివుడే కేశవుడు కేశవుడే శివుడు అని లోకమునకు ప్రకటించుటయే పోతన యభిప్రాయము. 'శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః, యథా శివమయో విష్ణుః' అను సూక్తియందలి భావ మాసంఘటనచేత వ్యక్తీకరించెను. కావుననే

చేతు లారంగ శివునిఁ బూజింపఁ డేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁ డేని

యని భాగవత పీఠికయందు నుడివెను. హరికీర్తనంబు సర్వజన సమ్మతమని యుద్ఘాటించెను. ఎవరిని ద్వేషించినను వాని జన్మ తల్లుల కడుపు చేటని ప్రబోధించెను. ఇందు మూలమున వీరశైవ శ్రీవైష్ణవుల పరస్పర విద్వేషము మహాపాపమని ప్రకటించెను. వేదార్థ ప్రతిపాదమునందు తిక్కనగారికంటే పోతనగారు ప్రజ్ఞావంతుడు. కాని వేదాంత విద్యావిదులు ఇరువురను అంగీకరింపరు. తిక్కనగారి హరిహరస్వరూప కల్పనము ఊహామనోహరమయినను శాస్త్రవిరుద్ధము. పోతనగారి శ్రీరామచంద్ర సాక్షాత్కారము వినోదకరమయ్యును సత్యదూరము. ఉపాసనాక్రమమునకు ఇరువురు తమ కార్య సాఫల్యమునకు నిరూపించిన పన్నాగములు అని తీవ్రముగా నాలోచించిన వారికి తోచక తప్పదు. వారు మహాకవులు. ఊహాప్రపంచమున సంచారము గావింతురు. 'తాభ్యాం నమః'

పోతన భాగవతము నాంధ్రీకరించుటకు పూనుకొనెను. ఆదియందు శ్రీకైవల్య పదంబు చేరుటకునై నందాంగనా డింభకుని చింతించెను. ఇది వింతలో మరొకవింత. అంకితమిచ్చినది రామునకు; ధ్యాన మొనరించినది నందాంగనా డింభకుని. తాము కృతి సమర్పించిన దేవతనే యాదియందు ధ్యానించుట కవుల సంప్రదాయము. తిక్కన హరిహరనాథునకు భారతము నంకితమిచ్చెను. ఆదియందు హరిహరనాథుని ధ్యానించెను. గోపీనాథ వేంకటకవి తన రామాయణమును శ్రీకృష్ణున కంకిత మొనరించెను. ఆ నందనందనున కాదిలో నమస్కరించెను. రఘునాథ నాయకుడు తన కృతులను రామాంకితము గావించెను. ఆదియం దా రాముని ధ్యానించెను. ముద్దు పళనియు నట్లే కావించినది. వీరందరి కా యా దేవతలు ప్రత్యక్షమైరి. కృతుల నర్థించిరి. ఇది పరంపరాగతము. కృతినొక దేవున కిచ్చి, ధ్యాన మింకొక దేవుని చేసినవారు లేరు. అట్లుచేయుట భక్తి లక్షణము కాదు. పోతన భాగవతమును రామాంకితము గావించి

శ్రీకృష్ణుని చింతించుటలో విశేషమున్నది. విష్ణువవతారములయిన రామకృష్ణు లేకరూపులనియు, వారిలో నెవరిని వినుతించినను ప్రణుతించినను రెండవవారికి కూడ చెందుననియు లోకమునకు నిరూపించుటకే యట్లు గావించెను. ఇట్లు శివుడు రాముడు కృష్ణుడు భిన్న మూర్తులుగా గోచరించుచున్నను అభిన్నులని పీఠికయందు నిర్దేశించి భాగవత కథా కథనమున కుపక్రమించెను. ఇందుమూలమున శైవ విశిష్టాద్వైత వల్లభస్వామి ఆళ్వారు మతస్థులకు పాఠము నేర్పెను.

భాగవతము భగవత్తత్త్వమును బోధించు గ్రంథము. భగవచ్ఛబ్ద నిరూపణచేత నొక్క విష్ణువును గ్రహించుట యవివేకము. విష్ణుతత్త్వమును బోధించు విష్ణుపురాణము, శివతత్త్వమును బోధించు శివపురాణము ప్రత్యేకముగా గలవు. భగవత్ శబ్దముచేత వేదమునందు ప్రతిపాదింపబడిన మూర్తిత్రయమును గ్రహింపవలయును. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పరబ్రహ్మ మూర్త్యంతరములు. వారి మహిమాతిశయమును బోధించునది భాగవతము. అది నారాయణ కథా ప్రపంచితము. ఆంధ్ర రాష్ట్రీయాస్థాన కవులగు కాశీ కృష్ణాచార్యులవారు బందరునందు భాగవత తత్త్వమునుగురించి యుపన్యసించుచు భగవత్ శబ్దముచేత శివునిగూడ పరిగ్రహింప నగునని చెప్పినటుల నాకు బాగా జ్ఞాపకమున్నది. శ్రీయాచార్యులవారి మాట సత్యము. భాగవతమునందు విష్ణుమూర్తి దశావతార కథలే గాక, దక్షాధ్వర విధ్వంసము త్రిపుర సంహారము మొదలగు శైవ గాథలు గలవు. బ్రహ్మను గురించిన కథలుగలవు. భాగవతము సకలమత సామాన్యమయిన గ్రంథము. కావుననే పోతన తన యభిమతమున కనుగుణమగు భాగవతమును తెనిగింప బూనెను. దానిని రామచంద్రుని నోట చెప్పించెను. అందు మూలమున తన భాగవతమునకు కీర్తి ప్రతిపత్తులు సమకూడగలవని తలంపు. అది యట్లే జరిగినది. కొందరు సుప్రసిద్ధ విమర్శకులు తలంచినటుల పోతనగారు శ్రీకృష్ణతత్త్వ మొక్కదానినే బోధించుటకు భాగవతము నాంధ్రీకరించ లేదు.

భాగవతము భక్తి ప్రధానమగు గ్రంధము. భక్తి రెండు విధములు. దాసభక్తి మధురభక్తి - 'తనుహృద్భాషల సఖ్యమున్' అను పద్యము రెండువిధముల భక్తిని నిరూపించును. ప్రహ్లాదచరిత్ర గజేంద్రమోక్షము అంబరీషోపాఖ్యానాదులు దాసభక్తికి దృష్టాంతములు. ఇది రామానుజ మతసాంప్రదాయము. దశమస్కంధములోని రాసక్రీడ భ్రమరగీతాది గోపికా వృత్తములు మధుర భక్తిని ప్రదర్శించును. అందు శృంగార మంతర్లీనమయి యుండును. గోపికాంగనలు తన్మూలమున తరించిరి. ఇది యాళ్వారుల మత సంప్రదాయము. వల్లభ చైతన్యాదులు జయదేవుడు శ్రీకృష్ణతత్త్వోపాసకులు. పోతన శ్రీకృష్ణతత్త్వమును తెనుగు దేశమునందు ప్రచారములోనికి తెచ్చెనను సంగతి ఎంతవరకు సత్యమో విజ్ఞులూహించుకొనగలరు. పోతన కవిలోకాగ్రగణ్యుడు. రసమయాంతరంగుడు. ఉభయ విధముల భక్తిని భాగవతమునందు సమగ్రముగా ప్రదర్శించి యపారమగు యశము నార్జించెను. ఏ పద్యము నేవిధముగా నడిపించిన నే రసమెట్లు వెల్లివిరియునో పోతన బాగుగా నెరుంగును. వానియందు శైవవైష్ణవములు గూడు కట్టుకొనియున్నవి. ఆ కారణముచేత వీర శృంగారములు భక్తి శృంగారములు మేళవించి కవిత నతి మనోహరముగా నడిపింప గలిగెను. పోతన రామభక్తుడనియు 'విష్ణుమయం జగత్సర్వం' అను సంగతి చక్కగా ననుభూతికి తెచ్చుకొనిన పరమ భాగవతోత్తము డనియు కొందరి యభిప్రాయము. పోతనను వారు సరిగా నర్థముచేసికొన లేకపోవుటయే కాక లోకమునుగూడ వారు తమతోపాటు పెడదారిని పట్టించి సారస్వతమునకు మిగుల నపకార మొనరించిన వారయిరి. పోతన శివమంత్రోపాసకుడు. లోక హితార్థము భాగవతమును తెనిగించెను. ఆయన మనోభావమున కది సరిపోయినది. ఆయన రామభక్తుడునుగాడు విష్ణుభక్తుడును కాడు. భాగవత తత్త్వమును బాగుగా నవగతము చేసికొనిన రసిక శేఖరు డగు మహాకవి. అప్రస్తుతమైనను నింకొక విషయమును నుడివి దీని నింతటితో విరమింతును.

భాగవతమును సర్వజ్ఞ సింగ భూపతి భూమిలో పూడ్పించె నను ప్రవాదము లోకమున గలదు. సింగభూపతి మహావిద్వాంసుడు. కావ్య రస పిపాసి. భాగవతమువంటి యుత్తమ గ్రంథమును విధ్వంసము గావించు నవివేకి కాడు. భాగవతము నాంధ్రీకరించునపుడు పోతన యొక క్రమమున తెనిగించ లేదు. తన యిచ్ఛవచ్చిన కథా భాగములను స్కంధములను ముందు తెనిగించుకొనుచు వచ్చెను. తరువాత వానిని యథారీతిగా కలుపుకొన తలంచెను. విధి విరోధించెను. పోతన మరణించెను. ఆ భాగములు అట్లే మిగిలిపోయినవి. తరువాత నారయాదులు పూరించిరి. ఇది యసలు సత్యము. లేనిపోని నిందలు మోపి సింగభూపాలుని సారస్వత ద్రోహుల జాబితాలో మొదట చేర్చినారు చరిత్రకారులు. అదేపరం పరాగతముగా కథలు గాథలయి దిగుమతియైనవి మనకు. దున్న యీనినదనిన దూడను కొట్టములో కట్టివేయు మనినవార మయితిమి మనము. ఉభయ మతములకు పొందు నాపాదింప తలంచిన పోతన్నగారి శిక్షణమున తెనుఁగుఁగైత యతిప్రౌఢమైనది. వీర శృంగారమును భక్తి శృంగారము నలవరచుకొనినది

సౌవర్ణ కంకణ ఝణఝణ నినదంబు
శింజినీ రవముతోఁ జెలిమి సేయఁ
దాటంక మణి గణ ధగధగ దీప్తులు
గండ మండల రుచిఁ గప్పికొనఁగ
ధవళేత రాపాంగ దళధళ రోచులు
బాణ జాల ప్రభా పటలి నడప
శరపాత ఘుమ ఘుమ శబ్దంబు పరిపంథి
సైనిక కలకల స్వనము నుడుప

నుభయ తత్త్వములను దాల్చినది. ఒకటి రౌద్రము, రెండవది వైష్ణవము. ఆంధ్రలోకమున కబ్బురపాటొదవించినది. ఈడు వచ్చిన యీడుది కవితా లతాంగి. ఎంతకాలమని యోపిక పట్టగలదు? లేఁ

బ్రాయంపుఁ జిన్నారి యగుటచేత నన్నయగారి పెంపకమున ధర్మ పన్నాగములకు తలయొగ్గి సిగ్గరియైనది. తిక్కనగారి చేతిలో నిండు ప్రాయంపు బిగువుల నొయ్యారియై సింగారంపుఁ బోకడల నెరజాణ తనము నభ్యసించినది. మనసు తీరియుఁ దీరకమునుపు నడిమి కాలమున వీరశైవ మవలంబించినది. తపశ్చర్యకు పూనుకొనినది. ఆ తపశ్చర్య పార్వతి తపశ్చర్యవంటిది కాదు. విష్ణుత్వము కొరకు పాశుపతచర్య. కోరిక నెరవేరినది. పోతన్నగా రాధారముగా దొరికినాడు. ఉభయ మతావలంబిని యైనది. ఉభయ రసముల నడుమ నూగిసలాడినది. కొంతకాలము రుచిమరిగిన ప్రాణి. తెగించినది చివరకు. పదునారవ శతాబ్దము నాటికి వైష్ణవ ప్రాబల్య మాంధ్రమున నెక్కువయినది. అద్వైతులు విశిష్టాద్వైత మతము స్వీకరించిరి. వైష్ణవము మరింత బలమయినది. క్రొత్త వింత, ప్రాత రోత. మహారాజులు మతములు మార్చుకొనిరి. విష్ణు భక్తులైరి. విజయనగర సామ్రాజ్యాధినేత శ్రీకృష్ణరాయలు. ఆయన వైష్ణవుడు. విష్ణువు శృంగార పురుషుడు. ఆయన భక్తులు శృంగార పురుషులు. పునుగు జవాది వాసనలు మేన గుబాళింప, వీటెరస వాసనలు దిశల నలముకొన పురవీథులందు సంచరింతురు. వారి మురిపెంపు పోకడల నరసి మురిసిపోయినది తెలుంగు కవితా లతాంగి.

రాయల యాస్థాన కవి యలసాని పెద్దన. ఆయన ఆహితాగ్నియైన విశిష్టాద్వైత మతస్థుడు. మొదట అద్వైతి. శఠకోపయతి శిష్యత్వమున వైష్ణవమును పరిగ్రహించెను. మహాకవి రాయల వారిచేత ఆంధ్ర కవితా పితామహ యని పిలిపించుకొనిన యుభయభాషా కోవిదుడు. సుఖజీవి

నిరుప హతిస్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పుర విడె మాత్మ కింపయిన భోజన ముయ్యెల మంచ

మున్నగాని కవితా రచనకు గంట మందుకొనని మహాభోగి. వలచి వలపించుకొన్న దా మహాకవి నాసపడి కవితావాణి. కాని యాత

డాహితాగ్ని కుటుంబములోనివాడనియు వేదవిదుడనియు మరచిపోయి నది. మనుచరిత్రమునందు మసలుకొన్నది. హిమాలయంపులోయలో నేకాంతమునం దావాసము కల్పించుకొన్నది. శృంగార రసోద్దీపక ములైన యపూర్వ వాతావరణములను కలిగించుకొన్నది. గున్న మావినీడ చంద్రకాంత శిలావేదిక మీాద మృగమద ఘనసార విభవ ద్విగుణిత వీటి గంధస్థగితేతర పరిమళయై వీణాగాన మొనరించుచు కూర్చున్నది. శృంగారమునకు సంగీతము దగ్గర చుట్టము. 'సంగీతం సాహిత్యం చ సరస్వత్యాః స్తనద్వయం' సరస్వతికి సమాకర్షణీయ ములైన యంగములు సంగీత సాహిత్యములు. రెంటి సమ్మేళన మిక్కడ చక్కగా కుదిరినది. దారులు వెదకికొనుచు వచ్చినాడు ప్రవరుడు. అతడు జయంత వసంత కంతులం జక్కదనంబునం గెలువం జాలిన యలేఖ్యతనూ విలాసుడు. కవితా లతాంగి తన యభిమతము నెరవేరిన దనుకొనినది. లోలోన నువ్విళ్ళూరినది. ఉబలాటపడినది. ఉప్పొంగిపోయినది. నయనాంబుజములు వికసించినవి. కాంతి వెల్లు బ్బినది. కనీనికలు వికసితోత్పల పంక్తులు గ్రుమ్మరింపగా చూచి నది. ఝణం ఝణత్కటక సూచిత వేగ పదారవిందయై లేచినది. కుచంబులుం దురుము లేనడు మల్లలనాడ గంపె డాసతో దగ్గర కరి గినది. అతడు పరమఛాందసుడు. ఇంతలు కన్నులున్నను దారి కాన రాని యమాయకుడు. చెప్పినను తెలియనివాడు. తెలిసినను నచ్చని వాడు. తన కథనంతయు వెళ్ళబోసికొన్న దా యిల్లాలు. ఆశలు పెట్టినది. బాసలు చేసినది. లాభము లేకపోయినది. తహతహ పడినది. యారాటము భరింపలేక

> ప్రాంచ ద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లుపొంగారఁబై
> యంచుల్ మోవఁగఁ గౌఁగలించి యధరం బాసిం

చినది. ఆ బ్రాహ్మణు డోరమోమిడి తదీయాంస ద్వయంబంటి పొమ్మంచున్ ద్రోచినాడు. ఆ యగౌరవము సహింపలేక పోయినది. వనితల్ తనంతఁ దావలచి వచ్చిన చుల్కనకాదె యేరికిన్—అను

కొనినది. తెనుగుదేశమునం దామె కింక కాలు నిలువలేదు. ఆ త్రోపుతో.

> మట్టైల్ ప్రోయఁగ గబ్బి చన్నుఁగవ కంపంబంద వేణీభరం
> బట్టైటై కటి చిమ్మచీకటులు గ్రమ్మన్

దక్షిణ దిశాభిముఖయై పరుగువారినది. తంజావూరు చేరునంతవరకు మనస్సాగలేదు. విషాదము డిందుపడలేదు.

---

## ౨

## రఘునాథ నాయకుడు

శ్రీకృష్ణదేవరాయలు దక్షిణముగా విజయయాత్ర సాగించెను. చోళరాజ్యమును జయించెను. దానిని స్వాధీనము గావించుకొనెను. తంజావూరునందు విశ్వనాధనాయకుని రాజప్రతినిధిగా నియమించెను. అతడు సర్వసమర్థుడు. మధుర తంజావూరు మండలములను జనరంజకముగా పరిపాలించెను. రాయల మెప్పు సంపాదించెను. రాయల యనంతర మాయన సహోదరు డచ్యుతరాయలు విజయనగర సింహాసన మధిష్ఠించెను. అచ్యుతరాయల దేవేరి తిరుమలాంబ. ఆమెకు మూర్తిమాంబ యను సోదరి కలదు. ఆమెను వీరశిరోమణియగు చిన్న చెవ్వప్పనాయకుడు పరిణయమయ్యెను. అతడు సుప్రసిద్ధుడగు తిమ్మనాయకుని కుమారుడు. బయ్యాంబిక గర్భశుక్తి ముక్తాఫలము. అచ్యుతరాయలు మూర్తిమాంబకు స్త్రీధనముగా తంజావూరుమండల మొసంగెను. చిన్న చెవ్వప్పనాయకుని విశ్వనాధనాయకునకు సహాయకారిగా నియమించెను. కొలది కాలమునకు అచ్యుతరాయలు మరణించెను. అతని సోదరుని పుత్రుడు సదాశివరాయలు సింహాపీఠి నధిష్ఠించెను. ఆయన కాలమున చిన్న చెవ్వనాయకుడు తంజావూరు మండలాధిపతిగా నియమింపబడెను. విశ్వనాధనాయకుడు మధుర మండలమునకు రాజయ్యెను. చిన్న చెవ్వప్పనాయకుడు పారమార్థికబుద్ధి కలవాడు. శివభక్తుడు. ధర్మకార్య నిరతుడు. శ్రీశైల అరుణాచల వృద్ధాచలములలో శంకరార్పణముగా ననేక కైంకర్యములు గావించెను. చిన్న చెవ్వనాయకుని దాన ధర్మములను గురించి రఘునాథనాయ కాభ్యుదయమునందు

> వారిలోఁ జినచెవ్వ వసుధా బలారి
> మేరు ధీరుఁ డనంగ మేదిని వెలసెఁ

చిరతరంబుగ భక్తి శ్రీశైలమందు
నరుణాచలమున వృద్ధాచలంబునను
శంకరార్పణముగా శాశ్వతానేక
కైంకర్యములు చేసి ఘనకీర్తిగాంచె

నని యున్నది. తిరువణ్ణామలైలోని యరుణాచలేశ్వరాలయమునకు పదునొకొండంతరవుల తూర్పుగోపురము నిర్మించెను. వృద్ధాప్యమునందు చిన్న చెవ్వనాయకుడు తనూజుడగు నచ్యుతనాయకునకు రాజ్యము నప్పగించెను. తాను శివధ్యాన తత్పరుడయి జీవితశేషమును గడపెను. అచ్యుతనాయకుడు మహావీరుడు. తన్నెదిరించిన భూపతులను రణావని దునిమి సవ్యసాచి యని యశము నొందెను. అచ్యుతనాయకుడు విష్ణుభక్తుడు. తండ్రివలెనే ధర్మకార్యములందాసక్తి కలవాడు.

రంగధామునకు శ్రీరంగమునందు
బంగారు నజ్జలుఁ బ్రాకారములును
రంగుమీఱు కిరీట రాజంబు మేలి
శృంగారవనములు

నిర్మించెను. ఆ మహారాజు దేవేరి మూర్తిమాంబ. ఈ రాజదంపతులకు అచ్యుత నాయకుడు రఘునాధ నాయకుడను నిరువురు కుమారులు జన్మించిరి. వారిలో రఘునాథ నాయకుడు చిన్నవాడు. చెవ్వప్ప అచ్యుతనాయకులు దైవ చింతనము కలవారు. వారి యంతః ప్రవృత్తి పారమార్థిక నిష్ఠకలది. సారస్వతాభివృద్ధికి వారొనరించిన కృషి యంతగా గనిపించదు. కవులను పోషించి కావ్యములను కృతి గొనిన జాడ లేమియు నగుపించవు. రఘునాధనాయకుడు అమిత పరాక్రమవంతుడు. సాహసోపేతుడు. తండ్రి పనుపున విజయనగరాధీశ్వరుండయిన వేంకటపతి దేవరాయలకు సహాయముగా నరిగి యతని రాజధానియగు పెనుగొండను ముట్టడించిన మహామ్మదీయులను దురమునం దోడించెను. అచ్యుత నాయకునకు వార్ధక్యము

ప్రాపించెను. రాజ్యపాలనమునందు విరక్తికలవా డయ్యెను. కుమారు డగు రఘునాథ నాయకుడు దక్షుడని యూహించెను. రాజ్య భార మును రఘునాథనాయకుని భుజస్కంధములపై నారోపించెను. తాను శ్రీరంగమును జేరి రంగధాముని పాదారవిందములను సేవించుచు కాలము గడపెను. తండ్రి జీవించియుండ కుమారునకు రాజ్య మప్ప గించుట తంజావూరు నాయకరాజులందుమాత్రమే కాన్పించుచున్నది.

శైశవేఽభ్యస్త విద్యానాం
యౌవనే విషయైషిణాం
వార్ధకే ముని వృత్తీనాం
యోగేనాంతే తను త్యజాం

అను శ్లోకార్థమునకు దృష్టాంతము నాయక రాజుల జీవితము. రఘునాథ భూవిభుడు.

వసుమతీ రాజ్య నిర్వాహకుం డగుచు
దుండీర వీరుని దురములో దునిమె
చండించి ఖండించె జగ్గభూవిభుని
నాలంబు చేసి పాండ్యావనీపాలు
పాళెంబు డాసి తద్బాలికా మణుల
మొఱఁ బెట్టఁగాఁ దన మూకలచేత

చెరపట్టి తెప్పించెను. ప్రజానురంజకముగా రాజ్యపాలనము గావిం చెను. అతడు దాన శీలుడు. నిరతావారితాన్నసత్ర సంతోషిత పంచాశత్సహస్ర భూసురుండు. నిజ నామాంకితాకలంక వస్తుసమగ్ర బహుళాగ్రహార భూషిత చోళ ధరామండలుండు. ఉభయ భాషా కోవిదుడు. కవిలోక మాన్యుడు. ఆంధ్రభోజుడను విఖ్యాతి గడించు కొనెను. శ్రీకృష్ణరాయల తరువాత తెనుగు దేశమును పరిపాలించిన రాజులలో సంస్కృతాంధ్రభాషా పండితులయిన కవుల నాదరించి పోషించినవారు తంజావూరు నాయక ప్రభువులు. వారి జీవిత కథలు ఆంధ్ర దేశ చరిత్రమునందు శ్రీకృష్ణదేవరాయల దివ్య జీవితచరిత్రతో

పాటు సువర్ణాక్షరములతో వ్రాయబడినవి. వారి కీర్తి యాంధ్ర సారస్వత ప్రపంచమునందు తెలి వెలుంగు వెన్నెలలను కాయించి నది. వారి పితృభక్తి పరాయణత్వము రామచంద్రునితోడిదయి చిరాక్షర స్థాయిగా కావ్యత్వమును దాల్చినది. వారిలో నొక్కొక్కరు బహుగ్రంథ కర్తలు. తంజావూరు నాయక రాజులలో రఘునాథనాయకు డగ్రగణ్యుడు. తరువాతి నాయక రాజులకు సర్వవిధముల మార్గదర్శకుడయి వెలుగొందెను. నాయకరాజులు విజయనగర సామ్రాజ్యాధిపతులను తమ జీవితమునకు మేలుబంతి గావించుకొనిరి. అందును శ్రీకృష్ణదేవరాయలు వారి కాదర్శపురుషుడు. నిత్య జీవితమునందు ధర్మకార్యములందు సారస్వత పోషణమునందు తంజావూరు నాయకరాజులు శ్రీకృష్ణరాయల యడుగు జాడలలో ప్రవర్తించిరి. సామ్రాజ్యాధిపత్యమునందు రాయలంతవారు కాక పోయినను సారస్వత పోషణమునందు దాదా పంతవారని యొప్పుకొనక తప్పదు. నాయక రాజుల కాలమునందు ఆంధ్ర సారస్వత సరస్వతి పెక్కు ఛందోరూపములగు వినూత నాలంకారముల నలవరచుకొన్నది. అందు యక్షగానములు పదములు మంజరులు పేర్కొన తగినవి.

విరవాది తావులు విరిసిన రీతి
పదములు మంజరి ప్రముఖ కావ్యములు
మొదల మా కంకితమ్ములు చేసి తీవు

అని రాజగోపాలస్వామి విజయరాఘవ నాయకునితో నుడివెను. వివిధచ్ఛందో వాఙ్మయభూషితయై కవితామతల్లి తంజావూరు నాయకరాజుల కొలువు కూటమునం దవిచ్ఛిన్నముగా దాదాపు డెబ్బది సంవత్సరములు కనకాభిషేకాది వివిధ గౌరవములతో విలసిల్లినది. శ్రీకృష్ణరాయలు కవు లెవరికిని కనకాభిషేక మొనరించినటుల కనిపించదు. మొదట దక్షిణాధీశుని ముత్యాల శాలయందు శ్రీనాథునకు కనకాభిషేకము జరిగినది. తరువాత తంజావూరు నాయక రాజులలో రఘునాథరాయల కా గౌరవము లభించినది.

మధురవాణి రఘునాథ నాయకుని యాస్థాన విదుషీమణి. రఘునాథాభ్యుదయాది కావ్యములు రచించెను. ఆమెకు కనకాభిషేకము చేయించినాడు రఘునాథ నాయకుడు. అనంతరము విజయరాఘవ నాయకుని యాస్థాన విద్వాంసురాలు కవయిత్రియు నగు రంగాజమ్మకు మరల ఆ గౌరవము చేకూరినది. ఆమె ఉషా పరిణయాది బహు కావ్యములను రచించిన పండితురాలు. స్త్రీలకు తమ కొలువు నందు స్థాన మొసంగినవారు తంజావూరు నాయకరాజులు. కావుననే పెక్కుమంది కవయిత్రులు విదుషీమణులు నాయకుల రాజ్యకాలము నందు చీకటి మరుగులను తొలగ తీసికొని వెలుగులోనికి రాగలిగిరి. స్త్రీలకు విద్యా స్వాతంత్ర్యముల నొకవిధముగా ప్రోత్సహించినవారు తంజావూరు నాయకరాజులు. వారు తమిళ దేశమునందు తెనుగు భాషను ప్రచారములోనికి తెచ్చిరి. అందుమూలమున తెలుగు వెలుంగు విస్తరించి వికాసము పొందినది. విజయనగర రాజులకంటె నాయకరాజులు తెనుగు భాషా విస్తృతికి నధికముగా తోడ్పడిరనక తప్పదు. ఒక్క కవిత్వమేకాదు, సంగీతము నాట్యము నాయక రాజుల కాలమునం దత్యంతాభివృద్ధి నొందినవి. వీని కన్నిటికి దారి చూపినవాడు రఘునాథ నాయకుడు. ఆయన సుగుణ సంపద తరువాతి నాయక రాజులకు ధ్రువతార యైనది. తంజావూరు మండలము నేలిన తరువాతి మహారాష్ట్ర ప్రభువులుసైత మా మహారాజు నడుగుజాడలలో వర్తించి చిరకీర్తి నార్జించిరి.

రఘునాథ నాయక రాజేంద్రుడు విశిష్టాద్వైత మతావలంబి. శ్రీరామపాద సేవాసక్తుడు. శ్రీరామచంద్ర సాంద్రకరుణా కటాక్ష లబ్ధ సారస్వత విశేష నిరర్గళ వాగ్వైభవ వాశేష సాహిత్య కళా భోజుడ నని రఘునాథ రామాయణ గద్యయందు చెప్పుకొనెను.

కోదండ దీక్షాధి గురుఁడైన రాముఁ
డే దైవమని యెంచు నెంచఁ డన్యులను
ఆ రఘునాథ నాయక శిరోమణి

ఆ భూజాని అచ్యుత నాయకాభ్యుదయ మను ద్విపద కావ్యమును రచించి తన పితృభక్తిని లోకమునకు ప్రకటించెను. విజయ రాఘవ మన్నారుదేవ నాయకుల కాదర్శప్రాయు డయ్యెను. విజయ రాఘవనాయకుడు రఘునాథనాయక మహారాజునకు తనూజుడు. రఘునాథ నాయకాభ్యుదయ మను ద్విపద కావ్యమును, యక్షగానమును రచించెను. విజయరాఘవనాయకుని కుమారుడు మన్నారుదేవనాయకుడు. ఆయన విజయరాఘు వాభ్యుదయ మనుపేర తండ్రి జీవితకథను ద్విపద కావ్యముగా ప్రబంధించెను. నాయక రాజులకు పాండిత్య సాహిత్యములు పితృభక్తి వంశ పరంపరాగతములు. ఈ నాయకుల కాలమునందు ద్విపదలకు యక్షగానములకు అధిక ప్రతీతి కలిగినది. అవి దేశీయచ్ఛందములు. వాని నభివృద్ధిలోనికి తెచ్చి తమ దేశీయ సారస్వత భక్తిని దేశీయతాసక్తిని వెల్లడించిరి. ''స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రస ప్రలుబ్ధ ధియః లోకే బహు మన్యంతే వైకృత కావ్యాని చాన్య దపహాయ'' రఘునాథ నాయకుడు అచ్యుతనాయ కాభ్యుదయమేకాక పారిజాతాపహరణ మను మహాకావ్యమును రెండు జాములలో నత్యాశువుగా చెప్పెను. లేఖకు లా ధారావాహిని ననుగమింప లేకపోయిరి. తబ్బిబ్బులయి క్రిందుమీదులు పరికించిరి. అది సముత్తుంగం బగు హిమావనీ ధర శృంగాగ్రము నుండి నిరంతరంబుగా నవనికి వినిర్గతంబయిన గంగా తరంగిణి. దానిముందెవరాగ గలరు. అందు మాకంద కందళ దమంద మరంద బిందుధారా సందోహములు వెల్లిగొనినవి.

మాకంద కందళ దమంద మరంద బిందు
త్వం పారిజాత హరణం త్వరయా నిబద్ధమ్
యామ ద్వయేన యదునేతరి పారిజాత
మాజీహర త్సరస మచ్యుతరాయ సూనుః
కావ్యం తదత్ర విబుధైస్తు కథం కథంచి
దాలేఖి చిత్ర మవధాయ ఫణీంద్ర కల్పైః సా. ర.

ఈ సంగతి మనసునం దుంచుకొని చేమకూర వేంకటరాజకవి

రసిక మాత్రుండె యంతఃపుర ప్రదీన
సార సారస్వతాధార శారి కాశు
కవన కృతముఖ శుక కళాకలన హృష్ట
బుధ జనాస్థాని రఘునాథ భూమిజాని వి. వి.

యని యభినుతించినా డా రఘునాథ నాయక ధరణీపతిని. ఆ కవితాధాటికి పండితు లబ్బురపోయినారు. అచ్యుత నాయక మహీజాని యొడ లుప్పొంగినది. కన్నులు చెమ్మగిల్లినవి. ఆనందాశ్రుపూరములు జడివారినవి. చూచినాడు గోవింద దీక్షితులు. ఆయన రాజగురువు. మహామంత్రి. సకలశాస్త్ర పరిజ్ఞాత. రఘునాథరాయల ప్రజ్ఞావిశేషంబున కంతరంగంబునం దలరినాడు. మహారాజునకు మనవి చేసినాడు. అవునని తలయూచినా డచ్యుత నాయ కావనీపతి. మరుక్షణము పండిత సభామధ్యంబున రఘునాథ రాయలకు కనకాభిషేకము జరిగినది.

ఏవం వద స్తనయ మేష కృపా రసాఢ్యైః
జాతాభిషేక మపి తం జగతీ బిడౌజః
తత్రాభిషించత మణీభి రసౌ సభాయాం
ఆసీత్స ఏవ వసుధేశ పటాభిషేకః సా. ర.

విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం. ఆశువుగా నుత్పలమాలికను చెప్పి యలసాని పెద్దన శ్రీకృష్ణరాయల మన్ననల నందుకొనెను. అంతకు ముందు సమస్యలను పూరించిన వారె కాని యేకధాటిగా వృత్తమాలిక లాశువుగా చెప్పినవారు లేరు. పెద్దనయు నాశువుగా ప్రబంధము లల్ల లేదు. ఆశుప్రబంధ రచనకు రఘునాథరాయలే మొదటివాడు. ఆయన కవనంపుఁ బోకడల యందచందములు కల్పనాశక్తియు రఘునాథ రామాయణమునందు కొంతవరకు నగుపించును. అది సంస్కృతమునందు వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణమున కనువాదము.

గీర్వాణ భాషయందు భారత భాగవత రామాయణములుత్తమ గ్రంధములని పండిత మండలిచేత నేకగ్రీవముగా నంగీక

రింపబడినవి. అందు రామాయణమునకు గల గౌరవము భారత భాగవతములకు లేదు. భారత మితిహాసము. భరతుని వంశీయులగు రాజుల చరిత్ర. ఒక విధముగా నది పురాణము. భాగవతము భగవత్కథ. ప్రత్యేకముగా నది పురాణముల పట్టికలో చేర్చబడినది. భారత భాగవతములందు కథకు మాత్రమే ప్రాధాన్యము కలదు. రామాయణ మట్లుకాదు. శ్రీమహావిష్ణువు నవతారమగు రామచంద్రుని కథ యందలి యితివృత్తము. అందుమూలమున నది భగవత్కథ. కావున భారతీయుల మతగ్రంథము. విశేషించి విశిష్టాద్వైతులు దానిని శిరమున ధరింతురు. పరమ ప్రమాణ గ్రంథ మని వినుతింతురు. 'రామో విగ్రహవాన్ ధర్మః' రూపొందిన ధర్మము రామచంద్రుడు. కావున ధర్మావబోధక మగు గ్రంథము రామాయణము. అది కల్పతరువు. దానిని పఠించినవారికి సకలాభీష్టములు సిద్ధించు నను నమ్మకము కలదు. సంస్కృతభాష వచ్చినను రాకున్నను వాల్మీకి రామాయణమును అనుదినమును ప్రాతఃకాలమున స్నాన సంధ్యాది కృత్యములు నెరవేర్చుకొని పారాయణము గావించువా రిప్పటికిని పెక్కుమంది కలరు. పండితుల మా టటుండగా పామరులు సైతము మాగ్రంథరాజమును పఠించినను పఠింపకపోయినను "వామేభూమిసుతా పురశ్చ హనుమాన్" ఇత్యాది శ్లోకములు చదివి నిత్యము ధూప దీప నైవేద్యారాధనలు జరుపుచుండువారును గలరు. వారి దృష్టిలో రామాయణమే శ్రీమన్నారాయణావతారుడగు రామచంద్రుడు. రామాయణము వేదాంతగ్రంథమని మహాపండితులు ప్రశంసింతురు. మా తండ్రిగారు శిష్టా నరసింహశాస్త్రిగారు షడ్దర్శనముల నామూలాగ్రముగా చదివిన మహాపండితుడు. వేదాద్వైత. మాడభూషి వేంకటాచార్యుల వారియొద్ద శ్రీభాష్యము శాంతిచేసిరి. మాడభూషి వేంకటాచార్యులవారు సకలశాస్త్ర పండితులు. ఆయన రామాయణము నందలి శ్లోకములకు విశిష్టాద్వైతాద్వైత పరములుగా జీవాత్మ పరమాత్మల సంబంధమును ప్రతిపాదించు వేదాంతార్థమును చెప్పుచుండెడి వారని మా పితృపాదులు

వినిపింపగా పలుసారులు వినియుంటిని. తరువాత గోవింద రాజీయ వ్యాఖ్యానమును పరిశీలించుట కలిగినది. అప్పు డందలి తత్త్వమును కొంతవరకు గ్రహించుకొన గలిగితిని. రామాయణ మొకవిధముగా పురాణము. రఘువంశ రాజచరిత్రమగుటచేత ఇతిహాసము, కావ్యము, వేదాంత గ్రంథము. అందలి శ్లోకములకు శ్లోకమునందలి శబ్దార్థములకు కథతోపాటు ప్రాధాన్యము కలదు. అట్టి గ్రంథము నాంధ్రీకరించుట యసాధ్యము.

కవి యొక శిల్పి. తన బుద్ధినైపుణ్యమునకు ప్రజ్ఞావైదగ్ధ్యములు జోడించి స్వతంత్రముగా నొక కావ్యమూర్తిని తయారుచేయును. దానికి వన్నెలు చిన్నెలు దిద్ది యసాధారణ మనోహరాకృతిగా నొనరించును. అది మానవ మానసోల్లాసకారి కావచ్చును. రసిక జనుల చిత్తము చూరగొనవచ్చును. దాని నింకొక దానితో సరిపోల్చుటకు వీలుండదు. దాని కదియే సాటి కాని యొక సజీవమగు రూపమును బోలిన రూపమును చెక్కవలసి వచ్చినప్పుడు శిల్పి తన చాతుర్యము నంతయు వినియోగించి బైటి యాకారమును యథాతథముగా నిర్మించినను దానికి జీవము పోయలేడు. హృదయ శ్వాసకోశాదులను పొందుపరచలేడు. సంస్కృతము గంభీరమగు భాష. అది దానికి ప్రాణము. తెనుగు మిక్కిలి సున్నితమగు భాష. ఇది దీనికి జీవము. కవి తానెంత పాటుపడి సంస్కృతభాషలోని కావ్యము నాంధ్రీకరించినను భాషాసహజమగు గాంభీర్యమును పిండి పోయలేడు. మూల కృతిలోని యర్థమును తెచ్చి పెట్టలేడు. ఈ సంగతి బాగుగా గ్రహించినవారు నన్నయ పోతనాదులు. భారత భాగవతము లాంధ్రీకరించు నపుడు మూలానుకరణమునుగాక స్వతంత్రమును గాక మధ్య మార్గ మనుసరించిరి. అవి పురాణములు. కథా ప్రధానమగు గ్రంథములు. కావున వారు కృతకృత్యులు కాగలిగిరి. యశము గడించిరి. అవి తెనుగు సారస్వతమునందు నాటికిని నేటికిని రూపు మాయని యుత్తమోత్తమ గ్రంథములైనవి. కావ్యములం దర్థము ప్రధానము. వానిని తెనిగించవలసి వచ్చినప్పుడు శ్రీనాథునివలె

గమి కర్మీకృత నైకనీవృతుడనై యని తెనిగింప వలసి యుండును. రామాయణము భారత భాగవతముల వంటిదికాదు. నైషధాది కావ్యములవంటిదియును గాదు. అది యొక ప్రత్యేకమగు విశిష్టత గల గ్రంథము. కావుననే దానిని తెనిగించుటయం దెవరును కృతార్థులు కాలేదు. వాల్మీకియే మరల జన్మించి తెనిగించినను హాస్యాస్పదు డగును. భాస్కరుడు నన్నయాదుల దారి ననుకరించి రామాయణ మాంధ్రీకరించెను. కావున అర్థగౌరవము తేలేకపోయెను. గోపీనాథ వేంకటకవి కావ్యపద్ధతి నవలంబించి యందందు సొంతపోకడలు పోయెను. అది వేదాంతగ్రంథమని మరచిపోయెను. సొంతపోకడలు రామాయణమున పనికిరావు. వావిలకొలను సుబ్బారావుగారు అర్థగౌరవము కొరకు పెనుగులాడిరి. లాభము లేకపోయినది. కావున ఎవరెన్ని విధముల పాటుపడినను సంస్కృతమున వాల్మీకి రామాయణమునకున్న గౌరవము తెనుగు భాషయందు రాలేదు. రాదు. రాబోదు. ఈ సత్యము గ్రహించినవాడు రఘునాథ నాయకుడు. తన రఘునాథ రామాయణమునందు వాల్మీకి రామాయణములోని కథామాతృక దృష్టియం దుంచుకొని స్వతంత్ర కావ్యముగా వ్రాయ నారంభించెను. 'కౌసల్యా సుతుఁ డిచ్చు మాకు నెపుడుం గళ్యాణ సాకల్యమున్' అని యాశీర్వాదము గావించెను. ఇది మంగళాచరణము. మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ కావ్యాని ప్రథంతే. ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్. యథాక్రమముగా రఘునాథ నాయకుడు ఇష్టదేవతా నమస్కారము గావించెను. సుకవి పురస్కారము కుకవి తిరస్కారము నొనరించెను. ఒక్క ప్రబంధంబు నిబంధింపగా చేయ నూహించెను. ఒక్కనాటి వేకువ జామున

శ్రవణ కుండలములు చంద్రు గెల్చిన నెమ్మొ
గమునకు నీరాజనము లొసంగ
మొలక నవ్వద్దాల గెలిచిన చెక్కుల
కడలకుఁ దెల్ల పావడలు వీవ

బంగరు విలువైరిఁ బరిమార్చు కేలికిఁ
గనకాభిషేకంబు నొనరఁ జేయ
మంజీర రవము పద్మముల భంగించిన
పదముల బిరుద సంపదలు నొగడ
వెంట జయలక్ష్మివలె మచ్చెకంటి యొత్తు
నీడవలె నొక్క కొమరుండుఁ గూడి నడువఁ
గన్నుల దయారసంబు చిల్కంగ నొక్క
నీల వర్ణుండు

రఘునాథ నాయకుని ముందర నిలిచెను. ఇది శ్రీరామచంద్రుని వర్ణన. పోతనగారికి శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించెను.

మెఱుఁగు చెంగట నున్న మేఘంబు కైవడి
నువిద చెంగటనుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
ముఖమునఁ జిరునవ్వు మొలచువాఁడు
వల్లీయుత తమాల వసుమతీజము భంగిఁ
బలువిల్లు మూఁపునఁ బరగువాఁడు
నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి
ఘన కిరీటము తలఁ గలుగువాఁడు

పుండరీక యుగముఁబోలు కన్నులవాఁడు
వెడద యురమువాఁడు విపులభద్ర
మూర్తివాఁడు రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె

అని వర్ణించెను. ఇది పౌరాణిక వర్ణన. నడకయందు కొంత కుంటు పడినను రఘునాథ నాయకుని పద్యమునందు ఒక రకమగు నూతనత్వము శిల్పము నున్నది. ఇట్లనుటచేత పోతనగారికంటె రఘునాథ నాయకుడు ఘనుడని నేను చెప్పుటలేదు. ఆయన కవితలో శిల్పము లేదని నుడువు వ్యక్తులలోని వాడనుగాను.

గుప్పించి యెగసిన కుండలమ్ముల కాంతి
గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ

ఇత్యాది పద్యము చదువు చున్నపుడు సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడు చక్రము కేల ధరించి గుప్పించి యెగురుచున్నటులనే కనులకు కానుపించును. భీష్ముని యంతరంగమునందలి భక్తి మాట మన మెరుగముగాని భక్తిరసావేశము పాఠకుని చిత్తకుహరమున పొడమి ఆనందాశ్రువులు వెల్లివిరియును. పోతనగారు మహానుభావుడు. తాను ప్రదర్శింప దలచిన చిత్రమును తన కనుల యెదుట నిలుపుకొనును. తీవ్రముగా పరిశీలించును. అతి మృదులములగు పదముల సముదాయంపు వన్నెల నందచందము లమర్చి బీరుపోనీయక పద్యములో రూపొందించును. పాఠకుడు దానిని చదువునపుడు తేనెల సోనలయి పదములు రసనాగ్రమున వ్రాలును. భావము మనసును ఆకట్టును. కనుల యెదుట రూపప్రదర్శనము వాటిల్లును. ఆయన శిల్పము సినిమా ప్రదర్శనము వంటిది. అతివేగమగు సంచలనము కలది. 'తన వెంటన్ సిరి లచ్చివెంట నవరోధ వ్రాతమున్' వలె చకచక గడచిపోవుచుండును. తిక్కనగారి శిల్పరచన యట్టిదికాదు. నిలిచి నిలువరించి యందచందములను చూపి పోవుచుండును. కావున గ్రహించుకొనుటకు నవకాశ మున్నది. తిక్కనగా రొకొక్కప్పుడు పదముల పొందికకంటె శిల్పమునకు ప్రాధాన్య మిచ్చుచుండును. రఘునాథ నాయకుని పద్య మటులున్నది. రఘునాథరాయలు మహారాజు. ఆయన వర్ణనమునం దా లక్షణములే గోచరించును. కవులకు పండితులకు కనకాభిషేకము చేయుట రాజుల కలవాటు. బంగారు విల్లు వైరిని బరిమార్చు కేలికి కనకాభిషేకము చేయుచున్నదట. శ్రీరామచంద్రుని దక్షిణ హస్తము విజయాంకిత మయినదని సూచితము. రాజులకు విజయము మహానందకరము. అంతకంటె నాల్గవ పాదము మరింత వింతయైనది. రాముని పాదములకు మంజీరము తొడిగినాడు రఘునాథ నాయకుడు. అది పద్మములను భంగించిన పదముల బిరుదు సంపదలు పొగడుచున్నదట. మహారాజులు పాదము

లకు మంజీరము తొడిగికొందురు. అది గండపెండేరము. ఓడిన రాజుల ప్రతిమ లందుండును. శ్రీకృష్ణదేవరాయలకు అట్టి గండ పెండేర మొకటి పాదమున నుండెడిది. అది మూరురాయర గండ పెండేరము. అల్లసాని పెద్దనగారు

మూరురాయర గండపెండేర మణి మ
రీచి రింఛోళి కలయ నావృతము లగుచు
నంకపాళి నట ద్దుకూలాంచలములు
చిత్ర మాంజిష్ఠ విభ్రమశ్రీ వహింప

అని వర్ణించినాడు. రఘునాథ నాయకునకు కూడ అట్టి పెండేరము కలదు. అది వైరులను జయించిన బిరుదు చాటును. రఘునాథ నాయకు డట్టి మంజీరము రాముని పాదమున కలంకరించెను. అది విరోధి వీరులను రణావని జయించుటవలన కలిగినది కాదు. అందము నందు కమలములను జయించుటవలన పదములకు కలిగిన బిరుదు చిహ్నము. అంతరువులను బట్టి యభిప్రాయములు. అట్లు సాక్షాత్క రించిన రాముడు రఘునాథ నాయకునితో 'నేను రామభద్రుడం జుమ్మీ' యని తన్ను తా నెరిగించుకొనెను. పోతన్నగారుకూడ రాముని నోట నిట్లే యనిపించెను. భక్తుడు తన్ను గుర్తింపలేడని రాముని భయము కాబోలు. హరిహరనాథుడు మిగుల లౌక్యుడు. తనరాక ముందుగా కొమ్మనామాత్యునిచేత చెప్పి పుత్తెంచెను. తిక్కనగారు మంత్రి. రాజసము కలవాడు. ఆ రాజసమే హరిహర నాథుని యం దారోపించెను. శ్రీరామచంద్రుడు రఘునాథనాయకు నితో 'రామాయణకృతి గావింపుము మదంకితమ్ముగా' అని యాన తిచ్చినాడు. అంతర్హితుడైనాడు. కృతి జీవించియున్నంత కాలము కృతిభర్త స్వర్గలోకమునందు సకల సుఖము లనుభవించునని లాక్షణి కుల మతము. శ్రీరామచంద్రుడు విష్ణువు నవతారము. ముక్తి ప్రదాత. అట్టి వా డే ఫలము నపేక్షించి కృతుల నర్థించుచుండునో తెలియదు.

స్వప్నములందు కవులకు యిష్టదైవములు ప్రత్యక్షమగుటయు కృతుల నర్థించుటయు పరిపాటి యైనది. కాళిదాసాది సంస్కృత మహాకవుల కీ యదృష్టము పట్టలేదు. భారతము పంచమ వేదము. హరిహరనాథుడు మోజుపడి కృతినర్థించె ననుకొందము. భాగవతము తన యవతారకథ. కావున భాగవతమును శ్రీరామచంద్రు డంకిత మొసంగుమని పోతన నడిగెనేమో. గోపీనాథాదులు రామాయణము కృతి నొసంగిరి. అంతటితో తనివి నొందలేదు. రఘునాథ నాయకుని మరల యాచించెను. దాని కేమి. తన చరిత్ర తాను విన వలయునని యర్థించెనని సరిపెట్టుకొన వచ్చును. విజయరాఘవనాయకుడు రఘునాథ నాయకాభ్యుదయము రచించెను. శ్రీమన్నారు స్వామి స్వప్నమునం దగుపించి

> రఘునాథ మేదినీ రమణుని చర్య
> ధీ కౌశలము మించ ద్విపద గావించి
> మా కంకితము చేసి మనుము వేయేండ్లు

అన్నాడు. ఎవరును నమ్మరని గాబోలు

> మా యవతారమై మహి నుదయించి
> మీ యయ్యయై ధైర్యమేరువై మించి
> యఘటన ఘటనా సమర్థుఁడై వెలయు

నని మన్నారుదేవుని నోట ననిపించినాడు విజయరాఘవనాయకుడు. ఆయన పితృభక్తి తిక్కనగారి పితృభక్తిని మించినది. అది యటుండ నిండు. వైజయంతీ విలాసము శృంగార ప్రబంధము. నాయకురాలు వేశ్య. నాయకుడు విప్రనారాయణుడు. తొండరడిప్పొడి యాళ్వారు. రంగని పదభక్తుడు. 'అతనుఁ డంగడి నమ్ము మోహనపుఁ బనస తొన యనఁగ' అని కవి వర్ణించిన కావ్యము. దానిని కుతూహలముతో ఏక పత్నీవ్రతుండగు రాము నంతటి దైవము

> నగు మొగంబున నెలవంక నలిక మయిన
> తిరుమణి ధరించు వాఁడొక్క దివ్యపురుషుఁ

డెదుట నిలుచుండి నా పేర నీవు సేయు
కావ్య మంకిత మొనరింపు భవ్యసరణి

అని యాచించినాడు సారంగు తమ్మయ్యను. స్నేహ మెంతటి పని నైనను జేయగలదు. ఇంకొక మెట్టు మించినది ముద్దుపళని. రాధికా స్వాంతనము రచించినది. అందు శ్రీకృష్ణపరమాత్మయే నాయకుడు. రాధ నాయిక. సంభోగ శృంగారము అణుమాత్రమయిన విడువక వర్ణించినది కవయిత్రి. ఆ వర్ణన విని మరల నొక్కసారి యానం దింప తలంచినాడు చేసినది చాలక శ్రీకృష్ణుడు. పళని కలలో కని పించినాడు.

చిన్ని కృష్ణుండ నే నాదు చిత్తమునకు
సమ్మతంబైన రాధికా స్వాంతనంబు
తగ నొనర్పు మదీయాంకితముగ నీవు

అని ప్రోత్సాహ మొనరించినాడు. తన చర్యలు లోకమునందు ప్రచారము కావలయు నని యా భగవంతుని యూహా కాబోలు. 'అరుగు చున్నాడు శ్రీనాథు డమర పురికి' అని యమిత దృఢవిశ్వా సముతో నుడివిన మహాకవికి ఒక్క కలయందైనను దైవము కని పించలేదు. కృతి నర్థించలేదు. అలసాని పెద్దనగారి కసలు కనపడ లేదు. తిక్కనగారు కలగనినారు. అందరి కదేపని యైనది.'గతాను గతికోలోకః'–స్వప్నములు కనుటవలనను, దైవము కృతి నర్థించుట వలనను, కావ్యమునకు ఘనత రానేరదు. రసవత్తరమైన కవిత యుండవలయును. మనుచరిత్రము నే దైవము కృతి యర్థించెను. కావ్య ప్రపంచమునం దది చిరస్థాయిగా కీర్తిచంద్రికలను గాయించు చున్నది.

రఘునాథ నాయకుడు తన కల సంగతి కొలువునందు వినిపిం చెను. అందలి పండితులు

దేవునియందలి భక్తియ
భావింప నపూర్వ మెందు భక్తి మహిమచే

దేవుఁడె తోడుతఁ బలికిన
దేవర భాగ్యంబు సన్నుతింపం దరమే

యని వినుతించిరి. రామచరిత్రం బుభయ భాషా ధురంధరులు మెచ్చం బ్రబంధంబుగా నిబంధింపు మని పలికిరి. రఘునాథ నాయకుడు సంగ్రహ రామాయణముతో కథ ప్రారంభించెను. వాల్మీకి నారద మహామునిని ప్రశ్నించుటయు నారదుడు రామాయణ కథ సంక్షిప్తముగా నుడువుటయు నిందలి వృత్తాంతము. వాల్మీకి రామాయణము బాలకాండమునందలి ప్రథమ సర్గలోని కథ. రఘునాథ రామాయణము వాల్మీకి రామాయణములోని కథకు అనువాదము కాని యాంధ్రీకరణము కాదు. ఒకొక్క-చోట కథయు సందర్భాను సారముగా మార్చబడినది.

ప్రవిశ్యతు మహారణ్యం రామో రాజీవలోచనః
విరాధం రాక్షసం హత్వా శరభంగం దదర్శహ
సుతీక్ష్ణం చా ప్యగస్త్యం చ అగస్త్య భ్రాతరం తధా
అగస్త్య వచనాచ్చైవ జగ్రాహైంద్రం శరాసనం
ఖడ్గం చ పరమప్రీత స్తూణీ రాక్షయ సాయకౌ

అని వాల్మీకి రామాయణమునందు కలదు. రఘునాథ నాయకుడు

అరిగి దండకమున కా దండ సాధిత
సాధు విరోధి విరాధుఁ ద్రుంచి
శరభంగముని సుతీక్ష్ణ మహర్షి దర్శించి
సజ్జన వినుత సౌశస్త్యుఁడైన
యల యగస్త్యుని నగస్త్యభ్రాతఁ గనుఁగొని
యయ్యగస్త్యుని వచనానుమతిని
నైంద్ర శరాసనం బక్షయ బాణ తూ
ణీరమున్ ఖడ్గంబు నెమ్మిఁ జెంది

అని తెనిగించెను. రామాయణ మంతయు నీ విధముగా సాగలేదు. చాలవరకు స్వాతంత్ర్యము నవలంబించెను. మూలమునందు

మృతేతు తస్మిన్ భరతో వసిష్ఠ ప్రముఖై ర్ద్విజైః
ప్రయుజ్యమానో రాజ్యాయ నైచ్ఛ ద్రాజ్యం మహాబలః

అని యున్నది.

అంత వసిష్ఠ ప్రముఖులు
మంతనము సెలంగ భరతు మహి మండలికిన్
గాంతునిఁ జేయఁగ వలె నని
చింతించుచు భరతుఁ బిలిచి చెప్పె నతండున్

కన్నుల బాష్పవారి దొలఁకం గలక న్మతి వారిఁ బల్కె నా
యన్న రఘూద్వహుం డడవికై చని కొండలమీఁదనుండ నే
నున్నత భద్రపీఠమున నున్న జనుల్ ననుఁ జూచి నవ్వరే
యెన్నఁగ నా మనంబునకు నెక్కసకం బిది యెల్ల రాజ్యమున్

అని రసానుగుణముగా సందర్భమునకు తగినట్లు పెంచెను. ఈ పద్ధతి రఘునాథ రామాయణమునం దెల్లెడలను కనిపించును. ఒక్కొక చోట మూలములోని కథాంశమును పూర్తిగా విడిచిపుచ్చెను. కుశలవుల వృత్తాంతము రఘునాథ రామాయణమునందు లేదు. దశరథుడు పుత్రకామేష్టి నారంభించెను. దాని నీక్షించుటకు బ్రహ్మాది సకల సురలు నరుదెంచిరి.

ఏతస్మి న్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః
శంఖ చక్ర గదా పాణిః పీతవాసా జగత్పతిః

అని వాల్మీకి రామాయణము. రఘునాథ నాయకుడు తన కృతియందు పురందర ప్రముఖబృందారకు లందరు న వ్విరించిం బురస్కరించుకొని పాల మున్నీటి నడుమంగల శ్వేత ద్వీపమునకు హరిని సందర్శింప నరిగి నటుల వర్ణించెను. రఘునాథుడు వర్ణన ప్రియుడు. శ్వేతద్వీపమును దాదా పిరువదియైదు పద్యములలో వర్ణించెను. ఇట్టివి పలు మార్పులను గావించెను. రఘునాథ రామాయణమును స్వతంత్ర కావ్యముగా తయారుచేసెను. అందు వాల్మీకి రామాయణములో కానరాని స్వతంత్ర కల్పనలు పెక్కు కలవు. నారదుడు తన దారి

తా నరిగెను. వాల్మీకి భరద్వాజుని వెంట నిడుకొని స్నానార్థము తమసా నది కరిగెను. నిర్మలమగు తమసా నదీ జలము నరసి

మిసమిస మెఱయుచు లోపల
నిసుకలు గనవచ్చుచుండ నింద్రమణి విభా
విసరము వలె నింపెసఁగెడు
ప్రసన్న సలిలంబు మనసు రంజిలఁ జేయున్
అని శిష్యు భరద్వాజుం
గనుఁగొని యీ తీర్థ మహిమఁ గనుఁగొంటే స
జ్జన హృదయంబును బలెఁ గడు
వినిర్మలత మించెఁ జూడ వేడుక నించెన్

అని పొగడెను. ఈ సందర్భమున వాల్మీకి

రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా

అని మాత్రము వర్ణించెను. నన్నయ పెద్దనల కందపద్యములం దొక విధమగు గేయముల నడక కలదు. అది గణముల కూర్పులో నున్నది. వానిని చదువు నప్పుడు గానము కూడగట్టుకొని వచ్చుచుండును. ఉదాహరణకు 'ఉత్తరపుగాలి విసరె' అను భారతపద్యమును 'ఉల్లలల దలకా జల' యను మనుచరిత్ర పద్యమును నరయవచ్చును. ఆ రచనా విధానము కొంత పోతనగారియం దున్నది. రఘునాథ రామాయణము నందు అచ్చటచ్చట నా పోకడ లగుపించును. 'మిస మిస మెఱయుచు' నను పద్యమునం దా నడక తీరు కలదు.

కిలకిలఁ గూయుచు విలపై
జలజలఁ జట్టుపలు రాల సారెఁ బొరలుచున్
విలవిలఁ దన్నికొనెడు నల
పులుగుం గని మౌని కరుణఁ బొగులుచు నిలిచెన్

ఇత్యాది కందపద్యముల నడక ప్రశంసింపఁ దగినది. రఘునాథ భూపతి చక్కని యూహాలు కలవాడు. ఊహాల కనువగు

పాండిత్య మున్నది. దానికి తగినటుల నుభయ భాషలందు శ్రుతి మనోహరములగు మెత్తని పదములు దొరలి వచ్చును. అందును దేశీయములగు తెనుగు పదములు చేరులు కట్టి బారులు సాగును. వాల్మీకి స్నాన మొనరించెను. నదీ తీరమునందు పక్షుల కోలాహలము లాలకించుచు నిలుచుండెను. ఆ సమయమున

కుఱుచగాఁ జుట్టిన కుఱుమాపు దట్టిపైఁ
గొడవలితోఁ దోఁటి కూడఁ జెరివి
కొడిది పూసల పేరు మెడ నంటఁగాఁ గట్టి
బిగిమెక్కుఁ జెవిఁ బీలిబెండ్లు వెట్టి
కొంగ యీఁకలు గొన్ని యంగుగాఁ దలఁజుట్టి
సంకు బల్కుడియంబు సందిట నిడి
గట్టి యల్లిక తట్ట బుట్ట చంక సమర్చి
సెలవిల్లు నమ్ములుఁ జేతఁ బట్టి

చిక్కు మురిగోల వల బిస జిగురుఁ గండెఁ
బాదియును గొంచు బుడుతరాఁ బాల నెమిలిఁ
గాఁజుఁ గక్కెరఁ గల్లేటిఁ గారుకోడిఁ
గొక్కెరను బట్టుచును వచ్చె నొక్క యెఱుక

ఇందు శిల్పరచన యున్నది. కాని కవి సంపూర్ణముగా నాకారమును చిత్రించలేక పోయినాడు. ఆ విషయమున తిక్కనగారొక్కరు మాత్రమే సిద్ధహస్తులు. ఆయన రచనలో కళావైశద్యమున్నది. అది యీ పద్యమునం దంతగా గోచరింపదు. రఘునాథ నాయకున కనుభవ మున్నది. కావుననే వివిధ సాధనములు నడవి పక్షులలోని రకములు వరుసగా పేర్కొన గలిగెను. ఆ ఎఱుక

నుదుటిపై నొక వ్రేలు గదియించి క్రౌంచముల్
నిలుచు చోటిది యని తెలిసి తెలిసి
చంక బుట్టటు వెట్టి సారెకు బుడుతనిఁ
జేరకు మని సన్న చేసి చేసి

కిఱు కిఱుత్కనకుండఁ గిఱుకు మెట్టులు విడ్చి
పొద దారి మెల్లన పొంచి పొంచి
మండి వ్రేయుచు వ్రాని దండ దండగ నిల్చి
సూటిగాఁ బలుమాఱుఁ జూచి చూచి

కుఱుచ తడవింట నొక మిట్ట కోలఁ గూర్చి
నేర్పడర నూర్పడచి తెగనిండఁ దివిచి
కామ మోహితమైన యా క్రౌంచ యుగము
నందు నొక్కటి నేసెఁ బుళిందుఁ డపుడు

పుళిందుని చర్య లతిస్వభావ సిద్ధముగా వర్ణింపబడినవి. ఇది స్వభావోక్తి. రఘునాథ నాయకుడు మహారాజు. అడవికి వేటకై యరుగు చుండును. అచట కిరాతుల చర్య లరయుచుండును. వానిని అచ్చొత్తి నటుల నిందు చిత్రించెను. అందులకు తగిన పదములు కూడ సేకరించి సమకూర్చెను. చంక బుట్టటు వెట్టి, బుడుతనిఁ జేరకుమని సన్న చేసి, మండి వ్రేయుచు ననునవి చక్కని వాడుక పదములు. వాడుక పదములతో దేశీయములను తద్భవములను కలయకలిపి పద్యములందు ధారాళముగా వాడుట తంజావూరు కవులకు చక్కని యలవాటు. అది తెనుగు కవితకు సరియగు తెనుగుతనము నాపాదించును. పుళిందుడు బాణమును విడిచెను.

మిట్ట కోల బోర పట్టు దాకి
చెట్టు మీఁదినుండి చట్టుప ల్చెదర న
ప్పిట్ట పిట్టపిడుగు పృథివి పడియె.
పడి రోఁజుకొనుచు నెత్తురు
బుడబుడఁ గ్రక్కుచును బోర పొడవై యెగయూ
ర్పడరఁగఁ బొరలం దొడఁగెన్
వెడ తెప్పం గన్ను గప్పి వేదన బలియన్

విష్ణుచిత్తీయమును పరిశీలించి చూచినచో శ్రీకృష్ణ దేవరాయలవారికి లోకానుభవ మెక్కువ కలదని స్ఫురించును. రఘునాథ

రామాయణమును చదివి చూచిన యెడల రఘునాథ నాయకునకు నిశిత మగు పరిశీలనా శక్తి కలదని తోచును. లేనిచో సక్రమముగా పక్షి మరణావస్థ లన్నియు నొకటి వెంట నొకటి యిట్లు వర్ణించుట యసాధ్యము. బోర పొడవగుట-ఊర్పుడరుట-వెడ తెప్పఁ గన్నుగప్పి వేదన బడుట-పరిశీలించినగాని బయలుపడవు. అవి యూహాకందునవి కావు. ఆ వర్ణనకు కందపద్యము సరిపోయినది. భావమునకు రసమునకు తగిన పద్యము నెన్నుకొనుటలో కవి తెలివితేట లున్నవి. కాళిదాసు మేఘసందేశమును మందాక్రాంతమునందును, కుమారసంభవములోని రతి విలాపము వియోగినీ వృత్తమునందును రచించుట చేతనే యంత బాగున్న వని రసజ్ఞులగు లక్షణవేత్తలు నుడివిరి. తెనుగు కవులందు నన్నయ కట్టి తెలివి తేటలు గలవు. ఈ విషయము అదివరకు సూచించితిని. రఘునాథ రామాయణమునందు మిక్కిలి రసవంతము లగు ఘట్టములలో నీ బోయని వృత్తాంత మొకటి. ఈ కథాఘట్టమును చదివిన తరువాత వాల్మీకి కన్నులార వీక్షించియు నీ విషాదగాథ విపులముగా వర్ణింపక సంక్షేపముగా మూడు నాలుగు శ్లోకములలో ముగించుట లోపమని తోచక మానదు. భాస్కర గోపీనాథులు రామాయణాంధ్రీకరణమునందు కొంత స్వతంత్రించి రనక తప్పదు. వారికి సైత మీ యూహ పొడమలేదు.

కులకుల కూయుచు నిలపై
జలజలఁ జట్టుపలు రాల సారెఁ బొరలుచున్
విలవిలఁ దన్ను

కొనుచు క్రౌంచి మరణించినది. వాల్మీకి శోకావేశమున కిరాతుని శపించినాడు. ఆ శాపాక్షరములు శ్లోకమై పొడకట్టినవి. వాల్మీకి యబ్బురపాటు తోడ నాశ్రమమున కరిగెను. సత్యలోకమునుండి బ్రహ్మ యరుదెంచి రామాయణము రచింపుమని నుడివి పోయెను. ఇది ప్రథమాశ్వాసములోని కథ. కోసల దేశ వర్ణనతో ద్వితీయాశ్వాస మారంభమయినది.

వేదండంబుల హస్తకాండముల కీవిన్ బొల్చు బల్గంటలం
బ్రోదిస్మీఱెడు రాజనంపు వరిగుంపుల్నిండి యెక్కాలమున్
గేదారంబులఁ బండి తట్టొరగి వీక్షింపగ నానంద మా

చు నా దేశము భాసిల్లుచుండునట. కోటలు సస్యసమృద్ధి. అదియే మొదట తోచినది రఘునాథ రాయలకు. దానిని ప్రథమమునందు వర్ణించినాడు.

కీరము ల్ముక్కుల గీఱ నిల్వక జాఱు
 చెలువంపు రసదాళి చెఱుకుఁ బాలు
చెంత నంతటఁ బండి చిదిపిన ముంతమా
 మిడి పండ్ల రసములోఁ బడి పొరలుచు
నుడుతలు గొఱుకంగ నొండొంటఁ దొరఁగెడు
 నారికేళంపు బొండ్లముల నీటఁ
గలసి చేరువ యేటి కాలువలను గూడి
 ములు రాజనపుఁ జేల వల దిరుగుచుఁ
దరులఁ బొదరులఁ బరువంపు విరుల వడియు
కమ్మఁ దెనెలుపైఁ గ్రమ్మి గ్రమ్మనంగ
ననుదినంబును

అన్ని యెడల నా దేశమునందు ప్రవహించుచుండునట. ఫల పుష్పాదుల సమృద్ధిని దెల్పు చక్కని యూహా కల్పనము. భోజనమునకు రాజనంపు వరి ధాన్యము భోగానుభవమునకు రసదాళి చెఱకు ముంత మామిడిపండ్లు నారికేళ ఫలములు పుష్పములు. హాలికులు చక్కెర చేయు పద్ధతి వింతయైనది.

చిలుకలు ముక్కునం బొడువఁ జిల్లునఁ జిమ్మన గ్రోవులం బలెన్
వెలువడు నిక్షు కాండ రస నిర్ఝరముల్ నికటస్థ పల్వలం
బులఁ బడి యెండ కాఁకలను బొంగుచుఁ జిక్కణ పాకమైన రం
జిలు తమిఁ ద్రొక్కి చక్కెరలు సేయుదు రక్కడి హాలికోత్తముల్

అంత రస పూరితములయినవి కోసల యందలి చెఱుకులు. ఈ రెండు పద్యముల చేత కోసల దేశము ధాన్య ఫల పుష్ప శర్కరాదులతో సమృద్ధమయి యలరారుచున్నదని నిరూపించెను. చక్కని జానయిన తేటతెలుఁగు పదముల పొందగు మేళవింపు. దానికి తగినటుల చెవులకు కటువుఁదనము పొడమనీయని యక్షరముల యనుప్రాసలు రఘునాథ భూపాలుని కవితలో నెల్లెడల ప్రధానముగా కనిపించును. దీనినే నన్నయ యక్షర రమ్యత యని నుడివినాడు. తరులఁ బొద రులఁ బరువంపు విరుల వడియు కమ్మఁ దేనెలుపైఁ గ్రమ్మ గమ్మ నంగ, రంగు మెఱుంగుల బంగరు ముంగిట, మొదలగునవి అరయు నది. ఈ రచనా రమ్యత సంస్కృత సమాసాదులందును కని పించును. బాలకు ఫాల కుటిల లంబాలకు బాలకు, నగర వధూటీ కోటి తులాకోటి ధ్వని మాటికి మొదలగునవి. ఈ యక్షర రమ్యత యొకొక్కప్పుడు తాళ లయా సమన్వితమై యుండును. దాక్షిణాత్యులు సంగీత నాట్య ప్రియులు. ఆ రెంటికి - నన్యోన్య సంబంధము కలదు. సంగీత సాహిత్యములు కవ తోరంగని లలిత కళలు, రఘునాథ నాయకుడు జన్మచేత నాంధ్రుడైనను నివాసము తంజావూరు. దాక్షిణాత్యుల కొలువు చెలుములు కలవాడు. వారికి గీతి ప్రియత్వము బాగుగా నలవడినది. ఆ కారణముచేత కవితకు తాళ లయాదులు అందందు జోడించుచుండును. ఆ పద్ధతి కంద పద్య రచనయందు మిక్కుటముగా కనిపించును. రఘునాథ నాయకుని కందమునకును, ఇతర తెనుగు కవుల కందమునకును చాల తార తమ్యమున్నది. రఘునాథ భూపతి కందమునందు లయా తాళములు పొందుపడి యుండును. ఈ సంగతి యిదివరకు సూచించి యుంటిని. వెండియు

సద్రక్షణ భరణ సము
న్నిద్ర కృపానిధి సమగ్ర నీతి సకల సా
ముద్రిక లక్షణ లక్షిత
భద్రాకారుండు రామ భద్రుఁడె తలపఁ

చివరి రెండు పాదములు పరిశీలించునది. ఈ రచనా వైదుష్యత నన్నయ పాలిటి సొమ్ము. పెద్దనగారికి సంక్రమించినది. దానిని రఘునాథకవి పుణికి పుచ్చుకొనినాడు. ఇదే కాదు సంస్కృత సమాస సంఘటనమునందు నన్నయ పెద్దనలకు దరిదాపులోనివాడు

వెండియు నా నృపాలునకు వేఱె నమాత్యులు గల్గియుందు రా
ఖండల మంత్రి ధీ విభవ ఖండన పండితు లాహవ క్రియో
ద్దండులు దండనీతి సముదార విచార కళా ధురంధరుల్
కుండలి సార్వభౌమ నిభ కోవిద సన్నుత వాగ్విజృంభణుల్

మరొకటి

పద మంజీర ఝుళంఝుళార్భటి జటా బంధామృతాంధ స్స్రవ
న్నృదయద్భంగ ఘుమంఘుమస్వనముకండూద్యన్మృదంగధ్వనిం
బొదలింపంగ నటించునాఁటి నటుఁ డింపుల్ మీఱ నాడించుఁగా
త దయ న్మ ద్రసనాగ్రరంగమున వాగ్ధాటీనటి న్నాటికిన్

తెనుగు రచనలోని యీ మెత్తందనము సంస్కృత పద సమాస కల్పనయందు నలవడినది. తెనుగు తనంపుఁ బోకడ లాయన స్వయం సమార్జిత విత్తములు. అవి తంజావూరు కవు లందరికి యలవడినవి. కోసలకు ముఖ్యపట్టణ మయోధ్య. దాని ప్రాకారములు అగడ్తలు సౌధములు కావ్యపద్ధతిని వర్ణింపబడినవి. రామాయణమును మహాకావ్యముగా రచింపవలయునని రఘునాథ భూపతి భావమయి యుండ నోపును. పుర వర్ణన మిరువది పద్యములు గావించెను. రచన యందు వలెనే భావములందును మార్దవ మున్నది.

ఆ నగరి కోట మలచిన మానికంబు
లంశు బాలాతపంబుచే నలరఁ జేసి
యగడితలలోని పద్మంబులందు రాగ
మునుఁపగాఁ బద్మరాగంబు లనుచుఁ బరగె

నట. మంచి కల్పన. రాగ శబ్దము మీఁద శ్లేష. ఒకొక్కప్పుడు

రఘునాథ నాయకుని యూహాలు చంద్రమండలమున కెగబ్రాకి యమృత మందిపుచ్చుకొనినవి.

ఉవిదలు రేల సౌధ శిఖరోపరి కాంచన చంద్రశాలలం
దివుట విటాలి తోడుత సదేశ సమాగత చంద్రమండల
స్రవ దమృతంబు చేతఁ గొని చందనముం బిరుసొందఁజేసి మై
సవరగఁబూయుచుండ్రు ఘనసౌరభముల్ నభమెల్లఁ గప్పఁగన్

అంత యెత్తయినవి యయోధ్యా నగరములోని మేడలు. ఇది అతిశయోక్తి. వాని కేవిధమునను తీసిపోవునవికావు ఇంద్ర ప్రస్థములోని మేడలు.

రేలమృతాంశులో శశము రెమ్మఁదమంచుఁ దలంచి జాళువా
మేలి పసిండి సోయగపు మేడల గుజ్జన గూళ్ళ సందడిన్
బాలిక లుండి యావలఁ జనంగని చింతిలి వంట యింటి కుం
దేలిది యెందుఁ బోఁగలదు నేటికి నేమని యందు రందులన్

కవులు సైత మొకరి నొకరు తీసిపోవు వారుకారు. సమ కాలికులు. ప్రాణస్నేహితులు. కావున భావములు సరిసమానములైనవి. ఆయన మహారాజు. శౌత్రము కలవాడు. కావున వేశ్యలచేత దోయిళ్ళతో నమృతము తెప్పించి గంధములో కలిపించినాడు. వేంకటరాజకవి బ్రాహ్మణుడు. ఎంతయిన నాశ్రితుడు. వంటయింటి కుందేలని బాలికలచేత నుదాసీనముగా ననిపించినాడు. స్వభావములు దాగునవి కావు. ఏనుగులను కావ్యములందు పెక్కుమంది వర్ణించిరి. అందరు నడకొండలవలె నున్నవనినవారె. సమర్థించి వివరించినవారు లేరు. రఘునాథవిభుడు

ఘనములగు గండశైలము లకదళికలును
బాదముల మేఘములు దంత పటిమ వంశ
గౌరవము పైఁ బరాగముల్ గలిగి మెలఁగుఁ
గుంజరమ్ములు పురి నడగొండ లనఁగ

అని సరసముగా శ్లేషను వినియోగించి సమర్థించెను. ఆయన వైదుష్యమున కీ పద్యము దృష్టాంతము. ఆ నగరమునందలి యేనుగులు కొండరాళ్ళవంటి గండస్థలములు గలవయి, అరటి చెట్లవంటి తొక్కములు దాల్చి పాద ప్రదేశములందు మేఘముల వలె మదజలము కార్చుచుండ, వెదురులను దలపించు తెల్లని ఘనములగు దంతములతో ధూళి క్రమ్ముకొని నడగొండల వలె నుండునట. కావ్యాంగనకు శోభ తెచ్చునవి యలంకారములు. అవి వినూతనములగు కల్పనలు కలవయినచో పాఠకుల మనసు రంజించును. కవికి కావ్యమునకు కీర్తి సంపాదించును. మనుచరిత్ర పేరెత్తినంతనే 'యింతలు కన్నులుండ' యను పద్యము జ్ఞాపకమునకు వచ్చును. అందలి వ్యంగ్యము మనమునకు స్ఫురించును. వహవ్వా యని పాఠకు నువ్విళులూరించును. 'ఉపమా కాళిదాసస్య' అను నుడి లోక మెరుగనిది కాదు. కాళిదాసు పేరు చెప్పగానే ఉపమాలంకారము మనస్సునకు తోచును. అమితమగు నానందము కలిగించును. రఘునాధకవి అయోధ్యయందలి గుఱ్ఱముల నిట్లు వర్ణించెను.

> జవ లీలం దనతోడ విగ్రహము నశ్రాంతంబు గావించు గం
> ధవహుం గ్రోలు మహోపకారి యగు నా దర్వీకరస్వామి కె
> క్కువయౌఁగా బరువంచునో మదిని లోకుల్మెచ్చ వాజి వ్రజం
> బవనిన్ సోఁకక దాఁటి మింటఁజను నత్యాశ్చర్య చర్యం బురిన్

కల్పన అత్యాశ్చర్యకరము కాకపోయినను కొంత వినూతనత్వమున్నది. ఆ యలంకారము లయినను మితి మించినచో పాఠకునకు నేవగింపు వాటించును. 'అతి సర్వత్ర వర్జయేత్' రఘునాథకవి నాలవ ఆశ్వాసమున శ్వేతద్వీపమును యిరువదియారు పద్యములలో వర్ణించెను. అన్ని యుత్ప్రేక్షలు నతిశయోక్తులు. చదువుటకు విసుగు పుట్టించును. పల్లెపడుచు పెళ్ళికూతురు వేషమువలె కావ్యమున కట్టి రచన బరువు చేటగును. ఇట్లనుటచేత కావ్యములలో వర్ణన లుండ కూడదని నా యభిప్రాయము కాదు. వర్ణనాంశములు కావ్యమునకు గౌరవ మాపాదించు ననుటలో సందేహము లేదు. వర్ణనలలో నితి

వృత్తము నిమిడ్చి వ్యంగ్యమూలకమున రూప కల్పనలు గావించుట వలన కావ్యమునకు శోభ నాపాదించును. సంస్కృతమునందు కాళిదాసు,

స్థితాః క్షణం పక్ష్మసు తాడి తాధరాః
పయోధ రోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోద బిందవః

అను శ్లోకమునందు చేసిన పని యదే. పై శ్లోకముచేత కనురెప్పలు వెంట్రుకలు ఒండొంటితో పెనసి దట్టముగా నున్నవనియు, నధర మతి మృదులమయి చిగురాకును బోలినదనియు, స్తనములు ఉన్నతము లయి బిగువు కలవనియు, నాభి మిక్కిలి నతమనియు పార్వతిని వర్ణించెను. దానికి తోడు కను లరమోడ్చి మెడ నిగిడించి యురము నుబికించి తప స్సమాధియం దాసీనయై యున్న పార్వతి రూపము పై శ్లోకమునందు కనులకు గోచరించును. పార్వతి సౌందర్యము సమాధి స్వరూపము కాళిదాసు వ్యంగ్య రూపమున నిందు వర్ణించెను. ఇట్టి వర్ణనాంశములు కావ్యమునకు గౌరవము, పాఠకున కాహ్లాదము, కవికి చిరయశము నార్జించును. తెనుగు నందు ఇట్టి రచనలు నన్నయ పెద్దనల కావ్యములందు కలవు. భారతమందలి 'అతిరుచిరాగతుం డయిన యాతనికిన్ హృదయ ప్రమోద మాతతముగ' మొదలుగా గల పద్యములు 'అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప' ఇత్యాదికములైన మను చరిత్ర ద్వితీయా శ్వాసములోని పద్యములు నరయవచ్చును. మనుచరిత్రలోనున్న గొప్ప విశేషమదియే. కావున మనుచరిత్ర కంత గౌరవము వచ్చినది; పెద్దనగారి కంత కీర్తి లభించినది.

పూర్వ కవులు తమ కావ్యములందు నాలుగు వర్ణముల వారిని క్రమముగా వర్ణించుచు వచ్చిరి. రఘునాధ నాయకుడా విధా నమును వదలిపుచ్చెను. ప్రత్యేకముగా నీ కావ్యమందు

కప్పురబోగి వంటకముఁ గమ్మగ నేవడియ న్భుజించి మే
ల్దుప్పటు లట్లు మూరగల తోరపుఁ బచ్చడము ల్చెలంగఁగా
గొప్ప కడాని పైఁడి జిగి గుత్తపు టుంగరము ల్కరంబులం
ద్రిప్పుచు రచ్చ చేయుదురు రెడ్డిదొరల్తమి హెచ్చు నచ్చటన్

అని రెడ్డిదొరలను మాత్రము వర్ణించుట క్రొత్తవిశేషము. శ్రీకృష్ణ రాయలు విష్ణుచిత్తీయమునందు

గుడుగుడుం చెంచలి దుమ్ము లేఁదగిరిసాకుం దింత్రిణీ పల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావి కుట్టారునో
గిరము ల్మెక్కితమింబసుల్పొలమువోఁ గ్రేపుల్ మెయిన్నాక మే
కెరువుం గుంపటి మంచమెక్కరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్

అని వర్ణించెను. ఇది జాతి వైషమ్యము. కృష్ణరాయల కాలమునందు కొండవీటి పరిపాలకులు రెడ్డిరాజులు. వారు రాయలవారితో విరోధించిరి. ఎదిరించి దుర మొనరించిరి. రాయలు సమరాంగణ సార్వభౌముడు. వారి నోడించి రాజ్యమును ప్రధ్వంసము కావించెను. ఆ విద్వేషము, పరిహాసము ఈ పద్యమునం దుబుకులాడుచున్నది. ఇరువురు రెడ్డిప్రభువులనే వర్ణించిరి. ఇందలి ప్రభుత్వైకాప్తిలో నెగతాళి యున్నది. రఘునాథ రాయల రెడ్డిదొరలలో గౌరవ మున్నది. రెండు వర్ణనలు నిజమైనవే. అబద్ధమేమియు లేదు. దోసెడు కొంపలో బసుల త్రొక్కుడి గల కాపు రెడ్డిప్రభువులు వీరు. ధనిక కుటుంబము లోని రెడ్డిప్రభువులు రఘునాథ నాయకుడు వర్ణించినది. రఘునాథ నాయకుడు రెడ్ల సహాయ సంపత్తిని పొంది విజయములు సాధించెను. ఆ యభిమానమూ పద్యమునందు కలదు.

తెలంగాణ పలనాడు తంజావూరు రాయలసీమలు రెడ్లకు పేరు మోసినవి. ఇప్పటికిని అచట పల్లెపట్టులందు రెడ్డి దొరలు రచ్చలు చేయుచుందురు. తగువులు తీర్చుచుందురు. వారు మీద కప్పుకొను దుప్పటులు డేరా గుడ్డలవలె మిక్కిలి నిడివి వెడల్పు కలిగి యుండును. రఘునాథరాయలు ఈ పద్యమునందు చేసిన వర్ణన సహ

జముగా నున్నది. ప్రతి పదమునందు సత్యము కలదు. సారస్యమున్నది. కప్పురభోగులు ఒక రకమగు సన్నబియ్యము దక్షిణదేశమునం దెక్కువగా పండును. వానితో వండిన భోజనము కడుపార భుజించి, నిడివి వెడల్పు మూరగల దుప్పటులవంటి దట్టపు పచ్చడములు కప్పుకొని, ఖరీదుగల అచ్చ మేలిమి బంగారుతో చేసిన కాంతిగల గుత్తపు టుంగరములను చేతియందు తాల్చి వానిని త్రిప్పుకొనుచు, రెడ్డిదొరలు రచ్చ సాగింతురట. ఇప్పటికిని రెడ్లయాభరణము లన్నియు అచ్చ మేలిమి బంగారముతోడనే చేయించుకొందురు. నవరసు బంగారము వారి మనసునకు నచ్చదు. ఆ కారణముచేత కడాని పైడియని వాడినాడు కవి. అట్టి బంగారముతో చేసిన విలువగల యుంగరములను ధరించిరి. అవి జారి రాకుండ వారి వ్రేళ్ళకు గుత్తముగా నుండును. వానిని చేతులతో త్రిప్పుకొనుచు రచ్చ చేయుచుందురట. ఉంగరములను త్రిప్పుకొనుచు ననుటలో సారస్య మున్నది. అట్టిచేత పురుషుల కందరి కొక యలవాటు. దానిని కవి కనిపెట్టి యిచట వెలిబుచ్చినాడు. ఈ సందర్భమున నొక సంగతి

నేను అవధానాల మోజులో పడి తిరుగుచున్న రోజు లవి. నిజాము రాజ్యమునందు వేంకటాపుర మొక ముఖాసా. దావులూరు వేంకట లక్ష్మీనారాయణగారు దానికి అధినేత. నా మిత్రునితో వారి యింటికి పోవుట కలిగినది. మే మందరము మధ్యాహ్నము ఫలహారములు ముగించి లోకాభిరామాయణ మారంభించితిమి. సరదాగా సాగిపోవుచున్నది. లక్ష్మీనారాయణగారు సాహిత్య ప్రియుడు. వేంకటశాస్త్రిగారు వారి శిష్యుల మాటలు వచ్చినవి. సందర్భము చేసికొని నా మిత్రుడు నా సంగతి ముచ్చటించినాడు. అప్పటికి సాయంకాలము నాలుగు గంటలయినది. సరే యష్టావధానము అన్నారు. ఆదే సమయానికి రంగారావుగా రక్కడికి సిబ్బందితో వచ్చిరి. ఆ రోజులలో ఆయనది చుట్టుపట్టులలో కెల్ల పెద్దముఖాసా. దాదాపు నాలుగువేల మెకరాలకు అధిపతి. తుపాకులు గుఱ్ఱాలు

హంగామా చాలా ఉండేది. రంగారావుగారు కవిత్వముకూడ వ్రాసే వారు. అవధాన మారంభమయినది. సగము గడిచినది. రంగారావు గారు లేచి "కవిగారు నాకు ఆలస్యమయినది యింటికి పోవుదును. నా ప్రశ్న నాకు పూర్తిచేయండి" అన్నారు. "అరగంటలో అందరికి పూర్తిచేస్తాను" అన్నాను నేను. మాటప్రకార మవధానము పూర్తి యైనది. ఇంకా అప్పటికి అరగంట ప్రొద్దున్నది. రంగారావుగారు నవ్వుచు "నే నొక సమస్యయిచ్చెదను. ఆశువుగా రెండు నిమిష ములలో పూర్తిచేయాలి" అన్నారు. "అంత కాలములో రెండు సమస్యలు పూర్తి చేయవచ్చునండి" అన్నాను నేను. సమస్య యిచ్చారు రంగారావుగారు.'దారము లేనిహార మువిదా! యెవ రిచ్చిరి నీకు చెప్పుమా' మందారము రాకూడదు దారము వాడకూడదు.

హీరములుర్ విదూరజము లింపగు సంజ మెఱుంగు నిగ్గులం
దేరెడు కెంపులుం దళుకు నీలము లచ్చపు రత్న జాతు లె
న్నో రకముల్ కనుంగొనఁగ నొప్పియు నేమగు నొక్కటేనియుం
దారము లేని హార మువిదా! యెవ రిచ్చిరి నీకుఁ జెప్పుమా

అని పూర్తిచేసితిని. ప్రక్కనున్న లక్ష్మీనారాయణగారు "అయ్యా కవిగారు ఇంకా నిముషమున్నది. రెండుకదా చెప్పెదు నంటిరి. మీ మాట నిలపెట్టుకొనండి. అదే నేనుకూడ యిచ్చాను." అన్నారు. కొంచెము కష్టమే అనిపించినది. అయినా యిట్లు చెప్పితిని

వారిజలోచనా! విను వివాదము లేటికి నీకు నాకు నె
వ్వారికిఁ జూపినం దెలియవచ్చు నిజంబు పగుళ్లువారి యీ
తీరున రూపు మాసి గురుతింపఁగ నోపని జాతి పచ్చలం
దారము లేని హార మువిదా! యెవ రిచ్చిరి నీకు చెప్పుమా

రంగారావుగారు మహానంద పడినారు. ఇద్దరు ఆలోచించుకొని యిచ్చిన సమస్య. లక్ష్మీనారాయణగారు తటాలున లేచి అమాంత ముగా నన్ను కౌగలించుకొనిరి. ఆయన చేతిలో పిడికెడువలె నైతిని. అంతలో రంగారావుగారు నా యెడమచేయి పట్టుకొని యొక యుంగ

రము వ్రేలికి తొడిగిరి. అది కెంపు నీలపు టుంగరము. పూరి కరుచును. నాకు చాల సంతోషమైనది. వారము గడచినది. నేను మా నాయన గారిని చూచుటకు బందరు పోయితిని. వారు ఉంగరము చూచి యెక్కడి దని యడుగవలయును, నే నీ కథ వారికి వినిపింప వలయు నని నా తలంపు. రాయి తళతళ లాడునటుల కుడిచేతితో ఉంగరము త్రిప్పుచు ప్రసంగించుట మొదలు పెట్టితిని. చూచినారు నా చర్య మా గురుపాదులు. ఇల్లా అన్నారు. "ఆడదానికి గాజులమోజు. మగ వాడికి ఉంగరాలమోజు" కొడుకు తల్లిని కౌగలించుకొని డబ్బుల కొరకు మారాము చేసినాడుట. ఆమె కొత్తగా చేయించుకొనిన గాజులుగలగల లాడునట్లు చేయి యూపుచు అదిగో మీ నాయనగారి నడుగుము అని కసరినదట. కుమారుడు తండ్రినిచేరి యడిగినాడు. ఆయన యుంగరపువ్రేలు ముందుకు చూపుచు మీయమ్మ పెట్టెలోయు చున్నది. అదిగో పోయి అడుగుము అనినాడట. కావున మగవానికి ఉంగరాలు సవరించుకొనుట యొక యలవాటు.రఘునాథభూపతి యా యలవాటు పై పద్యమునందు ప్రకటించెను. ఇట్టిపద్యములు కావ్యము నకు జీవము పోయును నూతనత్వము కల్పించును. కవి యీపద్యము వలన రామాయణమున కొక చణుకు నాసాదించెను. అది సజీవమయి నది. చక్కని తెనుగుపదముల సమాస సంఘటన మీ పద్యమునకు మరింత శోభ కలిగించుచున్నది. ఇట్టి సమాసకల్పన లీ కవికి సహజ ముగా నలవడిన విద్య. ఈయన యాస్థానకవి చేమకూర వేంకటరాజు. అచ్చిక సమాస కల్పనమునం దాయన సర్వవిధముల సిద్ధహస్తుడు. ఆయన కూర్పులో నిండార విరిసిన క్రొవ్విరులలోని మారంద రసము జడివారు చుండును. ఆ విషయమునందు చేమకూర వేంకటకవికి సాటి యగు వారు తెలుగు కవులందు లేరు. రఘునాథ కవి వెంకట కవికి దరిదాపులోనివాడు. వీని తెనుగు పదముల కూర్పులో గులాబి పూరేకుల మెత్తందన మున్నది. ఈ రచనా విధానము తంజావూరు కవులలో మొలకెత్తి విస్తరించినది. ఇది వారి కవితలోని ప్రత్యేకత. సంగీత సాహిత్య నాట్యకళా కోవిదుడు రఘునాథనాయకమణి. తంజా

పూరునందు నాటకశాలలు నిర్మించెను. రఘునాథాభ్యుదయమునం దీ విషయము పేర్కొనబడినది. రఘునాథ నాయకు డట్టి నాటకశాలలను అయోధ్యాపురమునందు నిర్మించినాడు. అంతటితో నూరకుండ లేదు. అం దాటకత్తెలు నిరంతరము నాట్యమాడుచుందురట

హాటక మణి సౌధంబుల
నాటకశాలల నటించు నగర-వధూటీ
కోటి తులా కోటి ధ్వని
మాటికి గుబ్బితలుఁ బర్వె మబ్బులలోనన్

అన్నాడు రాజకవి. ఆ నాట్యశాలలు సౌధ సౌధంబునందు నున్న వట. అవును. కళాభిమాన మట్లుండవలయును. భావానుగుణమైన చక్కని తాళ సహితమగు రచన. అందులో వృత్త్యనుప్రాస. ఆయనను మించినవా డాయన ఆస్థానకవి చేమకూర వేంకటరాజు. ఇంద్రప్రస్థమునందు విపుల భరతకళా శాస్త్ర నిపుణులైన బిరుదు పాత్రలు గలరట. 'యథా రాజా తథా ప్రజా'. అయోధ్యాధిపతి దశరథుడు

ఆ నరపతి సకల క్షితిఁ
దా నేలుచు విభవమునకుఁ దగినట్టి సుతుం
గానక ఘన సంతాపము
మానక యుల్లంబులోన మల్లడి గొనఁగన్

సుమంత్రుం డను మంత్రితో

ముద్దు నగుమోము నందపు
బొద్దు మెఱుఁగు మేనుఁ జిన్ని బొజ్జయు నెంతేఁ
బ్రొద్దులు జరపెడు జిలిబిలి
సుద్దులు గల బాలకులను జూడన్వలదా

చప్పటులు చరచి యిటు మా
యప్పలు రమ్మనుచుఁ బిలువ నలకలు నుదుటం
గప్పఁగ నందెలు మొరయఁగఁ
దప్పా టడుగు లిడుచు వచ్చు తనయుఁడు వలదా

యని తన యావేదనను వెళ్లబుచ్చుకొనెను. ఎంత స్వభావ సిద్ధమగు వర్ణన. బొద్దు మెఱుంగు మేనుఁ జిన్ని బొజ్జయునట. శిశువులకు పాల మెఱుగువలన మేను నిగనిగ లాడుచుండును. బొజ్జ కొంచెము ముందునకు వెళ్లుకొని వచ్చును. బాల్యమునం దారోగ్యవంతులగు పిల్లలు బొద్దుగా మిసమిస లాడుచుందురు. చూడ ముచ్చటగా నుందురు. రసానుభవమువలన భావోద్రేకము కలుగును. తన్మూలమున కవితావేశము వాటిల్లును. అందువలన సంస్కారముగల కవికి అప్రయత్నముగా భావానుగుణములయిన పదములు దొరలుకొని వచ్చును. దీనినే తిక్కన కవితావేశ మనినాడు. అట్టి యావేశ పూరితమయిన హృదయముతో వ్రాసిన పద్యములివి. కావున రసవంతములై భావోచితములగు వాడుక పదజాలముతో నంత రమ్యముగా కుదిరినవి. వానిని చదువు నపుడు చిరుబొజ్జ బొద్దురూపముగల శిశువు కనుల కగుపించును. ఆ రచనలో నా యంద మున్నది.

రఘునాథ భూపతి కందపద్యము నడిపించుటలో చతురుడు. అంత చిన్న పద్యములో చిత్రరచనము వాని ప్రతిభ యనవలయును. అలకలు నుదుటం గప్పఁగ నందెలు మొరయఁగఁదప్పు టడుగు లిడుచు వచ్చు తనయుఁడు కావలయునట. కడు సహజమగు శిల్ప రచన. చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర రచించెను. అందు రాజరాజనరేంద్రుడు సంతతి కొరకు కావేదన పడెను. ఆ రచనలో నీ సహజ సౌందర్యము లేదు. ఈ చిత్రకళా ప్రదర్శనము లేదు. ఈ విషయమునందు రఘునాథభూపతి విజయ కంకణము ధరించినాడు. అనుభవముమీద వ్రాసిన పద్యము లివి. వేంకట కవియే కాదు. ఉత్తర హరివంశము రచించిన నాచన సోముడు, ఎఱ్ఱా ప్రగడయు కూడ తమ కృతులందు విప్రుడు తన సంతతిని గురించి శ్రీకృష్ణునితో మొరపెట్టుకొనిన కథా ఘట్టమును పొందుపరచిరి. అందలి భావములలో నైన నీ యుద్రేకము కనిపించదు. దశరథుడు మిగిలిన మంత్రులను పిలిపించెను.

వెన్న ముద్దలు వోలె సన్న సుగ్గిడితంపుఁ
దెలిచల్వ బటువు పాగలు పొసంగ
నునుసాలె యఱచట్టలును వాని కొనరిన
వలిపె పచ్చడములుఁ జెలువ మెసఁగ
నొండొంట నరవచ్చుచున్న చెంపల గొప్ప
నీలాల పోగులు నిగ్గు దొలఁక
నృపముద్రల చెలంగు నపరంజి ముద్దు టుం
గరములు కరములఁ గరము మెఱయ

శుద్ధ వేషంబుతోడఁ బ్రసిద్ధులైన
సచివు లధిపు

నరయ వచ్చిరి. ఈ వస్త్రాలంకారములు దశరథమహారాజు మంత్రులవి కావు. ఇట వర్ణించినది దశర థామాత్యులు కారు. కవి తన కాలమునందలి వ్యక్తులనే కావ్యమునందలి పాత్రలుగా సందర్భములనుసరించి వర్ణించుననని మనవి చేసితిని. తెల్లని వెన్న ముద్దలవంటి గుండ్రని తలపాగలు పట్టు వలిపెంపు అరచట్టలు, వాని కమర్చిన సన్నని వల్లెవాటు పచ్చడములు, చెంపల గొప్పనీలాల పోగులు, ఇవి జంపుపోగు లయియుండ వచ్చును. వ్రేళులకు నపరంజి నృపముద్రికల యుంగరములు. తన యాస్థాన మంత్రులనే వర్ణించెను. వారి వస్త్రాలంకారములనే దశరథామాత్యుల కలవరించెను.

రఘునాథ నాయకుడు క్రీ. శ. పదియారు వందలు మొదలు పదియారువందల ముప్పదివరకు రాజ్యపాలనము గావించెను. అప్పటికి పరాసులు వర్తకవ్యాపారమును బాగుగా సాగించుచు వచ్చిరి. వారిలో అధికారులు చొక్కాలకు వల్లెవాటుగా పట్టు వలిపెములు కూర్చి కట్టించుకొను నలవాటు కలదు. డూప్లే పరాసు గవర్నరు. అట్టి దుస్తులతో నున్న డూప్లే చిత్రము నా చిన్నతనమున తామ్సను హిందూదేశ చరిత్రలో చూచినట్లు బాగా జ్ఞాపకము కలదు. ఆ విధానపు టంగీ రెండవ పాదమునందు వర్ణింపబడినది. దాక్షిణా

త్యుల తలపాగాలకును ఇతరుల తలపాగాలకును తారతమ్య మున్నది. రఘునాథ భూపతి వర్ణించినట్లు దాక్షిణాత్యుల తలపాగలు తెలి వలిపె ములతో చుట్టుదురు. అవి గుండ్రనయి యున్నగా వెన్న ముద్దల వలెనే యుండును. పై చెవులకు నీలాల జంపు పోగులు ధరియించుట ధనికులగు రెడ్డి కులజులకు పలనాడు మొదలగు సీమలం దొక యల వాటు. కావున రఘునాథ నాయకుని మంత్రివర్గమే యిచట దశరథా మాత్యులుగా చిత్రింపబడినది. రెండవ పాదమునందు 'నును సాలె యరచట్టు' అనియుండుట పొరపాటు 'సాలు' అని యుండ వలెను. ఉన్నిబట్ట యని యర్థము. అట్లున్నచో ఉకారసంధి జరిగి సాలరచట్టు అగును. గణము తప్పును. సాలునకు సాలువు అని వాడుక కలదు. 'సాలు వరచట్టు' అగును. అప్పుడు సరిపోవును. ఈ పద్యమునందు చదివినంతనే రూపము కన్నులకు పొడకట్టింపచేయు చక్కని శిల్ప మున్నది. ఇట్టి రచన రామాయణమునం దచ్చ టచ్చట కనిపించును. నిడదవోలు వేంకట్రావుగారీ సీసపద్యమును దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమునం దుదాహరించి యిది వేత్ర ధరుల వర్ణనమని నుడివినారు. వేత్ర ధరులు వేరు సచివులు వేరని నా తలంపు. లేదా వారు చదివిన ప్రతియం దట్లుండిన నుండ వచ్చును. రోమపాదుడు వేశ్యలను పిలువనంపెను.

బిగువుఁ జన్గవ మీాటు వగ లెల్లఁ గనిపించు
　　నటజాటు పయ్యెద లంద మొందఁ
జెలువంపు నెఱిక కుచ్చెలలపైఁ బచ్చ రా
　　మొగపుల యొడిదారములు సెలంగ
సన్న గేదఁగి రేకు వన్నె చొప్పడు కీలు
　　జడలు పిఱుందల సందడింపఁ
జెక్కుల డిగ్గఁ బూసిన మేలి జవ్వాది
　　నిగ్గు వాసన దిశ ల్నిండికొనఁగ

గిలుకు మట్టెలు మొరయంగఁ గులుకు నడలు
జీని బంగారు సురటులు పూని రోమ
పాదు డగ్గఱ కేతెంచి

నారు వేశ్యలు. ఇందలి రూపకల్పన కళాకౌశలమునకు రచనా సౌంద ర్యము వన్నె పెట్టినది. శృంగార రసమునందు అచ్చ తెలుగు పద ముల కూర్పు అందము నాదవించును. పాఠకుని మనస్సు రంజింప చేయును. శృంగారము మృదులమైనది. రసానుగుణముగా రచనయు పదముల పొందికయు నుండవలయును. అట్టి పదముల సంపుటీకరణ మీా పద్యమునం దున్నది. "చెలువంపు నెరిక కుచ్చెలలపైఁ బచ్చరా మొగపుల యొడిదారములు సెలంగ" చక్కని యాచ్ఛికపద సమాస కల్పనము. ఇట్టి రచనకు మూలము తిక్కనగారు

ఎడమేని నెత్తావి సుడియంగఁ బయ్యెద
సగము దూలించి పై మగుడ దిగిచి — విరా.

అల్లదనంబున ననువు మైకొనఁ జూచు
నడపు కాంతికి వింత తొడవుగాఁగ — విరా.

తత్సమముతో కలయ కలిపి మెరుగెక్కించినవాడు శ్రీనాధుడు

చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బూవుఁబోడి — శృం. నై

దానికి తీర్పులు దిద్దినవాడు అలసాని పెద్దన

చిన్ని వెన్నెల కందు వెన్ను దన్ని సుధాబ్ధి
పొడమిన చెలువ తోఁబుట్టు మాకు — మను.

చేర్చుక్కగా నిడ్డ చిన్న జాబిల్లి చే
సింధూర తిలకంబు చెమ్మగిల్ల — మను.

బాగుగా నాచరణలో పెట్టినవారు తంజావూరు కవులు. వారిలో నొరపులు పెట్టినవాడు రఘునాధరాయ భూపతి. ఆయనను మించిన వాడు చేమకూర వేంకటకవి

బెళుకు కాటుక కంటి సోలపు చూ పెదలోనఁ
బట్టియుండిన ప్రేమ పట్టి యీయఁ
జికిలి బంగరు వ్రాత జిలుఁగు టొయ్యారంపుఁ
బైఁట గుబ్బల గుట్టు బైట వేయ  విజ.

ఇత్యాది. ఈ రచనా విధానము ఈ మార్దవము ఈ సొంపు ఈ నడకలోని జిగి బిగి మరే కవికి నలవడలేదు; అలవడదు. వేంకటకవి రచన నన్నయ, తిక్కన, పెద్దనల రచనవలె ప్రత్యేకత కలది. ఆ విషయము ముందు చర్చింపబడును. రఘునాథ నాయకుడు రెండు మెట్లు తక్కువ. వేశ్యలు విభండక మహాముని యాశ్రమమునకు ప్రయాణ మయిరి. మార్గమునందు జనుల యసూయాలాపములు, విటుల పలుకులు, వేశ్యల వగలు చక్కగా చిత్రింప బడినవి. రఘునాథ రాయలు లోకానుభవము మానవ స్వభావ విజ్ఞానము ప్రకటించు ఘట్ట మది. వేశ్యలు విభండకుని యాశ్రమము చేరిరి. ఎనిమిది పద్యములలో ఆశ్రమ ప్రదేశము వర్ణింపబడినది

నకనకఁ గానులు బెళకఁగ
సికతా కలశములఁ జలువ చెలువొందంగఁ జె
ట్లకు నీళ్లు వోయు

చుండిరట మునికన్యకలు. చక్కని భావము. వారి తపశ్శక్తి వెల్ల డించునది. ఈ పద్యము పరశురాముని తల్లియగు రేణుక యిసుకతో జలకుండిక ననుదినము నిర్మించి జలము మోచుకొని వచ్చు వృత్తాంత మును జ్ఞాపకము చేయుచున్నది.

బంగారు వెండి గొలుసుల
భంగిం గంఠములఁ గోడె పాములు పెనఁగన్
ముంగిసలు పర్ణశాలల
ముంగిళ్లం బరువు లిడు

చున్నవట. అంతకంటె విచిత్రము

హోమ వేళ లెఱుంగుచుఁ దామె వచ్చి
కుండ లటువెట్ట నిండఁ బొల్గురిసి మగిడి
పొలములకుఁ బోవు గోగణంబు

లట. ఆశ్రమ మహిమ చక్కగా నిరూపింప బడినది. వేశ్యలకు

ఆ ఋశ్యశృంగ మౌనియు
మూరెఁడు గడ్డమ్ము నెత్తి మొలిచిన కొమ్ముం
జాఱల మెకమ్ముతోలు వి
కారము దెలుపంగ నెదురుగాఁ గనిపించెన్

ఇందలి ఋకార రకారముల ప్రాస గమనింప తగినది. ఆ యంగనలకు ఋశ్యశృంగుని రూపురేఖలు, వేషము నబ్బురపాటు, భయము కలిగించినవి. వారిలోవారు

కొమ్మరో నడునెత్తిఁ గొమ్మేంది యా చుట్టు
జడలు చెంపల వ్రేలఁబడుట యేంది
మెడచుట్టుఁ జిల్లుల చిడిపిరా ల్గూర్చిన
తీరునఁ బూసల పేరు లేంది
బుసి గప్పుకొన్న చొప్పున మేన నిండంగ
మేదించినట్టి యీ బూది యేంది
కసపు ముప్పిరి త్రాటఁ బొసగంగఁ గట్టిన
పొడజింక తోలు కచ్చుట మదేంది

నొసల మసిబొట్టిదేంది యెద్దెసల నిట్టి
బూచిఁ గనుఁగొన మమ్మక్క చూచి నపుడె
వెఱపడరె నంచుఁ జేరొమ్ము చరచికొనుచుఁ
గడఁగి దగ్గఱఁ జేరక కడనె యుండి

రట. సంభాషణలో వర్ణన నిమిడించుట యొక రకమగు రచనా పద్ధతి. ఇందుమూలమున ఋశ్యశృంగుని రూపరేఖలను వేషమును విపులముగా నిరూపించెను. వేశ్యల యచ్చెరుపాటును ప్రదర్శించెను.

ఏంది పదప్రయోగ మీ పద్యమునందు వింత నొదవించుచున్నది. ఇది గ్రామ్యమని తలంపు. ఏమి+ఇది ఏమిది ఏంది అయినది. ఇది దేశీయ మని కొందరి వాదన. పలనాడు నెల్లూరు ప్రాంతములం దీ పదము మిక్కుటముగా వాడుదురు. కసవుముప్పిరిత్రాడు అందమయిన సమాసము. ఇందు పరిహాస మిమిడి యున్నది. ఋశ్యశృంగుడు మానిసి మెకమట. మనుష్య మృగమునకు చక్కని వికృతి రూపము. వానిని నమ్మకూడదట. దగ్గర కేగినచోఁ బైఁ గ్రమ్మి తల వంచికొని వడిఁ గొమ్ముసఁ జిమ్మునట! అవును. అది మృగముల అలవాటు. నవ్వు పుట్టించు పరిహాసము. వారు నవనాగరి కాంగనలు. అందులో నందక త్తెలు. నాజూకుతనము కలవారు. వేశ్యలు. రాజాశ్రయము వారికి రక్ష. మిడిసిపాటు తనమున కేమి తక్కువ? నోటికి వచ్చినట్లెల్ల వేళాకోళ మారంభించినారు.

ఈ పట్టవర్ధనం బేటికి నుదుటికిఁ
దీరుగాఁ గస్తూరి దిద్దరాదె

అన్నది యొక వారాంగన. రఘునాథనాయకుడు విష్ణుభక్తుడు. వైష్ణవ సంప్రదాయములు కలవాడు. పట్టవర్ధనములు తాల్చును. ఋశ్య శృంగునకు గూడ నుదుట పట్టవర్ధనము లలవరించెను. శ్రీ వైష్ణవునిగా చేసెను. పట్టవర్ధనములె కాదు

ఈ తులసీ భూష లేటికిఁ జెవులకుఁ
గట్టాణి యొంటులు పెట్టరాదె

అన్నది యింకొక వెలయాలు. చెవులకు తులసీ భూషలు తాల్చినాడట ఋశ్యశృంగుడు. తులసి దళము లలంకారముగా చెవి రంధ్రములందు ధరించెను కాబోలు. అందుకనే కట్టాణి యొంటులు పెట్టరాదె అన్నది. తులసి విష్ణువునకు మిగుల ప్రీతిమైనది. మారేడు శివునకు ప్రీతి. వైష్ణవులు తులసి దళములను చెవి పోగులందును, చెవులందును ధరింతురు. అట్లే ఋశ్యశృంగుడు కూడ విష్ణువున కర్చనచేసి ధరించి యుండును. శ్రీమద్రామాయణమునందు రోమపాదుడు పంపిన

వేశ్యలు వైష్ణవు లగుదురో కారో నిరూపించలేము కాని రఘునాథ రామాయణములో రోమపాదు డంపిన వారాంగనలు మాత్రము తప్పక వైష్ణవులు. అవును. వైష్ణవ భక్తుని వశపరచుకొనుటకు వైష్ణవులే పోవలయును. వైజయంతీ విలాసమునందు నాయకుడు విప్రనారాయణుడు. అతడు విష్ణుభక్తుడు. ఆయనను వశమొనరించు కొనుటకు దేవదేవి విష్ణుభక్తురాలి వేషముతో పోయినది. సాధించు కొని వచ్చినది, ఏ యెండ కా గొడుగు

తెలి గందవొడియ మంత్రించి మైనటు చల్లి
వెంటరా మరపెద వీని గొమ్మ!

అని పంతములు పచరించినది వేరొక వారవనిత. ఆమె గట్టివాయి. మంత్ర తంత్రములు నేర్చినది. ఏదైన పీడను నివారింపవలసి వచ్చి నపుడు శైవులు నద్వైతులు విభూతిని మంత్రించి శరీరమునందు రాయుదురు. విశిష్టాద్వైతులు నారాయణ మంత్రముతో హరిచందనపు పొడి మంత్రించి మేనికి రాయుదురు. విష్ణు పాదోదక మొసంగుదురు. భల్లాలరాజు విఠలదేవరాయలు. ఆయన శైవుడు. ఆ మండలేశ్వరుని కుమార్తెకు బ్రహ్మరాక్షసి పట్టినది. రామానుజులవారు అష్టాక్షరి జపించి హరిచందనము రాజకుమారి మేన పూయించెను. విష్ణు పాదోదకము త్రావించెను. బ్రహ్మరాక్షసి విడిచి పోయినది. విఠల దేవరాయలు వైష్ణవము స్వీకరించెను. విష్ణువర్ధను డని పేరు మార్చు కొనెను. ఈ వేశ్యాంగన విష్ణు భక్తురాలు. కావున తెలిగందపుపొడి వశీకరణ మంత్రముచేత మంత్రించి చల్లెద ననినది. వేశ్యలు కామ శాస్త్రోపాధ్యాయినులు. వశీకరణ మంత్ర తంత్రౌషధములు నేర్చిన వారు. ఎంతకైన చాలుదురు. ఆ వెలవెలందుకలు ఋశ్యశృంగునకు జవ్వాది కానుక యిడిరి. అది గోపిచందనమనుకొని ఫాలమున దిద్దు కొనెనట. మరువ మొసంగిరట. తులసీ దళమని భక్షింప చూచెనట. రఘునాథ నాయకుడు తన వైష్ణ వాభిమానమును రామాయణ కావ్యముఖమున చక్కగా ప్రకటించెను. ఇంత అభిమాన మున్నను అతడు శైవద్వేషి కాడు. రాజు సర్వజనరంజకుడు, పోషకుడుగా

నుండవలయును. సర్వ మత సహత్వము రాజ లక్షణము. ఈ విషయ మున రాజ సంప్రదాయము లెరుంగక చాలమంది చరిత్రకారులు పొరపడుచున్నారు. హిందూరాజులు పెక్కుమంది జైన బౌద్ధుల నాదరించిరి. వారికి పెక్కు మాన్యము లిచ్చిరి. వారి తీర్థంకరుల ప్రసాదములు గ్రహించిరి. అంతమాత్రముచేత ఆంగ్లేయులు జైనులని బౌద్ధులని వారిని నిరూపింతురుగాక. భారతీయ సంప్రదాయ మెరిగిన మన చరిత్రకారులు వారి దారినే యనుసరించుట విచారణీయాంశము. విమర్శకుడు స్వబుద్ధిచేత ఆలోచింపవలయును. సాంప్రదాయములు లక్షణములు తెలిసికొని యుండవలయును. తప్పు దారికి పాఠకులను మరల్పరాదు.

రఘునాథనాయకుని గుణగణములు రామాయణ కృతియందు ప్రతిబింబమువలె పరిస్ఫుటముగా నగుపించుచున్నవి. కవి మానసిక ప్రవృత్తికి ప్రతిబింబము కవిత్వము. కవి యంతరించినను ప్రతిబింబము మాయదు. అది కావ్య విశిష్టత. రఘునాథ భూపతి వైష్ణవుడు. ఒక్క లింగడు పోయినను పోయినట్లే యని యనుకొను సంకుచిత స్వభావము కలవాడు కాదు. పరమత సహనము, త్రిమూర్తులయందు భక్తి, వేదములందు నమ్మకము గల మహోదార స్వభావుడు. విశాల హృదయుడు. మెత్తని మనస్సు కలవాడు. కావుననే వాని భావములు మృదులములు. కవిత నవనీతము. శైవ వైష్ణవులకు వాద ప్రతివాద ములు, ద్వేష విద్వేషములు మిక్కుటముగా నున్న పదునేడవ శతాబ్దమునందు తాను విశిష్టాద్వైతుడయ్యును రామాయణ కృత్యాది యందు

పద మంజీర ఝుళం ఝుళార్భటి జటా బంధామృతాంధ స్తతి
న్యుదయద్భంగ ఘుమం ఘుమ స్వనము తండూద్య న్మృదంగధ్వనిం
బొదలింపంగ నటించు నాఁటి నటుఁ డింపు ల్మీర నాడించుఁ గా
త దయ న్మ ద్రసనాగ్ర రంగమున వాగ్ధాటీ నటి న్నాటికిన్

అని శివుని ప్రార్థించినాడు. రఘునాథ రాయల భక్తి సంతరితంబైన యంతరంగము నుండి వినిర్గతమయిన కవితా సుధాంధ స్తటినీ తరంగ

వాహిని యిది. దీనియందు శివుని పాద మంజీర ఝణం ఝణార్భటి యున్నది. కవి భక్తి రసమయుండయిన గాని యిటువంటి పద్యము వ్రాయలేడు. ఇది నన్నయాది మహాకవుల కవితాధాటికి దీటయిన పదగుంభనములు గల గంభీర రస తరంగిణి. ఆ పద మంజీరము వేదము. రఘునాథ నాయకుడు సంస్కృతాంధ్ర భాషలయందు సమానముగా కవిత్వము నడిపింపగల యుభయ భాషా కోవిదుడు. ఆయన వ్యాకరణ శాస్త్ర పాండిత్య మా సమాస ఘటనమే వేయి ముఖముల చాటు చున్నది. 'ధరాధరేంద్ర నందన ఘన వాగ్విశేష కలన న్వాలనొప్పఁగ మాకు నీవుతన్' అని పార్వతి నర్థించినాడు. ఇట్టి రసవంతమగు కవిత రచించిన రఘునాధనాయకుడు నిజముగా నాంధ్రభోజుడు. శ్రీ కృష్ణ రాయలకు సమాన మయినవాడు. కావున తెనుగు కవితా వనజాత లోచన రాయల మరణానంతరము రఘునాధ నాయకుని యండ చూచుకొనినది. వినూతన మార్గము లవలంబించి తరగని యశ మార్జించుకొన్నది. మూడు తరములవరకు తంజావూరు కదలలేదు. దానికి కారణము నాయకరాజుల యవ్యాజ మగు కవితాసక్తియే. అది తరువాతి మహారాష్ట్ర భూపతులకు దారి చూపినది.

రఘునాధ నాయకుని శివకేశవులందలి యభేద భావము ఋశ్యశృంగుని కధయందు సైతము గనవచ్చును. వేశ్యలు

బుసి కప్పుకొన్న చొప్పున మేన నిండంగ
మేదించినట్టి యీ బూది యేంది

అనుకొనిరి. విభూతి శివ ప్రీతికరమైనది. శైవులు దానిని ధరింతురు. ఋశ్యశృంగుడు నుదుట పట్టవర్ధనములు తాల్చెను. మేన విభూతి రాచుకొనెను. ఈ వేషము శివకేశవులం దభేద భావము సూచిం చును. దానిని చిత్రించిన రఘునాధ రాయల చిత్తము నటువంటిదే.

చెలువలు పన్నీరు చెంబు లిచ్చినఁ గాళ్ళ
కుప్పెల జల మంచుఁ గ్రోల నెంచు
పొలతులు వెలిగంద వోడి యిచ్చిన విభూతి
యిది యటంచుఁ ద్రిపుంద్ర మిడఁ దలంచు

ఈ పాదములు నట్టి యభేద భావమునే సూచించును. రఘునాథ నాయకుడు రసికుడు. పలుకులలో పరిహాసంపు చణుకులు వెలయించు భావములు కలవాడు. ఆయన కల్పనా శక్తియు నూహాపోహాలు ప్రశంసింప దగినవి. వారాంగనలను చూచినాడు ఋశ్యశృంగుడు.

న తేన జన్మప్రభృతి దృష్ట పూర్వాం తపస్వినా
స్త్రీర్వా పుమాన్వా యచ్చాన్య త్సర్వాం నగరరాష్ట్రజం

అని మాత్రమే నుడివినాడు వాల్మీకి. ఋశ్యశృంగుని అమాయకత్వము గాని యబ్బురపాటు గాని యిసుమంతయిన ప్రదర్శింపలేక పోయినాడు. అతడు మహర్షి. ఆ యూహ లందుకొన లేకపోయినా డను కొందము. అది రామాయణ కావ్యత్వమునకు తీరని లోప మనుటకు సందేహము లేదు. అందుకనే రామానుజులవారు రామాయణ మొక యితిహాస మని చప్పరించిరి. భాస్కరుడు గోపీనాథులకైన నీ లోపము తీర్పవలయు నను భావము కలుగలేదు. ఈ లోపము గ్రహించినవాడు రఘునాథ నాయకుడు. వారాంగనలను చేరం జనినాడు ఋశ్యశృంగుడు.

అబ్బురంబుగ నెద గుబ్బకొమ్ములు మొల్చె
ఘనులు వీరౌర నాకన్న ననుచుఁ
బదములఁ బొడమెడుఁ బద్మము ల్వీరల
మహిమ యెంతటి వింత మహి నటంచు
ఘనములు వెనువెంటఁ గదియుచున్నవి జల
దాకర్షణము వీరి కబ్బె ననుచుఁ
బలుకుల నమృతంబు దొలఁకెడు బళి! వీర
లమృతాంధసులకన్న నధికు లనుచుఁ

గాన మెన్నఁడు నీ సామగాన గరిమఁ
గఠిన పాషాణముల నీరుగాఁ గరంచె
నంచు మది నెంచి పలుమఱు నరుదుపడుచుఁ
గొమ్మ కొనయూఁగఁ దలయూచి కొనుచుఁ జేరి.

ఈ పద్యమునందు ఋశ్యశృంగుని యమాయకత్వము, అచ్చెరుపాటు, వారాంగనలందలి గౌరవాభిమానములు నిరూపింపబడినవి. పక్షాంతరమున వేశ్యల రూప వర్ణనము చేయబడినది. ఇట్టిరచన మహాకవులకు సహజము. 'స్థితాః క్షణం పక్ష్మసు తాడి తాధరాః' అను శ్లోకము నందున్న వ్యంగ్యము ఈ పద్యమునందు లేదుగాని రస భావాదుల నిండికయున్నది. ఋశ్యశృంగుడు స్త్రీ పురుష తారతమ్య మెఱుఁగనివాడు. వారాంగనలు మహర్షు లనుకొనినాడు. వారి స్తనములు గుబ్బలవంటి కొమ్ము లనుకొనినాడు. తనకు తలపై నొక్క కొమ్ముకలదు. వారికి ఉరమున రెండు కొమ్ములు మొలిచినవి. కావున వారు తనకంటె ఘనులని యూహించినాడు. పాదముల వంక నరసినాడు. అవి తామర పూలవలె నున్నవి. కాళ్ళకు కమలములు మొలిచిన వనుకొనినాడు. వారి మహిమ వింతయైన దని తలంచినాడు. జడల నీక్షించినాడు. మేఘము లని భ్రమసినాడు. మేఘముల నాకర్షించు శక్తి వానికిలేదు. వారికా శక్తి కలదనుకొనినాడు. వేశ్యల పలుకులలో నమృతము జాలువారినది. వారు దేవత లనుకొనినాడు. వీణె తంతువులు సరినొత్తి గాన మొనరించినారా వారాంగనలు. ఆ గానమునకు రాలు కరిగి స్రవించినవి. అది సామగాన మని భ్రమసినాడు. ఎంత యమాయికత? సారాంశము వేశ్యలు దేవఋషు లనియు, తనకంటె ఘనులు మహిమకలవా రనియు ఋశ్యశృంగున కూహ పొడమినది. కావుననే యాశ్రమమునకు గొనిపోయి యాతిథ్య మొసఁగినాడు ముని కుమారుడు. ఇట్టి తలంపులతో 'కొమ్ముకొన యూఁగఁ దలయూచికొనుచు' వారిని చేరినాడట. స్వభావసిద్ధ మగు చర్య. నవ్వు పుట్టించు భావము. అంతకంటె వింత సంగతి. రఘునాథ నాయకుని యూహలు వార వనితల చూపులలో దేవతార్చనకు కలువ పూవులు కోయించినవి. నవ్వులలో వినువాక జలమని స్నానమాడించినవి. కేలి పచ్చల గాజుల నిగ్గులు దర్భలని కోసికొన డాయించినవి. రెప్పవేయక చూచు చూపులు వార లనిమిషులని తలవంచి మ్రొక్కించినవి

అపుడు తన కొమ్ము కను దాకునంచు నెంచి
వెనుకకై పోవ వారలఁ గనుచుఁ జేరి
యకట! నామీఁద దయలేదె యనుచుఁ బలుకు

నట. అంతవరకు తెచ్చినాడు కవి. కవులు ఘటనాఘటన సమర్థులు. తలంచుకొనిన నేమైన చేయగలరు. కవి సంస్కారము కలవాడు కావలయును. రసావేశ పూరిత మయిన యంతరంగమునుండి దొరలుకొని వచ్చు కవితా వాహినిలో పొడమిన యలంకారములు ముత్యాల మురువులు మెఱయించుచుండును. అవి కావ్యాంగనకు విన్నాణంపు కంఠాభరణము లయి మిగుల శోభ నొదవించును. అవి మితి మీరినచో కృతికి వికృతాకారము కల్పించును. వసుచరిత్ర యందలి లోపములలో నది యొకటి యని పండితకవుల యభిప్రాయము.

రఘునాథ రాయలు రసప్రియుడు. రసాభివృద్ధికి తగిన యలంకారమునే వాడెను.

కులుకు గుబ్బెతల చూపులు గల్వ విరు లంచు
దేవ తార్చనకుఁగాఁ దివియఁ బూను.

ఇత్యాది పద్యమునందలి భ్రాంతిమదలంకారము రసోపస్కారక మయి కథా ఘట్టమునకు శోభ సమకూర్చినది. చివరి గీతముస్వభావ సిద్ధమగు భావము కలది. నాయికా నాయకులకు మేను మేనితో నొరసికొనునప్పుడు కాని యెడబాటొదవినప్పుడు తీవ్రమగు వియోగ తాప మనుభవింపరు. రఘునాథ నాయకుడు రసజ్ఞుడు. మాట చతురత కలవాడు. పనుల తీరులలో పరిణామ మెఱింగినవాడు. ఋశ్యశృంగు నొక యడుగు ముందునకు నడిపినాడు. అమాయికత్వము నంతరింపనీయలేదు. తొల్లింటి భావమును మాయింపలేదు.

హోమ కుండిక లెట్టు లెద మోచికొన్నార
లని కుచంబులు కేల నంటి యంటి
యీ తెల్ల రుద్రాక్ష లేడఁగ్గె నటంచు
హారము ల్వలు మాఱు నలమి యలమి

మంచివి కటి బద్ధ మౌంజీ గుణము లంచు
మొలనూళ్లు సారెకు ముట్టి ముట్టి
సూక్ష్మ వల్కలము లెచ్చోటఁ దెచ్చితి రంచుఁ
బసిడంచు చేలలు పట్టి పట్టి
హోమ రక్షుల పరిమళం బున్న దనుచు
మేలి కస్తూరి తిలకము ల్ఫాల సీమ
మోము దార్కొన మూర్కొని ముని కుమారుఁ
డిట్లు భ్రమయంగ నంగన లెల్లఁజూచి

నారు. మనచేతఁ జిక్కెఁబో యనుకొనినారు. పలికించ లేదు, పలుక రించ లేదు. మాటలాడని సినిమా చిత్రమువలె నాటకమాడించినాడు రఘునాథ నాయకు డీ రంగమునందు. మంచి తెలివికల దిట్ట ప్రజ్ఞ కలవాడు. ఏ కావ్యమునం దే కవియు నింత చక్కని రచన చేయ లేదు. తెనుగునందే కాదు, సంస్కృత సారస్వతమునందు నైతమిట్టి రచన యున్న దనుకొనను. చదివినంతసేపు పాత్రలు వాని చర్యలు కనులకు పొడకట్టుచునే యున్నవి. నవ్వు పుట్టించుచునే యున్నవి. రఘునాధనాయకుని యుపజ్ఞతకు వహవ్వా యనిపించుచునేయున్నది. రంగము అయిపోయినది. ఆ మరునాటి సంగతి రెండవ రంగము, విందు భోజనములు. మూడవరంగము ఋశ్యశృంగునిఁ గొనిపోవుట. అందును వింతగలదు. సావకాశ ముండవలయునుగాని యొక గ్రంథము వ్రాయ వచ్చును. ఇది కావ్యములలో రసవంతమగు కావ్యము. ఆమ్రేడిత పద ప్రయోగములో చక్కని సారస్య మున్నది. వేశ్యల స్తనముల దగ్గరనుండి యధః కాయమువరకు నవరించినాడు ముని కుమారుడు తనివితీర. ఈ రంగమునందలి పద్యము లన్నియు సాన పట్టిన జాతి రత్నములు. వానియందు శృంగారాద్భుత హాస్యరస ములు పిండి పోసినాడు రఘునాథ నాయకుడు. వేశ్యల రూపరేఖా లంకార వర్ణనలను పొందుపరచినాడు.

మరునాడు ఋశ్యశృంగుడు వేశ్యలను కలిసికొనినాడు. ఇది సంభాషణ రంగము. "ఓ ఋషులారా! మీరలు మా యాశ్రమం

బునకు వచ్చి మా సేయు నుపచారంబులు గైకొని పోవలయు'' నని ప్రార్థించినాడు. వా రంగీకరించినారు. ఋశ్యశృంగుడు పర్ణ శాలాంగణమున రసాల సాలంబు నీడ నందరకు నందంబుగా దర్భాసనంబులు పరచినాడు. కూర్చుండ నియమించినాడు. రసాల సాలంబు నీడ, అందంబుగా నను పదములు వ్యర్థముగా నుపయోగించ లేదు. చక్కని సారస్య మున్నది. తన ఘనత వారి యెదుట కనిపించ వలయును. అది మానవ ప్రకృతి.

> ''ఇదె యర్ఘ్యం బిదె పాద్యం
> బిదె కుసుమ ఫలోపహార మిదె కొమ్ము''

అని పూజలు సమర్పణచేసినాడు ముని సుతుడు.

> ''కంటిరే నేడు నిన్నటికంటె వెట్టి
> మిగులఁ గనిపించె''

ననుకొనినారు వేశ్యలు. అది కామ వికారమని వారి తలంపు. అందుకనే 'వెట్టి' అన్నారు. లేనగవు లలర నొయ్య దగ్గఱ కటు చేరినారు. చనవు సావకాశము లభించినది. వారు తెచ్చిన తెలి చక్కెరలు కజ్జములు కైకానుక లిచ్చినారు వెలవెలందుకలు.

> ''మునినాథ మా వనంబులఁ బండు లివి కొన్ని
> చవి చూడుము''

అనినారు. నిజమని నమ్మినాడు ఋశ్యశృంగుడు. కేల్సాచి యందుకొనినాడు. స్త్రీ పురుషుల తారతమ్య మెఱుంగక పోవుటయే కాదు; ఫల భక్ష్యముల భేదముకూడ తెలియని యమాయకుడు ఋశ్యశృంగుడు. ఆరితేరిన యారిందాలు వేశ్యలు. వానిని పట్టుకొని నాటక మాడుచుండిరి. అస లిది నాటకము. నాటకములో అంతర్నాటక మీా రంగము.

> త్రుంచి భక్షించుచును కొమ్ము తుద యొకింత
> కదలఁ దల యూచి సంకుల కరణి ధవళ

దంతములు గానుపింపంగ సంతసంబు
చెలఁగ మొగ మెత్తి నవ్వుచుఁ జెలులఁ జూచి

ఋశ్యశృంగుని చర్య చక్కగా వర్ణింపబడినది. ఇది స్వభావోక్తి. ఆనందానుభవము, తృప్తి, కృతజ్ఞతాశ్చర్యము లిందిమిడియున్నవి.

"ఇవి మీ వన తరు ఫలములె?
చవి యేమనవచ్చు! నమృత సంభవులో? యీ
భువి నెన్నడుఁ గనుఁగొన మా
దివినైనం గలవె! యిట్టి తీయని ఫలముల్"

"ఎంత దూరంబు మీ వన మిచటికి"

అని యడిగినాడు విభండక సుతుడు

"దూర మేడది, గడియెడు త్రోవ, యింతె,
వనము కనుఁగొని పండ్లు తేవచ్చు, నొడలు
కదల కుండంగఁ దోడుక పోయెదము నిన్ను"

అన్నారు వారాంగనలు. గడియెడు త్రోవట చక్కని వ్యావహారికము

"చను దెంచెద నేనును మీ
వెనువెంటనె"

అనినాడు ఋశ్యశృంగుడు. రంగము ముగిసినది. పదములకు వెదకి కొనుట లేదు. యతి ప్రాసలకు తడుముకొనుట లేదు. తా వెరింగి తమంతట తాము వచ్చి వాలినవి శబ్దములు. వ్యర్థపద మగుపించదు. ధారాళ మగు శయ్య. తీరయిన రచన. ద్రాక్షాపాకమున పడినది. అన్వయ కాఠిన్య మరయుద మన్నను కనిపించదు. సంభాషణ పద్ధతిని కథ నడిపించుట తిక్కనగారి విధాన మని కొందరు ప్రముఖులైన విమర్శకుల యభిప్రాయము. అయిన కావచ్చును. అది దుష్యంతో పాఖ్యానాదులందు నన్నయగా రవలంబించిన పద్ధతి యను మాట మరువరాదు. దానిని తిక్కనగారు సొంతము చేసికొనిరి. ఆయన రచనలో నచ్చ టచ్చట క్లిష్టాన్వయము లుండును. అది నారికేళ

పాకము. రఘునాథ నాయకుని పద్యములలో మార్దవ మున్నది. శ్రీకృష్ణరాయలు సాహితీసార్వభౌముడు. ఆయనకంటె పలుకు తియ్యతనము వీనియందు కలదు. ఇంక మూడవ రంగము

తళుకు బంగరు వ్రాత వలిప చేలలు వన్నె
సవ తేరుపడఁ జాల హావణు మించఁ
గాసెల తీరుగాఁ గట్టి యాపై నల్ల
పట్టుదట్టుల లీలఁ బరఁగ జడలు
నడుములఁ జుట్టి యందముగాఁగ నందుపైఁ
బలు కెంపు మొలనూళ్లు పరిఢవించి
అవికెలు ముడులు జాఱకయుండ బిగియించి
ముత్తేల జన్నిదంబులు ఘటించి
మేలి చందురుకావి రుమాలు లొక్క
వింతగా నాల్గు చుంగులు వెడలఁ గట్టి
యొడల నిండంగఁ దెలిగంద వొడులు చల్లి
పల్లవాధర లెల్ల సంభ్రమము మెఱయ

ప్రయాణ సన్నాహము గావించినారు. "వేణీం జొల్లెము వెట్టి సంఘటిత నీవీ బంధయై" అని రచించిన పోతన్నగారుకూడ సత్యభామ చేత యింత ప్రయత్నము చేయించలేదు. అవును. అది యుద్ధ ప్రయత్నము. ఇది కాలు నేలమోవకుండ ఋశ్యశృంగుని మోసి కొని పోవలసిన ప్రయత్నము. కొంచె మెక్కువ ప్రయాస మున్నది. రఘునాథ కవి వ్యూహము పన్నించినాడు వేశ్యలచేత.

తరలాక్షు లిద్ద రొండొరుల చేతులు గూర్చి
పొడవుగా నెత్తి యిర్గడలఁ గొమ్మ
వగ హస్తములు సాఁచ వారి వెన్నులఁ జన్నుఁ
గవ హత్త నిద్ద ఱంగనలు నిలిచి

దంతపుఁ గోడెల చందానఁ గంకణ కరం
బులు నిగిడింప వారలకు నడుమ
భామ లిద్దఱు నిల్చి పటము పోలికఁ గరా
బ్జాతంబు లుయ్యేల పట్టుగాఁగఁ
బట్టి యా చుట్టు ముననాబు పస పూసంగఁ
గుడి భుజంబుల క్రిందట జడలు దెచ్చి
యొండొరుల రొండిఁ జెక్కి పసిండి సరిగ
చేల పన్నాగముగ వైచి లీల మెఱయ
అందలము రీతి నందఱు
నందంబుగఁ గూడికొనుచు నందు మునీంద్రుం
బొందుగ నిడికొని పదరక
మంద గతులు మెఱయ హరి మార్గమునందున్

సాగి నడచినారు వారాంగనలు. అది పద్మవ్యూహము. లోపల ప్రవేశించువరకే. బయటకు తిరిగి వచ్చుట యుండదు. దానికి వారి యనుగ్రహ ముండవలయును. అర్థము చేసికొని పన్నింపగల దర్శకు డుండవలయునుగాని కన్నులకు విందొదవించు సినిమా ప్రయోగము. రెప్ప వాల్పక చివరివరకు ప్రేక్షకులు వీక్షింతురు. రఘునాథ నాయ కుడు ఎన్నో దైవతోత్సవములు చేయించి యుండును. ఆ యుత్సవము లలో నిట్టి ప్రదర్శనములు చూచి యుండును. వానిలో నొకదాని నిందు వర్ణించినాడు. వేశ్య లిట్టి వినోద విద్యలం దారితేరిన నిపుణలు. అందును మధుర, తంజావూరు, శ్రీరంగము, తిరుత్తని మొదలగు క్షేత్రములందలి వేశ్యల సంగతి చెప్పవలసిన పనిలేదు. వారు నాట్యాభినయ గానములందే కాక క్రీడా వినోదములందు ఇట్టి విద్యల యందు మిగుల ఘటికురాండ్రు. చెట్టుకట్టుట తొట్టికట్టుట జడకోలా టము మొదలగు వినోద ప్రదర్శనములు వారికి వెన్నతో పెట్టిన విద్యలు.

భోగి చేపట్టుకొని పోవు బాగు మెఱయ
వనజవిలోచన ల్మెఱుఁగు వాలిక చూపులు క్రేళ్లు దాట న
మ్మునిసుతు సారెఁగన్గొనుచు ముద్దుల వేడుక చింక చిక్కెఁబో
యనుచు లస ద్విలాస పరిహాస వచః క్రమముల్ సెలంగఁగాఁ

జనిరి. శాంతా ఋశ్యశృంగుల పరిణయముతో ద్వితీయాశ్వాసము ముగిసినది. చక్కని యుపాఖ్యానము. మనసు రంజింపచేయు కథా సరణి. రసవంతమయిన రచన. నవ్వు పుట్టించు హాస్యము. వింత గొలిపించు కల్పనలు. సరసములయిన పదములు. ధారాళమయిన కవిత్వము. ఇంకేమి కావలయును. ఇటువంటి రచన వాల్మీకి విడిచి పుచ్చుట శ్రీమద్రామాయణమున కొక లోటని యెంతవారికి నని పింపక పోదు. రఘునాథ నాయకుని యీ రచన మూలమునకు మెరుగు పెట్టినది. వాల్మీకి యీ రసస్థాయికి రాలేక పోయినాడు. 'పురాణ మిత్యేవ న సాధు సర్వం' అనినాడు మహాకవి కాళిదాసు. అది యనుభవము మీద అన్నమాట. పూర్వ కృతులలోని మంచి చెడుపుల కన్నిటికి తల యూపుట నా పద్ధతి కాదు. లోపములు వెలి బుచ్చుటలో తప్పు లేదు. భార తాంధ్రీకరణమునకు రఘునాథ రామాయ ణాంధ్రీకరణమునకు చాల తారతమ్య మున్నది. ఉన్న దానికి వన్నెలు దిద్ది మూలముకంటె ముద్దు లొందవించినారు నన్న యాదులు. అస లాధారము లేని చోట అందమయిన యల్లిక లొంద వించి మూలమును మించి పోయినాడు రఘునాథ నాయకుడు. అక్షర మున కక్షరము, పదమునకు పదము తెనిగించుటలో ఘనత లేదు. అది బ్రహ్మాదులయిన చేసి మెప్పింపలేని పని. మూలములోని లోటు పాటులకు మెరుగు దిద్దుచు రసము లొలికించు కవిత వ్రాయుటయే ఘనము. రఘునాథ రామాయణము పూర్తిగా రచియించినచో భాస్కరాదుల రామాయణము విప్పి చూచు సారస్వత ప్రియు లుండెడివారు కారు. బ్రహ్మకు కను కుట్టినది. ఆదిలో నాయుర్దాయము త్రుంచినాడు. రఘునాథ రామాయణ మంతటితో ముగిసినది.

కోరుకొండ భట్టరు కృష్ణమాచార్యులవారు మహాపండితులు. నా కాప్తమిత్రులు. భాష్యాంతము వ్యాకరణశాస్త్ర మధిగమించిన వారు. ఏ విషయ మయిన ఆయన నాలుక తుద నాట్య మాడు చుండును. అయిదు భాషలలో చాల ఘటికుడు. సంస్కృతము, తెనుగు, అరవము, హిందీ, పర్యాప్త భాషలలో ఆయన చదవని సాహిత్య గ్రంథములు లేవు. పూర్వోత్తర మీమాంసలు శ్రీభాష్యము వానికి సంబంధించిన ఖండన గ్రంథములు ఆమూలాగ్రముగా చదివెను. ఆళ్వారుల దివ్య ప్రబంధములు మొదలుకొని వైష్ణవ మత గ్రంథములన్నియు కంఠస్థములు. వాల్మీకి రామాయణము సంస్కృత భాషకు దేవతా ప్రసాదమని వారి అభిప్రాయము. అది వారికి నిత్య పఠన గ్రంథము. సాధారణముగా వారు మా యింటికి వచ్చుచుండుట యలవాటు. సారస్వత సంబంధములగు సంభాషణలు జరుగుచుండును. నే నీ వ్యాసము వ్రాయుచు బల్లమీదనుంచి లోనికి పోయితిని. తిరిగి వచ్చునప్పటికి వారు వచ్చి యీ వ్యాసము చదువుచుండిరి. పూర్తి అయినది. పుస్తకము బల్లమీద నుంచిరి.

"వాల్మీకి నెత్తిమీది కెక్కించారే రఘునాధనాయక భూపతిని" అన్నా రాచార్యులవారు. ఆ మాటలో చాలా అర్థాలు భావాలు స్ఫురించినవి వారి పలుకుబడిని బట్టి. నేను వారి ముఖము చూచితిని. ఒక రకముగా అసూయాభావము కనిపించినది.

"నే నెక్కించిన దేమున్నది ఆయనే యెక్కినాడు"

అన్నాను నేను

"ఆస్థాయి కందుకొనలేక పోయినా డంటిరి. మీవంటి వారలు అనవచ్చునా?" అన్నా రాచార్యులవారు.

"నిజమే" అన్నాను నేను.

మా యిరువురకు రెండు మూడు గంటలు తర్జన భర్జనలు జరిగినవి. వారే ఒకప్పుడు "భాస్కరాదులను మించినాడు రఘునాథ నాయకుడు" అన్నారు. ఇప్పుడు నేను 'వాల్మీకిని మించినాడు' అన్నాను.

ఆచార్యులవారి కమిత కోపము వచ్చినది. అప్పటికి రాత్రి యెనిమిది గంట లయినది. పూర్వపక్ష సిద్ధాంతాలు పెరిగినవి. అది మా కొక వినోదము. గోవిందరాజీయముతో రామాయణ మీ మూలనుండి యీ మూల కొక సారి తిరిగిపోయినది. చివరికి అన్నారు. "వాల్మీకి యేమి కారణముననో రామలక్ష్మణాదుల జన్మ వృత్తాంతము వరకు రామాయణ కథ క్లుప్తపరచినాడు"

"అదే నేను చెప్పబోవునది. వాల్మీకి సామాన్యుడా? దూర దృష్టి కలవాడు. నక్షత్రమండలము నంటుకొను మహానగము నెక్క-బోవుచు ముందుగా తన శక్తిని వ్యర్థపుచ్చుకొనువా డుండునా? ఇది యుపోద్ఘాతము రామకథకు. కావున కథను పరుగెత్తించినాడు. తరువాత కథలో నెవరు వ్రేలెట్ట గలరు. పెట్టి పరిహాసముల పాలు కాకపోరు" అన్నాను నేను.

"చక్క-గా ఆలోచించారు శాస్త్రిగారు"

అన్నారాచార్యులవారు నవ్వుచు.

"వారేమి సామాన్యులా?" అన్నారు మా మిత్రులు

పుత్రకామేష్టి యశ్వమేధ యాగముల వర్ణన తృతీయాశ్వాసమునందు కలదు. ఈ కథాభాగము కొంచె మించు మించుగా వాల్మీకి రామాయణము ననుసరించి వ్రాయబడినది. రఘునాథ నాయకుడు వర్ణన ప్రియుడు. అందును రసవంతములగు వర్ణనలనే పరిగ్రహించుచుండును.

సరిగ చిత్రపుఁ గుట్ల సరిలేని ముత్యాల
బవిరి చౌకట్లులు పరిఢవిల్లఁ
గుఱుచ గేదంగి రేకుల యల్లికల మించు
జడలు పిఱుందుల బెడఁగు చూప
జిగి పైఁడి యంచుల వగల చందురుకావి
నెఱిక కాసెల నిగనిగలు నిగుడ
నభినయంబుల నేర్పు లలరించు కంకణ
కలిత హస్తముల సింగార మమర

ఘనతర మృదంగ ధిం ధిమి ధ్వనులు సెలఁగ
వింత కోపులు మెఱయంగ వేశ్య లపుడు
నాట్య మొనరించి రమ్మహీనాథ మౌళి
యాగ శాలాంతర ద్వార భాగములను.

భోజన శాలయందు

గంతులు వైచుచు న్నగుచుఁ గాంచన శోభిత రత్న మేఖలా
కాంతులు దిక్కుల న్నిగుడఁగాఁ బరివేషకు లప్పు డచ్చటన్
బంతుల రీతి సూప ఘృత పాయస పాత్రలఁ బట్టి యాడుచు
న్బంతుల వెంట వేడుక లొనర్చిరి చూపఱ కెల్ల నెల్లెడన్

నిరతావారితాన్న సత్ర సంతోషిత పంచాశ త్సహస్ర భూసురుఁడు రఘునాథ నాయకుడు. ఈ వినోద మాయనకు నిత్య పరిచయము. కావున నింత మనోహరముగా వర్ణింపఁ గలిగెను. ఇదె కాదు

గండ యుగ స్థలంబుల నఖండ మణీ ఘృణి మండల స్ఫుర
త్కుండలముల్ నటింపఁగ నెదుర్కొని వాద మొనర్చి మాటికిం
బండిత కోటి యా ధరణిపాలకు సద్వార వాటి నిండి వై
తండిక మార్గ వక్రతర తర్క వచః క్రమము ల్చెలంగఁగన్

రఘునాథ నాయకుడు పండితుడు కవి. పెక్కు మంది విద్వాంసులను కవులను పోషించెను. తన కొలువునందు పండిత సభలు చేయించెను. కని విని యానందించెను. ఆ యానంద రసానుభవ ఫల మీ పద్యము. పాఠకుల కేల సంతోషము కలిగింప కుండును? అచ్చ తెలుగు పదముల పొందిక వలెనె సంస్కృత పదముల పొందికయు సరసమయి మృదులముగా నుండును. చెవులకు కటువుతనము వినిపింపని యక్షరముల కూర్పు అనుప్రాసలతో రచన సాగిపోవుచుండును. కత్తి పట్టినంతనె వీరరసము వెల్లివిరియ నరాతి భూపతుల చిత్తంబున కుత్తలపాటొదవించు నతిలోక భయంకర సింహ గర్జారవంబులు దిక్కులు పిక్కటిల్ల నావిర్భవించు మానసమునం దుండి, గంటము పట్టుకొనినంతనె నెత్తెమ్మి పూరేకు ముత్తమ్ములం దుండి జాలువారు

మారంద రస ధారల నూరించు నతి మృదులంబులగు పదంబుల పొందికలతోడి పలుపోకడలఁ గవనంపు రచన సాగించిన రఘునాథ నాయకుని ప్రజ్ఞ ప్రశంసింప దగినది. చతుర్థాశ్వాసము శ్వేతద్వీప వర్ణన. ఇందు నిరువదియారు పద్యములు మాత్రమే ముద్రితము లయినవి. ఇవి యన్నియు చక్కని భావములతోడను ఊహలతోడను నిమిడియున్న పద్యములు. మచ్చునకు

నీరుపాపలు గుమిగూడి నింగి కెగయ
వీచికా రజ్జువులఁ గట్టి విడిచి నట్టి
కాగితపు గాలిపటము నిమ్కంప లీల
నున్నదో యనఁ దెలిదీవి చెన్ను మీఱు.

మనోహరమగు భావకల్పన. రూపకానుప్రాణితమగు నుత్ప్రేక్షాలంకారము. ఈ పద్యము మూలమున కాగితములు రఘునాథ నాయకుని కాలమునకే యుపయోగములోనికి వచ్చినవని మన మూహించుకొన వచ్చును. ఆ కాలమునందలి నాగరికతా విశేషములను స్త్రీ పురుషుల వస్త్రాలంకారములను తెలుపు పద్యములు రఘునాథ రామాయణమునందు పెక్కు కలవు. పై పద్యములం దవి యరయ వచ్చును. రఘునాథ నాయ కావనీపతి భావములు మానవ సామాన్యుల కందుబాటులో నుండును. అన్వయ కాఠిన్యముగాని పదకర్కశత్వముగాని యగుపించదు. ఇదియే రఘునాథ రామాయణములోని ప్రత్యేకత.

శ్రీమద్రామాయణము పరమార్థ సాధనంబయిన పవిత్ర గ్రంథము. అందు పలు విధములగు వేదాంత విషయము లిమిడియున్నవి. వానితో కావ్యంపుఁ బోకడల కలయకలుపులు కలవు. దాని విశిష్టతను గురించి మొదటనే ముచ్చటించితిని. పంపాసరోవరాదిక వర్ణనములు పౌరాణికములు. సామాన్య మానవుల చిత్తమున కందుబాటులో నుండవు. మందాకినీ తరంగ సందోహముల వలె గగన సంచార మొనరించుచుండును. అతీతములగు విషయముల నందించుకొను సహన మీ కాలపు జనులకు లేదు. భావములైనను అలంతి మాత్రులగు పండితులకు అగమ్య గోచరములు. మహాపండితు

లను సైతము తలక్రిందు చేయునవి. ఆ కారణముచేత నందలి పాత్రలు గూడ మానవాతీతులయినారు. అది యొక యలౌకిక లోకము. దాని యందు ముక్తి, మోక్షము మూట కట్టుకొని యున్నవని తలంపు. కావున దానిని మడికట్టుకొని గాని ముట్టుకొనరు. భాస్కర గోపీనాథ ఆంధ్ర వాల్మీకి ప్రముఖులు ఎంత ప్రయత్నించినను ఆ స్థితిని అందు కొన లేకపోయిరి. కావున ఆ గౌరవము వారి రామాయణములకు రాలేదు.

నన్నయ పరమ లౌక్యుడు. ఆయనను మించినవాడు తిక్కన. వారు వ్యాస భారతములోని యలౌకిక ప్రవృత్తి నావలకు త్రోసి యాంధ్రీకరించిరి. వారు ప్రపంచమును, ప్రపంచ స్వభావమును బాగుగా పరిశీలించిరి. అవగతము గావించుకొనిరి. దాని కనుగుణ ముగా తెలుగు గొనరించిరి. నన్నయకంటె తిక్కన మరింత ముందునకు పోయెను. భాషయందు భావములందు మానవ చిత్తవృత్తికి అనుగుణ ముగా తెనిగించెను. విరాట పర్వమును మూలముతోపాటు చక్కగా చదివి చూచినచో నవగతముకాక మానదు. కీచకుని కథా ఘట్టము పెరుగుటకు కారణ మిదియె. తిక్కన విరాట ఉద్యోగపర్వములు కావ్యములవలె చిత్రించె ననుటలోని యర్థ మిదియే. శ్రీకృష్ణుని రాజనీతి వేత్తయైన లౌకిక వ్యక్తిగా ప్రదర్శించెను. ధర్మరాజును 'మెత్తని పులి'గా నిరూపించినాడు. ఆ కారణముచేత తెనుగు భారత మున కంత ప్రచారము వచ్చినది. తిక్కన 'భారతమును పాడు చేసినాడు, వ్యాస ఘట్టములను భగవద్గీ తాదులను తెనిగించుట చేత రాక విడిచిపెట్టినాడు' అని వెక్కిరించిన సంస్కృత పండితులను పెక్కుమందిని నే నెరుగుదును. వారి కా రహస్యము తెలియదు. వ్యాస భారత మున్నది యున్నటుల తెనిగించినచో నింత ఘనతకు వచ్చెడిది కాదు. రామాయణ స్థితియే పట్టెడిది. భారతమునుగూడ ఈపాటికి వందమంది యైనను తెనిగించెడివారు. భాస్కరాదులు తిక్కనయంత లౌక్యులుగారు. కవితాశిల్పము కలవారును కారు. కావున వారి రామాయణము భారతమంత ప్రసిద్ధికి రాలేదు.

రఘునాథ నాయకుడు మహారాజయ్యును లోకమును బాగుగా పరిశీలించెను. మానవ స్వభావములను గుర్తించెను. నన్నయ తిక్కనల భారతాంధ్రీకరణములోని రహస్యమవగాహనము చేసికొనెను. రఘునాథ రామాయణములోని వర్ణనలు భావములు కల్పనలు పాఠకుల యూహాల కందుబాటులో నుండునటుల విరచించెను. బోయ వాడు క్రౌంచము నేసిన విధము, వేశ్యావాటిక వర్ణనము, వారి మాయా నటనలు, వేషభాషలు, ఋశ్యశృంగుని గొనిపోయిన విధానము లోక సహజములు. అశ్వమేధ యాగములోని భోజనములు వడ్డనలు పండితవాదములు నాట్యములు మానవానుభవము లోనివి. ధనికుల వివాహములందు సమారాధనలయందు నట్టివి చూచుచుందుము. దశరథుని యనుతాపము లోకము తోడిపాటిది. శ్వేతద్వీప వర్ణనము లన్నియు పాఠకుల యూహాల కందుబాటు లోనివి. ఇట్లు రఘునాథ రామాయణము నైసర్గిక లోకప్రవృత్తికి ప్రతిచ్ఛందము గావించి చదువరులకు మనోరంజకముగా నుండునటుల విరచించెను. రచనా విధానమునందు లోకమును దృష్టియం దుంచుకొనిన రఘునాథ నాయకుడు పాత్రపోషణమునందు వాల్మీకిని విస్మరింపలేదు. దశరథుని

తన దాన మహిమ చింతామణి కామధు
  క్సంతానముల కోజ బంతిగాఁగఁ
దన హేతి సకల దిగ్ధరణీశ లక్ష్ములఁ
  దో తెచ్చుటకుఁ దగు దూతిగాఁగఁ
దన నీతిగుణి యుగంధర ముఖ్యులకు నెల్ల
  తవణిల్లు పఠిత పాఠంబుగాఁగఁ
దన కీర్తి ఘన నృపాస్థాన రంగములకు
  నవ్య మౌక్తిక వితానంబుగాఁగ
నలరు నా స్వర్గ మార్గ నిరర్గళైక
రథుఁడు సంతత రాజాధిరాజ దత్త

సార వస్తు సమగ్ర మనోరథుండు
దైవత నుత ప్రథుండు నా దశరథుండు

అని వర్ణించెను. ఈ పద్యము వాల్మీకి వర్ణించిన శ్లోకముల కాంధ్రీకరణము కాకపోయినను వానియందలి సర్వ సంగ్రహః, దీర్ఘదర్శీ, మహాతేజాః, ధర్మపరః, త్రిషు లోకేషు విశ్రుతః ఇత్యాది ప్రధానాంశములందలి భావములను మనస్సునం దుంచుకొని రఘునాథ నాయకమహారా జీ పద్యమును వ్రాసెను. ఈ రచనా సౌందర్యము మరే యితర రామాయణములందు తరచి చూచినను కనిపించదు. మూలమునకే యందము తెచ్చు భావ కల్పన. వర్ణనలందు స్వతంత్రించినను ప్రధాన కథయం దొక్కొక్కచోట శ్రీమద్రామాయణమును ముందుంచుకొని తెనిగించెను. శాంతా ఋశ్యశృంగులను గౌరవించుట, యజ్ఞమునకు ప్రయత్నములు, మంత్రులతోడి సంభాషణ పరిశీలింప వచ్చును. మచ్చునకు

ఛిద్రం హి మృగయంతేఽత్ర విద్వాంసో బ్రహ్మరాక్షసాః
నిహతస్య చ యజ్ఞస్య సద్యః కర్తా వినశ్యతి
త ద్యథావిధి పూర్వం మే క్రతు రేష సమాప్యతే
తథావిధానం క్రియతాం

అని వాల్మీకి

పగ వట్టి విద్వాంసులగు బ్రహ్మరాక్షసు
లివ్విఘ్నంబు సేయంగ వేచి యుంద్రు
క్రతువునకు విఘ్న మేదైనఁ గలిగెనేని
కర్తకుఁ గొంత వాటిల్లుఁ గాన మీర
లధ్వరం బెట్లు కొనసాగు నట్లు సేయు

డని రఘునాథ రామాయణము. అందందు మార్పు కావించినను వాల్మీకికంటె చక్కని పోకడలను ప్రదర్శించి పాత్ర పోషణకు మరింత మెఱుగులు దిద్దెను. గంభీరమగు భావములను వెలయించెను. వాల్మీకి

'తత స్తా స్తం సమాలింగ్య' అని వ్రాసెను. తాః వారాంగనాః తం ఋశ్యశృంగం సమాలింగ్య ఇతి భావః. స్నేహిజనవత్ వశీకరార్థ మాలింగ్య ఇతి గోవిందరాజీయం. స్పర్శేనాపి వశీకర్తు మాలింగన మితి శ్రీమహేశ్వర తీర్థీయం. రఘునాథ భూపతి దీనిని మార్చి వేసెను.

హోమ కుండికలెట్టు లెద మోచికొన్నార
లని కుచంబులు కేల నంటి యంటి

ఇత్యాది పద్యమునందు ఋశ్యశృంగుడే వేశ్యల స్తనములను హారము లను చీరెలను కాంచీగుణములను స్పర్శించినటుల వ్రాసెను. అట్లు మార్చుటలో విశేషమున్నది. ఋశ్యశృంగుడు వేశ్యలను మహర్షులని తలంచెను. వారి మహత్త్వమున కాశ్చర్యపడెను. వారి వేషము లకు అబ్బురపాటు నొందెను. ఆ యచ్చెరుపాటు వేశ్యలను స్పర్శింప చేసినది. వింత వస్తువులను పరిశీలించునపుడు చేతితో తాకి పరీక్షిం చుట మానవ స్వభావము. ఆ స్వభావమే ఋశ్యశృంగుని ప్రోత్స హించినది. వేశ్యల స్తనములు తాకినాడు. అంటి అంటి అను నామ్రే డితము నుపయోగించుటచేత బాగుగానంటి పరిశీలించె నని భావము. అట్లు అంటుకొనుటలో నవి హోమ కుండిక లను పవిత్ర భావమే యాతని మనస్సున కలదు. కామోద్రేక మొదవించు నంగములని యత డెరుంగడు. అది ఋశ్యశృంగుని అమాయికత్వమును సూచించు చున్నది. అతడు స్త్రీ పురుషుల తారతమ్య మెరుగడు. శిశువు తల్లి పాలను త్రావుచుండును. ఒక చేత రెండవ స్తనమును పీడించు చుండును. అవి తనకు ప్రాణాధారములయిన పాలతిత్తు లను భావమే గాని వేరుభావము ఆ శిశువున కుండదు. అట్టి యమాయికత్వము ఋశ్యశృంగునియం దా పద్యము చదువునపుడు స్ఫురించును. మహ ర్షులు దేశాంతరములకు పోవునపుడు తమవెంట నగ్నిహోత్రములను కుండికలం దుంచుకొని మోసికొని పోవుదురు. ఈ సంగతి పురాణ ములం దగుపించును. ఋశ్యశృంగుడు స్తనముల నగ్నికుండికలని తలంచుటలో విపరీత మేమియులేదు. ఇంకొక విశేషముకూడ ఇందు

కలదు. వేశ్యల స్తనములు కుండికల వలె వర్తులములయి యున్నత ముగా నున్నవని కవి పక్షాంతరమున వర్ణించెను. ఇట్టి చక్కని భావములతో లోప మొదవనీయని పాత్రపోషణలతో రఘునాథ రామాయణము నాలు గాశ్వాసములు రచించెను. అది పూర్తియై నచో భారతమున కున్న ప్రచారము రఘునాథ రామాయణమునకు కూడ వచ్చెడిది. తెనుగునందు రామాయణ లోపము తీరిపోయెడిది. దైవ మసూయాపరుడు. రఘునాథ నాయకుని యీ పోకడలు పరిశీ లించి కాబోలు ఆదిలోనే యంత మొనరించెను.

రఘునాథ రామాయణమునందు పెక్కు దేశీయములు మాండలికములు ఆచ్ఛికములు నగు పదములు వాడబడినవి. కుఱు మాపు దట్టి, దోటి, కొడిది పూసలు, బుడుత, నీఱుతాఱులు, కిఱు మెట్టులు, బోర, చట్టుపలు, ఉంగటములు, సుగ్గడితము, అరచట్టలు, హాజారము, గోదమొగుళ్ళు, చోరువులు, నెఱిక, పచ్చరా మొగ పుల యొడిదారము, సంబళము, కమ్మబాగాలు, తెలనాకుఁ గవిలెలు, మంజిటికావు బరణులు, మంజిడి చేలలు, కట్టాణి, చేపావడలు, వీణాము, ఒంటులు, సరపణ, గడియోఁడు త్రోవ, రుమాలు, చుంగులు, ముసనాబు, రొండు, అనుసులు, గొల్లలు, హెగ్గళ్ళు ఇటువంటి పద ములు పెక్కు గలవు. ఇట్టి మృదు మనోహరములగు మాండలిక ములు వ్యావహారికములు దేశీయములైన పదము లుపయోగించుట వలన తెనుగు కవిత కొక వినూతన వికాసము కల్పించినవాడు రఘు నాథ నాయకుడు. ఒక్క రఘునాథ నాయకుడే కాదు, తంజావూరు కవుల రచన లన్నిటిలో నీ యందమున్నది. దానికి దారిచూపిన వారు పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు మొదలగు వీరశైవ కవులు. వారి కావ్యములలో దేశీయత తొణికిసలాడుచుండును.

రఘునాథ నాయక భూపతి వెలయించిన సుప్రసిద్ధ కావ్యము లలో నింతకంటె మెచ్చుకొన తగినది వాల్మీకి చరిత్రము. వాల్మీకిని గురించి పలు గ్రంథములు పలు విధములుగా చెప్పుచున్నవి. వాల్మీకి బ్రహ్మ రేతస్సువలన జన్మించె ననియు, శాపవశమున కిరాతులం

గూఁడి దారిదోపిడి తనముచేత నుదర పోషణము గావించుకొను చుండె ననియు, సప్తమహర్షుల ప్రబోధమువలన మహామునియయ్యె ననియు, పురాణములం దున్నది. ప్రాచేతసు డనగా వాల్మీకి. ప్రచేతసః అపత్యం పుమాన్ ప్రాచేతసః. భృగువంశీయు డగు ప్రచేతసుని కుమారుడు వాల్మీకి. కిరాతాంగనను పరిణయ మయ్యెనని ఇతర గ్రంథములందు కలదు. ధర్మఖండమునందు వాల్మీకి కిరాత కులజుం డని యున్నది. అందలి కథ ననుసరించి రఘునాథ నాయక భూపతి వాల్మీకి చరిత్రమును రచించెను. ఇది మూడాశ్వాసముల గ్రంధము. మొత్తము నాలుగు వందల నలుబది నాలుగు పద్యము లున్నవి. రఘునాథ రామాయణములోని కవిత్వము చవి చూచినాడు శ్రీరామచంద్రుడు. అది సుధారస ధారకంటె నింపై కనిపించినది. రుచి మరిగిన మనస్సు

నాకథ తొల్లి యర్థ రచనా రుచి మించఁగఁ జెప్పి తట్టె వా
ల్మీకి చరిత్రమున్ నొడువు మెచ్చుగ నీ విపు డచ్యుతాత్మజా!

యని శ్రీరామచంద్రుడు మరల స్వప్నమునం దగుపించి రఘునాథ నాయకున కానతిచ్చినాడు. కవి కృతి నిర్మాణమునకు పూనుకొనినాడు. ఇందువలన వాల్మీకి చరిత్రమును రఘునాథ రామాయణము తరువాతనే రచియించి యుండునని యూహింపవలసి యున్నది. అట్లయిన రఘునాథ రామాయణ మసంపూర్తిగా నుండనేల యను తలంపు కలుగ వచ్చును. రామాయణ మొక మహాగ్రంథము. రచన ఇంత నంత తేలునదికాదు. కొన్ని సంవత్సరములు పట్టును. కావ్యమును ప్రారంభించినాడు. ప్రారంభించిన వాడను కడనెగ్గించ లేక పోవుదునా యని వాని ధైర్యము. ఆ మహాసముద్రమును తుద వరకు నీదకమునుపే మధ్య నీ పల్వలము తరించెను. "అందాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్ర కవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె" నని తిక్కనగారు వచించినట్లు రఘునాథనాయక భూపతి "అర్థ రచనా రుచి మించఁగఁ జెప్పితి" నని సంపూర్తి యైనట్లు

నుడివినాడు. రఘునాథకవి తన వాల్మీకి చరిత్రమును రఘువీరునకు సమర్పితంబుగా నొనర్చినాడు.

శ్రీవర చరణాంభోజ ర
జో వాసిత మగుచు నలరు సుకృతి నికర సం
జీవనము పావనము బద
రీవనము విముక్తి సుందరీ యౌవనమై

అని బదరీవన వర్ణనముతో కథాప్రారంభము గావించినాడు. రఘునాథ నాయకుడు తరువాతి తొమ్మిది పద్యములలో నా వన మహత్వమును వినుతించెను. ఆ వనమునందు పులులు

తమ తమ యిచ్చఁ బచ్చికలు ద్రచ్చి వెసం జను హోమధేనుసం
ఘములకు గోప బాలకుల కైవడి నేరిమి వాల వాల దం
డముల నదల్చి

మగుడం గొనితెచ్చునట

బాల రసాల సాల ముఖ పాదప రాజికిఁ బూని మానిరా
డ్వాలిక లందు సైకత ఘటంబులచే సలిలంబు

వోయుదురట. అంతేకాదు

దిన్నఁగ నఖంబుల మన్నులు గిరి గిరి యా
వాలములందు నెక్కఁగఁ బ్లవంగమ సంఘము

లు గాలువలు తీర్చునట. ఎంత చక్కని యభిప్రాయము. రఘునాథ రామాయణమునందలి భావమున కొక మెట్టెక్కువ.

గజము లుట జాంగణంబులఁ గరములఁ గొని
దినము నివ్వరి యన్నులు దెచ్చి వై

చును

అవి కపులు గోళ్ళ నొలిచి బియ్యంబు సేయు

ను. అదియు

మునుల హావిరన్న వేళకు ననువుగాఁగ

రఘునాథ నాయకుడు సర్వ స్వతంత్రుడు. ఆయన భావములు నల్లేయుండును. ఇతరుల ననుకరించుట వాని కంతగా గిట్టదు. వాని రచనలో అభిన వోత్ఫుల్ల మల్లికా కుసుమ గంధము నలవరించు కొని మంద మంద గతుల భావంపు మలయానిల పోతములు స్వైర సంచార మొనరించుచుండును. అది కావ్య లతాంగికి వెన్నెముకయై సాహిత్య రంగమున నాట్యంపు గతులకు దిట్టతన మొదవించు చుండును. భావప్రదర్శనమునకు పద విన్యాసమునకు నొక విశిష్టత సంపాదించి పెట్టును. నన్నయాది కవి పుంగవులు తపోవనములను వర్ణించిరి. సంస్కృత కావ్యములందు నట్టి వర్ణనలు గలవు. వారెవరు వర్ణించినను అడవి స్వత్త్వములు జాతి వైరమును విస్మరించి స్నేహముతో మెలంగిన వని పాడిన దానినే పాడిరి. రఘునాథ నాయకు డట్లుకాక మునులతోడి నిరంతర సాంగత్యమువలన అడవి సత్త్వములకు సజ్జన సేవాసక్తియు పరోపకార ప్రవృత్తియు నెలకొల్పి పూర్వకవులను మరపించినాడు. శ్రీకృష్ణ రాయాది రాజకవి సార్వభౌముల రచనలలో స్వతంత్ర కల్పనలు మున్నీటిలోని రత్న సంపదవలె గోచరించును. కుమార సంభవము, ఆముక్తమాల్యదలందు కవితలో కొంత పెళుసుతన మున్నది. రఘు నాథ నాయక భూపతి కవితలో మార్దవమున్నది. అది ద్రాక్షా పాకము. నోట గిల్ల నవసరములేదు. పంట నదుమ నక్కర లేదు. రసము నిరాటంకముగా జాలు వారును.

చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపైఁ
గప్పిన క్రియ విరి పొట్లము
విప్పిన గతి ఘుమ్మనం గవిత్వము సభలన్

రఘునాథ రాయల యాదర్శ మది. వాని కవితయు నట్లేయుండును. ఆదర్శమును బట్టి యధిగమనము.

వర్ణ నాంశములందు రఘునాథ నాయకుని ప్రతిభ మెచ్చు కొనతగినది. ఏ వస్తువు నైనను పౌరాణికముగాను లౌకికముగాను అనుభవమునకు తెచ్చుకొనును. చాలవరకు పూర్వకవుల మార్గము లను భావములను పరిహరించును. వినూతనత్వము నాపాదించును. వర్ణనకు కడంగును. సప్త మహర్షులు విష్ణువును దర్శింప నుద్దేశించిరి. శ్వేతద్వీపమున కరిగిరి. శ్వేతద్వీపము పాలసముద్రమునందు కలదు. దానిని కవి యారు పద్యములలో వర్ణించెను.

వ్రాలి జలంబు గ్రోలు ఘన వారిద పంక్తులలోఁ దళుక్కునం
గ్రాలు మెఱుంగుఁ దీగియలు గన్గొన నొప్పుచునుండు నందు నె
క్కాలము పీచి గర్భములఁ గమ్మఁ గమ్మఁ బుట్టునప్సరస్
స్త్రీ లన నెల్లచో ననధరీణ ధురీణ విలాస మూర్తులై

ఈ వర్ణన పౌరాణికము. పాలసముద్రమునుండి యప్సరసలు జన్మించి రనుట పురాణ ప్రసిద్ధము.

ఘన బడబాగ్ని కీలములఁ గాగి యభంగ తరంగ కైతవం
బున వెస నింగి వెన్నొరయఁ బొంగి చెలంగుపయః ప్రపూరముల్
దిన దినమున్ సమాగత నదీజల యుక్తినడంగు నంద కా
క నిమిష మట్టు లున్నను జగంబుల నొక్కట నాక్రమింపదే

ఇది లౌకికానుభవము. పాలు కాచినప్పుడు పొంగి పొరలిపోవును. కాసిని చల్లని నీరు చల్లగానే యా పొంగణగిపోవును. రఘునాథ రామాయణమునందు శ్వేతద్వీప మిరువదియేడు పద్యములలో వివిధ విధముల వర్ణింపబడినది. వాల్మీకి చరిత్రమునందు నాలుగు పద్యము లలో వర్ణింపబడినది. అందును నీ యిరు తెరంగు లగుపించును.

నీరుపాపలు గుమి గూడి నింగి కెగయ

అను పద్యము నితర పద్యములతో సరిపోల్చి చూచుకొనునది. శ్వేత ద్వీపమునందు వైకుంఠ నగరము కలదు. అది

శ్రీ భూమి నీళా విచిత్ర పాద న్యాస
ధన్యాసమాన సౌధ వ్రజంబు

లతో విరాజిలు చుండు నట. నీళ యాది గోపిక. శ్రీకృష్ణునకు పట్టంపు దేవేరి. మేనమామ కూతురు. నీళా కృష్ణులను ద్రవిడ ప్రబంధములు బహు ముఖముల వినుతించుచున్నవి.

కౌస్తుభ మణి గన్న కనకంపు బొమ్మ నా
వనధి కన్యక యురంబునఁ జెలంగ
నిలయు నీళయుఁ బాద నళినముల్ గుబ్బ చ
న్బటువులఁ జేర్చి యందముగ నొత్త

హరి యా వైకుంఠ పురమునం దుండెను. అచ్చటి వారందరు 'సార సాక్ష సార సారూప్యములను గన్నవా'రట. విష్ణుభక్తులు తమ తమ యాధిక్యతను బట్టి సాలోక్య సామీప్య సారూప్యములను పొందుదురని విశిష్టాద్వైత మతము. తనచేత విముక్తుండైన

హస్తిలోక నాథుఁ డజ్ఞాన రహితుఁడై
విష్ణు రూపుఁ డగుచు వెలుఁగు చుండె

నని భాగవతము. మహర్షులు విష్ణువును దర్శించిరి. ఆయన ఆదరాభిమానములను బొందిరి. మగిడి తమ నెలవులకు బయలుదేరిరి. దారియందు సప్త సముద్రములను కుల పర్వతములను చూచుచు గజ తీర్థమునకు వచ్చిరి. ఇచట రఘునాథ నాయక కవి పది పద్యములలో గజేంద్ర మోక్షణ కథను రచించెను. భాగవతమునందు నక్రము హూహూ నామక గంధర్వుడయి హరిని వినుతించి తన లోకంబున కరిగెననియు, గజేంద్రుడు విష్ణు సారూప్యమును పొందెననియు కలదు. ఇది వైష్ణవ మత తత్త్వమునకు తగియున్నది. గజరాజు ద్రవిడాధీశుండగు నింద్రద్యుమ్ను డనియు, కలశజుని శాపమున కరియై జన్మించెననియు, భాగవతమునందు కలదు. రఘునాథ రాయలు

హరి హస్త స్పర్శనమున
కరియును గరి భావ మెడలి గంధర్వుండై
సుర మార్గంబున తా యం
బురుహాక్షుం భక్తరక్షుఁ బొగడుచుఁ జనియెఁ.

అని మార్చెను. సప్తర్షులు గజతీర్థము వెడలి సేతువున కరుదెంచిరి. అంతటితో ప్రథమాశ్వాసము పూర్తియైనది. సేతు వర్ణనతో ద్వితీయాశ్వాస మారంభ మగును. పరిసర తీర్థము లన్నియు సక్రమముగా వర్ణింపబడినవి. రఘునాథరాయలు రామసేతు - శ్రీరంగ - విజయ రాఘవ పుర - కుంభకోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్రుడు. ఆ యా క్షేత్రముల ప్రాముఖ్యత నెరింగినవాడు. దర్శించి విమర్శించుకొనినవాడు. ఆ యనుభవ మా యా వర్ణనలం దగుపించును. మహర్షులు మధురా నగరమున కరుదెంచిరి. హేమ పుష్కరిణిచెంత నీప వనాంతరమునందు వేంచేసియున్న కర్పూరసుందర స్వామిని దర్శించిరి.

పంచశర భంగ కర్పూర పాండు రాంగ
మేరు కోదండ ధృత రమామిత్ర కాండ
నాగ వర హార కలధౌత నగ విహార
నీకు మ్రొక్కెద మభవ యనింద్య విభవ

అని వినుతించిరి. ఈ వినుతి మహర్షులది కాదు. దేవతా సందర్శనంబున పులకిత శరీరుండయి యుత్తరంగి తాంతరంగంబున భక్తి మెండుకొన తన్ను తా నెరుంగక రఘునాథ రాయ లొనరించిన వినుతి. దాని కా యంత్యప్రాసలు రచనా వైదగ్ధ్యములే సాక్ష్యములు. ఏ పాదమున కా పాదమునందు ప్రత్యేకమగు నంత్యప్రాస లుండుటచేత పద్యమును మరింత శోభామయము గావించినది. రస పరవశత్వమును పొందిన కవి చిత్త జలజమునుండి వెల్లివిరిసి వినిర్గతంబులగు భావములు పదములను, అలంకారములను తమంతట తాము కూడతీసికొని కవి లేఖని కందించును. అనుభవజ్ఞుల కిది విదితము.

రఘునాథ రాయలు వైష్ణవుడు. ఆ భక్తాగ్రేసరుడు సుందరేశ్వరుని భక్తి పరవశత్వమున నిట్లు వినుతించుటలో నా మహామహుని పరతత్త్వ జ్ఞానము ప్రకటిత మగుచున్నది. అది పరమత సహనమని కొందరు విమర్శకులు నుడివిరి. కాదు. పరమభక్తుడు తా నొక

దైవము నుపాసించును. దానిని పరతత్త్వముగా నంగీకరించును. తద్భిన్న దైవతములందు ఆ పరతత్త్వము నా యా మూర్త్యంతరము లుగా నెరుంగును. వారి నా రూపములుగానే వినుతించును. పర బ్రహ్మ స్వరూపము నెరిగినవారి స్వభావ మది. రఘునాథ రాయలు పరమ తత్త్వవేత్త. విజ్ఞాన సంపన్నుడు. విష్ణుభక్తుడు. శివుని విష్ణువుయొక్క మూర్త్యంతరముగా నెరింగి యట్లు వినుతించినాడు. పోతనగారి చిత్తవృత్తియు నిదియే. కావున శివుని ధ్యానింప రాముడై కనిపించెను. అప్పయదీక్షితులవారు లోకప్రసిద్ధుడైన పండితుడు. శివారాధన తత్పరుడు. ప్రతిదినము సాయంకాలమునందు సంధ్యా వందనాదులు ముగించుకొని మొదట శివాలయమునకుపోయి శివదర్శ నము గావించుకొనుచుండెడివాడు. అనంతరము విష్ణ్వాలయమున కరిగి విష్ణుసందర్శన మొనరించుకొను చుండెడివాడు. ఒకనా డాయన శిష్యులు కొంతెు తనమున మాటల సందర్భములో మనసు మరిపించి తప్పదారిని మొదట విష్ణ్వాలయమునకు గొనిపోయిరి. ఆ మహా పండితుడు యథారీతిగా శివ స్తవము నారంభించెను. శిష్యులకు విష్ణువు పరమశివుడుగా కనిపించినాడట. వారు నిర్ఘాంతపోయి చూచు చుండిరి. తరువాత వారు శివాలయమునకు దారితీసిరి. అచ్చట దీక్షి తులవారు విష్ణు స్తోత్ర మారంభించిరి. అచట శివుడు విష్ణువుగా దర్శన మిచ్చెను. అప్పుడు శిష్యులు తమ యజ్ఞానమునకు సిగ్గుపడిరి. తమ యపరాధమును గురువుల కెరిగించిరి. పాదములకు నమస్క రించి క్షమింప వేడుకొనిరి. బ్రహ్మ పదార్థముయొక్క తత్త్వ మెరిగి యనుభవమునకు తెచ్చుకొనినవారి చిత్తవృత్తులు విచిత్రములుగా నుండును. రఘునాథ రాయలు రాచతపసి. ఆయన మనోవ్యాపార మవగాహన మొనరించు కొనినవాడు చేమకూర వేంకటకవి. 'ప్రాగ ల్భ్యంబున విష్ణు శంభు మతముల్ పాటించి' అన్నా డా మహాకవి. మతములు పాటించుటయె కాదు. మతగ్రంథములను సమగ్రముగా పరిశోధించినాడు రఘునాథ రాయలు. కావుననే - చతుష్షష్టి లీలా వినోది యగు హాలాస్యనాథుని మహిమ భావించి

మునుల కందఁగ రాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయ మెలర్ప
వివి ధార్థములుగ ద్రావిడ సూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబులఁ దురంగంబులుగాఁ జేసి
యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి
శ్రుతి నిందకులఁ దామసుల శూలల విద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ

దట్టఁ దలఁ బెట్టి పట్టెడు పిట్టొసంగ
ముసలి యవ్వకునై మన్ను మోచె నెవ్వ
డట్టి లింగ స్వరూపున కఖిల పతికి
సోమసుందరునకు నీడు జోడు కలదె

పక్షికి మోక్ష మిడుట, జంబుకంబులను తురంగంబులుగా జేసి యమ్ముట, ముసలి యవ్వకు మన్ను మోయుట, మొదలగు విషయ ములు ప్రసంగించిన యీ పద్యము రఘునాథ రాయల ప్రాచీన దాక్షిణాత్య శైవ వాఙ్మయ పరిచయమును వివిధ విధముల ప్రక టించు చున్నది. శివుడు మోక్షప్రదుం డని ప్రశంసించుట రఘునాథ రాయలకు శివ కేశవులయెడ గల సమాన గౌరవ ప్రతిపత్తులు వెల్ల డించు చున్నది. 'సోమసుందరునకు నీడు జోడు కలదె' అన్నాడు రాజకవి. పరతత్త్వముయొక్క రూపాంతరముగా భావించినప్పు డదియు పరబ్రహ్మమే యగును. దానికి తుల్య మింకొకటియుండదు. మహాతత్త్వవేత్త రఘునాథ రాయలు కావుననే వానిని 'రాచతపసి' యంటిని. ఇట్టి పద్యరత్నములు వాల్మీకి చరిత్రలోని ద్వితీయా శ్వాసమునందు పెక్కు కలవు. అదియొక రత్నాకరము. శివ కేశవుల సమదృష్టితో నిరూపించు ఘట్టము. పిమ్మట మహర్షులు శ్రీరంగము నకు వచ్చిరి. కావేరీ జలంబులందు స్నానమాడిరి. వేద శృంగమును, ప్రణవ మయంబును నగు రంగ విమానమునకు నమస్కరించిరి.

మంచి తెమ్మెర దూది మించిన గోధుమ
వన్నె పానుపుమీద నున్నవాని
వలచే దలాడగా నిలిపి వామ కరంబుఁ
జఱుతొడపైఁ జాఁచి మెఱయువాని
దృక్కోణ ఘన ఘృణామృతము మీఱెడు లీల
నెలనవ్వు చెక్కుల గ్రోలఁకువానిఁ
దన పాద పద్మముల్ తప్పక సేవించు
నల విభీషణుఁ జూచి యలరువాని

సరస వాయక జయజయ శబ్దములను
మించు పంచాయుధములను నించువాని
రంగ తరళిత మణి భూషణాంగ విభుని
రంగవిభుఁ గాంచి

రట మహామునులు. శ్రీరంగమునందు రంగనాయకులను సందర్శించిన వారీ పద్యమును చదివినచో ఆ స్వామి మనోహరమూర్తి చిత్తనయనమునకు సాక్షాత్కరించును. ఇట్లు విష్ణువును చిత్రించిన యీ లేఖని భద్ర సభాపతి యగు నుమాపతిని నిరవధిక మగు భక్తి సుధా కల్లోలిని వెల్లివిరియ నతి మృదు మనోహరములగు నాచ్ఛిక వైకృత పద సమ్మేళనముతో

నొసలి కన్నెను మంట మసలునో పైకన
నిడుద కెంజడ గుంపు గడలు కొనఁగ
నిల నూఁదు పాదము వలగొన్న నూపురం
బొండొండ శబ్దంబు లుగ్గడింప
భక్తులఁ బిలిచి సంపద లిత్తుననుభంగి
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్క మొఱయ
మాళి చందురుఁ డాకాలి యందియఁ దోచి
నిర్ద్వంద్వ భావంబు నెరయఁజేయ

హారత్తి మై యొప్పు గంటెంబు గుత్తముగను
గదిసి రింగులు వారంగఁ గట్టి యసుర
మట్టి నాట్యంబు సలుపు నుమాధవుండు

అని వర్ణించినాడు రఘునాథ రాయలు. ఇది నటరాజస్వామి వర్ణన. ఈ శిల్పరచన ప్రశంసింప తగినది. రఘునాథ నాయక కవి నాథునకు శివుని యందు కల యపూర్వ భక్తిభావమునకు కవితావేశము తోడయినది. ఈ రూపచిత్రమును కల్పించినది. ఆ మహోదార భక్తి భావము

ఇందుశేఖరు సేవించి యెందు మాకు
భేద మెక్కడి దంచుఁ గాన్పించు లీల
నందు ఘన భోగ విభవంబు లందుచుండ
దిల్ల గోవిందరాజులఁ దేట భక్తి

కొలిచి రని నుడివించినది. శివకేశవులకు భేదము లేదట. ఇది రఘు నాథ రాయల అభిప్రాయము. కవితా రచన యొక దర్పణము. అందు కవి చిత్తవృత్తి ప్రతిబింబించు నని పాశ్చాత్య విమర్శల యభి ప్రాయము. ఆ మాట సత్యము.

సాంజలులై పతంజలి మహాముని రంజిలి చూడఁగా దెసల్
మంజుల పాదనూపురఝుళం ఝుళన ధ్వనిమ్రోయుచుండఁగాఁ
గెంజడ లాకసం బడరఁ గేవల తాండవ మాడెఁ జిత్తభూ
భంజనుఁ డెందు వేడ్క నల ధర్మసభం గని విస్మితాత్ములై

నారట సప్తమహర్షులు. ఈ పద్యము రఘునాథ రాయలకు పతంజలి యెడ గల యసమాన గౌరవమును వెల్లడించుచున్నది. పతంజలి వ్యాకరణ మహాభాష్య కర్త. రఘునాథ రాయలు భాష్యాంతము వ్యాకరణశాస్త్ర మధిగమించిన మహాపండితుడు. ఆ మహాకవి తన కావ్యములందు ధారాళముగా వాడిన శబ్దజాలము దానికి ప్రబల సాక్ష్యము. అట్టి వానికి పతంజలిమహాముని యెడ గురుభావ ముండుట సహజము. రఘునాథ రాయలు ఏ దైవతము[illegible] దే

ప్రధాన గుణము కలదో బాగుగా గుర్తించెను. దానిని చక్కగా ననుభవమునకు తెచ్చుకొనెను. ఆ మూర్తిని చిత్తవిలోకనములతో పరిశీలించెను. వర్ణనము కావించెను. శ్రీరంగపతి విభీషణునకు అభయ మొసగిన దయా సముద్రుడు. ఆయన నట్లే వర్ణించినాడు. వేంకటాచలపతి అలివేలు మంగాంబను మరులు కొలిపిన నవకోటి మదన మూర్తి. ఆ స్వామిని

మణి కిరీటంబు సంపద లేమి యనవచ్చు
నమ్మ ముత్తియపు నామమ్ము డంబు
మందహాసంబుల యందంబు హైహ సరే
సరిలేదు మెడ కంటసరికి నెందు
నుదర బంధము నొప్పు లోహహో హో మెచ్చుల
మెచ్చువో బంగారు పచ్చడంబు
కటి పసిండి కటారి కాంతి యెంతటి వింత
మంజీరముల మంజిమంబు మేలు

ఉచిత శృంగార మితనికి నొప్పుఁ జూడుఁ
డిట్టి చక్కని తండ్రి యెందేనిఁ గలఁడె
వలతు రీ వేంకటాచల వల్లభునకు
యోగి పురుషులు మదియంద యునిచి చాల

అని వినుతించినాడు రఘునాథ భూపతి. నిజమున కా చక్కనయ్య యలంకారము లట్టివి. వానినిగాంచి యోగి పురుషులే కాదు దేవతలు సైతము విముగ్ధులగుదురు. ఆ స్వామిని దర్శించిన భక్తులందరు రెప్ప వాల్పక యా మూర్తి సౌందర్యమును విలోకించి చిత్తముల హత్తికొందురు. ఆకారమును మించిన యలంకారములు. ఒకదాని నతిక్రమించి యింకొకటి యుండును. కిరీటము మొదలు మణి మంజీరముల వరకు తీగెలు సాగు చూపులతో నోరు తెరచుకొని విలోకించుచు నడుగు కదలింప లేక యాశ్చర్యమున నిలబడి కన్నుల నప్పగింతు రా స్వామికి. ఆ యాశ్చర్యరస భావ మీ పద్యరచనయందు పాఠకులకు గోచరించును. రసమును బట్టి భావములు, భావముల

ననుసరించి పద్యరచన రఘునాథ రాయల కావ్యములం దగుపిం చును. తిక్కన శ్రీనాథుల తరువాత నట్టి రచనకు రఘునాథ రాయ లనే చెప్పవలయును. ఆ రచనా భేదము వాల్మీకి చరిత్రలోని వివిధ క్షేత్ర వర్ణనలను అక్షరమైన బీరుపోనీయకుండ పాఠకుని చదివింప చేయును. శ్రీశైలమును దర్శించినారు మునులు. అందు

చుక్కలదారి యొకించుక నిక్క శిరసున
    పదినూఱు చెంగులు పాగఁ జుట్టి
తరుచు వెన్నెల లీను దళుకు నెమ్మోముపైఁ
    దొలిపల్కు లీనెడు తొడవు వెట్టి
ముద్దుల జింక మురెమ్మొనపోటు ముట్టును
    సరవితో రెండు హస్తములఁ బట్టి
పెళపెళ మను చెఱంగుల రంగు లడరెడు
    మూఁడువన్నెల పట్టు మొలనుగట్టి
కేళ్లుఱుకు ముత్తియపుఁ జాయ గిబ్బ నెక్కి
చారుతర హార శృంగార హారి యగుచు
ధారుణీధర రాజ నందయుఁ దాను
నమ్మునీంద్రుల క్రేవాలఁ బ్రత్యక్ష మయ్యె

నట. మనోహరగు వర్ణన. సంపూర్ణ రూపశిల్పము. తిక్కన శిల్ప రచనకు సరితూగు వైశద్య మిందుగలదు. చదువునప్పు డా పరమ శివమూర్తి మునుల మా టటుండ పాఠకుల మనో నయనము ముందు సాక్షాత్కరించును. మహానందమున నొడలు పులకింప 'నమఃశివాయ శిల్ప కవితా సిద్ధహస్త రఘునాథ నిర్మితాయ' అని కనులు మోడ్చి నమస్కరింపని వారుండరు. మహాకవులు శ్రీనాథాదులు శంకరుని వర్ణించిన పట్టులు పెక్కుగలవు. ఈ రచనలోని శిల్పము రూపసౌంద ర్యము వానియందు లేవనుట నిర్వివాదాంశము. ఇందలి రచనకు నొడ లుబికింప జేయు పదినూఱు చెంగుల పాగ, తొలిపల్కు లీనెడు తొడవు, మురెమ్మొనపోటు ముట్టు, పెళపెళ మను చెఱంగుల రంగు

లడ రెడు మూడువన్నెల పట్టు. మూఁడువన్నెల పట్టుట. ఎంతచక్కని పద సంపుటి! ఇటువంటి మృదు మధురములు భావగర్భితములు నగు నచ్చ తెనుగు సమాసము లా పద్య రచన కమృతము పోసినవి. ఇట్టి రసవంతములగు పద్యములు రామాయణమునందు కంటె వాల్మీకి చరిత్రయందు పెక్కు గలవు. వాల్మీకి చరిత్రము సర్వ విధముల రఘునాథ రామాయణమును మించినది. రఘునాథకవి రసప్రియుడు. అలంకారములను చొనిపించుటకంటె రసస్రుతికి తలపు మలిపించును. ఇందు స్వభావోక్తి యలంకార మున్నది.

## జననీ జన్మభూమిశ్చ

కవులకు జన్మభూమియం దాదరాభిమానములు మెండు. స్వస్థానమును తలంచుకొని నప్పుడు వారి మేను లుప్పొంగును. పులకలు నిండార కను లరమోడ్చి యానందాశ్రు కణములను జారవిడుతురు. అవకాశము లభించి నపుడు తమ కృతులలో వానికి స్థాన మొసంగుదురు. ఆ పేరు తమ కృతులతో పాటు చిరస్థాయిగా స్మరణీయములు కావలయు నని వారి తలంపు. కాళిదాసు మేఘసందేశమునందు తన జన్మస్థానమగు నుజ్జయినిని దర్శించి పొమ్మని మేఘు నర్థించెను.

> వక్రః పంథాః యదపి భవతః ప్రస్థిత స్యోత్తరాశాం
> సౌధోత్సంగ ప్రణయ విముఖో మా స్మభూ రుజ్జయిన్యాః.

అందలి ప్రకృతి సౌందర్యమును ఋతుసంహార కావ్యముగా రూపొందించినాడు.

బిల్హణుడు మహాకవి. కాశ్మీర వాసి. భారదేశమంతయు పర్యటించెను. వివిధ రాజాస్థానములను సందర్శించెను. కడకు స్వదేశము మాట గుర్తునకు వచ్చినది. వాని మనస్సాగలేదు. కాశ్మీరమునందలి కుంకుమ పూదోటలు, తెల్లని యువతుల చెక్కిలి గవను బోలు వన్నెగల ద్రాక్షా గుళుచ్ఛంబుల పందిరులు, పండితుల పఠన పాఠ యోగ్యములగు చల్లని నీడలతోడి బావుల పరిసరములు ఒకటి

వెంట నొకటి కనుల యెదుట నిలచినవి. విక్రమాంక దేవ చరిత్రము నందు వానిని పూసగ్రుచ్చినటుల వర్ణించినాడు.

నన్నయ తెనుగు కవులకు గురువు. వ్యాసుడు స్మరించె నని కాబోలు మాతృదేశముమీాది యమితాభిమానమున అర్జునుని

అనఘమై విశిష్టాగ్రహార భూయిష్ఠమై
  ధరణీసురోత్త మాధ్వర విధాన
పుణ్యా సమృద్ధమై పొలుచు వేఁగి దేశ
  విభవంబు చూచుచు

దక్షిణాంబురాశి తీర్థమునకు పయనింపఁ జేసినాడు. మాతృ దేశాభి మాన మటువంటిది.

సర్ వాల్టరు స్కాటు "విదేశ సంచార మొనరించి తిరిగి స్వదేశమున కడుగులు మరలించిన వాని చిత్త మిది నా మాతృభూమి యని యుప్పొంగనిచో వాని యాత్మ నిర్జీవమైనది. వా డెంత ధనికు డైనను ఎన్ని బిరుదులు కలవాడయినను ఉన్నతాధికార పదవియం దున్నవా డయినను దైహికముగాను ఆత్మికముగాను మరణించుచు బూడిద పాలగును. వానికొరకు విలపించువా రుండరు. పొగడు వా రుండరు" అని నుడివెను.

"దేశమంటే మట్టికాబోయి" అన్నా డొక గేయకవి. అవును అందు మాతృత్వ మంతర్భూతమయి ప్రతి యణువునందు నిమిడి యున్నది. అట్టి మాతృదేశముకొరకు ప్రాణాలపై యాశ మాని కదన రంగమున కత్తి పట్టి యరివీరుల నురుమాడినవాడు రఘునాథ రాయలు. వాని మాతృదేశ భక్తి అనన్య సాధారణము. అను క్షణము కర్ణాట తంజాపురీ రాజ్యములను కబళింప గాచుకొనియున్న తురకలకు హృదయ శల్యమై మసలినాడు. ఆ మహారాజు మాతృ దేశాభిమానము తొణికి తూగిసలాడి పొంగులుతేరి వాల్మీకి చరిత్రము నందు పొరలుకొని వచ్చినది. ఎవరు దాని నాపగలరు. ఆ మహా రాజకవి తంజాపురమును

ఏ వీట నిరవొందు నిందుశేఖరుఁ డెప్డు
బృహదీశ్వరుం డను పెంపుఁ గాంచి
యే పట్టనమునకు నేలికయా నృసిం
హ స్వామి జన కామి తార్థ భూమి
యే ప్రోలి కెలన నెప్డెలరారు నీల మే
ఘ శ్యాముఁ డిందిరా కాముకుండు
నే నగరమున నిర్హేతుక దయఁ బ్రోచు
నతకల్పవల్లి యానందవల్లి

యెచట విలసిల్లుఁ దగ సుందరేశ్వరుండు
ప్రాంత కాంత కవేర కన్యాంబు ధన్య
వివిధ సస్య ప్రశస్యమై వెలయుచుండు
నట్టి తంజాపురంబున కరిగి వేడ్క

మును లందలి విభవంబుల వీక్షించి రని వర్ణించెను. రఘునాథ రాయల జన్మభూమి తంజాపురము. అది ఆయన రాజ్యమునకు ప్రధాన నగరము. దాని యభివృద్ధికొరకా మహారాజు మిగుల పాటుపడెను. త న్నగరాభిమాన మాయనను కృతిలోనికి నెక్కింప జేసినది.

రఘునాథ రాయలకు శ్రీనాథునందు గురుత్వము కలదు. శ్రీనాథుడు సీసపద్య రచనయందు అందెవేసిన చేయి. ఆయన పోకడలు తరువాతి కవుల కావ్యములందు మిక్కుటముగా కనిపించును. రఘునాథ నాయక భూపతి వాల్మీకి చరిత్రమునం దా నడక లెల్లెడల కనిపించును. అట్టివానిలో పై పద్య మొక మచ్చుతునక

ఏ పట్టనము ప్రోల నేలేరు ప్రవహించుఁ
బృథివికి ముత్యాల పేరు వోలె

ఇత్యాది శ్రీనాథుని పద్యము లరయ వచ్చును. మహర్షులు కాశిని దర్శించిరి. ఈ సందర్భమున కవి

ప్రతివీధి సంచర త్పార్వతీ చరణాంబు
జాత నూపుర ఝుళం ఝుళ రవంబు
విశ్వనాథ విహార వృషభరా జాకుంఠ
కంఠ ఘంటా ఘణం ఘణ నినదము
పటహ రవ దభంగ భాగీరథీ భంగ
సంఘు ఘుమం ఘుమ స్వన భరంబు
రక్షాధికార భైరవ భుజా స్తంభ గం
భీర ఢక్కా ఢం ఢ మారవంబు

సరవి నెచ్చోట మోక్షంబుఁ జాటు సిరుల
కాపురం బగు నా కాశికా పురంబు

అని వర్ణించెను. శివ క్షేత్రముల పేరెత్తినను పార్వతీ పరమేశ్వరు లను దలంచినను శ్రీనాథున కొడ లుప్పొంగును. భక్తిరసము వెల్లి గొనును. అభంగ గంగా తరంగ సంఘము లట్లు భావములు మిన్నంటి ప్రవహించును. పదములు రస ప్లావితములయి నేను నే నని పుంఖాను పుంఖములుగా బయల్వెడలును. పద్యముల వెంట పద్యము లమిత వేగముతో సాగిపోవును. వానిని చదువు నప్పుడు పాఠకుల చిత్త మొక పరమాణువయి ఆ వెల్లింబడి పరుగులు వారును. ఆ రసవత్కవితా వేగ మటువంటిది. అందును కాశిని వర్ణించు పట్టున శ్రీనాథుని యొడ లమితావేశము నొందినది. దానిని చదువు నప్పుడు పాఠకులకు పులకాంకురములు పొడమును. రఘునాథ రాయలు శివక్షేత్రములను శివుని వర్ణించు పద్యములందు నావైలక్ష్య మున్నది. శ్రీనాథుని కవితలోని యావేగము లేదు కాని మృదుత్వ మాధుర్యము లున్నవి. దానికి కారణము భాషాతారతమ్యము. శ్రీ నాథుని శయ్య సంస్కృత సమాస సంఘటితము. గంగా తరంగిణి వలె నొడ్లు నొరసుకొని పొరలి ప్రవహించును. ఆ కవిసార్వభౌముడు కాశీఖండము భీమఖండములందు వివిధ క్షేత్రములను వర్ణించెను. ఒక దానిని వర్ణించినటుల నింకొక దానిని వర్ణించలేదు. వానియందు

పెక్కు సీసపద్యము లున్నవి. ఒకదాని పోకడ యింకొకదానికి లేదు. దేనికదే క్రొత్తదారి త్రొక్కినది. అనుభవజ్ఞులగు కవుల కది విదితము. రఘునాథ రాయ లా రచనలోని విశిష్టత హృదయగతము గావించుకొనినాడు. ఒక క్షేత్రమును వర్ణించినటు లింకొక క్షేత్రమును వర్ణింపలేదు. ఒక సీసపద్యపు నడక యింకొక దానిలో పొడమ సీయలేదు. వాల్మీకి చరిత్రయందు మూడువంతులు వర్ణనాంశములు కలవు. వినూతనములగు భావములతోపాటు క్రొత్త దారుల ననుకరించిన సీసపద్యముల పోకడలు పాఠకుని నొక పాదమయిన విడిచిపుచ్చ నీయకుండ చదివించును. పై పద్యమును చదువునప్పుడు కాశీ నగర వీథులందు నిరంతరము సంచార మొనరించుచుండు పార్వతి పాద మంజీర శింజా రవము నందీశ్వరుని కంఠమునందలి గంటల గలంగల నినాదము గంగా భంగముల ఘుమంఘుమధ్వానము ఢక్కా ఢమం ఢమ స్వన మొక్కుమ్మడి చెవుల సోకి మే నుబికింప చేయును. ఇది శైవ సంరంభము. వేసవి యాసన్నమయినది.

అట్టి వేసవి బెడిదంపు వెట్ట కతన
నేల నందంద విరిసిన నెఱియలందుఁ
ధరణి పాదంబు లెడ నెడఁ దవుల మెల్లఁ
దివిచికొని పోవ దివసంబు దీర్ఘమయ్యె

నట. ఎంత చక్కని భావకల్పన. అవును. నెరియలందు దిగపడిన పాదములు దిగిచికొనుట కాలస్యము పట్టును. పాదములమీద శ్లేష. మునులు పయనించుచు పోయిరి. ఒక భయంకరం బగు వనమునందు ప్రవేశించిరి. ఆ వనములో

తోరణంబులుగ వీథుల నారఁ గట్టిన
యుప్పుఁ గండలకు నొండొండఁ దిరుగు
పులుగుల ఱెక్క గాడ్పులఁ జాల నెగసెడు
పసరంపుఁ బొలకంపు ముసురు గొనఁగఁ

బసివట్టి నలుగడఁ బఱచిన మేకముల
పచ్చి తోళ్ళను బండ్లఁ గ్రుచ్చి పెఱుక
బలు జాగిలంబుల భౌభౌ రవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి

పరువులిడు సూర పందుల మఱికి గవులు
చేఁప తట్టల గదురుతోఁ బెనసి చుట్టఁ
గూఁత వెట్టిన జనుల వాకొలుపఁ జేయ
భయము గొల్పెడు నొక బోయపల్లె గాంచి

నారు మునులు. ఇందు బీభత్సరసము ప్రదర్శింపఁ బడినది. అందుండి యొక బోయ వారిపైఁ గదియ నేతెంచెను. వారిని బలు విధముల బాధించెను. వారు

ఓరోరి నీవు చేసిన
ఘోరపుఁ బాపములు నీవుఁ గొడుకులు నాలుం
జేరఁబడి పంచుకొందురొ
వారికిఁ బనిలేక నీక వచ్చునొ చెపుమా

అని బోయని ప్రశ్నించిరి. మునుల సందర్శనమున వానికి జ్ఞానము పొడమినది. ఆ బోయ పల్లె కరిగెను. మును లడిగిన ప్రశ్నమును భార్య బిడ్డల నడిగెను. వారు మాకేమి పట్టినది పాపమును పంచుకొనుట కనిరి. బోయకు వారియందు విరక్తి పొడమినది. తిరిగి వచ్చినాడు. మునులు వానికి రామనామ మంత్ర ముపదేశించినారు. తమసానదీ తీరమున కూర్చుండి తపము ప్రారంభించినాడు బోయ వాడు. రఘునాథ నాయకుడు వర్ణనాంశములం దెంత ఘటికుడో కథను రసవంతముగా నడిపించుటయందు కూడ అంత ఘటికుడై పై కథాభాగమును చక్కగా ప్రదర్శించినాడు. ఆ బోయవాడు

నుదుట జేగురు బొట్టు పదనింకఁ గాదని
తులసి మృత్తిక నూర్ధ్వ తిలక మిడియె

నట. చేయునది రామనామ మంత్రజపము. రాముడు విష్ణువు. బోయవాడు విష్ణు భక్తు డయినాడు. కావున వైష్ణవ ఆచారమును రఘునాథ నాయక కవి బోయవాని కలవరించినాడు. కవి వైష్ణవుడు. వైష్ణవ సంప్రదాయమును బోయని కలవరించుటలో నాశ్చర్యము లేదు. తులసి విష్ణువునకు ప్రీతికరమైనది. వైష్ణవులు తులసీ మూలము నందలి మృత్తికతో నూర్ధ్వపుండ్రములు ధరింతురు. బోయవాడు నట్లే కావించెను. 'వాని కలవారెల్లరు' వెదకుచు వచ్చి బోయనిం గాంచిరి. వారు

పచ్చి కస్తురి బొట్టు పస మీఱు నెన్నొసల్
సుద్ద రేకల చుక్క దిద్దంబడెనె

యని తలంచిరి, సుద్ద శ్వేతమృత్తిక. దానితో వైష్ణవులునామములను ధరింతురు. అది రేకల చుక్కయట. చక్కని కల్పిత పదము. ఇచట చుక్కకు బొట్టనియే యర్థము. ఇట్లే 'వాని కలవారు' అను పదము. రఘునాథ రాయల స్వకల్పిత పదములను రామాయణ వాల్మీకి చరిత్రములందు పెక్కు వాడెను. ఆయన విద్వత్కవి. విద్వత్కవులు సర్వ సమర్థులు. ప్రాత శబ్దములు నమలి వేసిన తమ్మ పిప్పిలు. క్రొత్త పదములను నిర్మింతురు. అసమర్థులు వానిని తప్పుగా భావింతురు. బోయని చుట్టపక్కములు వానిని గురించి పలువిధముల దలంచిరి. ఆ పద్యములు చదువు నప్పుడు ధూర్జటి రచించిన కాళహస్తిమాహాత్మ్యములో తిన్నని వెదుక వచ్చిన బోయల మాటలు గుర్తునకు వచ్చును. మచ్చునకు రెండు పద్యములు

నట్టడవిం జట్టుకోడుకై
కట్టెదుటన్ మనము నిలువంగాం జూడండు తా
నట్టటు బొంపన దయ్యము
పట్టెనొ యీ రావినుండి బాపురె వీనిన్

నవ్వు పుట్టించు భావము. ఇందు చక్కని యభిప్రాయ మంతర్లీనమయి యున్నది. బ్రహ్మరాక్షసులు రావిచెట్ల నాశ్రయించియుందురు.

వారు వేదవిప్రులు. కావుననే బాఁపన దయ్యమని వాడినాడు కవి. దయ్యము పట్టిన వానికి దయ్యము గుణములు సంక్రమించును. ఇది బాఁపన దయ్యము కావున జప తపాదులగు బ్రాహ్మణ గుణములు వీని కొదవిన వని యనుకొనిరి. 'చట్టుకొడుకై' ఎంత చక్కనిపదము. మగ రాతిబొమ్మ యను భావములో నిది వాడబడినది. రాతిబొమ్మకు సంచలన ముండదు. కావున 'చూడఁడు తా నిట్టటు' అనుకొనినారు. ఇంకొక పద్యము.

కానకు నేఁగి వింత రుచి గల్గిన పిట్టలుఁ జెట్టు జున్నులున్
దేనెలు చారపప్పులును దెచ్చుఁగదా యిఁక నంచుగూళ్లలోఁ
గూనలు వోని నీ కొడుకుఁగుఱ్ఱలు నీ చనుదెంచు త్రోవఁజూ
పానఁగ నిల్తు రయ్యెడలు హోమముఁబోంట్లకుఁ జూడవచ్చునే.

రఘునాథ రామాయణములోని కవిత్వమునకును వాల్మీకి చరిత్రము లోని కవితకును చాల తారతమ్యము కలదు. ఇది సాపు తేలిన కవిత్వము

కులుకు గుబ్బలతోనె కురువింద పేరులు
గనియుచుఁ బెనఁగొని గొల్లిఁ జూప
దంతంపుఁ గమ్మల తళుకులు పలచని
చెక్కుటద్దంబులఁ జికిలిసేయఁ
బగడల రతనాలు బవిరుల పికిలి పూ
దండ కొండొండఁ గైదండ యొసఁగఁ
గదలుఁ గొప్పునఁ జుట్టుఁ జెదరి పారెడు మల్లె
మొగ్గలు తెలి నిగ్గు ముగ్గు లిడఁగ

నడవి దడవిల్లుఁ గైకొని యమ్ముఁ దొడిగి
పొంచి పై వంచి నిను రెచ్చరించి మంచి
మెకముఁ బడనేసి నిచ్చలు మెచ్చఁజేయు
నట్టి నాయకురాలిఁ బాయంగఁ దగునె

ఇది నాయకురాలగు చెంచెత వర్ణన

నును ముత్తియపుఁ దీవపని కుట్టు కనుపట్టు
పట్టు చనకట్టు సంభ్రమముఁ జూప
నిండు చందురు కావి నెరికెచే రంగారు
కడవన్నె బంగారు కాసె యెసఁగ
వలిచుట్టి పూదండ వెలిచుట్టు గన నొప్పు
కప్పు చిప్పిలు సాము కొప్పు దనర
ఝుళ ఝుళం ఝుళ నాద హాళ హాళితం బైన
బిరుదు వజ్రపు జల్లి పెండె మమర

మాటికిని మ్రోల జయడిండిమంబు మొరయ
రయము భయమును నయమును బ్రియము నమర
నమరవల్లభు కొలువున కరుగుదెంచె
రంభ సన్నుత నాట్య సంరంభ యగుచు

ఇది రంభ వర్ణనము. ఈ రెండు పద్యములందలి శిల్పరచన నిండిక
కలిగి మిగుల సహజముగాను మనోహరముగా నున్నది. చిత్రము
నందు వలె రూపములు కనుల యెదుట దోచును. ఇంక

వలరాజు మదదంతి తల మాళిగ యనంగఁ
గలికి చన్నులఁ బట్టుకంచె లలర
రతిచేతి జీని సురఁటి యూని దిది యనంగఁ
గళుక బంగరు వ్రాత కాసె మెఱయ
శృంగార ఫణి ఫణా భంగిఁ దాయెతు చుట్ల
గప్పు మీరెడు సాము కొప్పు దనర
నంఘ్రి పద్మము చుట్టు నతి వలయంబుగా
నీలాల సరపణాల్ నీటు సూపఁ

బసిడి తీఁగెకు నార్చిన పటిక వోలెఁ
జిటులు గందంబు నెమ్మేన జిగి తొలంక
నృత్త వేషంబు మిక్కిలి బిత్తరింప
వచ్చె నూర్వశి సకియ లిర్వంకఁ గొలువ.

ఇది యూర్వశీ వర్ణనము. అలంకార సహితము. అయినను రూప చిత్రము కనులకు కట్టినటుల కనిపించును. ఈ మూడు రూపచిత్రము లందు చక్కని నాజూకుతనము కలదు. ఒక్క రూపములందే కాదు పదములందును ఆ నాజూకుతన మున్నది. రచనయందు భావప్రదర్శన మునందు మనోహరత్వ మున్నది. రఘునాథ రామాయణములో రోమపాదుని వేశ్యలు దర్శింప వచ్చిరి. వారిని

బిగువు చన్గవ మీాటు వగలెల్లఁ గనిపించు
నజాజూఱు పయ్యెద లంద మొంద

అను పద్యముచేత వర్ణించినాడు రఘునాథ రాయలు.

సరిగ చిత్రపుఁ గుట్లు సరిలేని ముత్యాల
బవిరి చౌకట్లులు పరిఢవిల్ల

ఇత్యాదిక మగు పద్యములచేత దశరథ మహీపాలు నెదుట యాగ శాలయందు నాట్యమాడిన వేశ్యలను వర్ణించినాడు. ఈ పద్యము లందలి రూప కల్పన అంత పరిస్ఫుటముగాను నిండుగాను లేదు. కొంత మోటుతనము కనిపించును. ఈ సంగతి శిల్ప కవితా పరిజ్ఞానము కల కవులకు విశదము. పదముల కూర్పునందు వాల్మీకిచరిత్రము లోని పద్యములందలి సరళత రమణీయత రఘునాథ రామాయణమునందలి పద్యములం దంతగా నగుపించదు. నాగరి కాంగనకు పల్లె పడుచునకు గల తారతమ్యమును బోలిన భేద మా రచనలందు కలదు. ఈ తారతమ్యము వర్ణనాంశమునందే కాక కథా కథన సంవిధానమునందును గోచరించును. వాల్మీకి చరిత్రములోని కవిత్వము సర్వవిధముల బరిపూర్ణత్వమును బొంది పాఠకుని చిత్తమున కాహ్లాదము కలిగించును. రఘునాథ రామాయణములోని కవిత అందందు కుంటుతనము కలదయి మనస్సు నొక్కొక్కప్పుడు కుంచించును. రఘునాథ రామాయణము చదివి, పిమ్మట వాల్మీకి చరిత్రమును పఠించి, తిరిగి రఘునాథ రామాయణము చదివి చూచిన కవిత్వ తత్త్వజ్ఞుల కీ విషయ మవగాహనము కాగలదు. రఘునాథ

A 8

నాయకుడు భూపతియు, పండితుడును, కవి, సంగీత నాట్య కళాపారం గతుడు మాత్రమే కాదు, ఉపాసనా కాండ యంతయు పరిపూర్ణ ముగా చదివినవాడు. ఆచరణలో పెట్టి అనుభవమునకు తెచ్చుకొనిన రాచతపసి. శ్రీరామభక్తుడు. బోయరేడు

సరసిజాకరముల నరసి పద్మాక్షముల్
　　పరిపక్వముగ నేరుపఱచి తెచ్చి
పురుష యోగ్యములైన పూసలు పరికించి
　　ముఖములు ముఖముల మొనయఁ జేసి
పర భాగములతో నపర భాగము లుంచి
　　నడుమ మేరువుగ రెండిడి యమర్చి
యంతరంబున గ్రంథు లమర సూత్రంబున
　　నూట యెన్మిదియుఁ బొందుపడఁ గ్రుచ్చి

అక్ష సరము గావించినాడట. ఈ మాలికా కరణ విధానము తెలిసిన వారు చాల అరుదు. అందును పురుష యోగ్యములైన పూసలుండు నని యెరిగినవారు నూటికి కోటికి కొక్కండయిన నుందురని నేను తలం పను. రఘునాథరాయల పరిజ్ఞాన మీ విషయమున మెచ్చుకొనదగినది. ఆ యక్షసరమును త్రిప్పుచు "మరా మరా" యని జప మొనరించి నాడు నిరంతరముగా బోయరాజు. అది "రామ రామ"యైనది.

ఆ రామ నామ జపానుభావంబున
　　నంతర్ముఖతఁ జూడ నల్ల నల్ల
నల్లని మొగు లొండు నానాఁటఁ గనుపించె
　　నదియుఁ గోదండ కాండాంకిత మగు
సగుణ భావము నొందె సగుణ భావం బెల్ల
　　రూపింప నిర్గుణ రూప మగుచుఁ
గోటి రవి చంద్ర తేజమై కొమరు మిగిలె
నట్టి తేజంబునందును నంతరంగ
మిట్టటు చలింపనీయక గట్టిగాఁగఁ
బూదె కఱగిన గతి నేకముగ ఘటించె

అత్తేజంబున నెంతయుఁ
జిత్త మలయ నంతఁ గాయ సిద్ధి మెఱయఁగా
హృత్తామరసమె సూచుచు
నుత్తమ యోగులు నుతింప నుండె నచలుఁడై

ఇంతటితో ద్వితీయాశ్వాసము పూర్తియగును. ఈ వర్ణన కొంత వరకు రఘునాథ రాయల స్వానుభవమై యుండవచ్చును. ఉపాసనా పరులకు పై విషయములు విదితము లగును.

రఘునాథ రాయలు తారక మంత్రోపాసన పరుడు. తిరుమల తాతాచార్యులవారి శిష్యుడు. సగుణము నిర్గుణోపాసనకు మొదటి మెట్టు. బ్రహ్మపదార్థము నిర్గుణము. అది అనంతము తేజోమయము. ఉపాసకుడు మంత్ర దేవతను కనులం దుంచుకొని నిమీలిత నయనుం డయి జప మాచరించును. వాని కాదియం దా రూపము పరిస్ఫుట ముగా నిలువదు. రాముడు నీలమేఘ శ్యాముడు. కావున నల్లని మొగులుగా నగుపించినాడు. నానాట మతి స్థిరత్వము కుదిరినది బోయకు. అందుండి కోదండాంకితమగు సగుణరూపము శ్రీరాము డగుపించినాడు. దాని యందు బుద్ధి నిలిపి ధ్యానించినాడు బోయ. అది కోటి రవి చంద్ర తేజమయి నిర్గుణ రూపముగా మారినది. వైష్ణవము పరతత్త్వమును సగుణముగా నంగీకరించినది. కావున దాని కొక రూపము కలదు. అది గీతలో పదునొకొండవ అధ్యాయము నందు వర్ణింపబడినది. అద్వైతులు నిర్గుణత్వము నంగీకరింతురు. అది శంకరుని మతము. రఘునాథ రాయలు అద్వైత మతము నంగీకరిం చిన వైష్ణవుడు. కావున సగుణము నిర్గుణముగా మారిన దని నుడి వెను. 'పొడుంకాయ మీద దశావతారాలని చెళ్ళపెళ్ళ వేంకట శాస్త్రిగా'రని నట్లు వాల్మీకి చరిత్ర చిన్న ప్రబంధ మయినను నవ రసము లిందు పొందుపరుపబడినవి. రఘునాథరాయల గ్రంథము లన్నిటిలో నిది యుత్తమమయినది. ఇందు కవిత కోటి కెక్కినది.

బోయ రేని తప మభివర్ణించుటతో తృతీయాశ్వాస మారంభ మయినది. తపోగ్ని ముల్లోకములను కలంచినది. ఇంద్రుడు భయపడి

నాడు. నారదునివలన వనచర వల్లభుం డొకడు రఘువర వల్లభుని గురించి తపము చేయుచున్నాడని తెలిసికొనినాడు. రంభను ఊర్వశిని తన కొలువునకు పిలిపించినాడు. వారిరువుర వివాదము లీ పట్టునందు రఘునాథరాయ లతి రమణీయముగా ప్రదర్శించెను. ఇది యా రాజకవి కల్పన. ఇదే కాదు ఈ యాశ్వాసములోని కథయంతయు కల్పితమే. ఊర్వశి యన్న మాట లివి

శివుఁ డొక్క నాఁడు దేశికి మెచ్చి నాకిచ్చెఁ
    బెద్ద వజ్రపుఁ గుచ్చు బిరుదు రవిక
నా తండ్రి హరి యభినయము మేలని యిచ్చె
    హరినీలముల కడియాల జోడు
చతురాననుఁడు సరస్వతియు గానము మెచ్చి
    యొసఁగి రంచల యంచుఁ బసిఁడి కాసె
విత్తాధిపతి తాళ విజ్ఞాన మరసి ప్రే
    మఁ జెలంగి యుభయ చామరము లిచ్చె

నెన్నియేనియుఁ గల వవి యెన్ని చూడఁ
బెట్టెఁ బెట్టెఁడు బిరుదులు గట్టిపెట్టి
యున్నయవి వానినేఁ జూడ నొక్క నాఁడు
బిరుదు లేటికి విద్యయే బిరుదు గాదొ

ఇందలి పదముల లాలిత్యము ధారాశుద్ధి యట్లుండ పద్యంపుఁ బోకడ మెచ్చుకొన తగినది. అచ్చముగా నూర్వశి రంభ మీాది యక్కసు పట్టలేక తన ఘనతను ప్రకటించుకొను చున్నటులనే యున్నది. ఊర్వశి యసూయ అహంభావము కోపము ముప్పిరులు గొని యా యా వాక్యములందు వెలికి యుబికిసలాడు చున్నవి. అవును, ఆరితేరిన కవిత కిదియొక తార్కాణము. రవిక ఇది దేశీయ మగు వ్యావహారికము. కాసె నడుమునకు బిగించుకొను ఉత్తరీయము వంటి వస్త్రము. దానిని కాసెకోక యందురు. రఘునాథ రాయ లీ పదమును చాల చోటులందు వాడెను. రాజుల కొలువునకు వచ్చు స్త్రీ పురుషులు

కాసెకోకను నడుమున బిగించుకొందురు. ఇది యాచారము. అల్లసాని పెద్దన మను చరిత్రమునందు 'కాసె కొంగున వారించి గడపఁగలరు' అని వాడినాడు. ఆ పట్టున వాడిన కాసెకు గూడ ఇదే యర్థము. వ్యాఖ్యాతలు వెనుకకు దోపుకొను చీర చెంగని వ్రాయుట విచారణీయాంశము. బిరుదు లేటికి విద్యయే బిరుదు కాదొ అన్నది యూర్వశి. రఘునాథ రాయల యంతరంగములోని యభిప్రాయము. భావగర్భితమయిన చక్కని వాక్యమును బంగారు టుంగరములో వజ్రము వలె నీ పద్యమునందు పొదిగినాడు మహారాజకవి. ఆశ్రయించిన యపండితులైనను బిరుదులు, పదవులు సంపాదింపవచ్చును. అవి నిరర్థకములు. విద్యయే ప్రధాన బిరుదము. "విద్వాన్ సర్వత్ర పూజితః" అని రఘునాథ రాయల భావము. ఆ మహారాజునకు బిరుదుల యెడగల యనాదర భావ మిందు వ్యక్తమగు చున్నది.

తారతమ్య మెఱుంగని వారి వద్ద
నుండు కంటెను నడవులఁ గొండలందు
నాకు లలములు దిని యల్ల హరుని నైన
మురహరుని నైనఁ గొల్చుట ముఖ్య వృత్తి

అని నిర్మొఖమోటముగా నన్నది యూర్వశి. ఈ పద్య మొక నిలువుటద్దము. ఇందు రఘునాథ రాయల ఆంతరంగిక ప్రవృత్తి ప్రతిబింబించుచున్నది. రాజు పాండిత్య ప్రకర్ష నెరిగి పండితులను సన్మానింపవలయును. శివ కేశవులందు అభేద బుద్ధికలిగి యుండవలయును. రఘునాథ రాయల కీ రెండు గుణములు గలవు. మధురవాణి రఘునాథ రామాయణము సంస్కృతీకరించిన కవయిత్రి. ఉభయ భాషల యందు కావ్యరచన చేయఁగలదు. ఆమె వైదుష్యము రసవత్కవితా రచన గుర్తించి రఘునాథ రాయలు తన కొలువునందు కనకాభిషేకము చేయించినాడు. చేమకూర వేంకటరాజు కృష్ణాధ్వరి మొదలగువారిని ధన వస్తు వాహనాంబ రాదికములతో సరిపెట్టినాడు. చేమకూర వేంకటరాజు

ఎందును విద్యలే యెఱుఁగ రెవ్వ రెఱింగినఁ గొంత మాత్రమే
యందును సాహితీ రస మహత్త్వ మెఱుంగ రెఱింగి రేని యా
యంద మెఱుంగ లే రెఱిఁగి నప్పటికిన్ విని మెచ్చి యీయ రె
న్నందగు నచ్యుతేంద్ర రఘునాథ విభుండె ప్రవీణుఁ డన్నిటన్

అని యొప్పుకొనినాడు. రఘునాథుని గుణ గణములు చక్కగా నెఱింగిన వా డాకవి.

తిరుపతి వేంకటకవులు విజయనగర సంస్థానాధిపతులగు ఆనంద గజపతి మహారాజుతో నిట్లే మొర పెట్టుకొనిరి. పాండిత్య తారతమ్య పరిజ్ఞానము లేకపోవుట రాజుల కొక లోపము. తిరుపతికవు లీ విషయమును "పండితాపండితులైన వారల సభాస్థలి నీవలెఁ బూజసేయు రా జుండెనె" యని గద్వాల ప్రభువును పరిహసించినారు. పై పద్యమునందు రఘునాథ రాయలు తారతమ్య మెఱుంగనివారి వద్ద అని వాడెను. వద్ద తప్పనియు ఒద్ద అని యుండవలయుననియు నా మిత్రులు కొంద రభిప్రాయపడిరి. ఒద్ద వ్యావహారికమందు వద్ద అయినది. మహాపండిత కవులే దీనిని వాడిరి. దేశభాష యొక ప్రవాహము వంటిది. "ప్రవాహినీ దేశ్యా" అని నన్నయగారు. అందు నూతన శబ్దములు వచ్చి చేరును. కొన్ని శబ్దములు కాలగతిని అర్థ రూపములు మారుచుండును. వానిని విద్వాంసులు వాడుచుందురు. వానిని యొప్పులుగా పరిగ్రహింపవలయును. "ఆర్య వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" లని చిన్నయసూరి. రఘునాథ రాయలు మహాపండితుడు కవి. సరపణాలు, రవిణె ఇత్యాది వ్యవహార సిద్ధంబులగు పదములు తన కావ్యములందు పెక్కు వాడెను. అట్టిదే 'వద్ద' యను పదము. బోయ రేని తపమును భంగము గావించుకొని వచ్చిన వారు మీలో ఘనులని నిర్ణయించినా డింద్రుడు. బయలుదేరినారు రంభోర్వసులు బోయరాజు తపోవనమునకు సముచిత పరివార సామగ్రులతో. వీరి పయనంపు హాళాహాళి రఘునాథ రామాయణములోని వేశ్యలు విభండక మౌని యాశ్రమమున కరుగు నార్భాటమును బోలి యుండును. కవి పదిరెండు పద్యములలో దీనిని వర్ణించెను. ఈ

పట్టున దాదాపు పిరువది యైదు పద్యములు వ్రాయబడినవి. వీనిని చదివినవారు బోయవిభుని యాశ్రమమునందు కవి రంభాదుల యాటపాటలు నాట్యములు నెంతగా వర్ణించునో యని యువ్విళులూరుదురు. కాని యీ సందర్భమున కథ తేల్చివేసినాడు రఘునాథ రాయలు. అది యొక లోపముగా దోచును. అచట రంభోర్వసుల ఆటలు సాగలేదు. వారు దేవలోకమున కరిగిరి. బోయరాజు తపము నిరంతరముగా సాగినది. వాని చుట్టు పొదలు పుట్టలు పెరిగినవి. కొంత కాలమునకు సప్తమహర్షులు మరల నటకు వచ్చిరి. వనచరవల్లభుడు పుట్టలను చించుకొని బైటికి వచ్చెను. సప్తమహర్షులను దర్శించి నుతించెను. అప్పటినుండి వనేచరుడు వాల్మీకి యయ్యెను. వాల్మీకి తపము వర్ధిల్లినది. శ్రీరాముడు ప్రత్యక్షమయినాడు. తన కథను వ్రాయమని యాన తిచ్చినాడు. రామాయణమునందు వాల్మీకిని బ్రహ్మదేవుడు ప్రోత్సహించినటులున్నది. ఇది వినూతము. నిరంకుశాః కవయః.

కవితా మాధుర్యముతోడి కథామాధుర్యము పొత్తుకలిసి నప్పుడు కావ్యము హృదయరంజకముగా నుండును. వాల్మీకి చరిత్రమునందు కథ స్వల్పము. కావ్యానుకూలముగా రఘునాథ రాయలు పెంచి వివిధ వర్ణనలు చేర్చినాడు. ఇతివృత్తమును వర్ణనలు మరుగుపరచినవి. కథకు ప్రాధాన్యము తగ్గిపోయినది. వాల్మీకి చరిత్రమందు అదియొక లోపముగా కనిపించును.

# 3

## కవితా గోష్ఠి

రఘునాథనాయక మహారాజు కవి పండితుడు. పెక్కుమంది కవులకు పండితులకు నాశ్రయమిచ్చెను. సత్కరించెను. పోషించెను. ఆ మహారాజు నాదరాభిమానములను పొంది తెనుగుభాష దక్షిణ దేశమునందు నలుముఖములను వ్యాపించినది. అనాంధ్రులు సయితము తెనుగుభాష నభ్యసించి కావ్యములు రచించిరి. ఆయన ఆస్థాన విద్వాంసులలో సంస్కృత తమిళ కన్నడ భాషా కవులుకూడ కలరు. అందరిలో మిగుల పేరుపొందినవాడు చేమకూర వేంకటకవి. తరువాతి వాడు కృష్ణాధ్వరి. ఈయన యధ్వరము చేయుటచేతనే యీ పేరు వచ్చియుండవచ్చును. ఈ కవి నైషధ పారిజాతీయము అను శ్లేష కావ్యమును రచించెను. దానిని రఘునాథనాయక భూపాలున కంకిత మొసంగెను. ఈ గ్రంథము తంజావూరు సరస్వతీ మహాలు పుస్తక భాండాగారమున నున్నది. ఇంకను ముద్రింపబడలేదు. రఘునాథ రాయల ఆస్థానమునందు కవయిత్రులు విదుషీమణులు కూడ కలరు. స్త్రీలకు కొలువుకూటమున స్థానము కల్పించిన మహారాజులలో మొదటివాడు రఘునాథ నాయకుడు. వారిలో పేర్కొన తగినవారు రామభద్రాంబ మధురవాణులు. వీరు కులముచేత వేశ్యలు. సంస్కృత ప్రాకృతాంధ్ర భాషలయం దనర్గళముగా కవిత్వము చెప్పగలరు. ఆశు కవిత చెప్పుట యందును సమస్యలు పూర్తిచేయుటయందు నారి తేరిన దిట్టలు. రఘునాథాభ్యుదయ యక్షగానమునందు వీరినిగురించి ప్రశంసింపబడినది.

రఘునాథ నాయనివారి మాట వింటిరా కవులారా! ఈ పడుచు లాంధ్ర గీర్వాణ ప్రాకృత సమస్యలు పూరింపఁ గోరుచున్నారు, వీరినిఁ బరీక్షింపరయ్యా

అన విని యమ్మహారాజుతోఁ గవిరాజు లేమనుచున్నారు. అయ్యయ్యా! స్వామి! నగర లక్ష్మి సరస్వతులు సాక్షాత్కరించి యుండఁగాఁ బరీక్ష యేలయ్యా! అయినను మీ రానతిచ్చిన మీాజ రాదుగద. ఈ కమలాస్యలకు సమస్య లిచ్చేమయ్యా

అని సమస్యలు ఇచ్చిరఁట. ఎటువలెను.

సమస్య.—"రారాజని యచ్యుతేంద్రు రఘునాథ నృపా"

ఔరా! రామభద్రమ్మవారు ఆ సమస్య పూరించి చదివిరఁట. ఎటువలెను

ఏరీ నీ సరి రాజులు
భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ!
స్వారాజని రేరా జని
రారా జని యచ్యుతేంద్రు రఘునాథ నృపా!

ఔరా! ఈ పద్యంబు విని యాంధ్ర కవితా నిర్వాహణంబునకు మెచ్చి గీర్వాణ భాషను సమస్య ఇచ్చిరట. ఎటువలెను

సమస్య:—"కింతే సంతాన పాదపాయంతే"

అవురా! ఆశుకవితా వాణి యగు నా శుకవాణి ఈ సమస్య పూరించి చదివెనట. ఎటువలెను.

కతికతిన క్షితిపతయః
కింతే రఘునాథ నాయకాయంతే
భువి బహవః కిల తరవః
కింతే సంతాన పాదపాయంతే.

అవురా! ఈ రీతి సంస్కృత సమస్య పూరించి చదివిన విని మెచ్చి ఆ రామభద్రమ్మకు మధురవాణమ్మకు వేర్వేర ప్రాకృత సమస్య లిచ్చిరట. ఎటువలెను.

సమస్య:—౧ రహుణా హ ఋృతి చందిరో విహాఇ

సమస్య:—౨ వడ్డఇ రహుణోహ రాయ పాహోహి

అవురా! ఆ రెండు సమస్యలు వారు పూరించి చదివిరఁట. ఎటువలెను

పరిపుణ్ణ కళాహి సోహమాణో
అహియం సక్కుళ ణిచ్చ సెవ్వమాణో
సహి ఎస చెంది ఆ ఓ
రహుణాహ ఖ్కితి చందిరో విహాఇ

ఛాయ :— పరిపూర్ణ కాలాభిశోభమానః
అభితః సత్కుల నిత్య సేవ్యమానః
సఖ! యశః చంద్రి కాఢ్యో
రఘునాథ క్షితి చంద్రో విభాతి

అవురా! రెండవ సమస్య పూరించి చదివెనఁట. ఎటువలెను.

తెల్లొక్కేక్క సుహావహ
సుహయర వియయ రాహావం సఇణం
దెఠ్ఠూణ ణియ తణూయం
వడ్డయి రహుణోహ రాయ పాహోహి

ఛాయ :— త్రైలోక్యైక సుఖావహ
శుభకర విజయ రాఘువ శశీనం
దృష్ట్వా నిజ తనూజం
వర్థతే రఘునాథ రాజ పాథోధిః

భళిభళి! మేలుమేలు! సారస్వత సామ్రాజ్య పట్టభద్ర! ఈ మహిమంబు స్వామి నగరిఁగాక తక్కిన రాణువుల నెక్కడిదయ్యా?

(ర. నా. అభ్యు)

ఆ విద్వాంసురాంద్ర కవితా పాటవమునకు రఘునాథ నాయక మహారాజమితానందము నొందెను. మహారాజునకే కాదు ఎటువంటి వారికైనను మహానందము కలుగక మానదు.

సంస్కృతమునందు పాండిత్యము సంపాదింప వచ్చును గాని ప్రాకృతములందు ప్రవేశము లభించుట చాల కష్టము. అందు కవిత

చెప్పుట దుస్సాధ్యము. ఆశువుగా సమస్యలు పూర్తిగావించి రనినచో మిగుల ప్రశంసనీయము. ఒక భాషకాదు. సంస్కృతము ఆంధ్రము ప్రాకృతము మూడుభాషల యందు వైదుష్యము సంపాదించి రనినచో మెచ్చుకొన దగిన విషయము. పూర్వకాలమునందు భారత దేశమున స్త్రీలకు విద్య లేదని వాదించు నవనాగరికులు పెక్కుమంది కలరు. వారీ విషయము నెరిగినచో మరల మాటలాడరు. ఆదికాలము నుండియు భారత దేశము విద్యలకు తరగని కొటారు. స్త్రీ పురుషులు మహావిద్వాంసులు. పరిపాలకులు శాస్త్ర పండితులు, కళావిదులు, విద్యాకోవిదులు. వారు విద్వాంసులను పోషించిరి. శాస్త్రాదికము లను ప్రోత్సహించిరి. కావున భారతీయ సంస్కృతి లోకోత్తర మయినది. ఆ యదృష్ట మితర దేశములకు లేదు. ఆ కారణముచేత ఆయా దేశములందు సారస్వతాభివృద్ధి యంతగా జరుగలేదు. రఘునాథ నాయక భూపతి దిన ముఖోచిత కార్యక్రమములం దను దినము కవితా గోష్ఠి యొకటి.

భువి మెచ్చ నచ్యుతాభ్యుదయ కావ్యంబు
నవరస చిత్రంబు నల చరిత్రంబు
హరువైన పారిజాతాపహరణము
మెఱవడిఁ జూపు వాల్మీకి చరిత్ర
జానకీ కళ్యాణ చాటు కావ్యంబు
తా నిర్వహించిన తక్కిన కృతులు
కొందఱు వినిపింపఁ గొందఱు తగిన
సందర్భముల సమస్యలు సేకరింప
నెదుట సంగీత సాహిత్య నాట్యములు
మొదలైన విద్యలు మూర్తీభవించె
నన మించు నల చంచలాక్షుల కెల్ల
గనకాంబరంబులు కరుణించి యొసఁగ (ర.నా.అభ్యు)

ఇది లోపలి నగళులలోని సంగతి. రాజ సభయందు పండిత కవి గోష్ఠుల మాట చెప్పవలసిన పనిలేదు. రఘునాథ రాయలు సాహిత్యమునే కాదు సంగీత నాట్య విద్యలను కూడ ప్రోత్సహించెను. అనుదినము పుత్ర కళత్ర సహితముగా వానిని వినుచుండును. ఆనందించుచుండును. గాయికా నర్తకుల సత్కరించుచుండును. ఆ మహారాజు కాలమున పలు విధములగు నాట్యములు వాద్యములు నభ్యసించి యపార పాండిత్యము సంపాదించినవారు కలరు. వారు మూర్తీభవించిన విద్యాధిదేవతలు, మహారాజు నెదుట తమ పాండిత్యములు ప్రదర్శించుచు వచ్చిరి.

పదచాళిఁ గొనియె రూపవతీ వధూటి
కొదలేక పేరణిఁ గొనెఁ చంద్రరేఖ
మిక్కిలి కోపుల మెఱవడిఁ జూపి
జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు
ననబోఁడి యగు లోకనాయకీ కాంత
వనజలోచన కీరవాణి లతాంగి
దురుపదకేళిక దురుత నీ కోపు
వరుస నటించిరి వన్నె మీఱఁగను (ర. నా. అభ్యు)

ఇవి నాట్యములు. రఘునాథ నాయకుడు నిత్యము చూచి యానందించునవి. పదచాళి నాట్యము. పేరణి భాండోపరి నాట్యము. జక్కిణి అట. దీనికి బల్లటి, కత్రి, బెళుకు మొదలగునవి యంగములు. దురుపద కేళిక కందుక కేళి వంటిది. ఈ నృత్యములు క్రీడలు చూచుచుండుటచేతనే వేశ్యలు ఋశ్యశృంగుని గొనిపోయిన విధానమంత రమణీయముగా కన్నులకు గోచరించు నటుల వర్ణింపఁ గలిగెను. ఇంక వాద్యవిశేషములు మనము విననివి కననివియు గలవు.

ఏణీవిలోచన యింపుగా నొకతె
వీణె వాయించెను వింత రాగముల

మురళి రబాబు తంబుర దండె చెంగు
సర్వమండలంబు రావణహస్త మనఁగ
విలసిల్లు జంత్రముల్ వేర్వేరఁ బూని
వెలఁదులు కొందఱు వినిపించి రపుడు.

సకల కళాపోషకుడు ప్రజారంజకుడు రఘునాథ నాయకుడు. తరువాతివారును ఆ మహారాజును ననుకరించిరి. కావుననే యిప్పటికిని తంజావూరు గాన నాట్య కళలకు నిలయమయి విలసిల్లుచున్నది.

౪

## చేమకూర వేంకటరాజ కవి

రఘునాథ భూపతి యాస్థానమున ఆంధ్ర సాహిత్య కళా కరుండయి కీరితి వెన్నెలలు నలుదిశల వెలయించినవాడు చేమకూర వేంకటరాజకవి. ఈతడు లక్ష్మణామాత్యుని కుమారుడు. అమాత్య శబ్దము తండ్రిపేరు చివర చేర్చియుండుటచేత ఈతడు నియోగి బ్రాహ్మణుడని యూహింప వలసియున్నది. తాను రచించిన గ్రంథ పీఠికలందుగాని యాశ్వాసాంత గద్యములందు గాని చేమకూర వేంకటకవి ప్రత్యేకముగా తన కుల గోత్రములను మాత్ర నామ మును నితర కవులవలె చెప్పుకొని యుండలేదు. అందుమూలమున కులమును గురించి శంకింప వలసియున్నదని కొందరి యభిప్రాయము. కింకవీంద్ర ఘంటా పంచానన బిరుదాంకితులగు శ్రీ చెళ్ళపెళ్ళ వేంకట శాస్త్రిగారు చాల మంది తెనుగు కవులను గురించి పరిశోధ నలు గావించిరి. ఆ కవికుల దేశికులు

విజయవిలాస కర్త సువివేకి మహాకవి యన్య జాతికిన్
ద్విజునకు నుద్భవించిన సుధీతిలకుండు

అనినుడివిరి. వారు తొందరపడి ఏ విషయ మనాలోచితముగా చెప్పరు.

పన్నిన సత్ప్రబంధమున బాగును నోగును జూడ కీసుచే
మన్నన మాలి మా కులము మాటఁ దలంతురె చేమకూర వేం
కన్నకు లోప మేమి కులమా కవనానకు వేంకటాద్రి రా
జన్న గణించి మీరలు దయామతిఁ బ్రోచిన నాకుఁ జాలదే

అని బుచ్చివేంకు వెంకటాద్రి నాయనితో ననెను. అతడు వేశ్య కులజుడు. కవి. అతని కులమును గురించి వెక్కిరించినారు వాసిరెడ్డి వేంకటాద్రి నాయని యాస్థాన విద్వాంసులు. దానికి సమాధాన ముగా నీ పద్యము చెప్పినాడు బుచ్చివెంకు. వేంకటాద్రి భూమీపతి

రఘునాథ నాయకుని సమకాలికుడు. చేమకూర వేంకట కవి రఘునాథ నాయకుని యాస్థానములోనివాడు. కావున బుచ్చి వెంకు వెంకటకవిని నెరిగియుండును. వాని మాటలలో సత్యము కలదు. వేంకటకవి వేశ్య కులమువాడు అని కొందరి వాదన. ''కులభేదము చేత లోకోత్తరమగు వసుచరిత్ర నుండి పద్యము లుదాహరింపని అప్పకవి విజయవిలాస రచయిత వేంకటరాజు కులము తెలియక పోవుటచే అయిదు పద్యము లుదాహరించినాడు'' అనియు చేమకూర వేంకటకవి తాను లక్ష్మణామాత్య తనయుడనని చెప్పుకొనుటచేత అప్పకవి యీతడు నియోగియని భ్రమించి యుండును గాఁబోలు ననియు దక్షిణ దేశీయ వాఙ్మయమునందు నిడదవోలు వేంకటరావు గారు వ్రాసిరి. అప్పకవి పలనాడులోని తంగెడుసీమ నివాసి. తంజావూరు తంగెడు సీమలకు రాకపోకల వ్యవహారములు నిరంతరముగా సాగుచుండెనని వారె యొప్పుకొనిరి. అప్పకవి క్రీ.శ. 1456 లోని వాడు. వేంకటకవి తరువాత దాదాపు ముప్పది యేండ్ల కుండెను. అంత పరమత ద్వేషము కల అప్పకవి వేంకటకవి కులము తెలియకుండా యెప్పుడు పద్యముల నుదాహరింపడు. తంగెడుసీమ తంజావూరుల మధ్య సన్నిహిత సంబంధములు కలవగుటచేత సుప్రసిద్ధమగు విజయావిలాస గ్రంథము రచించిన వేంకటకవి కులమును గురించి అప్పకవికి బాగుగా తెలిసియుండును. వారిద్దరి మధ్య ముప్పది సంవత్సరములు మాత్రమే కలదు. తప్పక అప్పకవి వాని నెరింగి యుండును. అతడు బ్రాహ్మణుడని బాగుగా తెలిసి పద్యములు తన గ్రంథమునం దుదాహరించి యుండుననుటలో సందేహము లేదు.

ఏలిక మాత్రమే మహిమ నీశ్వరుఁడే తలపోసి చూడ నా
పాలిటి రామభద్రుఁ డని బంగరు పూవులఁ బూజ చేసి

అనియు

శ్రీరస భావముల్ వెలయఁ జెప్పి ప్రబంధము లెన్ని యేని మీ
పేరిట నంకితం బిడిన బిడ్డల నెందఱఁ బేరు పెట్టినం
దీరునె మీ ఋణంబు

అనియు పీఠికలో వేంకటకవి రఘునాథ నాయకుని గురించి నుడివెను. తెనుగు కవులం దెవ్వరు కృతి భర్తల నంతగా పొగడినవారు లేరు. అంత వినయము చూపిన వారును లేరు. ఎంత సంస్కార ముండినను ఏదోయొక పట్టున నైసర్గిక స్వభావము బైటపడక తప్పదు. వీని యందు వేంకటకవి కుల తత్వము వ్యక్తమగుచున్నది. వేంకటకవి బ్రాహ్మణు డగుచో రఘునాథ నాయకుడు వానిచేత నట్లనిపించు కొనునా? అతడు బ్రాహ్మణ భక్తికల మహారాజు అని కొందరు వాదింతురు. డబ్బిచ్చువా డుండవలయును గాని పొగడువాని నోటి కడ్డ ముండదు, అను లోకోక్తి యెరుగనిది కాదు. తెనుగు సారస్వత చరిత్రమునందు నన్నయభట్టు మొదలుకొని నేటివరకు గల కవులలో కృతిభర్తలను ఈశునిగాను విష్ణువుగాను ఇంద్ర చంద్రులుగాను చేసి పొగడనివారు లేరు. వారు సత్కరించనిచో తిట్టనివారును లేరు. ప్రభువులు కృతు లందుకొనుట పొగడ్తలకొరకే. కవులు కావ్యములు వ్రాయుట ధనముకొరకు. కాదనగలవారుండరు. పోతన మహాభక్తుడు. ముముక్షువు అని యందరు తలంతురు. అతడు భోగినీ దండకము రచించెను. అది ధన లోభము. తా ననుకొనినంత ధనలాభము కలుగలేదు. ఆశా భంగమయినది. రాజులయెడ విద్వేషము వాటిల్లి నది. విరక్తి పొడమినది. 'ఇమ్మనుజేశ్వ రాధముల కిచ్చి' అను పద్యము నుడివినాడు. భాగవతము రామాంకితము చేసినాడు. అభావే విరక్తిః.

కవి లోకములోనివాడు. రాజును లోకములోనివాడె. వారి వారిని విమర్శించు నప్పుడు లౌకిక దృష్టితో చూడవలయును. పార మార్థిక దృష్టి పనికిరాదు. అది సత్యమును దూరము చేయును. పోతన కరుడు గట్టిన భక్తిరస మనియు అనుదినము విష్ణువుతో ప్రసం గించుచుండెడివా డనియు నుడివినవారు కలరు. దానిని గురించి విమ ర్శించుట కిప్పుడు గ్రంథము చాలదు. వేంకటకవి రచించిన పై పద్య భాగములలో నొక విధమగు విశ్వాసము హృదయ గోచర మగు చున్నది.

కల నయిన మిమ్ముఁ గా కన్యులఁ గొలువ నంటి
కృతు లొకరి కీను మీకె యంకితము లంటి
పలికిన ప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు

అన్నాడు రఘునాథ నాయకావనీపతి వేంకటకవితో. సమయములు ప్రతిజ్ఞలు గావించు కొనునంతటి సన్నిహిత సంబంధము కలది వారి పరిచయము. అది బాల్యాదికము. అందును సేవలు కృతులను గురించియే వారి యొడంబడికలు. రఘునాధ నాయక మహారాజు రాజమాత్రుడె కాడు. హృదయ సంస్కర్త. తాను మహావిద్వాంసుడయి పరులకు విద్యా దాన మొనరించి కవి మాన్యులుగా తీర్చి దిద్ది కనకాభిషేక మొనరించి పోగడ్తలను పొందిన విద్యా గురువు. కొందరు తంజావూరు కవులు, తంజావూరు నాయక రాజుల చరిత్ర, ఆ నాటి కవుల కృతులు, విమర్శకుల వ్యాసములు మొదలగునవి పరిశీలించి చక్కగా నర్థము చేసికొనిన యెడల రఘునాథ నాయకుని గుణములు అవగతములు కాగలవు అందుకనే ఆ మహారాజు నాయక రాజులకు శిరోలంకారమయి యనంతమగు యశమును సంపాదించెను. తరువాతి రాజులకు మార్గ దర్శకుడయి చిర స్మరణీయు డయినాడు.

శబ్దయో ర్మమ సమ ప్రధానం
వశంవదం యస్య వదంతి సర్వే
కృతీ స ఏవాత్ర కృతౌ సహాయః
నాథో మమ (శ్రీ) రఘునాథ నేతా

అని రఘునాథాభ్యుదమునందు రామభద్రాంబ చెప్పుకొనినది. ఆమె విశ్వాసమే యామె జీవిత సర్వస్వము రఘునాథ నాయకున కంకితము చేయించినది. ఆమెను విద్యా సరస్వతి యను జన వినుతికి తెచ్చిన వాడు రఘునాథ నాయక ధరాధినేత. వేంకటకవిని కూడ ఒకటకా వన్నిటఁ బ్రయోజకుడ వని వినుతింపఁ దగినవానినిగా మలిచియుండ వచ్చును. ఆ ప్రయోజకత్వము వేంకటకవిని గద్యలో సకల కళా ప్రవీణ యని సగర్వముగా చెప్పుకొన చేసినది. వేంకటకవి సంగీత

సాహిత్య నాట్యాది కళలయందు ప్రవీణుడు. ఆ ప్రవీణతకు మహారాజు కారకుడు. మహారాజు సకల కళావేత్త. కళారాధకుడు రఘునాథ మేళ యను వీణను స్వయముగా నిర్మించుకొనెను. ఈ మాట తలంచుకొని నప్పుడు ఘోషవతితోడ నుదయన మహారాజు మనసునందు పొడకట్టును. అతడు వినూతనములయిన రాగతాళములను కనిపెట్ట లేదు. అతనికంటె ఘనుడు రఘునాథ నాయకుడు. జయంతిసేన యను రాగమును రామానంద యను తాళమును క్రొత్తగా కనిపెట్టెను. రాజు మహావైణికుడు. సంగీత విద్యా దేశికుడు. ఆయన యాస్థానములోని వారందరు సంగీత సాహిత్య కళా విద్వాంసులు. పరమ వైణిక శిఖామణులు. యథా రాజా తథా ప్రజా. కానివారికి శిక్షాభ్యాసముల నొదవించెను.

చాతుర్య మేతి కవితాసు చతుర్విధాసు
వీణా కళా ప్రకటనే భవతి ప్రవీణ
ప్రజ్ఞా మియం నిపుణ మంచతి పాణినీయే
మేధాం వ్యనక్తి బహుధా వివిధావధానే

అని గర్వాతిశయముతో చెప్పుకొనినది మహావిద్వాంసురాలు కవయిత్రి వైణిక కళా పండితురాలు మధురవాణి. గర్వపడుటలో తప్పేమియు లేదు. విద్వాన్ సర్వత్ర పూజితః. మహారాజామెను తలపై నలంకరించుకొనినాడు. గౌరవించినాడు. ఆమె ఘనత కా మహారాజే కారణము. అట్లే మహారాజుతోడి పరిచయము వేంకట కవిని సంస్కారవంతుని చేసినది. విజ్ఞానామృతము పోసినది. పండితునిగా మలచినది. కవిగా రూపొందించినది. సకల కళా ప్రవీణు నొనరించినది. అది మొదట సాహిత్యముతో ప్రారంభించలేదు. రణ విద్యతో నారంభించినది.

క్షత్ర ధర్మమ్మె కద నీకుఁ గలదు మొదటఁ
దమ్ములు సుతుల్ హితులుఁ గూడ మమ్ముఁ గొలిచి
తిపుడు కృతియును జెప్పి మా కింపొనర్చి
తొకటఁ గా వన్నిటను బ్రయోజకుఁడ వీవు

అవి నుడివిన రఘునాథ నాయకుని మాటలను బట్టి చేమకూర వేంకటకవి యుద్ధ విద్యయందుకూడ ప్రవీణు డని విశద మగుచున్నది. ఈ విద్య రఘునాథ నాయకుని యొద్ద నేర్చుకొని యుండును. ఆ మహారాజు వేంకటకవిని మహావీరునిగా తీర్చియుండును. వేంకటకవి రణాంగణములందు రఘునాథ భూపతికి చేదోడుగా నుండి వైరి నిర్మూలనమునందు సాయపడియుండును. మహారాజు వానిని మెచ్చి మిగుల మన్ననలు గావించి యున్నత స్థితికి తెచ్చి యుండును, 'నన్ను నడిపిన బహుళ సన్మాన మెంచి' అను వాక్యములోని నిగూఢాభి ప్రాయమే యది. బాల్య మాది రాజుతో గల పరిచయము సమర సాహితీ కళా పండితుని చేసినది వేంకటకవిని. అన్నివిధముల లోక మాన్యుని గావించినది. ఆ విశ్వాసము వేంకట కవిని ప్రతిజ్ఞ లొన రింప చేసినది. సుత హిత సోదర సహితముగా రఘునాథ నాయకుని సేవింప చేసినది. "ఏలిక మాత్రమే-శ్రీరస భావముల్" అను పద్య ములను వ్రాయుటకు నంతరంగమును పురికొల్పినది. ఒక స్థితియం దున్న మానవుని మహోన్నత పదవికి గొనివచ్చి సర్వ జన సన్నుతి పాత్రునిగా నొనరించిన మహారాజు నెడ నంత వినయము చూపించు టలో నాశ్చర్య మేమియు లేదు. వేంకటకవి గద్యమునందు గాని పీఠిక యందు కాని కుల గోత్రములు చెప్పుకొన నంతమాత్రమున వేశ్యాకులజుడని తలంచుట యసమంజసము. అట్లు చెప్పనివారు తెనుగు కవులలో చాలమంది కలరు.

నన్నయ భారతమునందు తన తల్లిదండ్రుల పేరు నుడువ లేదు. పెద్దన తల్లి పేరు చెప్ప లేదు. శేషము వేంకటపతి గద్యయందు శేషము కృష్ణమార్య తనూభవ యని మాత్రమే చెప్పుకొనెను. ఇట్టివారి నందరిని నీచ కులజులుగా నెన్నుట లేదు. వేంకటకవిని మాత్ర మట్లెన్నుటలో నర్థము లేదు. లక్ష్మణామాత్య తనయుండ నని వేంకటకవి గద్యయందు వ్రాసికొనెను. అమాత్య శబ్దము నియోగి బ్రాహ్మణులకు మాత్రమే చెల్లును. అందుమూలమున వేంకటకవి తన కులమును చెప్పుకొనినట్లే యగును. వేంకటరాజ అని తన పేరు

చివర రాజశబ్దము చేర్చి చెప్పెను. రాజ శబ్దము నియోగుల పేరు చివర 'గంగరాజు లింగరాజు' అని చేర్చియుండుట లోక ప్రసిద్ధము. కావున వేంకటకవి నియోగి బ్రాహ్మణు డగుటలో సందేహము లేదు. వేశ్యకొక్క భర్త యుండడు. వేశ్యా తనయుడు తల్లి పేరు చెప్పుకొనుట యాచారము, తల్లి పేరు విడిచి పుచ్చిన వేంకటకవిని వేశ్యాతనయు డనుట సాహసము. నీ వెవరి కుమారుడ వని యడిగి నచో సంసారి తండ్రి పేరు చెప్పును. తల్లి పేరు చెప్పడు. ఆ విధము ననుసరించి వేంకట కవీత్యాదులు తండ్రి పేరు మాత్రమే నుడివిరి. కావున వేంకటకవి కళంకము లేని నియోగి సంసారమునందు జన్మించెను. ఇంక బుచ్చి వెంకు సాక్ష్యము. చేమకూర ఒక యూరి పేరు. ఒక్క యింటిపేరు కలవారు పెక్కు కులములం దుండుట అందరు నెరిగిన విషయము. చేమకూరవారు వేశ్యలందు నుండి యుందురు. ఆ వేంకనయే యీ వేంకట రాజకవి యని యెవరు చెప్పలేరు. మీాదు మిక్కిలి యతడు వెంకన్న, ఇతడు వేంకటరాజు. పేరులో భేదము కలదు. వేంకటకవి గద్యలో సమారాధిక బుధ సమాజుండ నని వ్రాసికొనెను. అతడు వేశ్యాకుల సంభవు డయినచో నే బుధు డాతని నారాధించును? బుచ్చి వెంకుని వలెనే పరిహసించును. కావున పై వాదనలు నిరాధారములు. ఇట్టి యుత్తమ కళా కోవిదులతో

సంభావనీయా ధృత శాతకుంభా
స్తంభావళీ సంభృత నూత్న రత్నైః
రమ్యా విశేషేణ సభా విభాతి
తత్రేందిరా మందిర నామధేయా

అందు రఘునాథ భూపతి నిత్యగోష్ఠి. వేంకటకవి 'యిదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర' మనినటుల మొదట వీరాధివీరుడయి రాజుతోపాటు యుద్ధములు గావించి యరాతి వీరుల నంత మొనరించెను. కత్తిపట్టిన యా చేతితోడనే గంటము పట్టి కృతులు రచించెను. క్షాత్ర ధర్మ మును పరిత్యజించి పరశురాముని వలె శాంతి జీవిత మవలంబించెను.

సూర్యోపాసన గావించెను. తత్ప్రసాద సిద్ధిని పొందెను. శ్రీసూర్య నారాయణ వర ప్రసాద లబ్ధ సారస్వత సుధాసార జనిత యశో లతాంకూరుండ నని గద్యలో వ్రాసికొనెను. రఘునాథ భూపతి సహితము "సామాన్యుడవే సూర్య వర ప్రసాదివి" అని పొగడెను. వారి మైత్రి అటువంటిది. మంత్రసిద్ధి ఉపాసనా మంత్రము నొండొరులు చెప్పుకొనునంత సన్నిహిత మైనది. వారిద్దరు సాధ్యాయు లని కొందరు భావించుచున్నారు. అయిన గావచ్చును. వేంకటకవి సారంగధర చరిత్రయందు సదారాధిత బుధ సమాజుడయి, విజయవిలాసము నాటికి అచ్యుతేంద్ర రఘునాథ భూపాల దత్త హస్త ముక్తాకటక విరాజమానుడయి కవిరాజ బిరుదము సంపాదించెను. వాని కృతులలో కూడ నా రచనాభివృద్ధి కనిపించును. చేమకూర వేంకటకవికి రఘునాథ నాయకునియందున్న దృఢ విశ్వాసము నమితమగు భక్తి యంతరంగమును పురికొల్పినవి. భావోద్రేకమును కలిగించినవి. వేంకటకవి రసావేశమును పొందినాడు. పీఠికయందే కథాటిగా నేడు పద్యములు 'సమర నిశ్శంక రఘునాథ సాహసాంక' యను మకుటముతో పద పదమునందు రసము చిందించు భావముల నిమిడించి ద్రాక్షాపాకమున రచించెను. అందలి ప్రతి పాదము రఘునాథ నాయకుని సమర కథా ఘట్టములలోని యొక్కొక్క కథా ప్రసంగమును సూచించుచున్నది. పరాక్రమమునందు రఘునాథ భూపతి నిజముగా సాహసాంకుడు. శ్రీకృష్ణరాయల తరువాత సమర విచిత్ర గాథలు రఘునాథ భూపతి జీవిత చరిత్రమునందే మరల వినగలము. రామభద్రాంబ రఘునాథాభ్యుదయమును సంస్కృతమున రచించినది. అందు రఘునాథ నాయకుని పరాక్రమము యుద్ధములు వర్ణించినది. ఆమె పద్యములందీ భావకల్పనలు రసోచిత పద గుంభనములు. రచనా చమత్కారము ఉద్రేకము కనిపించదు. వేంకటకవి స్వయముగా చూచి యనుభవించి వ్రాసిన పద్యములు. కావున అంత రసోత్కృష్టములుగా కుదిరినవి. మచ్చునకు

రంభ వాకిటను దోరణములు గట్టెడు
తీవర మొక కొంత దీలుపడియె
మేనక యింటిలో మేల్కట్లు సవరించు
సంరంభ మొక కొంత సడలువారెఁ
గనకాంగి యింటిలోఁ గర్పూర వేదికల్
సవరించు టొక కొంత జాగుపడియె
హరిణి బంగరు మేడ నరవిరి సెజ్జలు
నిర్మించు టొక కొంత నిలుకడయ్యె

మబ్బు గొబ్బున నీ శౌర్య మహిమ వినక
తెగువతోడుత నెదిరించి తిరిగి విరిగి
పాఱిపోయిన మన్నీల పాటు సూచి
సమర నిశ్శంక రఘునాథ సాహసాంక

మంచి రసవంత మయిన పద్యము. చక్కని భావకల్పన. సమరము నందు నిహతులయిన వీరులు స్వర్గమున కరుగుదురు. అచట వారికి రంభాద్యప్సరసలతోడి చెలిమి వాటిలును. అని మన శాస్త్రములు చెప్పుచున్నవి. రఘునాథ భూపతి నెదిరించిన మన్నీలు యుద్ధము నందు తప్పక మరణింతురు. తమ యిండ్లకు వత్తురని వేడుకపడి రంభాదులు తమ గృహము లలంకరించుకొన మొదలిడిరి. కాని వారు రణమున భీతిలి పారిపోయిరి. కావున నిరాశ నొంది యచ్చరలు తమ ప్రయత్నములు మానిరట. రఘునాథ నాయకు నెదిరించి రణమున నిలిచిన వారు తప్పక మరణింతురని సారస్యము. శృంగారము రసము. వీరము హాస్యము దాని కంగములు. వేంకటకవి

కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ
జౌకట్ల నిగనిగ ల్వ్యాకళింప
హురుమంజి ముత్యాల యరచట్టపై గొప్ప
పతకంపు హారముల్ పరిఢవిల్ల

వెలఁ జెప్పరాని కెంపుల వంక జముదాడి
  పీతాంబరంబుపైఁ బెరిమె నెరప
గబ్బి మన్నెకుమార గండపెండారంపు
  జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప
దొరల మంత్రులఁ గవుల నాదరణ సేయు
కరము కంకణ కాంతి నల్గడలు నిండ
నిండు కొలువుండెఁ గన్నుల పండువుగను
ఠీవి నచ్యుత రఘునాథ భూవిభుండు

అని వర్ణించినాడు. నిజముగా కన్నుల పండువు కలిగించు సజీవమగు ఛాయాచిత్రము. దీనిలో జీవకళ యున్నది. మహారాజు మరణించినను ఈ పద్యము చదువుకొనినవారికి ఆ ఠీవి, యా యలంకారములు, ఆ రూపము మనోనయనమునకు గోచరించును. ఇట్టి శిల్ప కళా వైశద్యము సారంగధర చరిత్రము నందు పలు చోటుల గానిపించుచున్నను రచనా విధానమునందును మనోహర శయ్యా మార్దవంబునందును పీఠికలోని పద్యములకు సారంగధర చరిత్రములోని పద్యములకును చాల తారతమ్య మున్నది. పీఠికలోని పద్యములు రసవంతమగు కవనంపుఁ బోకడలలోని సహజ లక్షణములను గుర్తించిన పిమ్మట స్వానుభవముమీద రచించినవి. విజయవిలాసములోని పోలికలున్నవి. కావున ఆ పద్యములు విజయవిలాసమునకు సంబధించినవి. సారంగధర కృతి పరిసమాప్తియైన తరువాత వేంకటకవి కవిత్వానుభవము సంపాదించి వ్రాసియుండును. సారంగధర కావ్యమునకు విజయవిలాస కావ్యమునకు కవితలో చాల భేదమున్నది. అది రసశ్రుతికయి పాటుపడిన కృతి. అయినను సహజమగు నస పోలేదు.

సారంగధరచరిత్ర చేమకూర వేంకటకవి ప్రథమప్రయత్నము. రస పోషణమునందును భావ ప్రకటనమునందును రచనా విశేషము నందును విజయవిలాసమునకు చాల వెనుకపడియున్నది. ఈ కృతులు రెండు క్రీ.శ. 1630–1640 మధ్య రఘునాథ నాయకునకు వేంకటకవి కృతి యిచ్చియుండునని శ్రీ కందుకూరు వీరేశలింగము పంతులుగారు

కవి జీవితములందు తెలిపిరి. రఘునాథ భూపతి క్రీ. శ. 1631 వ సంవత్సరమునందు మరణించెనని చరిత్రకారులు నుడివిరి. రఘునాథ నాయకుడు క్రీ. శ. 1600 లో పట్టాభిషిక్తుడయ్యెను. ఆ కాలము నందు దేశ మల్లకల్లోలముగా నుండెను. విరోధిరాజుల యొత్తిడి యెక్కువయ్యెను. యుద్ధములతో మహారాజునకు విరామము లేదు. మహమ్మదీయులతో సంధి కుదిరిన తరువాత కొంత సంరంభము తగ్గినది. రాజ్యమునందు శాంతి భద్రత లేర్పడినవి. క్రీ. శ. 1615–1630 సంవత్సరముల మధ్య కృతి సమర్పణ కార్యము లన్నియు జరిగియుండును. వేంకటకవి తన కృతుల నా కాలమునందే యంకిత మొనరించి యుండవలయును. అప్పటికి వేంకటకవి 'క్షత్రధర్మమ్మె కద నీకు' అను పీఠికలోని పద్యమునుబట్టి పెరిగి పెద్దవారయి కొలువు చేయుచున్న తనయులు కలవాడు. కావున ఏబదేండ్లు పైబడినవాడు కావలయును.

సారంగధర చరిత్ర సుప్రసిద్ధ మయినది. స్త్రీ పురుషుల హృదయ రంగములందు నిలిచి నిలయ మేర్పరచుకొనినది. సామెతలు చలోక్తులలోనికి ప్రాకినవి. వగలాడి యగు వనితను చిత్రాంగి యందుము. తెనుగు దేశమునం దీ కథ గద్యములు గాను పద్యములు గాను ద్విపదలుగాను రూపొందినది. శ్రీగిరికవి యీ కథను పద్య కావ్యముగా రచించెనని వాడుక. ఆ గ్రంథ మింతవరకు లభింపలేదు. దాని స్వరూప మెవరికిని తెలియదు. అత డెప్పటివాడో యెరుగ రాదు. అత డొక శివభక్తుడని గ్రహించుకొనవచ్చును. శ్రీగిరికవి కావ్యమును గౌరన చూచియుండెను. ఆ సంగతి తన కృతియందు సూచించెను. అతడు నవనాథ చరిత్రమును ద్విపద కావ్యముగా విరచించెను. అందు శ్రీగిరి పద్య కావ్యమగు నవనాథ చరిత్ర ననుసరించి నటుల నున్నది. గౌరన నవనాథ చరిత్రము నందు సారంగధరుని కథ యున్నది. ఆ కథ నాధారముగా చేసికొని కొలది పేరుల మార్పుతో వేంకటకవి యీ కృతిని రచించెను. మాళవ రాజు రాజనరేంద్రుడు. వాని దేవేరి రత్నాంగి. చిత్రాంగి యను

నుంపుడుకత్తె వానికి కలదు. రాజనరేంద్రునకు సంతానము చాల కాలమువరకు కలుగలేదు. శివుని వరప్రసాదమున సారంగధరుడను కుమారుడు జన్మించెను. అతడు యౌవనవంతుండయ్యెను. వానికి ఘూర్జర దేశాధిపతి కూతురగు మంజువాణిని పరిణయము గావించి నాడు రాజనరేంద్రుడు. కాలము గడచినది. రాజు వేట కరిగెను. ఒకనాడు బుసుపోకకు సారంగధరుడు పావురము లాడుచుండెను. పావురము చిత్రాంగి మేడమీద వ్రాలినది. సారంగధరుడు పావురము తెచ్చుకొనుటకు పోయెను. చిత్రాంగి సారంగధరుని బలాత్కరించి నది. ఇందు సారంగధరుడు నాయకుడు. చిత్రాంగి నాయకురాలు. శృంగారాభాసము రసము. ఈ కథ నాటికి సారంగధరునకు పాతి కేండ్లుండు ననుకొందము. చిత్రాంగికి ఏబది యేండ్లయిన నుండును. ఆమె వాడువారిన సూనము. ఆమె సారంగధరుని వరించె ననుట కథయందౌచిత్యమునకు భంగము వాటిల్లుచున్నది. ఈ విషయ మూహించినాడు బాణాల శంభుదాసు. కథను మార్చినాడు. చిత్రాంగి సారంగధరుని కొరకు నియమింపబడిన కన్యకయనియు, రాజు మోసము చేసి యామెను పరిణయ మాడెననియు చిత్రించినాడు.

బాణాల శంభుదాసు ద్విపద కావ్యము ననుసరించి ఆంధ్ర నాటక పితామహ ధర్మవరం కృష్ణమాచార్యులవారు నాటకముగా నీ కథను రూపొందించిరి. సారంగధరుని కాలు సేతులు ఖండించిరి. వేంకటకవి కావ్యమునందు మంజువాణి విలపించినటుల ఎందును కనిపించదు. ఆమె ప్రస్తావము లేదు. అది గొప్ప లోపము. కవి కథ యందు కాని పాత్ర పోషణయందు కాని రసమునందు కాని యౌచిత్యమునకు భంగము రానీయరాదు. అది కవితా శిల్పమునకు సహింపరాని లోపము. కవి ప్రతిభకు పెను ఘాతము. కావ్యమునకు తరింపరాని కళంకము. కావ్యమునకు కథ శరీరము. రసము జీవము. అలంకారములు నగలు. కాళిదాసు శాకుంతలమునందు పాత్రపోషణ కొరకు, కథయందలి యౌచిత్యముకొరకు భారతమునందలి విధాన

మును మార్చినాడు. దూర్వాస శాపాదులను కల్పించినాడు. వేంకట కవి యప్రధానములగు విషయములను చేర్చి ఒక్కొక్క చోట కథ పరిహాసముపాలు గావించినాడు. ఆ యా విషయము లా యా తావు లందు సూచింపబడును. వేంకటకవి సారంగధర చరిత్రమును

రాజనరేంద్రుఁడు రిపు ఫణి
రాజ నరేంద్రుఁడు కళా పరాక్రమ రేఖా
రాజిత భోగ పరాజిత
రాజ నరేంద్రుఁడు సుధాకర కులుం డలరున్

అను పద్యముతో ప్రారంభించెను. ఇది వస్తు నిర్దేశము, ఆశీ ర్నమ స్క్రియా వస్తునిర్దేశో వాపి. ఈ యాచారము సంస్కృత కావ్యము లందు విశేషముగా కనిపించును. కాళిదాసు కుమార సంభవ కావ్య మును, 'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః' అని ప్రారంభించెను. శ్రీహర్షుడు

నిపీయ యస్య క్షితిరక్షిణః కథా
స్తదాద్రియంతేన బుధా స్సుధా మపి
నల స్సభూజాని రభూ ద్గుణాద్భుతః

అని నైషధము నారంభించెను. తెనుగు కావ్యకర్త లీ యాచారము నంతగా ననుసరించినటుల తోచదు. ఆశీ ర్నమస్క్రియలతో తమ కావ్యములు ప్రారంభించుట పరంపరగా వచ్చుచున్న యలవాటు. అసలు కథ పుర వర్ణనలతో చాల వరకు మొదలు పెట్టుచువచ్చిరి. అలసాని పెద్దన 'శ్రీవక్షోజ కురంగనాభ మెదపై' అను పద్యముతో నాశీర్వాద మాదియందు గావించెను. 'వరణాద్వీపవతీ' యను పద్య ముతో అరుణాస్పద పుర వర్ణన మొనరించెను. కథ మొదలుపెట్టెను. భట్టుమూర్తి 'శ్రీభూపుత్రి వివాహ వేళ' యని యాశీర్వాదముతో వసుచరిత్ర నారంభించెను ముక్కు తిమ్మన 'శ్రీమదికిం బ్రియం బెసఁగ'నని పారిజాతాపహరణమునందు శ్రీకృష్ణరాయల నాశీర్వ దించెను. 'హరి నరకాసురుం గెలిచి' అని వస్తు నిర్దేశముతో కథ

మొదలుపెట్టెను. అందరు కృత్యాది యందు ఆశీ ర్నమస్క్రియలతో మంగళాచరణము గావించినవారే. వేంకటకవియు విజయవిలాసము నందు 'శ్రీ లెల్లప్పు డొసంగ' యను పద్యముచేత రఘునాథ భూపాలుని కృత్యాదియందు నాశీర్వదించెను. 'చంద్రప్రస్తర సౌధ ఖేలన' అను పద్యమునందలి ఇంద్రప్రస్థ పుర వర్ణనతో కథ నారంభించెను. వేంకటకవి పీఠికలోని పద్యము లన్నియు విజయవిలాసములోనివి. వానిని మొదట చేర్చి వావిళ్ళవారు సారంగధర కావ్యమును ముద్రించిరి. కావ్యము బోసిగా నుండుట వారి కిష్టము లేకపోయినది కాబోలు. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ముద్రించిన దానిలో పీఠిక పద్యములు లేవు. వేంకటకవి సారంగధర కావ్యము రాజనరేంద్రుని వర్ణనతోడనే మొదలుపెట్టెను. అది యొక పద్ధతి.

రాజనరేంద్రుడు మాళవ దేశమునకు రాజు. వానికి రత్నాంగి యను దేవేరియు చిత్రాంగి యను నుంపుడుకత్తెయుఁ గలరు. ఈ రాజనరేంద్రుడే రాజమహేంద్రవరము నేలిన రాజరాజనరేంద్రుడని చాలమంది కవులు పండితులు పొరబడుచున్నారు. అప్పకవి మొదలగు ప్రామాణిక లక్షణ గ్రంథ కర్తలు కూడా అదే భ్రాంతిని పొందిరి. ఆంధ్రశబ్ద చింతామణి విషయమున పెక్కు కథలు గాథలు సృష్టించిరి. అది తెలుగువారికి తేలిక పని. ఆ పుక్కిటి పురాణములను నమ్మి, విమర్శక మహాశయులు కొందరు తాము తప్పుదారి యందు సంచరించి, పాఠకులకు గూడ తప్పుదారులను చూపించినారు. ఇప్పటికి నప్పటికి సారస్వత పిపాసువులు ఆ దారి వెంట గతానుగతికముగా చరించుచు ముందువారికి దారి గట్టిపరచుచున్నారు. ఆ రాజనరేంద్రునకు రాజరాజనరేంద్రుడు మాళవపతి రాజమహేంద్రుడు రాజరాజను పేరులు కలవు. అతడు అనపత్యుడు. రాజనరేంద్రుడు రత్నాంగితో

చక్కిలిగింత వెట్టినను సారెఁ గిశాకిక నవ్వుచుం బయిం
బక్కఁ బడంగఁ జక్కని కుమారుని మక్కువ మీఱ నేడ్పురాఁ

చెక్కిలి గీఁటి యెత్తి యెదఁ జేరిచి ముచ్చట దీఱ నట్లుగా
నక్కట ముద్దు లాడవలదా కలదా యిటువంటి భాగ్యముల్

అని తన విచారమును వెలిబుచ్చెను. ఈ సందర్భమున చేమకూర వేంకటకవి మూడు పద్యములు వ్రాసెను. రఘునాథ రామాయణము నందు దశరథ మహారాజు తన యనపత్యతను తలచుకొని మంత్రితో తన పరితాపమును వివరించెను. రెండు స్వతంత్ర రచనలే. రఘునాథ నాయకుని పద్యములు చదువు నప్పుడు కలుగు ఆనందము వేంకటకవి పద్యములందు కానరాదు. అవి రసానుభవమును పొంది విరచించిన పద్యములు. వానిని చదువునప్పుడు పాఠకుని కనులముందు చిఱు బొజ్జతో పసిపాప రూపము కనుపించును. వెనుక నుదాహరించిన పద్యములు చూచుకొనవచ్చును. వేంకటకవి పద్యములు కవిత్వము కొరకు కావ్యత్వముకొరకు వ్రాయబడినవి. పై పద్యమునందలి చక్కని, అక్కట యను పదములు ప్రాసకొరకు ననుప్రాసకొరకు వాడబడిన పదములు. అట్టి పదములు కావ్యాంగన నెమ్మేన పొడమిన పుడుపుడు కాయలు

సంతాన రహిత సంసారంబు నాయక
రత్నంబు లేని హారంబుగాదె

ఇత్యాది పద్యమునందు వినోక్తి యలంకారము కలదు. అది రసావి ర్భూతికి సహకారి కాలేదు. రసోదయమునకు కారణ భూతమయిన యలంకారము కావ్యమునందు రాణించును. కానినాడు పాఠకునకు విసుగు పుట్టించును. అలంకారములకు కావ్యమునందు స్థానా స్థానములు గలవు. అయినచోటను, కానిచోటను వానిని వాడిన కావ్య రమణీయత చెడిపోవును. రాజరాజనరేంద్రుడు ధరణి గల జను లెల్లరు శివ పూజ గావింపవలయునని చాట బనిచెను. శివా లయము లెల్లెడల నిర్మించెను.

రాజశిఖామణి పూజలు
రాజ శిఖామణి యొనర్చె రమ్య దళాళిన్

రాజీవ కుముద చంపక
రాజీ వకుళాది కుసుమ రాసుల వేడ్కన్

ఇట్టి శబ్ద చమత్కారములు అక్షర రమ్యతలు తంజావూరు కవుల కావ్యములందు సాధారణముగా పెక్కు తావులందు గోచరించును. అది వారి కృతులందలి విశిష్ట లక్షణములలో నొకటి

శాలలు గట్టిరి చాల వి
శాలతలు చెలంగుచుండ సరయూ తటినీ
కూలమున సవనమున కను
కూలముగాఁ బనుల హరువు కొమ రొప్పంగన్

అతని శుభ గుణము లల ఫణి
పతియును వాచస్పతియును భాషా పతియు
న్నుతియింప లే రయిన నా
మతికొలఁది వచింతుఁ గొంత మాని వతంసా (ర. రమా)

ధీ రాజిలఁ జనవీరా
వీరాయిత కేళి నిన్ను వెలకు గొనేరా
నేరాల కేమి రారా
రారాపులు మాని విజయ రాఘవ ధీరా (మ. దా. వి)

నీవు పోయిన పనికి రానీవు కొదవ
పట్టి పల్లార్చి దేవకి పట్టి నిటకుఁ
దోడుకొని వత్తు ననుచు నీతోడు చిలుక
నెమ్మి కన నెమ్మనమ్మున నమ్మి యుంటి (రా. సాం)

ఇటువంటి శబ్దాలంకారములు గల పద్యములు తంజావూరు కవుల కావ్యములం దెందు చూచినను గనిపించును. అందు చేమకూర వేంకట కవి కడు సమర్థుడు. విజయ విలాసమునం దిట్టి రచనా చమత్కారములను విరివిగా వాడినాడు. అది యా కవి కొక వినోదము. మచ్చునకు

అయ్యారే చెలు వెక్కడ
నయ్యారే గెలువఁ జాలు నంగజు నారిన్
వెయ్యారులలో సరి లే
రయ్యా రుచిరాంగ రుచుల నయ్యంగనకున్

ఇట్టి రచనల యందలి మోజునకు లోబడి యొక్కొక్కప్పుడు వ్యాకరణమును త్రోసిపుచ్చును

అన్నన్న మొగము వెన్నుని
యన్నన్న జయించుఁ గన్ను లన్నన్ నలినా
సన్నములు నడుము మిక్కిలి
సన్నము మాటలు సుధా ప్రసన్నము లెన్నన్

అన్న నన్న జయించు నని నుగాగమము రావలయును. దీర్ఘ సమాసములు శబ్దాలంకారములు రస స్రుతికి నడ్డుపాటు లని యాలంకారికుల మతము. అవి మృదులము లయి తేలికగా నర్థమగున వగుచో నుపయోగించ వచ్చు నని రసగంగాధరుని వాదము. తంజావూరు కవుల కృతులందలి యీ శబ్దాలంకారము లచ్చటచ్చట తప్ప పాఠకుల కర్థము కానివి లేవు. అవియును విజయవిలాసమునందే కలవు. సామాన్యముగా వారి పద చమత్కారము లచ్చ తెనుగుల మీదను వాడుక పదముల మీదను వాడుచుందురు. కావున తేలికగా నర్థమగుచుండును. అందుమూలమున పాఠకున కానంద మొదవించుచుండును. దీనిని గురించి ముందు విరళముగా చర్చింపబడును. రాజరాజనరేంద్రుడు కాశీశునకు నభిషేకాదు లొనరించెను. శివుడు వాని పూజ లంగీకరించెను. మహారాజునకు ప్రత్యక్షమయ్యెను.

వర దాన సంపద వా మోత్తమాంగముల్
శైలజా గంగల సాక్షి తెలుపఁ
గోప ప్రసాదైక గుణ రూఢిఁ జూపులు
చందమా మల్లుని సాక్షి తెలుప

ఖలశిక్ష సాధురక్షణమునఁ గటియుఁ గేల్
శార్దూల మృగముల సాక్షి తెలుప
ననుప మాజ్ఞా సిద్ధిఁ బునుక గంగాళంబు
సరసీరుహాసను సాక్షి తెలుప

బంధు రాష్ట్ర విభూతులు పరిఢవిల్లఁ
దనదు రాజశిఖామణిత్వంబు వెలయఁ
బ్రమదమున మందహాసాననములతోడ
వచ్చి ధరణీతలేంద్రుని స్వప్నమునను

ఇది శివుని వర్ణనము. రాజశిఖామణి యనగా శివుడనియు రాజశ్రేష్ఠుడనియు నర్థములు. రెండు పక్షములందు నన్వయము సరిపోవునట్లు శ్లేషాలంకార ముపయోగించబడినది. అలంకారాంతరితమయి శివుని రూపవర్ణన యిందు నిమిడి యున్నది.

కెంపారు జడల క్రిక్కిరుసు సందులనుండి
మందాకినీ దేవి ముందు లరయ
నమృతంబు జడివారు నొదలఁ జిన్ని చు
క్కలరాజు జిలుగు వెన్నెలలు గాయ
వలెవాటుగాఁ గొన్న వాసుకి మలుపులోఁ
బునుక పేరులు వక్షమున నటింప
భువన సంరక్షణంబునకుఁ దార్కాణమై
హాలాహలచ్ఛాయ లరుత మెఱయ

భోగి కుండలంబులు చెవి నూఁగులాడ
శూల డమరు పినాక కపాల పాణి
యగుచు సాక్షాత్కరించె నా యంబుజాస
నాంబుజాత లోచనుల సమక్షమందు (దా.)

ఇది చిత్రశిల్పము. ఈ రెండు పద్యములలోని యందచందములను పాఠకు లూహించుకొనగలరు. అట్లు సాక్షాత్కరించిన శివుడు "రత్నాంగి కుదయమా నొక రత్నమువంటి తనయుండు. వానికి నా

పేరి''డు మని యదృశ్యు డయ్యెను. అట్లే కుమారుడు జన్మించెను. దాదు లా సంగతి రాజున కెరింగించిరి. రాజు మొగమొకయింతయుఁ బుజాలు మూఁడయినవట. చక్కని దేశీయము. బాలకునకు సారంగ ధరు డని పేరు పెట్టిరి.

కన్నుంగవఁ గాటుక యిడి
చన్నిచ్చుచు నేడు పుడిపి చక్కని ముద్దుం
జిన్ని కుమారుని మారుని
పెన్నుద్దిని బత్తి నెత్తి పెంచిరి దాదుల్

రమణీయమయిన రచన. పరుగులువారు శయ్య. చిన్ని కుమారుని మారుని. యిది లాటానుప్రాసము. చన్నిచ్చుచు దేశీయమగు వాడుక పదము. ఈ రెండు నీ పద్యమునకు మెరుగు పెట్టుచున్నవి. రసపుష్టి కలిగించుచున్నవి. ఇదే కాదు. దీని తరువాత

పూ నెఱి మేని రాకొమరుఁ బొత్తులలోపల నుంచి గట్టు వి
ల్కాని వర ప్రసాదమునఁ గల్గిన చక్కని యన్న నిద్ర పొ
మ్మా ననుఁ గన్న తండ్రియని మక్కువఁ జొక్కఁగ జోలవాడి రిం
పూనిన జాళువా పసిఁడి యుయ్యెల నయ్యెలనాగ లూఁచుచున్

పూర్వ పాదాంతమునందలి పదము తరువాత పాదములోని ప్రాస స్థానమువరకు చొచ్చుకొని వచ్చినప్పుడు పద్యము మిక్కిలి దూకుడుగా నడచి పోవుచుండును. ఆ ధారాశుద్ధి పద్యమునం దున్నది. ఈ వరుస పద్యములు రసవంతములైనవి

కను ఱెప్ప వేయక కనుఁగొంచుఁ దనలోన
నుంగుంగ యని సారె నుగ్గడింప
నెలనవ్వు పాల బుగ్గలపై దువాళింప
నత్తత్త యని గోగి యాడుచుండ
విద్దెముల్ సేయుచు వింతలే కెవ్వరు
చప్పటుల్ చరచిన సరస కరుగ
జిలిబిలి ముద్దు మాటలతోడ దాది ప్రే
లంది మెల్లనె తప్పు టడుగు లిడఁగఁ

గను మొఱంగి చెలుల్ మఱుంగున నడంగి
తొంగిచూచిదోబూచి యన్నం గికాకి
కన్నగఁ గుమారుఁ గౌఁగిట గారవించి
యలరుదురు వేడ్కఁ దలిదండ్రు లనుదినంబు

ఈ పద్యమునందు పాద పాదమునను వర్ణింపబడిన యాటల మూలమున సారంగధరుని క్రమక్రమాభివృద్ధి సూచింపబడినది. అనుభవము కల మానవు డీ పద్యమును చదువునపుడు అంతకంత కొదవు నానందాతిశయముతోపాటు శిశివు వాని యమాయికపు ఆటలు మనోనేత్రమునకు బొడగట్టుచు నారు నెలలనుండి యేడాది వరకు పెరిగినవాడగును. ఇది స్వభావోక్తి. ఈ వర్ణనలో ఆ శక్తి యున్నది. అది కవి ప్రతిభ. ఇట్టి యాకర్షణీయములగు భావములను వెలయించు పద్యముల మధ్య

ఇన కర స్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుఁడు భాసిల్లు కరణి
ఇన కర స్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుఁడు భాసిల్లె నంత

అను నీ పద్యములోని పాద యమకము ఉంగరములోని జాతి రత్నము వలె భాసిల్లినది. స్థానము నెరిగి ప్రయోగించిన సముచితమగు నలంకారము కావ్యమునకు శోభ నాపాదించును. లేనిచో ఫల శూన్యమగు గారడివాని విద్యా ప్రదర్శనము వలె రస విచారము చేయునపుడు కవి ప్రయాస మొకటియే మిగులును.

"మంత్రాభిషేక మే మర్యాదఁ జేసెనో
తల కెక్కిన విషంబు తొలఁగ లేదు"
"వరదాన సంపద వామోత్తమాంగముల్
శైలజా గంగల సాక్షి తెలుప"

ఇత్యాదిగా గల పద్యములు రెండు నీ కృతి కటువంటివి. రెండవ దానియం దలంకార ప్రసక్తికంటె శిల్ప రచనకు స్థానము కలదు.

ఔచిత్య మెఱింగి పాత్రపోషణ గావించుటయందును అలంకారము లుపయోగించుటయందును కవి తెలివితేటలను వినియోగించవలసి యున్నది. ఇందువలన వేంకటకవికి నౌచిత్య విచారము లేదని నే ననుట కాదు. ఈ కావ్యమును ప్రథమ ప్రయత్న మని సూచించుట నా యుద్దేశ్యము.

చంద్రునకు స్వయంప్రకాశత్వము లేదు. అది యొక మంచు గోళము. సూర్యుని కిరణములు చంద్రునిమీద పడుటవలన చంద్రుడు ప్రకాశించునని ఖగోళశాస్త్రము. అట్లే రాజు కరస్పర్శ చేత సారంగధరుడు మిగుల ప్రకాశించెను. నానాట నభివృద్ధి నొంది యౌవనవంతుడయ్యెను. అని చక్కని భావము నెలకొల్పెను. తండ్రి వానికి యౌవరాజ్యాభిషేకంబు గావించెను. ఘూర్జరాధిపుని కూతురగు మంజువాణిని వానికి పరిణయ మొనరించెను. కాలము గడచినది. రాజరాజు ఒడ్డోలగంబం దుండెను. అట్టి సమయమున

పులి తోల్కాసెల నంట దోపిన పిడెంబుల్ పీలి పూఁదావళం
బులు బల్సింగపుఁ జుంచు దండకడియంబుల్ చెంపలన్ జెక్కు పీ
కలు కెంజేగుఱు బొట్లు జుంజుఱు సిగల్ గౌరంపు మైపూతలున్
బలు దూపుల్ వెడవిండ్లును న్జెలువొనర్పన్

భిల్ల జనంబులు కొందరు వచ్చిరి. జల్లులు పునుఁగు జవాదుల పిల్లులు కుందేటి లేటి పిల్లలు కానుక పెట్టిరి. ఇట్లు మనవి చేసికొనిరి.

క్రోల్పులు ల్మంపిల్లి గొట గొట మని రొప్పి
బలు సింగముల నైనఁ బట్టఁ జూచుఁ
గండ క్రొవ్వునఁ గన్ను గానక పందులు
బిరుదేనుఁగుల నైన నోరయఁ జూచుఁ
గాఱుపుల్ దిని యాము కవిసి మన్ బోతులు
కారుపోతుల నైనఁ గదుమఁ జూచుఁ
బోతరించి సివంగు లీత లాతల చేసి
గబ్బి యెల్గుల నైన గిబ్బఁ జూచుఁ

సామి వాని చలంబు మచ్చరము బలిమి
యెక్క డేవంక నేమని యెంచ వచ్చు
నొకటి నొక్కటి సడ్డ సేయక మెలంగు
నా పొలంబునఁ దరతరంబై మెకములు

రఘునాథరాయల కొలువునకు భిల్లజనంబులు వచ్చుచుందురు. రాజుతో మనవులు చేసికొనుచుందురు. వారిని వేంకటకవి చూచి యుండును. కావున వారి వేష భాషలు నైసర్గికముగా నుడువఁ గలిగెను. అల్లసాని పెద్దన మనుచరిత్రలో నాల్గవ ఆశ్వాసమునందు నిట్టి ఘట్టమును వర్ణించెను. సారంగధర చరిత్రమునందలి యీ కథా భాగములోని కొన్ని పద్యములు వానిని గుర్తుకు తెచ్చును. వరాహముల "కొస వెంద్రుక యొక్కటి రెమ్మ దీసినన్ జిల్లున వెళ్ళఁబో చమురు చిమ్మనగ్రోవిని జిమ్ము కై వడిన్" అని వేంకటకవి నుడివెను. పెద్దనగారు

పొడిచిన కైదువునకుఁ జము
రిడఁగా వల దగ్గి కాఁక యించుక యిడినన్
జెడుగఱ్ఱుల గ్రుచ్చిన నం
జుడు మంటలఁ దగిలి నెయ్యి జొటజొట వడియున్

అని వర్ణించిరి. ఇంతకంటెఁ బై పద్య పాదములం దన్ని విధముల నతిశయ మెక్కువ కలదు. మనుచరిత్రలోని

"కండూతికై రాయుఁ గర్కశంబగు తుంటిఁ
బీటఁ వెట్టిన మ్రాను పెల్లగిల్ల"

అను పద్యమునందున్న అతిశయ స్వభావోక్తులలోని యంద చందములు వేంకటకవి పద్యములందు కనిపించవు. రాజరాజనరేంద్రుడు వేటకు బయలుదేరెను.

ఒంటు ముత్తెములతో నొంటు కెంపుల కాంతి
చెక్కుల జవ్వాదిఁ జికిలి సేయ
హురమంజి ముత్యాల యొరగు పాగ మెఱుంగు
నొసలి బిత్తరి బొట్టు ముసుఁగు వేయ

జాతి నీలపుఁ దాళి చాకచక్య ప్రభల్
కస్తూరి నెఱి పూత గుస్తరింప
సొగసు సూర్య పటంపు సురెవాలుఁ మైదళ్కు
హొంబట్టు దట్టిపై నోలగింపఁ
జేతి వజ్రంపుఁ బిడితోడి చిక్కటారి
చాయ వలెవాటు దుప్పటి సంకుఁ దోమ
రాచిలుక తేజి నెక్కెడు రౌతనంగఁ
జక్కఁదన ముప్పతిల్లంగ జనవిభుండు

ఇది రాజరాజనరేంద్రుని వర్ణనము. ఈ పద్యము పోకడ పీఠికలోని రఘునాథ నాయకుని వర్ణించిన

కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ
జౌకట్ల నిగనిగల్ చౌకళింప

అను పద్యపు పోకడతో సరిపోలుచున్నది. రాజరాజనరేంద్రుని వర్ణించిన పద్యమునందు సైతము మనోనయమునకు రూపము పొడ కట్టు శిల్పమున్నది. దాని కా యచ్చతెనుగు పదముల కూర్పుగల రచన చక్కని యందము తెచ్చినది. తెనుగు పదములలో రసికజన హృదయోల్లాసకరమగు మార్దవ మున్నది. ఆ మృదుత్వము ఆ పద్యములో గలదు. దానికి నడక కొంత సహకారి యైనది. వేంకటకవి సీస పద్యముల నడక శ్రీనాథుని సీసముల నడకను బోలియుండును. శ్రీనాథుడు సీస పద్యములు నడిపించుటయందు పేరు మోసినవాడు. ప్రతి పాదము యతి స్థానము దగ్గర పదము ఆగిపోవును. ప్రతి యర్థ పాద మెక్కడి కక్కడ విరుపుకల దగును. గణములు ఒకపాటున సాగిపోవును. మచ్చునకు

చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బూవుఁబోడి
సత్య లోకముదాక సకల లోకంబులు
ఆటపట్టులు మాకు నబ్జవదన

ఇత్యాదులు. ఈ నడకను పెద్దనాది ప్రబంధ కవు లనుకరించిరి. మచ్చునకు

కలశ పాథోరాశి గర్భ వీచిమ తల్లి
కడుపార నెవ్వాని కన్న తల్లి

తిక్కనగారి సీసమునకు శ్రీనాథుని సీసమునకు చాల తారతమ్యమున్నది. తిక్కనగారి సీసము పాదారంభమునుండి చివరివరకు విరామము లేకుండ ధారావాహికవలె సాగిపోవును. యతి పదమధ్యగతమయి యుండును

కాళ్ల యొప్పిద మాఁడుక ట్టనుజ్వాలము సే
యంగ సంకుల బాహు లంద మొడల వి.ప

కాంచన మయ వేదికా కనత్కేతనో
జ్వల విభ్రమమువాఁడు కలశజుండు వి.ప

ఇత్యాదులు చూచుకొన వచ్చును. గణములలో తూక ముండదు. రాజరాజనరేంద్రుడు వనమున కరిగెను. వేటలాడి యందందు వింతలరయు చుండెను. అందు

కనుమాయఁ జని సీతఁ జెనకు కాకాసురుఁ
గనుమాయఁగాఁ బాటికొనిన చోటు
తల కిక్కు వలపునఁ దగులు శూర్పణఖ ము
క్కును జెవుల్ రాపాడుకొనిన చోటు
సపరివేషం బైన చంద్రబింబము వోలె
గుడి వ్రాసి జానకి నిడిన చోటు
కుహనా మృగ నిశాటు గహ నాధిదేవత
కనురక్తి బలి ఇచ్చినట్టి చోటు

కనుఁగొనినాడు. ఈ పద్యము మనుచరిత్రలోని

నిడుద పెన్నిఱి గుంపు జడ గట్ట సగరు ము
మ్మనుమండు తపముఁ గైకొనిన చోటు

ఇది మొదలుగా గల పద్యమును బోలి యున్నది. ఇచట సారంగ ధరుడు ఉబుసు పోకకు ఒకనాడు తన సరి రాజకుమారులతో పారావతముల పందె మొడ్డినాడు. ఆకాశ వీధికి తన పావుర మెగురవైచినాడు. అది

అభ్ర మాతంగంబు హ స్తంబులోఁ జిక్కి
కదలెడు పుండరీకం బనంగ
హరి విధుల్ వెఱఁగందఁ బెరుగు నంబర కేశు
తలవాఁకఁ దేలాడు నెల యనంగ
మిన్నేటి దరులందు మేత లాడుచు నున్న
యెదుటు రాయంచ లేఁగొదమ యనఁగ
వడిఁ బోవుచో జారిపడు నభోమణి తేరి
తెల్లని చిన్నారి జల్లి యనఁగ

ఱెక్క లార్చుచు లకుముకి పక్కి రీతిఁ
దెలుపుచు ధరణి నేమైనఁ దెలుపుఁ గనినఁ
బెట్ట యని గమకించి చూపెట్టు కొనుచు
నుండెఁ బారువ మప్పు డయ్యువ జనంబు

మనోహరమైన భావకల్పన. ఉత్ప్రేక్షాలంకారము. పాఠకుని చిత్తము రంజింప చేయుచున్నది. రెండవ పాదమున తేలి+ఆడు తేలాడు అని సంధి చేయబడినది. తేలి క్త్వార్థకము. క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు అను సూత్రముచేత సంధి నిషేధింపబడినది. 'ప్రవాహినీ దేశ్యా' సజీవ మగు దేశభాష యొక ప్రవాహము వంటిది. ఒక్కొక్కప్పుడు వ్యాకరణ సూత్రములను ముంచెత్తుచుండును. ప్రపంచ భాష లన్నిటికి గల లక్షణ మిది. నిరంకుశాః కవయః. కాళిదాసాది కవుల కావ్యములందు వ్యాకరణముల నతిక్రమించిన తావులు కలవు. 'త్రయంబకం దదర్శ.' అందుకనే వ్యాకరణములం దెప్పటి కప్పుడు అపవాద సూత్రములు పుట్టినవి. భాషావేత్తలు వాని నంగీకరించిరి. చేమకూర వేంకటకవి స్వతంత్రించి యీ సంధి కావించెను. విజయ

విలాసమునందిటువంటి స్వతంత్ర ప్రయోగములు పెక్కు గలవు. ఆధునిక కవుల కావ్యములందు క్త్వార్థక ఇకార సంధులు చాల చోటు లందు కనిపించు చున్నవి. కావున ఇట్టివి దోషములు కావు. అభ్రమా తంగమను దానికి ఐరావత మని బులుసు వెంకట రమణయ్యగారు వాఖ్యానించిరి. అభ్రము ఆకాశ మను మాతంగము ఏనుఁగు అని యర్థము చెప్పినచో అందము కలదు. కవి యభిప్రాయముకూడ అదే యయి యుండును. ఒక ఆధునిక కవి సారంగధర నాటకమునందు

గగ నేందిరా రామ కై సేయు రవలచే
పాలుపారు పాపట బొట్టనఁగ

ఇత్యాది పద్యముచే పావురమును వర్ణించెను. పారావతము కొంత తడవు గగనమునందు క్రీడించినది. రాజ కుమారుడు బిట్టుగఁ గేక వేసి విన పిల్చినాడు. అది వెండి కరంగి ముద్దయైన ట్టిరు తెక్కలున్ ముడిచి చుక్క తెగి పడు క్రమమున రాఁదొడగినది. చక్కని యుప మానములు. దానిని చిత్రాంగి పట్టుకొనినది. చిత్రాంగికి సారంగ ధరునియందు వలపుకలదు. ఈ కారణముచేత సారంగధరుని తన సౌధమునకు రప్పించుకొన తలంచినది. వాని రాకతలంచుకొని వాసన కుల్కు కుందనపు బొమ్మయో, కలికి రూపైన రత్నమో, కాక యల్ల మోహినియో నాగ సాలంకృతయై యెదురు చూచుచుండెను. అంతటితో ప్రథమాశ్వాసము పూర్తియైనది. ఈ కథ చదివినవారికి వినినవారికి నొక సందేహము రావచ్చును. చిత్రాంగి యప్పటికి వయసు మరలిన యేబదియేండ్ల యువతియై యుండవలయును. కథను బట్టి సారంగధరుడు పాతికేండ్ల వాడయి యుండ వచ్చునని తోచు చున్నది. ముదుసలికి వయసునం దున్నవానిపై నేటి ప్రేమ. కథ యం దౌచిత్యము లేదు. అందుకనే శ్రీకృష్ణమాచారిగారు తన సారంగధర నాటకమునందు కథ మార్చినారు. సారంగధరునికొరకు నియమింప బడిన కన్యకను రాజరాజ నరేంద్రుడు మోసగించి వివాహ మాడినట్లు వ్రాసినాడు. అందుమూలమున కథ కౌచిత్యము నాపా దించినాడు. రసము చక్కగా పోషింప బడినది. వేంకటకవి కది

తోఁచలేదు. అని వాదింపవచ్చును. ఆ మాట కాదనను. ఈ కావ్యము నందు ప్రధాన రసము శృంగారాభాసము. కరుణ దాని కంగము. వయసు మళ్ళిన యువతి నడివయస్సునందున్న వాని పయిన వలపు నిలుపుటయు నొక రకమగు నాభాసము. అని సరిపెట్టుకొన వచ్చును.

సారంగధరుడు పావురమును తీసికొని వచ్చుటకు బయలుదేరు టతో ద్వితీయాశ్వాసము ప్రారంభ మగును. సుబుద్ధి మంత్రి కుమారుడు సారంగధరుని స్నేహితుడు. చిత్రాంగి చిత్త మెఱింగినవాడు. దూర దృష్టి కలవాడు అతడు

రా జొకఁ డూర లేఁడు చెలి ప్రాయపు బిత్తరి నీవు రూప రే
ఖా జిత మన్మథుండ వటు కావునఁ బోఁ దగదయ్యా నీకు నో
రాజ కుమార! యెక్కడి పరా కిటు సూడఁ గదయ్యా భామినీ
రాజుల చిత్తము దెలియరా దెటుపో యెటు వచ్చునో కదా!

అని యడ్డగించినాడు. ఈ పద్యమునందు చెలి ప్రాయపు బిత్తరి యనుట అంత సంజసము కాదు. కథను బట్టి రత్నాంగియు జిత్రాంగియు కొంచె మించు మించొక్క ప్రాయంపు వారై యుందురు. కాకున్న కొంత చిన్నది కావచ్చును. కథా ప్రారంభ మట్లే చేయ బడినది. అప్పటి కామె యిరువ దేండ్ల దయిన నయి యుండ వల యును. కథ నాటికి సారంగధరుడు వివాహితుడు. పాతి కేండ్లయిన నుండ వలయును. అప్పటికి చిత్రాంగి నలుబది యైదేండ్ల దైనయై యుండును. ఆమె ప్రాయపు బిత్తరి యెట్లగును? కావున ఈ విశేషణ మంత సమంజసము కాదు. ఎటుపో యెటు వచ్చునో చక్కని దేశీయ మగు వాడుక పదము. సుబుద్ధి మాట నిరాకరించినాడు రాజ కుమారుడు. చిత్రాంగి మేడ కరిగినాడు.

సిక పువ్వు టెత్తు తావికి వెంటఁబడు తేంట్ల
ఝంకృతి మాగధ స్తవము గాఁగఁ
గడిది రాయకుమార గండపెండేరంపు
రవళి కంచుకి లోక రవము గాఁగఁ

దలఁ జుట్టి వచ్చు దృగ్ధాళ దళ్య ప్రభ
లిరువంక వేయు చామరలు గాఁగ
నలు దెసల్ మిఱుమిట్లు గొలుపు దేహ చ్ఛాయ
తలఁగఁ ద్రోయఁగ రాని బలము గాఁగ

రాజసంబునఁ గక్ష్యాంతరములు గడచి
యరిగె నపుడు జగన్మోహ నాంగ విజిత
రాజరాజ కుమార సారంగధరుఁడు
రాజరాజ కుమార సారంగధరుఁడు

చక్కని పద్యము. యిక్కడనుండి యీ కావ్యము నానాట పాలు పోసికొని పొట్టపెరిగి గట్టిపడు వరి కంకి వలె, నంత కంతకు రసాభి వృద్ధి కలిగి పోను పోను మనస్సును రంజిల చేయుచు మూడవ ఆశ్వా సమున పరిణామమును పొందినది. ఈ సీస పద్యము నాల్గు పాదము లందు కవి నాల్గు రకముల సారస్యములను పొందుపరచినాడు. వంది మాగధులు రాజులను కైవారము చేయుదురు. తేంట్ల ఝంకృతి వందమాగధ స్తవముగా చెప్పుటచేత రాజరికము సూచింపబడినది. రెండవ పాదమునందు చరణమునకు కుమార గండపెండేరము కల దనుటచేత యువరాజనియు అందుమూలమున మొదటి యౌవన ప్రాయమునం దున్నవాడనియు తెలుపుచున్నది. గండపెండేరపు రవళి కంచుకి లోక రవముగా వర్ణింపబడినది. కంచుకి యంతఃపుర సంచార యోగ్యుడైన వృద్ధ సేవకుడు. వివాహితు లగు రాజ కుమారులకే యంతఃపురము లుండుట లోక ప్రసిద్ధము. అట్టివారికే కంచుకుల యలజడి యుండును కంచుకీరావముగాగ యనుటచే వివాహితు డని సూచింపబడినది. మూడవ పాదమునందు తలఁ జుట్టి వచ్చు దృక్కులుకలవా డనుటచేత ఆకర్ణాంత విశ్రాంతములు కను లని తెలుపబడినది. అందుమూలమున అందమగు ముఖము కలవా డని సారస్యము. మనుచరిత్రయందు ఇంతలు కన్నులుండ అనుటలోని సారస్యము కూడ ఇదియే యని రసజ్ఞుల యభిప్రాయము. నాల్గవ పాదమందు శరీర లావణ్యము వర్ణింపబడినది. ఇట్టి రాసజము కల

సుందరాకారుడగు సారంగధరుడు చిత్రాంగి సౌధమునందలి కక్ష్యాంతరములను దాటి యరుగుచుండెను. చిత్రాంగి వేశ్య. ఈ పద్యము తరువాతి కథకు బీజము. 'భోగ బాహ్య మయ్యె పూచిన సంపెంగ పోలుపు మధుక రాంగనలకు వోలె' అను వాక్యమునందు వరూధిని వల చుటయు ప్రవరుడు తిరస్కరించుటయు గల కథ బీజమునందు మొలక వలె నిమిడి యున్నటుల

కడిది రాయ కుమార గండపెండేరంపు
రవళి కంచుకి లోక రవము గాఁగ

అను పాద భావములో సారంగధరు డంతఃపురాసక్తు డనియు చిత్రాంగి వలపు నిష్ఫల మనియు, కథ యిమిడి యున్నది. అలంకార ముత్ప్రేక్ష. గీతమునందు యమకము. సారంగధరుని రాక చెలికత్తె లెరిగించిరి.

ఉరు కుచ డెంద మెంత మృదువో మఱి తియ్యని తుంట వింటనే
విరవిరవోవు నారిఁ గొని పెన్నెఱి గొజ్జగ తూపుచేత న
చ్చెరువుగఁ బొంచి కంటికిదిసింపనివాఁ డపు డేసి యార్చెఁ బో
సురసుర స్రుక్క మెత్త నగు చోటనె గుద్దలి వాఁడియాఁ గదా.

కంటికి దిసింపనివాడు చక్కని పదము. కంటికి కనిపింపనివాడు మన్మథుడని భావము. పెన్నెఱి గొజ్జగి తూపుచేత నేసినాడట సారస్యముగల భావము. చిత్రాంగి పెన్నెఱులయందు గొజ్జగి పూల నలంకరించుకొనినది. రసోద్దీపన కారణములు చంద్రజ్యోత్స్న కుసుమాదికములు. అంతఃపురమున నున్న చిత్రాంగికి తా నలంకరించుకొనిన గొజ్జఁగి పూపు లుద్దీపన విభావము లయినవి. చివరి పాదమునందు లోకోక్తి. రసవంతమయిన పద్యము. వేంకటకవి యిట్టి లోకోక్తులను రస పుష్టికొఱకీ ఆశ్వాసమునందు పలుచోటుల వాడెను.

అతి వినయము ధూర్త లక్షణము
వెన్నఁ బెట్టుకొని నేతికి నేటికి నంగలార్పఁగన్
అరచేలోపలి నిమ్మపండు
నీరు పైకొని వచ్చిన నేరికైనఁ గోకయను బుద్ధి కల్గునే

ఇత్యాదులు. సంస్కృత లోకోక్తులును సందర్భానుసారముగా వాడబడినవి.

> వినాశ కాలే విపరీత బుద్ధిః
> గ్రామో నాస్తి కుత స్సీమా

ఇవి యన్నియు హారములోని జాతి రత్నముల వలె నా యా తావు లందు భావ గర్భితములై తళుకులను వెలయించుచున్నవి. చూచి నది చిత్రాంగి సారంగధరుని. వాని యందమున కబ్బురపాటు నొందినది. ఇచట కవి యేడు పద్యములలో చిత్రాంగి నోట సారంగధరుని యఖిలాంగశృంగార మభినుతింప చేసినాడు. ఇది నాటకపద్ధతి. తిక్కన్నగారి రచనా విధానము. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమునందు ద్వారకా పుర వర్ణనాదులు పాత్రల నోట వర్ణింపించెను. అది యంద మగు విధానము. పాఠకులకు విసుగు పుట్టింపదు. కథకు రమణీయత నొదవించును. "చిత్తరువందు వ్రాయరా దిక్క మనీయ రూపము" అనుకొనినది చిత్రాంగి. 'అలేఖ్య తనూ విలాసుడై' యను పెద్దన్నగారి మాట గుర్తునకు తెచ్చుచున్నది. చిత్రాంగి

> అపుడు మంజీర కలకలం బాలకించి
> వలదు వల దన్న గతి దోఁపఁ బలికి పెనఁగు
> నంచ గమిఁ గాళ్ళఁ ద్రోచి యేతెంచె శకున
> మడ్డగించిన పని సేయనగునె యెందు

ఇందు అర్థాంతరన్యాసాలంకారము కలదు. అలంకారములలో పాఠకుని మనస్సు మిగుల రంజింపచేయునవి ఉపమా అర్థాంతరన్యాసములు. ఉపమా కాళిదాసస్య. ఉపమాలంకారములకు కాళిదాసు పెట్టినది పేరు. ఆయన యుపమానములు మనస్సు నాకర్షించుచుండును. దానికి కారణము మానవానుభవమునకు దరిదాపులం దుండును. అందులో నానందమున్నది. అనుభవమునందున్న విషయమును అలంకారము నందిమిడ్చి చెప్పుటచేత దానియందొక హృదయాకర్షణీయమగు నూతనత్వము కవి కల్పించినవాడగును. అందు

మూలమున పాఠకుడు చదువుచున్నప్పుడు వెంటనే యర్థము చేసికొనును. దాని ననుభవములోనికి తెచ్చుకొనును. సారమును గ్రహించి యానంద మనుభవించును. ఆనందానుభవమే రసానుభవము. ఆనందో రసః. 'ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః' 'ఏకో హి దోషో గుణ సన్నిపాతే నిమజ్జ తీందోః కిరణే ష్వివాకః' ఇత్యాదు లరయునది. వీనిని చదువుచున్నప్పుడు కలుగు ఆనందము 'విదూర భూమి ర్నవమేఘ శబ్దా దుద్భిన్నయా రత్నశలాక యేవ' అనుదానియందు కలుగదు. దాని నర్థము చేసికొని యనుభవమునకు తెచ్చుకొనుట కొంత ఆలస్యము పట్టును. కావున సామాన్య మాన వానుభవమునం దున్న వానిని ఉపమానములుగా వాడుటలో నందము అర్థముతో పాటు అవగతమగును. రస స్రుతికి సహాయభూత మగును. అందుమూలమున పాఠక లోకమున కమితానంద మొదవును. ఆంగ్లేయ కవుల యుపమానములు మానవుల తలంపుల కందుబాటులో నుండును. కావున వారి రచనలను చదివి మానవ లోకము మురిసిపోవుచున్నది. భారతీయులను పాశ్చాత్య వాఙ్మయ వ్యామోహములో పడవేసినది యా సమాకర్షణీయ రచనా వైదగ్ధ్యమే. టాగూరును విశ్వకవిగా చేసినది యా నైసర్గిక కవితా రచనయే, కాళిదాసునకు ఖండ ఖండాంతరములందు విఖ్యాతి సంపాదించిన దదియే. కాళిదాసుని యుపమలలో నా యందమున్నది. ఉపమలలోనె కాదు అర్థాంతర న్యాసములందును సరసజన మానస సమాకర్షణీయ మైన శక్తి యున్నది. అందుమూలమున

శరీర మాద్యం ఖలు ధర్మ సాధనం —
యాచ్ఞా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధ కామా —
భ్రష్టస్య కా వా గతిః —
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః.

ఇత్యాదులు లోకోక్తులయి పండిత పామర జనముల రసనాగ్రములందు నృత్య మొనరించుచున్నవి. కవుల యనుభవములు, మానసిక ప్రవృత్తులు అర్థాంతరన్యాసములం దిమిడి యుండును.

నమ్మియుండగా వలవదు బుద్ధిమంతులు నవ ప్రియులైన ధరాధినాథులన్ —
వనిత తనంత తావలచి వచ్చిన చుల్కనగాదె యేరికిన్ —
పతులు మెచ్చని చెలువు నిష్ఫలముకాదె —
వనితల కలుక కార్యసాధనముకాదె —

మహాకవుల కావ్యములం దిట్టివి తెనుగు భాషయందును గలవు. ఇట్టి లోక సహజములైన విషయము లలంకారములందు నెలకొని ఉన్నత స్థాయి యందు ప్రవహించు కవితా వాహినిని మానవ సామాన్య స్థితికి తెచ్చును. రసానుభవ మొదవించును. ఆనందము కలిగించును. కవికి కీర్తినాపాదించును. ఉత్ప్రేక్షాదుల కీ శక్తి లేదు. వేంకటకవి యిట్టి యర్థాంతరన్యాసములు తన కావ్యమునందు పలుచోటుల వాడుచు వచ్చెను.

బాస చేసిన వనజాక్షుల నమ్మరాదు —
వారకాంతల కెందైన వావి కలదె —
మనసునకు మనసే సాక్షి కాణము —
నీరు పైఁగొని వచ్చిన నేరికైనఁ గోక యను బుద్ధి కల్గునే లోకమునను.

ఇత్యాదు లరయునది. ఈ వాక్యములు ద్వితీయాశ్వాసములోని కథకు మెరుగులు పెట్టుచున్నవి. పాఠకునకు ప్రపంచము ననుభవములోనికి తెచ్చుచున్నవి. చిత్రాంగి

నిశ్రేణి శోణ మణి శ్రేణి కాంతులఁ
జరణాబ్జ రాగంబు శిరము దన్న
జాతరూప కవాట జాత రూప స్ఫూర్తి
నంగవల్లీ చ్ఛాయ యవలఁ ద్రోయ
జాల మౌక్తిక వజ్ర జాల మంజుల ద్యుతిఁ
గను దోయి జిగి యోరగంటఁ జూడ
నస్తంభ నీల మయి స్తంభ రుచితోడ
నెఱి కొప్పు గప్పు డాలొరసి కొనఁగ

న వ్విలాసిని యతి మనోహరములైన
చవికె లరుగులు పాకలు చప్పరములు
నాది యైన విశేషమ్ము లన్ని యతని
కెచ్చరించుచు మేడపై

కిఁ గొనిపోయినది సారంగధరుని. ప్రకృతమును వర్ణించుచు కథకు సంబంధించిన యప్రకృతమును స్ఫురింప చేయుటలో కవి ప్రతిభా విశేషము ప్రకటమగుచుండును. కళా గోపనమునందు కళ గలదని ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులందరు నొప్పుకొనిన సంగతి. పై పద్యము నందు అతిశయోక్తి అలంకారము. మెట్లనెక్కుచున్న చిత్రాంగి విలాసమును కవి వర్ణించెను. దానితోపాటు అంగముల యంద చంద ములను స్ఫురింపఁజేసినాడు. ఒక పాత్ర నాపాదమస్తకము నైష ధాది గ్రంథములందు వలె కవి వర్ణించుటకంటె, కథా సందర్భమును పట్టి ప్రకరణోచితముగా నా పాత్ర యంద చందములు స్ఫురింప చేయుటలో నెఱ జాణతన మున్నది. కళాసౌభాగ్య మున్నది. పాఠ కునకు విసుగు పుట్టించదు. హృదయ సంతోష సంపాది యగును. అట్టి ప్రతిభ చతురత మొదట చూపినవాడు పెద్దన. వరూధిని యంగ సౌందర్యమును కథలో విలీనము గావించి పాఠకునకు స్ఫురింపజేసెను. పాత్రను పాఠకునకు ప్రత్యక్షీభూతము గావించెను. 'చూచి' ఝుణం ఝుణ త్కటకాది పద్యము లటువంటివి. నెత్తురు నెగజిమ్ము చున్న యెఱ్ఱని కమలములవంటి పాదములు, బంగారు వన్నెను తిరస్కరించు చున్న పచ్చని మేని మిసిమి, తెలి ముత్తియముల నిగ్గును కడకన్నుల చూపు నొరపుచేత జయించుచున్న వాలు కనులు, నీలముల నవల ద్రోయు ముంగురుల నైగనిగ్యము కల చిత్రాంగి రూప రేఖలు ఈ పద్యము చదువునపుడు గోచరించును.

తిక్కనగారు అడుగుల నునుఁ గాంతి యను పద్యముచేత నుత్తరను వర్ణించెను. అది రసజ్ఞు లందరు వినుతించిన పద్యము. అందు తద్గుణము, స్వభావోక్తి, ఉపమాలంకారములతో బొమ్మను చెక్కి మెఱుగు పెట్టి వన్నె చిన్నెలు సవరించి కనుల యెదుట నిలిపి

నాడు. వేంకటకవి యీ పద్యమునందు మరింత సారస్యము నింపి నాడు. గ్రంథ విస్తర భీతిచేత నింతటితో విరమింపవలసి వచ్చినది. రసజ్ఞులగు విద్వత్కవి వరులు గ్రహించుకొనగలరు. అది శయ్యా మందిరము. అందు శృంగార రస పోషకములగు చిత్తరువులు పెక్కు గలవు. తరువాతి నాటకమున కిది రంగస్థలము. చిత్రాంగి సారంగ ధరుని మణిమయ పీఠము మీద కూర్చుండ బెట్టినది. గౌరవించినది. అందలి చిత్తరువులు చూపినది. వ్యాఖ్యానము లారంభించినది. వాని కన్నిటికి ప్రత్యాఖ్యానములు చేసినాడు సారంగధరుడు. అతని హృదయము సునిశ్చల మయినది. నీతియు ధర్మము పద్మాసనములు వేసికొని కూర్చున్నవి. అవి పారమార్థిక యోగమవలంబించినవి. చిత్రాంగి మాటలు చెవి కెక్కలేదు. సారంగధరుని బుద్ధి పెడదారి పట్టలేదు. మొదటి ప్రయత్నము నిష్ఫలమయినది. దానోపాయ మవలంబించినది. ఆసలు పెట్టి వలపు లూరింప తలంచినది.

పసని కదంబము మంజుల
వసన కదంబము ననర్ఘ వర మణి భూషా
విసరంబులు విరి నెత్తా
వి సరంబులు దిగిచి వలపు వెలి విసరంగన్

సారంగధరున కొసంగినది. వరూధినీ ప్రవరుల కథకును, చిత్రాంగీ సారంగధరుల కథకు దగ్గర పోలిక లున్నవి. రసము రెండింటియందు శృంగారాభాసము. రచనయందు పోకడలయందు భుజములు రాచు కొనిన తావులును గలవు. వరూధిని

నభో వాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబులివి మత్కాంతారసంతానముల్

అని ప్రవరునకు తెలిపినది. అందలి

సద్యో వినిర్భిన్న సారంగ నాభికా
హృతమై పిసాళించు మృగమదంబు

కసటువో బీఱెండఁ గరగి కట్టల నంటి
గమగమ వలచు చొక్కపు జవాది

మొదలగునవి చూపినది.

వివిధ కుసుమ కదంబంబు దివిజ తరుజ
మృదుల వసన ఫలాసవామేయ రత్న
భూషణంబులు గల విందు భోగ పరుఁడ
వయి రమింపుము ననుఁ గూడి యనుదినంబు

అని యర్థించినది. ఈ గీతమున కనుసరణము 'పసని కదంబము' అను కందము. దానిని వ్యాఖ్యానించుచు పసని ఎరుపు మించిన పసుపు వన్నె కలదయిన కదంబము. సువాసన ద్రవ్యములతోఁ గూడిన చందనము కలపము అని యర్థము వ్రాసిరి. దానిని నేను కాదనను. వివిధ కుసుమ కదంబంబు మనసునం దుంచుకొని వేంకటకవి పసని కదంబము అని మొదట వాడినాడు. కావున పసని= బాగయిన, కదంబంబు= పలు రకములగు పూలు, చేర్చికూర్చిన సిగమాల యని నా తలంపు. కదంబము దేశీయముగా కూడ వాడవచ్చును. దక్షిణ దేశమునందు వివిధ రకములగు పూల నేర్చి కూర్చిన సిగ బంతులకు కదంబము లందురు. ఇప్పు డిప్పు డా పదము మన దేశమునకు సిగ మాల యను నర్థములో పాకినది. ఈ యర్థము సమంజస మని రెండు పద్యములు సరిపోల్చి చూచిన వారికి తోఁచక మానదు. విరి నెత్తావి సరంబులు కంఠ మాలికలు. పూల దండలు. వలపు వెలి విసరంగం దిగిచినది చిత్రాంగి. వలపు=వాసన, ప్రేమ యని యర్థములు. వాని నొకొ క్కటి యొసంగుచు నొకొక్క భావ గర్భితమయిన పదము విసరినది. పలుకు చతురత రసికుల పాలి సొమ్ము. ఓయి నెఱజాణ యని సంబోధించినది. ఆ సంబోధనలోనే చిత్రాంగి నెఱ జాణతన మిమిడి యున్నది. పలుకు చతురత పట్టుబడి యున్నది. వలపు తలపులు నెల కొని యున్నవి. సర్వము గ్రహించుకొని వర్తింప గల నేర్పరి వని భావము. విరులు చూపినది, తలకొనఁ జేయుము అన్నది. తల తాల్పు మని యర్థము. ప్రయత్నమునకు పూనుకొనుము. లే అని హెచ్చరిక.

జవాది కనుపరచినది. చెయి పట్టుము అన్నది. ఊ తీసికో చెయి చాచుము అని యర్థము. ఎందు కాలశ్యము నను పరిగ్రహింపుము అని సారస్యము కలాపము చూపించినది. ఎదఁ జేర్పుము అన్నది. వక్షమున రాచుకొను మని భావము; నను కౌగిలించుకొను మని నిగూఢార్థము. ఎంత మాట నేర్పరి చిత్రాంగి. నిజముగా చిత్రాంగియే. చిత్రాంగి కాదు ఆ పలుకు చతురత వేంకటకవిది. వాడుక పదములలో నింత శృంగార రస భావముల నిమిడించి వ్రాసిన వారు తెనుఁగు కవులలో నింకొకరు లేరు.

నిజముగా చిత్రాంగియే మాటలాడు చున్నటు లున్నది. చెయి చాచి యందిచ్చు చున్నటుల సహృదయులకు కనిపింపక మాన దా చిత్రాంగి కనుల ముందు. గ్రహించుకొనవలయును గాని యొక విధముగా నవ్వు వచ్చును. మనస్సున కానందము కలుగును. 'వహవ్వా' యనిపించును. అది సరసమగు రచన. రసికుల కానంద కోశము పద్యము. 'ననుఁగూడి రమింపు మనుదినంబు' అన్నది వరూధిని. ఏ యాడది సిగ్గు విడిచి యట్లన గలుగును. ఎంత వేశ్య యయినను నిగూఢముగానే తన మనస్సును సాధ్యమగునంతవరకు దోబూచులాడించును. చిత్రాంగి పలుకులలో స్త్రీ సహజమగు లజ్జ, నిగూఢత, నిపుణత యున్నది. 'కో' కొనుము అనినది. తీసికో అని భావము. ఎందు కాలస్యము నన్ను కైకొనుము అని తొందరించినది. ఆ తొందరపాటులో స్పర్శ సుఖ మనుభవించినది. మరుడు నామాన్యుడు కాడు. వేసినాడు గొజ్జంగి విరి కోలలు. వేసినట్లూరకుండక కో యని విజయ నాద మొనరించినాడు. జలుదిట్ట వేంకటకవి. సరస మగు రచన. సారస్యముకల పదములు. చక్కని నడక. అనుభవైక వేద్యములు సారస్యములు. ఆప్టీలు బ్రౌను కోశములు బిక్షి పెట్టవు, సహృదయులకు స్వానుభవములు సాక్ష్యములు. కవికి వ్యాఖ్యాతకు విమర్శకునకు నవియే కోశములు. వ్యాకరణములు పట్టుపట్టవు. ఇట్టి మనస్సును రంజింపజేయు పద్యరత్నములు చేమకూర రచనలందు పెక్కు గలవు. గనిలో రత్నములతోపాటు గులక రాళ్ళుండవచ్చును.

అది లోక సహజము. వేంకటకవి కృతులను తూయుటకు తెనుగు నాట జన్మించిన సహృదయుడగు పండిత కవి కావలయును. ఆభర ణాదులను చేనంటి నాదుదాపురముగా నీ పెట్టెయం దుండనిమ్ము అనినాడు సారంగధరుడు. 'జాతికిఁ దోడు పోయినది రాసుతు డెందము' చక్కని వ్యావహారికము. సముఖంబున నేటికి రాయ బారము-లని తలంచినది చిత్రాంగి. వేంకటకవి సందర్భోచితముగా చక్కని లోకోక్తులు పొదువు చుండును. అవి ముత్యాలవలె మిల మిల మెరయుచుండును. చిత్రాంగి మూడవ ప్రయత్నమునకు తల పెట్టినది 'తల్లీ తడవాయెనువచ్చి పోయెదను' అని లేచినాడు

అనిపోఁ గుచ్చెలు వీడ లేనడుము జవ్వాడన్ జగన్మోహన
స్తన కుంభంబుల మీద హారములునృత్యం బాడ లోఁ దాల్మి యూ
డనిఁ బాడన్ బులకాంకురంబు లొనఁగూడం గట్టివా యింతి వే
చని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంక్షం బట్టఁగాఁ బోయినన్

అని వేంకటకవి.

వెతలం బెట్టకు మింక నన్ననుచు నీవీబంధ మూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందన్ గొప్పువీడన్ దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననునయాలా పాతి దీనాస్యయై
రతి సంరంభము మీర నిర్జర వధూ రత్నంబు పైపాటునన్

అని పెద్దనగారు.

ఈ రెండు పద్యములందలి రచనా తారతమ్యము రసజ్ఞు లగు చదువరులు తేలికగా గ్రహించుకొనగలరు. చిత్రాంగి సారంగధరుల సంభాషణ యీ సందర్భమునందు కొంతవరకు చక్కగా నున్నది

అంటకుమీ లతాంగి నను

అన్నాడు సారంగధరుడు.

అంటిన నేమి మనోహరాంగ! నే నంటు పడంగలే దనుచు
నంటెద నిన్ను

అన్నది చిత్రాంగి.

అ టంట గాదు న, న్నంటఁగఁ జెల్లునే జనకు నంటిన పిమ్మట అనినాడు సారంగధరుడు.

ఐన నేడు నీ
యంటున నంటుగామి నెటు లంటును గెంటక మేనప్రాణముల్
మే లౌరడి పెట్టంగా
మేలా నిలు పోవలదు సుమీ చల మేలా
మేలావఱ సద్రూపక
మేలా? వరియింపుము

అనుచు మీద పడినది చిత్రాంగి. విజ్ఞాన సంపన్ను లయిన రసజ్ఞులు సరసముగా మాట్లాడుకొను నప్పుడు పలుకులలో నెఱ జాణతనమును వెలయించుట లోక సహజము. చిత్రాంగి నెరజాణ. ఆ జాణతనము పలుకులలో నొలక పోసినది. ఇట్టి రచనా చమత్కారము రసాస్వాదన పరుల చెవులలో నమృతము చిందించును. కాని యది మితి మించినపుడు వెగటుగా నుండును. అతి సర్వత్ర వర్జయేత్ 'అంటు' శబ్దము మీద చూపిన చమత్కారము హృదయాహ్లాదము గానున్నది. అందుకు సందేహము లేదు. కాని రెండవ పద్యము వెగటుతన మొదవింపక తప్పదు. అలంకారములు కృతి కన్యకకు నలంకారములు కావని నేననుట లేదు. కవితకు కావ్యత్వ మాపాదించు ననుటలో ననుమానము లేదు. అవి మితిమించినచో వికృ తాకారమును కలిగించును. అందును శబ్దాలంకారములు కావ్యాంగన ధరించిన పైచీరె వంటివి. అది అతి సున్నితమయి మేని యంగసౌందర్యమును దోబూచు లాడించు సింగారంపు జిలుగు చెంగావి చీనాంబరమువలె నుండవలయును. ఆపాద మస్తకము కప్పివేయు బీబీల ముసుంగు దుప్పటివలె నుండరాదు. చేమకూర వేంకటకవి శబ్దాలంకారము లీ కావ్యమునందు పూలపాన్పుపయి పల్లేరు కాయలవలె, అందందు హృదయ బాధాకరముగా నున్నవని రసజ్ఞులకు తోపక పోదు. ఒక్కొక్క చోట కృతి సౌందర్యమును కప్పిపుచ్చు చున్నవి. పై సంభాషణయం దీ సంగతి గోచరించును. 'అంటు పడంగ లేదు'

అనుచోట పర పురుష స్పర్శచేత మైల పడలేదు అని బులుసు వేంకట రమణయ్యగారు వ్రాసిన యర్థమంత సమంజసముగా కనిపించదు. అది కవి భావమయి యుండదు. అంటుపడలేదు అనుటకు బైట నుండలేదు అను అర్థము సమంజసము. స్త్రీల యెడ అది సహజము. కొంత సంభాషణ జరిగినది. సారంగధరుడు

ఇపుడు ధైర్యమూని యిసుమంత పుష్పకో
దండ ధరుని బాధ తాళలేవు
పాపమెంచి మీఁదఁ బటుకార్లఁ బట్టించు
దండధరుని బాధ తాళఁ గలవె

యని ప్రశ్నించినాడు: చిత్రాంగి సమాధానము చెప్పినది.

నను ముద్దువెట్టి యుఱుకంగఁ దలంచెదు మానుమీ వగల్
నినుఁ గలఁచు భర్త కోపగాఁ డనఁగ నేల
కోల బుజమున నిడి యున్నఁ దోలువాఁడు
అవ్వ యననేల రాజౌనొ రడ్డియానొ
నాటి కిపుడేమి రారాదె యేటి కలఁచ
ఇక్కల్ల దెలిసి విభుఁడిం
కొకప్పుడు సేయు సేఁత కొప్పితిఁ బని లే
దెక్కడి తగ వెక్కడి కొల
యెక్కడి వావేల కొమ్మ లెవ్వరి సొమ్ముల్

ఇటువంటి మనోహరములగు దేశీయములు మాండలికము లగు పదముల మెరయింపులు సారంగధర కావ్యమునందు కలవు. ముద్దువెట్టి యుఱుక తలంచినాడట సారంగధరుడు. చక్కని దేశీయము. సంభాషణ వైఖరి మాటల సహజత్వము బాగున్నవి.

దారువన స్త్రీలఁ దగిలెఁ గాని యదేమొ
నీవలె ముక్కంటి నేరఁడయ్యొ
గారాబుఁ గూఁతునే గవిసెఁ గాని యదేమొ
నీ వలెఁ బరమేష్ఠి నేరఁ డయ్యొ

నల యహల్యా కాంత నంటెఁ గాని యదేమొ
సీవలె జంభారి నేరఁ డయ్యె
గురుని యిల్లాలితోఁ గూడెఁ గాని యదేమొ
సీవలె నుడురాజు నేరఁడయ్యె
వారికంటెను హెచ్చైనవాఁడ వౌర
నీకుఁ గలబుద్ధి వారికి లేకపోయె
నీవు నాఁటికి లేకపోయితివి గాక
చేరి వారల యోజలు చెలుపలేవె

ఈ పద్యమునందు నిస్పృహత్వము నొంది నిలువున నీరయిన చిత్రాంగి యంతరంగము దోబూచులాడుచున్నది. ఒక విధమగు దైన్యము, దెప్పిపొడుపు, అక్కసు ఒక విధమగు జాలి, వేడికోలు రసిక హృదయమునకు పొడగట్టును. ఈ మాటలు చిత్రాంగి సారంగధరుని వైపు వెనుతిరిగి సగము మొగము త్రిప్పి కడగంట నరయుచు జాలి కొలుపు చూపులలో కన్నీరు సుడులు తిరుగ పలికి యుండును. ఈ పద్యము చదివి నప్పు డా రూపము సౌహృదయ హృదయాకర్షణీయ మయి మైమరపింపచేయుచు నెదుట నిలుచును. పాఠకుడు ఆమె స్థితికి జాలి పడును. గీతము సీస పద్యము కొన నమర్చిన మౌక్తిక హారము లోని నాయక రత్నము. అందుండి దైన్యాది భావములతో ముప్పి రులు గొని యీర్ష్యాసూయా కోపములు మెరుంగలయి తళుకులు వారుచున్నవి. అందు అడియాసల కొడి గట్టిన స్త్రీ యంతరంగము మూమూర్తుల నవగత మగుచున్నది. వరూధినియును

వెలిపెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశ కన్యా కేళి తప్పు సేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టరికము?

ననుపుత్రుఁడై వేల్పు నాగవాసముఁ గూడి
మహిమఁ గోల్పడియనే మాంధకర్ణి?
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైన జంభాసురారి?
వారికంటెను నీ మహాత్త్వంబు ఘనమె
పవన పర్ణాంబు భక్షులై నవసి యినుప
కచ్చడా లట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్ర లిండ్ల బందాలు గారె!

యనినది. ఇరువురు నొక బడియందు చదువుకొనిన వారే. జననము నందు స్వభావమునందు భేద మున్నది. వరూధిని వాక్కులలో అతిశయ మున్నది. అపును ఆమె గంధర్వాంగన. ఆమె మాటలు సంభాషణ యున్నత స్థాయిలో నడచినవి. దానికి తగినట్లు ప్రవరుడు త్రికాలాగ్ని హోత్రి. చిత్రాంగి మాన వాంగన. స్త్రీ జన సహజ మగు సామాన్య స్వభావము కలది. ఆమె సంభాషణలో నా మానవత్వము గోచరించును. సారంగధరుడు రాజ కుమారుడు. పాప భీతి కలవాడు. ఆ తారతమ్యము పెద్దన వేంకట కవుల రచనలందు అడుగడుగునకు నగుపించును. పెద్దన

చిన్ని వెన్నెల కందు వెన్నుఁ దన్ని సుధాబ్ధి
పొడమిన చెలువ తోఁబుట్టు మాకు

అను పద్యములో పొందుపరచిన యా ఘనతను 'తామరస నేత్ర లిండ్ల బందాలు కారె యను తుదివరకు పద్య పద్యమునందు ప్రస్తరించు కొనుచు కులమున కనుగుణ మగు నున్నత స్థితియందు కథ నడిపించినాడు. వేంకటకవి

ఇంతింత గాని తమి న
కాంతా మణి యట్టు లతని గనుఁగొని మణి పీ
ఠాంతరము డిగ్గి

నది మొదలు 'చేరి వారల యోజలు చెరుప లేవే'యను నంతవరకు చిత్రాంగి పాత్రయందు మానవ స్వభావమును నెలకొల్పుచు తదను సరణములగు దేశీయతలు ప్రతిబింబింప చేయుచు ప్రతి పద్యమును తూకముగా నల్లినాడు. వేంకటకవి మనుచరిత్రమును అక్షర మక్షు రమును పరిశీలించి తన సారంగధర కావ్యమును రచించెను. ఇట చిత్రాంగీ సారంగధరుల సంభాషణము చంద్రోపాలం భాది ఘట్టములం దడు గడుగున అనుకరణములు గోచరించును. రెండు గ్రంథములు దగ్గర పెట్టుకొని చూచిన సత్యము గోచరించును. మొదట విపులముగా వ్రాయ తలంచియు నవకాశము లేమి మచ్చు నకు చవి చూపి విడిచితిని. మిగిలినది పాఠకులు తెలిసి కొందురుగాక. పిమ్మట చిత్రాంగి మాటల వశంబుగాడని బలిమి నొడసి పట్టినది సారంగధరుని. అతడు పైకోక విడిచి చనినాడు.

ద్వితీయాశ్వాసము నందలి తరువాతి ఘట్టము వేట కరిగిన రాజరాజ నరేంద్రుడు చిత్రాంగితోడి వియోగము వలని వేదనా వశమున చంద్ర దూషణాదు లొనరించుట. మహాకావ్య లక్షణము లలో నిది యొకటి. అయిన కావచ్చును. అది యతుకుపెట్టిన ట్లుండ గూడదు. కావ్యములందు సామాన్యముగా నాయిక మదన తాప వశమున చంద్రాదుల నుపాలంభించుట కద్దు. సారంగధర చరిత్రము నందు నాయికా నాయకులు చిత్రాంగీ సారంగధరులు. వారి కిట్టి సావకాశము లేదు. ఏదో యొక విధముగా దానిని చొనిపించ వల యును. కావున కవి రాజరాజు నెత్తిన మోపినా డాపని. అది యట్లే యున్నది. మూడు కాళ్ళ ముదుసలికి పెండ్లి ముచ్చట యనిపించును. రాజరా జింటికి తిరిగి వచ్చెను. చిత్రాంగి మందిరమున కరిగెను. తల వాసెన కట్టుకొని పరున్నదామె. అచట జరుగ వలసిన లాంఛనము లన్నియు జరిగినవి. ఆమె లేచినది. సారంగధరుడు తన్ను బలాత్కా రించె నని పయ్యెద తీసి గుర్తులు చూపినది. అవి గోటి పోటులు, స్వయముగా చేసికొనినవి. రాజు నమ్మినాడు. తన మంత్రితో నాలో

చించినాడు. సారంగధరునకు కబురు పంపినాడు. ఈ ఘట్టము నుండి ఒకటి రెండు పద్యముల నిం దుదాహరింతును.

నెఱి గొప్పు కొన గోర నివిరి చూచెద నన్నఁ
　　జెలి నీ వది ఘనంబు చేసికొనెదు
గట్టి చన్గవ చేత ముట్టి చూచెద నన్నఁ
　　జెలి యది యొక కొండ చేసికొనెదు
పసి కౌను పిడికిటఁ బట్టి చూచెద నన్నఁ
　　జెలి యది గగనంబు చేసికొనెదు
మించు మే నటు కౌఁగిలించి చూచెద నన్నఁ
　　జెలి యది బంగారు చేసికొనెదు

చెప్పు లె త్తిటు చూడవే యొప్పులాడి
యెంత దయలేని దానవే యేణనయన
యాస పడువారి నెఱుఁగవే యలరుఁ బోడి
చాటు కేగద వేటికే జలజగంధి.

అని నాడట సారంగధరుడు చిత్రాంగిని. మిగుల సారస్యము గల పద్యము. ఘనంబు కొండ గగనము బంగారు పదములలో చక్కని భావము లిమిడి యున్నవి.

అనుచు నా కేలు పట్టిన యప్పు డధిప
యేమి చెప్పుదు నా నగు లీశ్వరుండ
యెఱుఁగు నా సిగ్గుఁ గాచువా రెవరు లేక
మిట్టి మీనై పడు చెనంటి కిట్టు లంటి

నన్నది చిత్రాంగి రాజుతో.

తృతీయాశ్వాసము చిత్రాంగి సారంగధరునిపై నారోపించిన నేరమును విచారించుటతో నారంభమయినది. ధర్మాధికారులు విజ్ఞానేశ్వరము చూచి 'అయ్యాజ్ఞుని వనిఁ గర చరణం బాజ్ఞ నిశా వేళఁ జేయ నర్హం'బని నిర్ణయించినారు. 'పట్టి నట్టు లాజ్ఞ వెట్టఁ

గట్టడి సేసి'నాడు రాజు. అంత సూర్యాస్తమయ మయినది. సంధ్యా రాగ మలముకొనినది.

> ప్రామినుకు మానికమ్ముల భరణి యైన
> తరణి శరనిధి మునుఁగఁగా సరగఁ దిగిచి
> వేయఁబోల్ పై వసు తతి నారాయణుండు
> కాకది కృపీట జాతాప్తిఁ గాంచ నేమి.

ఈ పద్యమునందు వేంకటకవి సంజ కెంజాయను మనోహర ముగా వర్ణించినాడు. అతని కల్పనా పాండిత్యప్రకర్షాదుల కిది మచ్చుతునక. విజ్ఞాన ప్రదర్శనమునకు జాతి రత్నము. వ్యంగ్య స్ఫూర్తి వివిధ ముఖముల వెలయించు చున్నది. వేదము లనెడు మాణిక్యములు గల భరణియైన సూర్యుడు అనెడు నావ సముద్రము నందు మునిగినది కాగా, అందలి వేద రూప మాణిక్యము లగు కిర ణములను రత్న సముదాయమును లాగి నారాయణుడు ఒడ్డున పడవేసి యుండ బోలును. అట్లు కాని యెడల నీటినుండి జన్మించుటను పొందుట యేల కలుగును. తరణి శబ్దమునకు సూర్యు డనియు నావయనియు నర్థములు. సూర్యు డనెడు నావ యని శ్లిష్ట రూపకము చెప్ప వలయును. అట్లే వసు శబ్దమునకు కిరణములు రత్నము లని యర్థము. కిరణము లను రత్నములు అని యన్వయము చెప్పవలయును. సూర్యు డస్తమించునపుడు ఊర్ధ్వ ముఖముగా నెఱ్ఱని కిరణములు పశ్చిమ దిశా సముద్రము నుండి వెలువడు చున్నటు లుండును. అందు మూలమున కృపీట జాతాప్తి గాంచి నటు లుండును. అర్థాంతరమునందు కృపీట జాత మనగా అగ్ని యని యర్థము. అగ్ని తోడి పొందు గాంచుట యెట్లు గలుగును అని భావము. రెండు కృపీట జాతములు గావున పొందు కలిగిన సారస్యము సూర్యుడు రాత్రియందు తన కిరణముల నగ్నియం దుంచి యస్తమించు నని వేదము. ఇందు రూపకము కావ్యలింగము లను నలంకారములు గలవు. (సోమకాసురుడు దొంగిలించిన) వేదములను నారాయణుడు సముద్రము నుండి (వానిని సంహరించి) బైటికి తెచ్చె నని యలంకార

కృత వస్తు ధ్వని. రెండవ పక్షమున పురాతనము లగు బంగరు నాణెములు కెంపులు గలదగు నావ సముద్రమునందు మునిగినది కాగా నీటియందున్న సరంగు బంగారు రతనముల సముదాయమును లాగి బైట పడవేసెను. అట్లు కానిచో సువర్ణ రత్న సముదాయము నకు అగ్నియొక్క పొందు కలుగుట యెందులకు. సువర్ణమునందు మాలిన్యము తీయుటకు అగ్నియందు పుతము పెట్టుదురు. రత్నములకు మెఱుగు పెట్టుటకు నీటిలో నుడక పెట్టుదురు. ఉభయ పక్షములందు కృపీట జాతావాప్తి కలుగు చున్నది. ప్రామినుకులు అను శబ్దమునకు పురాతనము లగు బంగారు నాణెములని యర్థము. వసు శబ్దమునకు బంగారము రత్నము లని యర్థము. కొందరు ఈ పక్షమునందు నీటి వలన నుండి పుట్టుకను పొందుట కలుగుట యెందు కని యర్థము చెప్పి సముద్రుడు రత్నాకరుడగుట ప్రసిద్ధ మని సమర్థించిరి. అది చెల్లదు. పగడములు ముత్యములు మాత్రమే సముద్రము నుండి లభించును. అవి నవ రత్నముల లోనివి. కావున రత్నాకరుడను నప్పుడు ప్రవాళ మౌక్తికము లగు రత్నముల కాకరు డని యర్థము. వజ్రాదులకు చెల్లదు. వజ్రాదులు ఖనిజములు. వానిని కూడ నిమిడ్చి నచో నవయ వార్థము చెప్పు నప్పు డతివ్యాప్తి దోషము పట్టును. లాక్షణికు లది యొప్పుకొనరు. సాగరసార వారిరుహ శౌక్తిక మౌక్తిక విద్రుమ ద్రుమ అని నన్నయ. బంగారము కెంపులు భూమి గర్భము నందుండి పుట్టినవి. కావున ఆ యర్థము ఆ సమర్థన చెల్లవు. ఇది శ్లేష యని కొందరి మతము. విశేషణ విశేష్యములు శ్లేషించి నపుడు ధ్వని యని ధ్వన్యాలోకకారుని మతము. ఇది అలంకార కృత యలంకార ధ్వని. రెండవ పక్షమునందు కావ్యలింగము కలదు. ఇంత చిన్న పద్యమునందు ఇంత భావము ఇన్ని యలంకారములు ధ్వను లిమిడించి రచించిన వేంకటకవి ప్రతిభ ప్రశంసనీయము. ఇట్టి జాతి వజ్రము లీ కృతియందింకను కలవు. పిమ్మట

లోకముల కంట నలమ వేలా కృశాంగి
మిహిరకర రస మానిన మిన్ను పెంచు

గదియ సాంధ్య విభా దీప కలిక యిడఁగఁ
బడిన కాటుక యనఁ దమః పటలి నెఱసె.

నట. ఎంత చక్కని భావము. వేంకట కవికి కాటుకపట్టు విధానము కూడ అనుభవములో నున్నది. అవును కవి కన్ని యనుభవములు నుండ వలయును. ఆ యనుభవము లలంకారరూపమున కవితలో కెక్కించుట యొక వినోదము. అది చదివి లోకము భావము ననుభవమునకు తెచ్చుకొనును. లోలోన మురియును. చిరునగవు వెలారించును. స్త్రీలు మంచిగంధము నరగతీసి పళ్లెమునకు పూయుదురు. కరక్కాయ పొడితో దూది ఒత్తిని చేయుదురు. ఆముదములో వేసి దీపము వెలిగింతురు. దానిపైన ఆ పళ్ళెముంతురు. దానిమీద నల్లగా మసి పారును. అప్పుడు కాటుక పడినది అందురు. ఆ మసి తీసి యాముదము పచ్చకర్పూరములో మేదింతురు. అదియే కాటుక. వేలా లతాంగి తట్టిన కాటుక లాగ యున్నదిట చీకటి. ఎవరికీ భావము అలంకారము సంతోషము కలిగింపకుండును. పగలంతయు సూర్యకరము లనెడు మంచిగంధపు రసము ఆకాశమనెడు పెంకునకు పూసిన సంజ కెంజాయ దీపము వెలిగించినది. చీకటియను కాటుక పడినది. ఈ యత్న మంతయు దేనికందురా? లోకములోని వారి కనుల నలముటకు కనులకు కాటుక పెట్టగానే క్షణకాలము కనులు మూసికొనిపోవును. ఏమియు కనిపించదు. ఈ కాటుక యలమగానే నిశియంతయు కనిపించదు. ఆ కాటుక కొన్ని ఆకు పసరులు కలిపి మేదించి పట్టినచో నిధి నిక్షేపాదులు కనిపించును. అది దొంగల కుపయోగించును. ఉభయత్ర సరిపోవుటకే వేంకటకవి మిహిరకర రసము అని వాడినాడు. ఫలితార్థము లోకులకు కన్నుమూత, దొంగలకు సహకారి చీకటి యని చక్కని యూహతో నిండిన పద్యము. రూపకము ఉత్ప్రేక్ష యలంకారములు. ఇట్టి మహత్తరమగు భావములతో నిండిన సారంగధరను విలువ కట్టుటకు కవికుల దేశికులు మహానుభావులు కింకవీంద్ర ఘంటాపంచాననులు తిరుపతి వేంకట కవులు తగినవారు. వేంకట కవిని మహాకవుల శ్రేణిలో చేర్చినారు.

సుధీతిలకుం డని పొగడినారు. వారికి నా ధన్యవాదములు. సత్యము వెలిబుచ్చిరి. పండితకవి పండిత కవిని గ్రహింపగలడు. వేంకటకవిని గురించి చెప్పిన పద్య మరయునది ఒకసారి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు బెజవాడలో చేమకూర వేంకట కవిని గురించి ప్రస్తావించుచు మాట చతురతతో పాటు మనసు మరపించు రసవత్తర కవిత చేమకూరది అన్నారు.

బెళుకు కాటుక కంటి సొలపు చూపెదలోనఁ
బట్టియుండెడి ప్రేమఁ బట్టి యీయ

అను పద్యము చదివి సారస్యము రస భావాదులు శ్రవణ రసాయనముగా వినిపించిరి. ఆ మహాకవుల శిష్యులు శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు. వారు బందరులో నున్నప్పుడు ఒక శిష్యుని కా పద్యము పాఠము చెప్పుచుండగా వినుట కలిగినది. ఆ యంద చంద ములు తరువాత సందర్భమును బట్టి మనవి చేసికొందును. తలారులు సారంగధరుని కర పాదములు ఖండించిరి. ఆకాశవాణి సారంగధరునికి పూర్వ జన్మ వృత్తాంతము వినిపించినది. చేమకూర వేంకటకవి కవితలో చక్కని శిల్పమున్నది. పలుకులో మాధుర్య మున్నది. మచ్చునకు

ఉమ్మెత పూవంటి యొఱపైన కుచ్చెల
చెఱఁగు మట్టెల మీదఁ జిందు ద్రొక్క
మెలపైన వలరాజు మేడపై బంగారు
కుండలో యనఁ గుల్కు గుబ్బ లమర
నెమ్మోము రేరాజు సమ్ముఖమ్మునఁ గ్రమ్మి
కమ్మపంజుల మొఱుం గెమ్మె నెఱప
భోగినీ మణి గాన పొందు సేయఁగ వచ్చు
నీలాహి యన వేణి నీటు చూప
సైకత నితంబ మొక వింత చలన మొంద
అలతి లేనడు మల్లలనాడు చుండ

నవని నిది గాక యెుయ్యార మద్దిర యని
యెంచనట నాతి వచ్చె రాయంచ నటన

ఇది కౌశాంబి నగరాధిపతి యగు ధవళచంద్రుని భార్య భువనసుందరి యను భోగసతి వర్ణన. ఈ పద్యమునందు స్వభావోక్తి యలంకారము కలదు. దానికి రూపకము ఉత్ప్రేక్ష తోడయి మరింత మెరుగు పెట్టు చున్నది. మొదటి పాదమునందలి కుచ్చెల యను శబ్దమునకు కటి వస్త్రము అని జితకాశియందు వ్యాఖ్యానించినారు దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు. కుచ్చెల యనగా కుచ్చెళ్ళు అని యర్థము. కుచ్చెల చెఱఁగు కుచ్చెళ్ళ చెంగు అంచు అనియే యర్థము. వారు చూపిన ప్రయోగము లన్నియు ఆ యర్థముతోడనే వాడబడినవి. భువన సుందరి భోగాంగన యగుటలో సందేహము లేదు. రాజులకు పలు రకముల భార్య లుందురు. అట్టి భార్యలలో భువనసుందరి యొకతె.

వేంకట కవి శృంగార రసము నెంత చక్కగా పోషించెనో కరుణ రసమును గూడ అంత చక్కగా నిర్వహించెను. ఎన్ని చూచిన లోపము లెంతవారికైన వుండక తప్పవు. వానిని ప్రధాన ముగా గ్రహించి కావ్య ప్రాశస్త్యమును డిందుపరుచుట యుక్తము కాదు. గ్రంథము పెరుగునను భీతిచేత కరుణ రసమునందలి యొకటి రెండు పద్యములు చూపి దీని నింతటితో విరమింతును. చిత్రాంగి రత్నాంగితో ననిన మాట లివి

ఎంతకు లేవు బాలుఁ డనియే పచరించెద వింతె కాక నా
చెంతకుఁ జేరి నీ కొడుకు చేసిన చేతఁ దలంపవైతి వో
కాంత నిజంబె యెవ్వరును గాశికిఁ బోయిన సుద్దులే ప్రతి
ష్ఠింతురు గాని యీ నడుమ చేసిన దోసము లెంచరే కదా
ఏల వితా దిసంతు లివి యెవ్వరు మెత్తురు నోరిలోపలన్
వ్రేలిడి నప్పుడుం గఱవ నేరఁడు నీసుతుఁ డడ్డపాపగాఁ
డే లలితాంగి నీ వనక యేరికఁ నందురె యీయెఁబొమ్ము చా
ల్చాలును వ్రేళ్ళ సందులను జాఱెడు వారలు లేరి యెవ్వరున్.

ఏమి గయ్యాళితనము! ఈ మాట లనుచు హావ భావ నాట్య ప్రదర్శ నాలు కూడ చేసియుండును. చిత్రాంగి పాత్ర నతి రమణీయముగా పోషించినాడు వేంకట కవి. రసమును బట్టి శయ్య కూడ మారినది. ఆ పలుకుబడి యా నానుడులు ఆ విరగ పాటుతనము తలంచుకొని యీ పద్యములు చదివికొనినవారు మునసుబికి లోలోన మురిసిపోయి చిన్న నవ్వు నవ్వుకొందురు. ఇంక శోకరసము మాట

సంపెంగ నూనె వాసనలఁ బెంపెక్కిన
యలకలా యివి కూర్మి తళుకు మొలక
చిట్టాడు నాఁడు నా చిటికెన వ్రేల్వట్టు
చేతులా యివి ముద్దు చిన్ని కూన
ఘులు ఘులు మని యందియలు మ్రోయ నడయాడు
నడుగులా యివి ప్రోది యనుఁగుఁ జూల
ప్రేమ నా చన్నిచ్చి పెంచిన నీ మేని
నెత్తురా యిది పూప నెనరు పట్టి
యనుచు నట రాలి యున్నట్టి యతని కురులు
కర చరణ ఖండ రక్త పంకములు మమత
నెత్తి యక్కునఁ జెక్కున నొత్తుకొనుచు
నిందుముఖి యేడ్చెఁ గోయిల లెల్లఁ గదియ

వేంకట కవి రచించిన ద్వితీయ కావ్యము విజయవిలాసము. ఇందలి యితివృత్తము భారతములోనిది. అర్జునుడు తీర్థయాత్రల కరుగుట ఉలూచీ చిత్రాంగదా సుభద్రలను పరిణయమాడుట మూడు శృంగారఘట్టములు మూడాశ్వాసములుగాఁగల ప్రబంధము. మొత్తము పీఠికతో కలిపి యారువందల డెబ్బది రెండు పద్యము లున్నవి. కథ యింద్రప్రస్థ పుర వర్ణనతో ప్రారంభమయినది. మహా కావ్యమునందు పుర వర్ణన నాయికా నాయకుల వర్ణన మొదలగు నవి యిరువది రెండు వర్ణన లుండవలయునని లక్షణకర్తలు నుడివిరి. ఈ కావ్యమునందు నాయకుడు అర్జునుడు.

పాఱంః జూచిన పరసేన పాఱంః జూచు
వింటి కొరగిన రిపు రాజి వింటి కొరగు
వేయు నేటికి నల పాండవేయు సాటి
వీరుఁ డిల లేఁడు ప్రతి రఘువీరుఁ డొకఁడు

రఘువీరు డను చోట శ్రీరామచంద్రుడని యర్థము. రఘునాథ నాయకు డని ధ్వని. ఇటువంటి నాలుగు పద్యములతో అర్జునుని వేంకట కవి వర్ణించినాడు. గదు డను యదువంశసంభవుడు ద్వారవతినుండి ఇంద్రప్రస్థ పురమునకు వచ్చెను. ఏకాంతమునందు సుభద్ర యందచందముల నర్జునునకు వినిపించెను.

కడు హెచ్చు కొప్పు దానిం
గడువం జను దోయి హెచ్చు కటి యన్నిటికిం
గడు హెచ్చు హెచ్చు లన్నియు
నడుమే పసలేదు గాని నారీమణికిన్

పద్యము రమణీయముగా నున్నది. ఒక దానిని మించి యింకొకటి యున్నటుల వర్ణించుటచేత ఇందు సారాలంకారము కలదు. చివరి పాదము పద్యమునకు జీవము పోయుచున్నది. పాఠకు మనసు మురిపించి నగవు కల్పించు రసవంత మగు భావము కలది. కవుల నాలుక తుదియందు నర్తించుచుండును. ఈ రీతిగా నఖ శిఖ పర్యంతము నొక్క యంగ మయినను విడిచిపెట్టక ఒక సారికి రెండు సారులు రెట్టించి రెట్టించి వర్ణించినాడు. చివరకు సుభద్ర నూగారైనను విడిచిపెట్టలేదు.

అయ్యారే చెలు వెక్కడ
నయ్యారే గెలువఁ జాలు నంగజు నారిన్

అంత యందముగా నున్నదట. సుభద్ర అసూర్యంపశ్య. పోతుటీగకైన చొరరాని నగళులలో మెలంగు బాలిక. గదున కామె నూగారెట్లు కనిపించినదో? కనిపించినది కనిపించినటు లూరకుండక యీతడవ దానిపై సంగతినే యెత్తుకొనినాడు. నూగారుతో జోడించి

అతివ కుచంబులున్ మెఱుఁగు టూరును వేనలియుక్ ధరాధి పో
న్నతియు సహీన భూతి కలనంబు ఘనాభ్యుదయంబు నిప్పు డొం
దితి మని మాటి మాటికిని నిక్కుచు నీల్గుచు వీఁబవీగుచున్

ఉన్నవట. మంచి పరిశీలనా శక్తి కలవాడు గదుడు. చూచిన వానిని సక్రమముగా వర్ణించినాడు. ఆ విశేష విషయమును

క్షితి నటుగాదె యొక్కొకరికి న్నడుమంత్రపుఁ గల్మి కల్గినన్

అని సమర్థించినాడు అర్థాంతరన్యాసాలంకారముతో. పద్యమున కేమి మంచి సారస్యము కలది. నడక పరుగులు వారుచున్నది. సారంగధర పద్యాల వలె వ్యర్థ పదాలు లేవు. చక్కని పదముల కూర్పు. మనో హరమయిన భావము. ఈ విధముగా చూచినవి చూచినట్లు తు.చ. తప్పకుండ వివరముగా వర్ణించినాడు గదుడు సుభద్రను పది పద్యా లలో. ఇంకా వర్ణింపవలసిన గుట్టుమట్టులు మిగిలిపోయినవి కాబోలు. సావకాశము లేకపోయినదో యేమో 'ఎక్కడ చెప్పినాడఁ దర శేషుణ చక్కదనంబు. శతాంశము చెప్పలేదు. నే నొక్కొక యంగ మెంచ వలయును' అని మిరమించినాడు. నాయకుని యెదుట నాయకురాలి కట్టుకోక యుడుగు మడుగునం దణగి మణగి యుండు మర్మాంగ ములను పరుడు వర్ణించుట పాత్రకు కళంక మని వేంకటకవి తలంచ లేదు కాబోలు. లోకవిరుద్ధమని యూహాకు తట్టలేదో. వర్ణన యెంత రమణీయముగా నున్నను పాత్రకు లోపము కలిగించినచో కావ్యము గర్హిత మగును. ఇట్టి లోపములు మన తెనుగు కావ్యములలో చాల వరకు కనిపించుచుండును. దీనికి బీజము సంస్కృత కావ్యములలో నున్నది. అవకాశమును బట్టి మనవి చేసికొందును. ఇటువంటి వానిని పరిశీలించి యాంగ్ల భాషా విదులగు నవ నాగరికులు తెనుగు కవులకు మన స్తత్వము తెలియ దని వేళాకోళము చేయుదురు. ఒకసారి కోరాడ రామకృష్ణయ్యగారు ఇష్టాగోష్ఠిలో నుండి తెనుగు ప్రబంధాల విషయము వచ్చి యిట్లా అన్నారు. 'తెనుగు కవులు ప్రబంధాల్లో పిచ్చిగా వర్ణించారు. పాత్ర పోషణ ఔచిత్యము కూడ ఒక్కొక్క

చోట పాటించ లేదు. రాజు పుర వీథుల వెంట పోతూంటాడు, పౌరాంగనలు మేడల మీాదనుండి తటకాపడి చూస్తారు. అది లోకంలో ఉన్న దే. ప్రతి యీాడదానికి రాజుపై మోహ మంకురించి నటుల సాత్విక భావాలు వర్ణిస్తారు. ఒక్కత్తైనా పతివ్రత వుండదు కాబోలు. ఇంత కంటె అసభ్యత ఇంకేం కావాలి' అన్నారు. నేను నవ్వుతూ అన్నాను "అదేమిటండి అట్లాంటారు; ఒక్కత్తైనా పతివ్రత వుండదా! పెద్దన్నగారు చూడండి ఒక్క నేత్రాంబుజ మొక్క గల్లమొక చన్నొయ్యారపున్ లీల అను మనుచరిత్రలోని పద్యమును చదివి ఒక్కత్తైనా వుందా లేదా!" అన్నాను. నా ప్రక్కన నున్న (కోర్కొండభట్టరు) కృష్ణమాచార్యులవారు ఆ మాట అందుకొని 'అది ముసలది, అందుకనే రాజ కిశోరంబును అన్నాడు పెద్దన్నగారేం తక్కువ తిన్నాడా' అన్నారు. రామకృష్ణయ్యగా రతి గంభీరుడు త్వరపడి యే మాటా అనరు. పూర్వాచార పరాయణుడు. సన్నగా 'దానికిని ఒయ్యారం ఒచ్చింది' అని జారవిడిచారు చిన్న నవ్వు చిలికిస్తూ. అందరము నవ్వుకున్నాం. సంస్కృత కవుల కావ్యములందే యీా లోపమున్నది. నైషధ వ్యాఖ్యాతయే అనుకుంటాను దీనిని గురించి చర్చించాడు.

అర్జునునకు సుభద్రపై అనురాగము జనించినది. ఆమెను పరిణయ మాడవలయును అను ఊహ పుట్టినది. సమయమునకై కాచుకొని యుండెను. దొరికినది. భూప్రదక్షిణమునకై బయలుదేరినాడు. తీర్థములు సేవించుచు గంగా తీరమునకు చేరినాడు. చేమకూరకు సహజమగు నస అందందు పొడసూపినను ఇచ్చట నుండి చివరివరకు చక్కగా సాగినది.

సునాసీర సూనుండు సూచె న్ని మజ్జ
జ్జనా ఘోత్పత త్పంక శకాంక రాత్రో
ర్మి నిర్మగ్న నీరేజ రేఖోన్న మ ద్భృం
గ నేత్రోత్సవ శ్రీని గంగా భవానిన్

ఇది భుజంగప్రయాత వృత్తము. సందర్భమునకు సరిగా తగిపోయినది. అర్జునుడు దేవనదిని గాంచెను. దేవతా దర్శన మైనప్పుడు దండక మును పఠింతురు. ఆ గణముల కూర్పులో భక్తి నుద్రేకింపచేయు శక్తి యున్నది. అట్టి నడక గణముల కూర్పు భుజంగప్రయాతలో నున్నది. రసమునకు భావమునకు తగిన వృత్తమును వాడుటలో కవి తెలివితేటలు వ్యక్తమగును. ఏ రసమునకు తగిన యా వృత్తమును ఛందశ్శాస్త్రవేత్తలు నియమించిరి.

కాళిదాసు వియోగినీ వృత్తమును రతి విలాప ఘట్టమునందు వాడియుండెను. అది కరుణ రసమునకు తగినదని సారస్వత తత్త్వవేత్తలు చెప్పగా వినియుంటిని. మేఘసందేశమునందు మందాక్రాంత మును వాడెను. దాని నడక ఆషాఢస్య ప్రథమ దివసమునందలి మేఘ గమన బోలి యుండుననియు, ఆ గమన సాదృశ్యమును తెలుపుటకే ఆ పద్యమును వాడె ననియు నాకు మేఘసందేశము పాఠము చెప్పుచు మా గురుదేవులు శ్రీ శిష్టా నరసింహశాస్త్రిగారు తెలిపిరి. అందలి సత్యాసత్యములు అప్పుడు నా కంత యనుభవము నకు రాలేదు కాని, నన్నయభట్టు కణ్వాశ్రమ వర్ణనమునకు వాడిన మానిని కవిరాజ విరాజితములు ప్రశాంతమగు నాశ్రమ వాతావర ణమును స్ఫురింపజేయు శక్తి యా నడకలో నున్నదని తెలిసికొన గలిగితిని. కావున రసమునకు సందర్భమున కనువగు వృత్తములు వాడుట ఉత్తమ కవుల లక్షణము. అర్జునుడు

పువ్వారు బోఁడిమై సరి
యెవ్వా రన భీష్మఁ గాంచి యింపొందితి నీ
వవ్వావి యెఱుఁగుదువె మా
యవ్వా! పోషింపఁ బాడి యగు నను నీకున్

అని వినుతించినాడు. బంధువు లొకరి నొకరు కలిసికొని నప్పుడు ప్రాత చుట్టరికాలు బైట వేసికొనుట లోక సహజము. ఈ పద్య మిక్కడ చక్కగా సరిపడినది. సారంగధర కావ్యములోని కందపద్య ములకు, విజయ విలాసములోని కందపద్యములకు నడకలో చాల

తారతమ్య మున్నది. వానియందు కుంటు కలదు, సాఫీతనము చాల తక్కువ. మచ్చునకు

నెలపూ దాలుపు మన పూ
జలు మెచ్చునె యని మదిన్ విచారింపకు చీ
కిలి మాకిలిగా నల్లిన
చెలది తెర ల్బూచి సంతసించుట లేదే

ఇది సారంగధర మొదటి యాశ్వాసములోని పద్యము. పై పద్యము నందలి శయ్యా సౌందర్య మిందు లేదు. ఒక్క కందమునందే కాదు వృత్తము లన్నిటిలో నా భేదము నిశితముగా పరిశీలించిన చో కనిపించును. మొదటి యాశ్వాసము సారంగధరలోని పద్యములకును ద్వితీయాశ్వాసములోని పద్యములకు తరువాతి పద్యములకు భేదము న్నది. సారంగధర తృతీయాశ్వాసము తుదిఘట్టములలోని పద్య మిది

నీ దండకు రాకుండినఁ
బూదండల [వేయు నన్నుఁ బొడగని నపుడో
వేదండ గమన సుమనః
కోదండ ధరుం డదేమొకో దండ మనెన్

ఇంతకంటె నడకలో సాఫీ తనము మృదుత్వము విజయవిలాస కందములం దున్నవి. కందము చెప్పినవాడె కవి యని నానుడి. దానిలో నందము తీసికొని వచ్చుట చాల కష్టము. కంద పద్య రచనలో తిక్కన్నగారు దిట్ట యని జన[శుతి. దీనికి కవిచౌడప్ప పద్యమే [ప్రబల సాక్ష్యము.

ముందటి దినములలోపల
కందమునకు సోమయాజి ఘనుఁ డందురు నే
డందరు నిను ఘనుఁ డందురు
కందమునకుఁ గుందవరపుఁ గవి చౌడప్పా!

విజయవిలాసములోని కంద పద్యములు శయ్యా రమణీయత కలిగి చాల మృదువుగా నుండును. దీనికి దృష్టాంతము పై పద్యము చాలును.

కంద పద్యము లేకాదు. అన్ని పద్యములట్లే యున్నవి. సారంగధరలో వ్యర్థపదములు గాని, యతి ప్రాసలకొరకు యమకముకొరకు తడవు లాడినట్లుగాని కనిపించదు. పద్యముల పోకడలను నిశితముగా సరి పోల్చుకొనుచు చివరకు పరిశీలించి చూచినచో సారంగధర యొక్క బిగువున వ్రాసిన గ్రంథము కాదనియు, అంతరాంతములందాగి మూడాశ్వాసములు మూడు నాలుగు తడవలుగా వ్రాసిన వనియు తోచుచున్నవి. కవితలో పరిపూర్ణముగా ననుభవము సంపాదించిన తరువాత విజయవిలాసము వేంకటకవి వ్రాసియుండును. మరొక విశేషము. సారంగధరలో జాతీయములు ఆచ్ఛికములు వ్యావహారిక ములు దేశీయము లగు పదముల కలయకలుపుతో పద్య రచన సాగినది. మచ్చునకు

క్రిక్కిరిసి నగరిలోనికిఁ
జక్కన దురదురన చొచ్చి చనుచో నేమిం
జెక్కు సెమర్పక యుండెడు
నక్కుమరునిఁ గాంచి వార లతి దుఃఖితులై

విజయవిలాసమం దిట్లుకాదు. జాను తెలుగు పదములతో తత్సమ పదములు మిశ్రమముచేసి దీర్ఘసమాసము లందందు వెలయించుచు మృదు లాతిమృదులముగా వేంకటకవి రచన సాగించినాడు.

సంతోష బాష్ప ధారలు
దొంతరగాఁ జూచి మ్రొక్కి తోయధి వర సీ
మంతిని నా త్రిజగద్వ్ధీ
వ్యంతిని భాగీరథీ స్రవంతిని బొగడెన్

రెండు పద్యములందలి నడకలోని తారతమ్య మరయునది. సారంగ ధర యందు కంటె విజయవిలాసములోని కవిత మిగుల రసవంతమయి మనసు నలరించును. ఏ పద్యము పరిశీలించిన నీ తారతమ్యము గోచ రించును. అర్జునుడు గంగాస్నాన మొనరించినాడు. దాన ధర్మములు చేసినాడు. హరికథాశ్రవణ పరాయణుండయి యచట కొన్నాళ్ళుం

డెను. ఒకనాడు గంగానది సైకతములందు నరుడు విహరించుచుండెను. ఉలూచి యను నాగకన్యక వానిని చూచినది. విజయవిలాసములోని మూడు శృంగార ఘట్టములు మూడు రకములుగా నడచినవి. మొదటిది యులూచి కథ. ఇందు ఉలూచి నాయకురాలు. అర్జునుడు నాయకుడు. బహు ప్రియాసదృశ శీలుడు. కావున దక్షిణనాయకుడు. అతడు

ఇలపయి మత్స్యయంత్ర మొక యేటున నేసి సమస్త రాజులన్
గెలిచిన మేలు వార్త లురగీ వర గీతిక లుగ్గడింప వీ
నుల నవి చల్లగా విని

నది యులూచి. వాని మీద వలపు గొనినది. వాని చెలువ మనేక లీలల చిత్తరువునందు వ్రాసి చూచుకొనుచు నానందించిన దింత వరకు. ఇప్పుడు కంట బడినా డర్జునుడు. విభా వానుభావ సాత్త్విక వ్యభిచారీ సంయోగా ద్రస నిష్పత్తిః—ఈ కథా ఘట్టమునందు ఉలూచి అర్జునుడు ఆలంబన విభావములు.

గుట్టసియాడ గబ్బి చను గుట్టలపైఁ బులకాంకు రావళుల్
తెట్టువఁ గట్టఁ గోరికలు తేటలు వెట్టఁగ వేడుకల్ మదిన్
దొట్టికొనంగ నచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగ నొత్తఁగాఁ
బెట్టిన దండ తీయక విభీత మృగేక్షణ

యులూచి అర్జునుని చూచినది. ప్రారూఢ కటాక్షాదిక మనుభావము. పెట్టిన దండ తీయక ఉలూచి యర్జునుని చూచుట యనుభావము. పెట్టిన దండ అను చోట నడుముపై మోపిన బాహువును అని వేదం వేంకటరాయ శాస్త్రిగారు వ్యాఖ్యానించిరి. అది యెంతవరకు సమంజసమో విచారింపవలసి యున్నది. కన్నార్పక చూచిన దని భావము. ఆ చూచుటలో తొంగలి రెప్పలను వీగనొత్తగా చూచినది అనగా కన్నులను విరివి చేసికొని చూచినది. దానికి కారణ మచ్చెరుపాటు. అర్జునుని యందచందముల కులూచి యచ్చెరుపాటు నొందినది. ఆ యచ్చెరుపాటు వాలు రెప్పలను వీగనొత్తినది. విప్పారునట్లు చేసినది. అట్టి విరివి కనులనుండి రెప్పలార్పక చూచినది. ఆ చూపులు పాండవేయు నలంకరించిన పూల సరము వలె నుండెను.

ఆ సరములను తొలంగ తీయలేదు. తదేక దృష్టితో చూచిన దని భావము. కెట్టిన దండ యనగా అర్జునుని అలంకరింపచేసిన దండవంటి నిరంతరమగు చూపు అని యర్థము. ఇట చూపును పూలహారముతో పోల్చినాడు కవి. అట్టి యెడతెగని దీర్ఘావలోకనమువలన గుట్టసి యూడినది. చను గుట్టల మీద పులకలు పొడమినవి. కోరికలు తేరు కొనినవి. వేడుక లంకురించినవి. ఇందు పులకాంకు రావళులు తెట్టువ కట్టుట సాత్త్విక భావము.

స్తమ్భ ప్రలయ రోమాంచాః స్వేదో వైవర్ణ్య వేపధూ
అశ్రు వైశ్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః ప్రకీర్తితాః

ఇచట చక్షుప్రీతి యను నాయిక చేష్టవలన పొడమిన సాత్త్వికాను భావములవలన రతి స్థాయిభావము గమ్యమానము. స్థాయిభావ ఏవ రసః. రతికి శృంగారము రసము. కావున శృంగార రసము ధ్వనితము. ఇది రసధ్వని.

మరు డసలే కొంటె. అందు వలపు గల నాయికా నాయకుల మీదికి నల్లేరుపై బండివలె పరుగులు పెట్టును.

ఏణాక్షి నపుడు వెడ సిం
గాణిం గొని యలరు తూపు గమిఁ జక్కెరయే
ఖాణముగాఁ గలిగిన కం
ఖాణపు దొర పింజ పింజ గాడఁగ నేసెన్

ఏణాక్షి నపుడు వెడ సింగాణిం గొని యలరుఁ దూపు గమి పింజపింజ గాడఁగ నేసినాడట. ఏ మాధాటి. చక్కని జాతీయములగు జాను తెనుగు పదముల సమ్మేళనముతో పద్యములు రెండును పరుగులు వారినవి. కంఖాణపు దొర అచ్చు పొరపాటు ఖేంఖాణ మని యుండ వలయును. ఖేంఖాణము సంస్కృతము. చక్కెరయే ఖాణముగాఁ గలి గిన ఖేంఖాణపు దొరయట మదనుడు. కవితలో మంచి పరిశ్రమ రచ నలో ననుభవ మున్నగాని యిట్టి పదముల యల్లిక కుదరదు. పాడి నదే పాడరా యన్నటుల పూర్వ కవులు వాడిన పదములనే యిటు నటు మార్చి వాడుటలో గొప్పతనము లేదు. స్వశక్తిచేత వినూత

నములగు పదములను పర్యాయ పదములను సృజించుటలో కవి ప్రతిభ యున్నది. అదియే తిక్కనగారు నిర్వచనోత్తర రామాయణములో నుడివినది. కళాపూర్ణోదయములో పింగళి సూరనగారు ముత్యాలు పోహళించిన లీల యనుటయు నదియే. నన్నయగారు వాడిమయూఖముల్ కలుగువాడు అని సూర్యునికి వాడినాడు. తిరుపతి కవులు తొండముల్ గలుగు జంతువు లని వాడినారు ఏనుగులకు. ఇట్టి పదములు భాషాభివృద్ధికి సహకారములయి తరువాత కవులకు దారి చూపిన వగును. ఒక యాధునిక కవి నీటఁ బుట్టిన విరిఁ బొడమిన వేల్పు అని బ్రహ్మకు పర్యాయ పదముగా వాడినాడు. ఇట్టి స్వతంత్రములు విజయవిలాసములో పెక్కులు గలవు. కావుననే వేంకట కవి కవన పరిశ్రమలో నారితేరిన తరువాత విజయవిలాసము వ్రాసెనని నుడివితిని.

ఉలూచి యర్జునుని సొగసు ఎనిమిది పద్యములలో నుతించినది యున్న తమి కొలంది. ఎంతవర్ణించిన నేమి లాభము. ఉట్టి పదాడంబరమే కాని సారంగధర యందలి చిత్రకళా నిర్మాణము శిల్ప కళా సృష్టి విజయవిలాసమునం దంతగా కనిపించదు.

సిగ సంపెఁగ పూ లొసపరి
వగ కస్తురి నామ మొఱపు వలెవా బారా
సొగ సిటు లుండవలె నని
సొగసి లతాతన్వి యతని సొగసు

నుతించినది. రఘునాథ నాయకుడు కృతిభర్త. అతడు వైష్ణవమతము వాడు. గీరునామము ధరించును. ఆ నామము వేంకటకవి యర్జునునకు పెట్టెను. అర్జునుడు విష్ణువగు శ్రీకృష్ణుని భక్తుడనుటలో సందేహము లేదు. కాని యా కాలమునందు నర్జునాది విష్ణుభక్తులు నామములను అనగా నూర్ధ్వ త్రిపుండ్రములను ధరించి నటుల నెందు నున్నటుల తోచదు. రఘునాథ నాయకుడు ఋశ్యశృంగునకు పట్టెవర్ధనము లున్నటుల వర్ణించెను. విష్ణుభక్తులకు నామ తిలక ధారణ మిటీవలి సాంప్రదాయ మయినది. వేంకటకవి యా సాంప్రదాయము అర్జును

నకు కూడ యలవరచినాడు. అర్జునునకే కాదు ఉలూచికి కూడ కస్తురి నామ మున్నట్లు వర్ణించెను. 'నా వలపు కస్తురి నామము తోడు' అన్నది ఉలూచి యర్జునునితో. నామ మను శబ్దమునకు బొట్టు అని శబ్దరత్నాకరమునందు అర్థ మున్నది. కాని మంచి కపురంపు గీరు నామములుతీర్చి యను చంద్రభాను చరిత్రలోని ప్రయోగమునకును, 'నొసలన్ నామ మొకింత తాల్చినను చాలున్ నీకు నెవ్వారలైనను సుపూజ్యుల్' అను పరమయోగి విలాసము నందలి ప్రయోగమునకును ఊర్ధ్వ త్రిపుండ్రములని యర్థము. నామము లను శబ్దమునకు పట్టెవర్థనము లనియే లోక వ్యవహారము. 'నామాలు పెట్టాడు నా కొంప తీశాడు' అని లోకోక్తి. కావున ఇట నామము లకు ఊర్ధ్వ త్రిపుండ్రము లనియే యర్థము. స్త్రీలకు నామము లుండునా యను సందేహ మక్కర లేదు. దానికి శబ్దారత్నాకరమే సాక్షి. ఇట ఉలూచి అర్జునులకు వేంకటరాజకవి నామములు అలవ రించుట ఆనాటి వైష్ణవ మత ప్రాబల్యము కారణము. రాజు వైష్ణ వుడు. అందుమూలమున ఉలూచి అర్జునులను వైష్ణవులుగా మార్చి నాడు కవి. రాత్రి యైనది. అందరు విశ్రాంతులై యుండిరి. జాహ్నవీ తటమున సంధ్యవార్చి జప తత్పరుడై యున్నాడర్జునుడు. ఉలూచి వానిని తన నగరికి ఉన్నవాని నున్నటుల గొనిపోయినది మాయా బలముచేత. కన్నులు తెరచినా డర్జునుడు. ఉలూచిని చూచినాడు.

జెళుకుఁ గాటుక కంటి సొలపుఁ జూ పెదలోనఁ
బట్టియుండెడు ప్రేమఁ బట్టి యీయఁ
జికిలి బంగరు వ్రాఁత జిలుఁగు టొయారంపుఁ
బైఁట గుబ్బలగుట్టు బైటవేయ
సొగసుఁ గుచ్చెల నీటు వగలు కన్నుల పండు
గలుగ మాయపుఁ గానుఁ గలుగఁ జేయ
నిడుద సోగ మెఱుంగు జడ కుచ్చు గరువంపుఁ
బిఱుదు రేఖకు గెల్పు బిరుదు చాటఁ

గంట సరినంటు కస్తురి కమ్మ వలపు
కప్పురపు వీడియపుఁ దానిఁ గలసి మెలఁగ
నోరపులకు నెల్ల యొజ్జయై యుండె నపుడు
భుజగ గజగామిని మిటారి పొలుపు మీఱి

ఇది మిగుల రసభావ గర్భితమయిన చక్కని పద్యము. అర్జునునకు రసోద్దీపకములయిన యులూచి ప్రాయంపు సోయగము. అలంకార చేష్టాదులగు విభావము లిందు వర్ణితములు. నాగాంగన పక్షమున సాత్త్విక భావములు సూచింపబడినవి. ఈ విభావానుభావ సాత్త్విక భావములతో మెఱుగులు తీరిన ఉలూచి రూప శిల్పము ఇందు చిత్రింపబడినది. కాటుక దిద్దిన బెళుకు కందోయి సొలపు చూపులు. వానిలో సువ్యక్తము లగుచున్న మనసులోని వలపు. ఆంతరంగిక వృత్తమునకు వ్యాఖ్యాత ముఖమని పెద్దల నుడి. ఉబికిన చందోయి మీఁది చికిలి బంగరు వ్రాత పనితనము గల సన్నని పైట; ఉట్టిపైట కాదు. అది యొయ్యారంపు పైట. నవనాగరి కాంగనకు వలె నొక వైపు చన్ను కనుపించుచున్నది కాబోలు. అవును. మోహాంబువలని పరవశత్వము నొందిన ప్రాయంపు గులుకులాడి యులూచి. అందు మూలమున పైట కొంత జారియుండవచ్చును. ఆమె

నాగరిక ముద్ర గల మంచి బాగరి యట
నాగవాసములో వింత నటనల దట

నే ననుటయే కాదు వేంకట కవియే యొప్పుకొనినాడు. అసలే నాగ రిక ముద్ర గల బాగరి. అందులో వింత నటనలది. వానికి తోడు వలపు సొలపు గలది. కావుననే పైట జారినది. ఇంక గుబ్బల గుట్టు బైటపడ కేమగును! చీరె కుచ్చెళులు లేని నడుమును ఉన్నటులు చేయుచున్నవి. ఇంక జడ సంగతి. ఉలూచి జడ నిడుద యైనది. సోగ యైనది. చివర బంగారు కుప్పె కుచ్చులు గలవు. అవి పిరుదులకు బిరు దులను చాటుచున్నవట. చక్కని యూహ. విజయములను పొందిన ఘనులు ఘంటా కంకణాది బిరుదములు ధరింతురు. అవి వారి గొప్ప తనములను చాటుచుండును. పిరుదు లున్నతిచేత విజయమును సాధిం

చినవి. కావున కుప్పె కుచ్చులను ధరించినవి. ఆ కుప్పెకుచ్చులు పిరుదులకు బిరుదులు చాటుచున్నవి. అనగా ఘనతను వెల్లడించుచున్నవి. వేంకటకవి బలుదిట్ట. ఉలూచి జడ పిరుదుల నంటుచున్న దనియు, పిరుదులు మిగుల పెద్దవనియు భావము. కావుననే యొరపుల కెల్ల నొజ్జయై కనిపించినది ఉలూచి, ఆమె యర్జునునియందు వలపు కలది.

ఓష్ఠః ప్రస్ఫుర తీక్షణే విచలతః కూపోదకే మత్స్యవత్
ధమ్మిల్లః కుసుమాంచితో విగళతి ప్రాప్తోపి బంధం పునః
ప్రచ్ఛన్నౌ వ్రజతః స్తనౌ ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే
నీవీ చ స్ఖలతి స్థితాఽపి సుదృఢం కామేంగితం యోషితాం

బెళుకు కాటుక కంటి సొలపుఁ జూపు, ఒయ్యారంపుఁ బైట గుబ్బల గుట్టు బైటవేయుట, జడకుచ్చు బిరుదులు చాటుచున్న పిరుదులు కాముకురాండ్ర లక్షణములు, ఇవి రస పరవశత్వమువలని తన్ను తా నెరుంగకుండుటచేత పొడము లక్షణములు. ఇందు స్తంభ మను సాత్త్విక భావము వర్ణింపబడినది. స్తంభ మచంచలత్వ మని కావ్యాలంకార సంగ్రహము. అది పరవశత్వమువలన కలుగును. ఇందును రసధ్వని కలదని కొందరు సాహిత్యవేత్తల యభిప్రాయము. అది యంగీకరింపతగినది.

అర్జునుడు 'వధూమణి! యెవ్వరిదానవు? పేరెయ్యది? నీకు నొంటి వసియింపఁ గారణమేమి?' యని యులూచిని ప్రశ్నించినాడు. ఆమె నాగవాసములో వింత నటనలు గలది. కావున

మేలి పసిండి గాజుల సమేళపుఁ బచ్చల కీల్కడెంపు డా
కేలు మెఱుంగు గబ్బి చనుఁ గ్రేవకుఁ దార్చుచు సోగ కన్నులం
దేలఁగఁ జూచి

నది. ఇది స్త్రీ స్వాభావికమయిన శృంగారచేష్ట. మహాకవుల విశేషణములు సార్థకములు.

'ఓ మదవతీ నవమన్మథ! ఈ జగంబు పాతాళము. నేనులూచి యను దానను. భుజంగమ రాజ కన్యకను' అన్నది.

మదవతీ నవమన్మథ అను సంబోధనచేతనే ఉలూచి వలపు వ్యంజిత మగుచున్నది. అంతటితో నూరకుండ లేదు.

సరిలేని విలాసము గని
వరియించెటఁ దోడికొనుచు వచ్చితి ని న్నో
కురవీర! వసింపఁగ నీ
కుఱు వీర దృఢాంక పాళి కోరిన దానన్.

అని వ్యాఖ్యానించినది. దృఢాంక పాళికి వేదం వేంకటరాయ శాస్త్రి గారు గట్టి కౌఁగిలి యని యర్థము వ్రాసినారు. అంకము అనగా ఒడి యని యర్థము. 'అంకము చేరి శైల తనయా స్తన దుగ్ధము లానువేళ' అని మనుచరిత్ర. అంకపాళి అనగా ఒడిచోటు. భార్య భర్త యొడిలో కూర్చుండుట అనురాగ లక్షణము. అందుకనే కుఱువు=తోడ, ఈర= ఈయవలసినది అన్నది ఉలూచి. అర్జును డామె ప్రత్యంగమును చూచినాడు. మెచ్చుకొనినాడు. అందమున కబ్బురపోయినాడు. అతడు నేర్పరి. వలచి వలపించుకొను తెలివికలవాడు.

కాముకుండఁ గాక వ్రతినై
భూమి ప్రదక్షిణము సేయఁ బోయెదు వానిం
గామించి తోడితేఁ దగ
వా మగువ! వివేక మించుకేని న్వలదా

యని గద్దించినాడు. 'వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కన గాదె యేరికిన్' అన్నాడు పెద్దనగారు. అందులో మహావీరు డర్జునుడు. నదురు బెదురులు లేనివాడు. గద్దించ కేమి? ఆ మాటలకు నవ్వు వచ్చినది ఉలూచికి. రాదా మరి. సుభద్ర మనోహరాంగ సౌందర్య మును విన్నాడు. ఆమెను చూడవలయునను కోరిక జనించినది. సమ యమున కెదురుచూచుచుండెను. దైవ వశమున నవకాశము లభించి నది. భూ ప్రదక్షిణము మిష. సుభద్రపై మనసు. ఈ సంగతి తెలియ నిది కాదు ఉలూచి. 'వ్రతినై' యనగానే నవ్వు వచ్చినది. పూర్వా పర కథా సందర్భ శుద్ధి గుర్తించి కావ్యము వ్రాయుట మహాకవి లక్షణము. కావ్యమునందు తాను వేయు ప్రతిపదమునకు ప్రయోజన

ముండవలయును. వేంకటకవి సందర్భ మెరిగి సప్రయోజనముగా విజయవిలాసము నందు పదములు వాడెను. 'పరియ మాటకేగు గతి' అనుటలోనే యర్జునుని వ్రతము తెల్లమగుచున్నది. అందుకనే 'నావుడు మోమున నొ్మలక నవ్వొలయన్' అన్నాడు కవి. దానిని తరువాత వ్యాఖ్యానింప చేసినాడు. ఉలూచి వలి గబ్బి గుబ్బ చక్రీవికిఁగా నటించుక నటించు కవు నగనిపింప పల్కినది. మంచి రస గర్భితమయిన వర్ణన. సారస్యము గల భావము. వలి గబ్బి గుబ్బల కీవికి నించుక నటించు చున్న నడుము కనిపించు నటుల చేసిన దట. మొహము కల నాయకురాలు తన మర్మాంగములను చూపి నాయకుని మనమునందు కామోద్రేకము కలిగించుట స్త్రీ స్వభావము. ఉలూచి సన్నని తన కౌను కనిపింప చేసినది. అది నటించు కౌను. అందుమూలమున నది చాల సన్నని దని తేలుచున్నది. ఆ నటనకు కారణము చన్నుల కీవి. అవి గుబ్బల వంటివి. అందు మూలమున పెద్దవై బరువుకలవి యని స్ఫుటమగుచున్నది. ఆ బరువువలన సన్నని నడుము తూగాడినది. అదియొక నాట్య భంగిమ. అటించుక నటించు నను పదముల కూర్పులో నాట్యము గోచరింప చేసినాడు వేంకటకవి. పదముల పొందికలో అర్థచమత్కృతి పదచమత్కృతి జోడించి రస సంయుతముగా భావము నవగత మగునట్లు చేయుట మహాకవుల రచనలలో నొకవిశేషము. దీనినే పలుకుబడివలన నర్థము ధ్వనింప చేయుట యందురు. ఇట్టి శక్తి పూర్వ కవులలో నన్నయ పెద్దన లకు కలదు. ఆ సంగతి మొదటనే వివరించితిని. తరువాతి కవులలో శేషము వేంకటపతి రచనయం దీ విశేషము కనిపించును.

ఏల లతా జాల డోలా సమాలోల
బాలామణీ గాన భాసురములు

లతా డోలికల యూపు పదముల కూర్పులో నెలకొల్పినాడు. అటు తరువాత ఉలూచి ఓ రసిక శేఖరా! యని యర్జునుని సంబోధించినది. ఆ మొలక నవ్వున కీ సంబోధన సరిపోయినది. అదియొక పరిహాస గర్భిత మయిన సంబోధన.

నిను గీతి సాహితీ మో
హన వాణులు చెవులు వట్టి యాడింపంగాఁ
గని యుండి కాముకుఁడఁ గా
నని పల్కిన నాకు నచ్చికొనె నృపాలా

అన్నది యులూచి. ఈ సమాధానము పై విషయమును వ్యక్త పరచు చున్నది. నాయిక చతురురాలు. అంతకంటె చతురు డర్జునుడు. 'సమస్తమ్ము నెఱుఁగు వలంతివి. పరసతి నెనయుట రాజుల ధర్మమా?' అని ప్రశ్నించినాడు. పరసతి యనగా పరుని భార్య అని యిట అర్థము. ఉలూచి వివాహిత యేమోనని పాండవేయు ననుమానము.

కన్నియఁగాని వేరొకతెఁ గాను మనోహర రూప! నీకు నే
జన్నియ పట్టి యుంటి నెలజవ్వన మంతయు నేటిదాక నా
కన్నుల యాన నా వలపుఁ గస్తురి నామముతోడు నమ్ముకా
దన్నను నీదు మోవి మధురామృత మా నిటు బాసచేసెదన్.

అని యర్జునుని సందేహము తీర్చినది. నమ్మడేమో నని యొట్టుమీద నొట్టు పెట్టుకొనినది. ముందు తనమీద తరువాత అర్జునునిమీద. ఆ బాసలలో ఉలూచి యావేగము స్ఫురించుచున్నది. మరల అడ్డుపాటు తెచ్చినా డర్జునుఁడు. 'ఫణి జాతివీవు. ఏ మనుజజాతిని. అన్యజాతిఁ ప్రవర్తించుట కర్హమగునే?' అని జాతి భేదమును నిరూపించినాడు. ఉలూచి కడు సమర్థురాలు. పూర్వ వృత్తము లెరిగినది.

తొల్లి శ్రీ
రాము కుమారుఁడైన కుశరాజు వరింపఁడె మా కుముద్వతిఁ
గోమల చారు మూర్తి పురుకుత్సుఁడు నర్మద బెండ్లియాడఁడే

అని దృష్టాంతములు చూపినది. 'నీ మన సొక్కటే కరుగ నేరదుగాని' అని యొక సూటిపోటు పొడిచినది. రమ్యమగు సంభాషణ నాయికా నాయకుల మధ్య సాగినది. చక్కని సన్నివేశములను సమకూర్చి నాయికా నాయకుల మధ్య మనోరంజకమును సందర్భ సముచితము నగు సంభాషణను జరిపించుటలో నిటీవల కవులందు చేమకూర

వేంకటరాజకవికిగల చాకచక్య మింక నితరకవులకు లేదు. సారంగధర చరిత్రమునందు చిత్రాంగి సారంగధరుల సంభాషణ, విజయవిలాసము నందు ఉలూచి అర్జునుల మాటలు, సుభద్రార్జునుల పలుకు చతురతలు మెచ్చుకొన తగినవి. ఉలూచి యతనుతాపమునకు తాళలేక పోయినది. ముఖాబ్జమునందు విన్నబాటొదవినది. చక్కని తెలిసోగ కన్నులయందు బాష్పములు గ్రమ్మినవి. గళంబునందు గద్గదిక పొడమినది. ఆమె వల పంత ముప్పిరులు గొన్నది. వైవర్ణ్యము, అశ్రువు, వైస్వర్యము లను సాత్విక భావము లిందు వర్ణింప బడినవి. అర్జునుని మనస్సు కరగినది. అన్నాడు.

> చక్కెర బొమ్మ! నా వ్రతము చందము దెల్పితి నంతెకాక నీ
> చక్కఁదనంబు గన్న నిముసంబయిన న్నిలుపోప శక్యమే
> యక్కున నఁ జేర్ప కంచు.

అంతలో నింతవరకు లేని నునుసిగ్గు దొంతర లెక్కడనుండి వచ్చినవో గాని యులూచి తల వంచినది. అర్జునుడు సరసుడు. అతివ మనస్సు గుర్తించినాడు.

> వివాహ విధిజ్ఞుఁడైన మా
> నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైక ముహూర్తము రమ్మటంచుఁబ
> ర్యంకము మీఁద నెచ్చెలి కరగ్రహణం బొనరించెఁ దన్మణీ
> కంకణ కింకిణీ గణ వికస్వర సుస్వరముల్ సెలంగఁగన్
> శయ్యకుఁ దార్పఁగా దుఱుము జాఱె నదంతటఁ జక్క దిద్దఁబోఁ
> బయ్యెద జాఱె నయ్యదిరిపాటునఁ గ్రక్కున నీవి జారె రా
> జయ్యెడ నవ్విలాసిని యొయారము చూచి కవుంగలించె నా
> నెయ్యెడ మేలె చూతురు గ్రహింపరు జాణలు జారుపాటులన్

అర్థాంతరన్యాసాలంకార మీ పద్యమునందు కలదు. గ్రహింపరు జాణలు జారుపాటులన్ అనునది లోకవ్యావహారికమయినది.

> కౌఁగిటఁ జేర్చు నప్పటి సుఖంబె లతాంగికిఁ బారవశ్యమున్
> మూఁగఁగఁగఁ జేసె మోవి పలు నొక్కులురోజనఖాంకము ల్మొద

ల్గాఁగల కంతుకేళి సుఖ లక్షణముల్ పయిపెచ్చు లయ్యె న
ల్గాఁగద యెట్టివారలకు నగ్గలపుం దమి కల్గి యుండినన్

ఇందు కావ్యలింగాకారము కలదు. 'కౌఁగిటఁ జేర్చు నప్పటి సుఖంబె లతాంగికిఁ బారవశ్యముం మాఁగఁగఁ జేసె' ననుటచేత నాయిక ప్రౌఢ. సతత ప్రథితోల్బణ కామ యౌవనోత్సవయు, రతాది మోహమును దాల్చు తలోదరి ప్రౌఢ దా నగున్ అని కావ్యాలంకార సంగ్రహము. ఇది ప్రౌఢసమాగమ వర్ణనము. ఉలూచికి సద్యోగర్భమున కుమారుడు జన్మించెను. వానికి ఇలావంతు డని పేరు పెట్టిరి. అర్జునుని తీసికొనివచ్చి యూలూచి గంగా తటమున విడిచినది. మరల తీర్థయాత్రలు సాగించినా డర్జునుడు. హిమాలయము చేరినాడు.

పదియారు వన్నె గుబ్బలి రాచకూతురు
పట్టంపు రాణిగాఁ బరగు జాణ
పతి యర్థ దేహంబు సతి యంట నిజముగాఁ
బ్రబలు కన్నియఁ గన్న భాగ్యశాలి
ముజ్జగమ్ముఁ బవిత్రముగఁ జేయు తీర్థమ్ముఁ
గొనసాగఁ జేసిన యనఘమూర్తి
భూమిధరారాతిచే మొక్క వోవని
యరిది బిడ్డనిఁ గాంచినట్టి మేటి
యోషధుల మొలిపించిన యుత్తముండు
చల్లదనముల కెల్ల దీక్షా గురుండు
సకల మాణిక్య రాశికి జనన సీమ
యీ నగస్వామి సద్గుణాస్థాన భూమి.

అని హిమవంతుని బొగడినాడు అర్జునుడు. మనుచరిత్రము నందు ప్రవరుడు

పసుపు నిగ్గులు దేఱు పాఁప జన్నిద మొప్పఁ
ప్రమథాధిపతి యింటి పట్టెటెంగె
శచి కీఁత గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలు వెటెంగె
నదనుతోఁ జేపి చన్నవిసి యోషధుల మ
న్నాదవు కొండల కెల్లఁ బిదుక నెటెఁగె
వేల్పు టింతులలోన విఱ్ఱవీగుచు మేన
నవరత్న రచనల రవణ మెటెఁగెఁ

బరిపరి విధంపుఁ జన్నంపు బరికరంపు
సొంపు సంపద నిఖిల నిలింప సభయు
నప్ప టప్పటికిని జిహ్వా ప్రొప్పు దుల్ల
నామెత లెటెంగె నీ తుషారాద్రి కతన

అని హిమాలయమును వర్ణించినాడు. రెండు పద్యములు ఒకేరకమగు పదముల కూర్పు కలవి. జానగు తెనుగు పదములతోడి వైకృతములు మేళవించి తత్సమ పదముల కలయ కలుపుతో రచన సాగినది. నడక యందు రెంటికి నెడ విడని పోలిక కలదు. తెనుగు భాష వెన్నవలె నతిమృదుల మయినది. అట్టి జానగు దేశీయముల పొందికతో విర చించిన పద్య మతి రమణీయమయి మనమునకు ముద మొదవించును. అట్టి రచనకు కవితావేశ ముండవలయును. అట్టి కవితావేశమునకు రసానుభూతి ప్రధానాధారము. అట్టి రసానుభూతి కల తెనుగు కవితకు తెనుగుతనము నాపాదింప తలంచును. అందుకనే 'స్వస్థాన వేష భాషాభి మతాస్సంతో రసప్రలుబ్ధ ధియః లోకే బహు మన్యంతే వైకృత కావ్యాని చ అన్య దపహాయ' అని నన్నయ వచించినాడు. ఆయన యనుభవము కల కవి. లోకగురుడు. తెనుగు కావ్యములందు చక్కని రసవంతములగు పద్యము లన్నియు నిట్టి రచన కలవే యని రసిక హృదయు లంగీకరించుచున్న విషయము. మనుచరిత్ర పేరెత్తగానె 'ఇంతలు కన్నులుండ' అను పద్యము రసిక కులావతంసులగు కవులకు జ్ఞాపకము వచ్చును. పండితులమాట నేను

ప్రసంగించుట లేదు. వారి ప్రవృత్తి వేరు. దానిని గురించి ప్రసంగించుట కవకాశము చాలదు. కావున దానిని విడిచి పుచ్చి ప్రకృతమునకు వత్తును. శృంగార నైషధము తలంపునకు రాగానే 'నలినసంభవు సాహిణము వారువంబులు ఇత్యాది జాను తెనుగు పదములతో తత్సమములు కలిపి యందముగా రచించిన పద్యములు స్ఫురించును. ఇవన్నియు నొక్క తరగతిలో చేరినవి. వానిలో సౌకుమార్యము ప్రసన్నత తొణికిసలాడుచుండును. కవితావేశ మున్నగాని యట్టి రచన కుదురదు. వేంకటకవి మంచి కవితావేశము కలవాడు.

అర్జునుడు వివిధ క్షేత్రములను దర్శించుచు పాండ్యదేశమునకు వచ్చెను. దానికి ముఖ్య పట్టణము మణిపురము. ఆ నగరమును పరిపాలించు రాజు మలయధ్వజుడు. వానికి చిత్రాంగద యను కూతురు కలదు. ఆమె చెలికత్తెలతో కేళీవనమునందు విహరించుచుండెను. అర్జును డామెను చూచెను. చిత్రాంగద సౌందర్యవతి. అర్జునుం డామెయందు వలపుగలవా డయ్యెను. అంతలో సాయంకాల మయినది. మంద మలయానిలము వీచినది. ఇచట

తనకుం గౌఁగిలి యీ వొకప్పుడును నాథా నీ కర స్పర్శనం
బున గిల్గింతలె యంచుఁ బద్మిని కరాంభోజమ్మున న్మంద మం
ద నట ద్వాయు చలద్దళాంగుళులు కన్పట్టంగ నవ్వేల్గు రా
యని రారాయని బిల్చెనాఁ దగె ద్విరేఫాద్యంత దీర్ఘ ధ్వనుల్.

అని కవి వర్ణించెను. నాథా! నీ కిరణములనెడు చేతుల స్పర్శము చేత నన్ను చక్కిలిగింతలు మాత్రము పెట్టుచుంటివి. ఒక్కసారి యైనను కౌఁగలించుకొనవు. అని కమలపుఁ దీగె యనెడు పద్మినీ జాతి స్త్రీ, కమలములవంటి లేక కమలములనెడు చేతులతో మంద మలయానిలము వలన కంపించుచున్న రేకు లనెడి వ్రేళులు కనిపించు నటుల రారా యని సూర్యుడనెడు తేజః సహితు డగు రాజును ద్విరేఫముల యొక్క నిరంతరమగు నాద్యంత దీర్ఘధ్వనులతో పిలిచినది. ఇచట రారా యనగా రమ్ము రమ్ము అని యర్థము. ద్విరేఫములు—

తుమ్మెదలు, రెండు రకారములు అని భావము. రారా యనునది మొదటిదాని యందు చివరిదాని యందు దీర్ఘములుగల రెండు రకారముల పదము. ఇది యొక యన్వయము. ఈ యన్వయమునందు పద్మిని నాయకురాలు. వెల్గురాయడు నాయకుడు. మందమందనట ద్వాయువు ఉద్దీపన విభావము. చల ద్దళాంగుళులు కంపించుచున్న దళాంగుళులు సాత్త్విక భావము. ఈ విభావ అనుభావ సాత్త్విక భావములవలన రతి యను స్థాయిభావము గమ్యమగుచున్నది. 'గిల్గింతలె యనుటవలన సంభోగ శృంగారము ధ్వనించుచున్నది. ఇది రస ధ్వని. ఇందలి శ్లిష్ట రూపకములవలన పద్మినీజాతి స్త్రీ రాజును కౌగిలి నిమ్ము రమ్ము అని పిలిచెను. అని అప్రకృత వస్తువు ధ్వనించుచున్నది. ఇది యలంకార కృత వస్తుధ్వని. ఇది రెండవది. ఇటువంటి రసవస్తు అలంకార ధ్వనులు, రసవంతములగు భావములు, విజయవిలాసమునందు పెక్కు గలవు. వాని నన్నిటిని ప్రదర్శించుటకు తావు చాలదు. కావున మచ్చునకు దీని నొక్కదాని నిచట పొందుపరచితిని. ఇట్టి యుత్తమ కవితా లక్షణములు గల కావ్యము తెనుగు సారస్వతమున కొక యపూర్వ అలంకారము. తరువాత అయిదు పద్యములలో రాత్రిని వర్ణించినాడు కవి.

రాత్రి గడచినది. తెల్లవారినది. మలయధ్వజుడు అర్జునుని సగౌరవముగా గొనిపోయెను. ఒక విడిదియం దుంచెను. అంతటితో ప్రథమాశ్వాసము సమాప్తమైనది. చిత్రాంగద వివాహముతో ద్వితీయాశ్వాస మారంభ మగుచున్నది. ఈ ఘట్టమునందు చెప్ప తగిన విశేషము లేమియు లేవు. భారతమునందు 'మణిపురంబునకు జని యందున్న రాజుఁ జిత్రవాహనునిం గని' యని యున్నది. వేంకట కవి మణిపురాధీశ్వరుండు మలయధ్వజు డని నుడివినాడు. దక్షిణ దేశమునందు లభించిన వ్యాస భారత ప్రతులలో నట్లుండిన నుండ వచ్చును. ప్రధాన కథ యంతయు భారతము ననుసరించి వ్రాయ బడినది. ఉలూచీ చిత్రాంగదలతోడి యర్జునుని సంభోగ శృంగార

మును వర్ణించుపట్ల వేంకటకవి కొంత తారతమ్యమును చూపించెను. చిత్రాంగద

ఇగ్గెడు నెక్కుఁ-కుం బయికి నీడ్చినఁ బైఁటఁ దొలంగఁ జేయఁ గే
లొగ్గెడు రెమ్మి పోకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండు కొంగులున్
బిగ్గ నడంచుచు న్విడిచి పెట్టను బాల ననం బనేమి యా
సిగ్గుకు సిగ్గు లే దిటులఁ జేసిన పిమ్మట నుండ వచ్చునే.

ముగ్ధా సంభోగ మిది. ఆ సిగ్గుకు సిగ్గు లేదట. చక్కని భావము. ముగ్ధ చిత్రాంగద. స్త్రీకి సిగ్గు సహజము. ఇంత జరిపిన తరువాత నిజముగా సిగ్గు తొలంగి పోవలసినది. అట్లు తొలగ లేదు. స్త్రీ సహజమగు నా సిగ్గునకు సిగ్గు లేకపోయినది. కావున సిగ్గు రెట్టింపయి గట్టిగా అంటి పెట్టుకొనినదని సారస్యము. ఇటువంటి విచిత్ర సారస్యములు గల వాక్యములు చాల విజయవిలాసమునందు కలవు. వానిని చదువునప్పుడును అవి తలంపునకు వచ్చినప్పుడును నవ్వు ఉబుకులాడును. కవి రచనా చాతుర్యమునకు మెప్పు లొదవును.

విజయ విలాసమునందు సౌభద్ర తీర్థ వృత్తాంతము తరువాతి ఘట్టము. ఈ కథ భారతమునందలి యాది పర్వము అష్టమాశ్వాసము లోనిది. పదియారు పద్యములలో నిమిడ్చ బడినది. వేంకటకవి దానిని ముప్పదియారు పద్యముల చిన్న ఆఖ్యానముగా పెంచి విరచించెను. అర్జునుడు తీర్థమాడుటకు సమకట్టెను. అచటివారు

మోక్షమునకుఁ బోవ మొస లెత్తుకొని పోయె
ననెడు వార్త నిక్కమగు నటంచుఁ
గ్రుంక వెఱతు రెవ్వరును మీర లటుఁ బోకు

డని హెచ్చరించినారు. ఇందలి లోకోక్తి పద్యమున కందము తెచ్చినది.

చనుఁ డచటికి నిపు డింపెన
య 'నదుఃఖం పఙ్చభి స్సహ' యనంగా మున్
విని యుందురె కద

అని నందాది యచ్చరలతో నారదు డనెను. కథ నడుపు నప్పుడు పద్యమునందు సారస్యము లేని పట్టున నిట్టి లోకోక్తులు,

> మా పొలు పొకింత గనుఁగొని
> తాపసుఁడట వలపుపేరు దైవ మెఱుంగుగ్.
> శాప మొసఁగె
> ఋషి తిలక కంటివే మా యదృష్ట రేఖ
> కుడిచి కూర్చుండి యిదె యొక బెడదఁ దెచ్చు
> కొంటి మేమేడ మకరుసై యుంట యేడ

'వలపు పేరు దైవ మెఱుంగున్' 'కుడిచి కూర్చుండి' ఇటువంటి వ్యావహారికములు, వానికితోడు విషమాది యలంకారములు జోడించి యందముగా నడుపుట వేంకటకవి రచనలోని యొక రహస్యము. సారంగధర చరిత్రయం దీ సంగతి తెలిపితిని. తనకు తోడు నీడ యయి వలచి వచ్చిన

> సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యాహాళి వాటిల్లెడున్
> సహకారాళి పదంబుఁ జూడఁగ వయస్యాహాళి యానే కదా

ఇత్యాది పద పాద యమకాది శబ్దాలంకారములు రసాపస్కారకము లయినను కావలయునని చతురోక్తి నిగుంభనము లను తలంపుతో వేంకటకవి తరుచుగా వాడు నలవాటు, ఈ చిరుత కథయందు సహితము మరచిపోలేదు. ఇదియొక లోపమని సాహిత్య కళా రహస్య విదులకు తెలియని విషయము కాదు. ఆ కారణము చేతనే యాతని సమకాలికు లాతనిని మెచ్చుకొనలేదు. ఆ విషయమును

> క్షితిపయి వట్టి ప్రాకులుఁ జిగిర్ప వసంతుఁడు దా రసోపగుం
> భిత పద వాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
> న్నతయును సౌకుమార్యముఁ గనంబడ జాల్గరఁగంగఁ జేసె నే
> గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!

యను పద్యమునందు సూచించినాఁడు. రసోపగుంభిత పద వాసనలచేత కేవలము మూర్ఖులను సంతోష పెట్టవచ్చును. ప్రసన్నత సౌకుమా

ర్యాది గుణములచేత రాయివంటి కఠిన హృదయములను కరిగింప వచ్చును. కాని మూర్ఖుడును కఠినాంతరంగుడును గాని సహజ రస సమాహిత కోమల చిత్తవృత్తి కల కవుల నుప్పొంగ చేయునది సజీవ మగు మనోహర శిల్పకళా సృష్టి. తిలకము ముఖమున కంద మొద వించు ననుటలో సందేహము లేదు. అది లలాటమునం దున్నపుడు సౌందర్యమును వెలయించును. కణతలయందు పెట్టిన పరిహాసము నకు గురి యగును. ముఖమునం దెల్లెడలను పెట్టినచో వికృతాకార మును కల్పించును. ఆ సంగతి వేంకటకవికి స్ఫురింపలేదు. మృదు మనోహర పద గుంభనలచేత సహజ సుందరమయి సజీవమగు విజయ విలాసమునకు రూపవైకల్యము కల్పించినవి పదాలంకారములు. పోతనయందు సహిత మిట్టి లోపమున్నది. కాని యతడు కొంతవరకు స్థానాస్థానము లెరిగినవాడు. ఇట్లనుటచేత చేమకూర వేంకటకవిని గాని పోతన్ననుగాని విమర్శించు చుంటినని తలంపరాదు. సత్యము వెలయించుట విమర్శకుని లక్షణము.

ద్వితీయాశ్వాసము డెబ్బదియేడవ పద్యముతో సుభద్రా వివాహ ఘట్టము ప్రారంభమగును. అర్జునుడు ప్రభాస తీర్థమునకు వచ్చెను. ద్వారక యచటకు చేరువ యని యర్జునుడు వినెను. సుభద్ర రూపరేఖా విలాసములు తలంపునకు పారినవి. ఆమెను పరిణయమాడవలయునని మనస్సునందు నిశ్చయించుకొనెను. ఈ కథ భారతమునం దరువది పద్యములలో వ్రాయబడినది. వివిధ వర్ణనలతో మూడు వందల పద్యములకు పెంచి విజయ విలాసము నందు విరచింపబడినది. భారతమునందు

''వ. అప్పురంబునం దన్నారు లెఱుంగకుండ వలయుననియు యాదవులు యతుల కతి భక్తులనియును మనంబునం దలంచి కృతక యతి వేష ధరుండయి'' అను వచనముతో కథ ప్రారంభింపఁబడినది విజయ విలాసమునందు

అనుచు నా కన్యఁ గైకొను నాసఁ దగిలి
యతులకు విధేయు లగుదురు యాదవు లని

తను నెఱుఁగ కుండవలె నన్న్యు లనియుఁ దలఁచి
యనుచర జనంబు నందంద పనిచి యంద

అని కథ నారంభించినాడు వేంకటకవి. వేంకటకవి విజయ విలాస కావ్యమును రచించునపుడు వ్యాస నన్నయ భారతములను కూడ కలుపుకొని స్వకీయములను చేర్చుచు వచ్చెను. వ్యాసభారతము నందు

అనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీ సురోత్త మాధ్వర విధాన
పుణ్య సమృద్ధమై పొలుచు వేంగిదేశ
విభవంబుఁ జూచుచు విభుఁడు

అని నన్నయ భట్టారకుడు తెనుగు భారతమునందు సూచించిన వేగి దేశ వర్ణన లేదు. వేంకటకవి దానిని పరిహరించెను. తెనుగు భారతమునందు కానరాని రామేశ్వర ధనుష్కోటి తీర్థములను విజయవిలాస కారుడు పరిగ్రహించెను. "ధనుష్కోటిం గృత స్నానుండయి పాండుసూనుం డందులం దులాపురుషాది దానమ్ము లాచరించి రఘువీర భూ భుజ భుజాదర్ప దర్పణంబగు రామాయ ణంబు పారాయణంబు సేసి" అని యున్నది. ఇట్లు వర్ణించుటలో కారణము లేకపోలేదు. రఘునాథ భూపతి పట్టాభిషేక దినమున తులాపురుషాది బహుదానము లొనరించెను. దానిని జ్ఞప్తి చేసినా డిచట వేంకటకవి. రఘువీర భూభుజ భుజాదర్పణం బగు రామా యణం బనుటచేత రఘునాథ రామాయణము ధ్వనితము. రఘు వంశమునందు వీరుడగు రాజు శ్రీరామ చంద్రుడు. వాని బాహు పరాక్రమ గర్వమునకు ప్రతిబింబము రామాయణము అని యర్థము.

రఘునాథనాయక మహారాజు సాహిత్య విద్యా గర్వమునకు ప్రతిబింబమగు రామాయణము రఘునాథ రామాయణము అని యర్థాంతరము. రఘునాథరాయలు తన రామాయణాది గ్రంథములను ప్రతి దినము ఇందిరా మందిరమునందు కొలువు తీరి యుండి చది వించుకొని యానందించుచుండెడి వా డని రఘునాథ నాయకాభ్యు

దయమునందు కలదు. దీనినిబట్టి విజయవిలాసము క్రీ. శ. 1628 ప్రాంతమున కృతి నొందియుండుననియు, రఘునాథనాయక మహారాజప్పటికి రామాయణము కొంత రచించి యుండుననియు, నదిపూర్తి కాకమునుపే మరణించెననియు తేలుచున్నది. ఇత్యాది స్వయం కల్పితములు. సంస్కృతాంధ్ర భారతములందు లేనివి విజయవిలాసము నందు కలవు.

మృగనాభి తిలకంబు భుగభుగ ల్గల లలా
టముపై మృదూర్ధ్వ పుండ్రంబు దీర్చి
తపనీయ కౌశేయ ధారేయ మగు కటీ
రమునఁ గాషాయ వస్త్రము ధరించి
శరణాగ తాభయ సంధాయకంబైన
దక్షిణపాణి త్రిదండ మూని
రణ చండ కోదండ గుణ కిణాంకంబైన
డాకేల నునుఁ గమండలువు దాల్చి
యుండెఁబో శాంతరస మెల్లనుట్టి పడఁగ
నంగనల పొందు రోసి సన్యాసి యగుట
గద యుచిత మెందు నా నవ మదన మూర్తి
యంగనామణిఁ గోరి సన్యాసి యయ్యె

నట. వింతలో వింత. పుచ్చుకొనినది వైష్ణవ సన్యాసము. శిఖా యజ్ఞోపవీతములు తీసివేయ నక్కర లేదు. విభూతి ధారణము చేయ నక్కర లేదు, అందముగా నామము తీర్చి దిద్దవచ్చును. అది ముఖమునకు తిలకముకంటె వేయింతలు సుందరముగా నుండును. నడుమున తపనీయ కౌశేయము మీద శాటి యొకటి యంచులు దిగజార ముడువ వచ్చును. అద్వైత స్వాముల కొక్కటె దండము. వైష్ణవ స్వాములకు త్రిదండము. మూడు దండములు కూర్చి కట్టుదురు. అది కొంచెము బరువుగా నుండిన నుండవచ్చును. కోరి వరించుకొని నా డా అందమగు వేషము నర్జునుడు. భావికథా ఘట్టమునకు రస పోషకము కూడాను. అర్జునుడు విష్ణుభక్తుడు. విష్ణువు శృంగార

పురుషుడు తన భక్తుల శృంగార చేష్టలకు తాను తప్పక సహకారి యగుచుండును. వారు సంసారులు కానీ సన్యాసులు కానీ అది యాయనకు పరిగణన లేదు. తన భక్తులకు తాను దాసుడు. మధ్య దూత కార్యమునకైన వెనుతీయడు. చివరకు వైకుంఠ మొసగుటకు శంకింపడు. తొండరడిప్పొడి యాళ్వారుల కథ అందరకు తెలిసినదే. భక్తులకు సులభ సాధ్యుడు హరి. అర్జునుడు హరిని తలంచినాడు. ఆయన ప్రత్యక్ష మయినాడు.

అప్పుడు సామి దాఁ దలఁచి నంతనె వచ్చె నటంచు విస్మయం
బుప్పతిలంగ వేడ్కఁ దనలోఁ దత్తఁగఁ గన్నుల హర్ష బాష్పముల్
చిప్పిలఁ గ్రీడి పాద సరసీజములం బ్రణమిల్లి తద్రుచుల్
రెప్పల నప్పళించుచును లేవక యుండఁగ సంభ్రమంబునన్
గ్రుచ్చి కవుంగలించుకొని కూరిమితోఁ గుశలంబు వేఁడి తా
వచ్చిన రాక లోఁ దెలిసి ద్వారక రైవత కాద్రి ప్రాంతనే
యిచ్చటికిక్ సమీప మని కృష్ణుఁడు దెల్పుచుఁ దోడి తేరఁగా
వచ్చె రథంబుపై నపుడు వాసవి వేసవి యేగు నంతకున్

వచ్చి రైవత కారామ వాటి నిల్పి
కృష్ణుఁడం దిష్టగోష్ఠి నారేయి గడపి
యిచట నుండుము తావ కాభీష్ట మిపుడు
సేయుదు నటంచుఁ జైత్రృప్వసేను నిలిపి

విజయ విలాసమునందు సుభద్రా వివాహ ఘట్టములోని కవిత్వమునకు తత్పూర్వ కథా ఘట్టములలోని కైతకు భేదము కలదు. అందు మూడు నాలుగు పద్యములు వరుసగా శబ్దాలంకారములు లేకుండా నడిపిన పట్టులు లేవు. ఈ సందర్భమున వాడిన భాషకును ప్రారంభ మందు వాడిన భాషకు కూడ తారతమ్యము కలదు. పై పద్యములు చదివినవారు గ్రహించుకొనగలరు. మొదటి యొకటిన్నర అనగా సుభద్రా వివాహ ఘట్టము పై వరకు శయ్యా తేనెపాకమున నడచినది.

ఈ ఘట్టమున పాలవలె జాలువారినది. రైవతకోత్సవమునకు సుభద్ర వచ్చినది.

> యావతచూలికాభరణ మప్పుడు కొందఱు బోంట్లు ముంగలన్
> రైవత కోత్స వాగత జనంబు బరాబరి సేయుచుండఁ ద
> ద్దైవత కర్చనా నతు లతి ప్రమదంబునఁ జేసెఁ బై పయిన్
> దైవత రాజ నందను ధనంజయునిం బతిగాఁ దలంచుచున్

అని వేంకటకవి.

> క్వణ దణు కింకిణీ కలిత కాంచన కాంచి కలాపముల్ రణ
> న్మణి కల నూపురంబులు సమ ధ్వని నొప్పఁగ భక్తిఁ బాద చా
> రిణి యయి కన్యకా జన పరీత సుభద్ర తదద్రి పూజన
> ప్రణతులు సేసె నింద్రసుతుఁ బార్థు నిజేశ్వరుఁగాఁ దలంచుచున్.

అని నన్నయ. ఈ పద్యమునందలి రాజసము మనోహరత పైపద్యము నందు గాలించి చూచినను గోచరింపదు.

సుభద్ర మహారాజ పుత్రి. శ్రీకృష్ణుని గారాబు చెల్లెలు. సర్వాభరణ భూషిత క్వణదణు కింకిణీ కలిత కాంచన కాంచి కలాప రణన్మణి నూపుర ధ్వనులతో నద్రి పూజన ప్రణతు లొనరించుచున్న యారూపము శబ్దముల కూర్పులో చదువునప్పుడు మనోనయనమునకు నగుపించు నటు లొనరించినాడు నన్నయ. ఆయన మహానుభావుడు. ఏ శబ్దమున కెట్టి శక్తి యున్నదో ఆయనకు తెలిసినట్లు మరే యితర తెనుగు కవికి తెలియదు. శబ్దముల పొందికలో రూప కల్పన చేయ గల శక్తి నన్నయకున్నది. 'కురువృద్ధుల్ గురువృద్ధ బాంధ' వాది పద్యము లటువంటివి. అర్థముల పొలయికలో రూపకల్పన చేయు శక్తి తిక్కన కున్నది. ఆయన శబ్దశిల్పి. ఈయన అర్థశిల్పి. నన్నయ కవితలో శిల్పము లేదని వాదించు వారిని నేను చాలమంది నెరుగుదును. అది వారికి తెలియనితనము తప్ప వేరొకటి కాదు. [illegible] సుభద్రను చూచినాడు. ఆమె యందమును పదునొకొం[illegible]పద్యము లలో వర్ణించినాడు. ఇది చర్విత చర్వణము. సుభద్ర[illegible] మూడు

చోట్ల ముప్పది పద్యములందు పదములను మార్చి వర్ణించిన దే మరల మరల వర్ణించెను. ఉలూచీ చిత్రాంగదలను అట్లే వర్ణించెను. విధానమునందు కాని విషయమునందు కాని మార్పులేదు. దీనిని చూచియే పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు 'నస పోలే' దనె ననుకొందును. అది నిజముగా నసయే గాని పసలేదు. దానికితోడు శబ్దాలంకార ములు మరింత విసువు పుట్టించును. ఇట్టి పద్యములు విజయవిలాసము నందు మొత్తముమీద నూటయేబది పైచిలుకు గలవు. వానిని తొలగించినచో నైదువందల పద్యములు గలుగు మిగుల రసవంతమగు కావ్యమగును.

తంజావూరు నాయక రాజుల కాలమునందలి సంస్కృతాంధ్ర కావ్యములను బరిశీలించి చూచినచో ఆనాటి కవులకు పండితులకు శబ్దాలంకారము లనిన మిగుల ప్రీతి యని తోచుచున్నది. దానికి కారణము వారి గీతి ప్రియత్వము. గీతములకు పదములకు సంగీత మాధారము. సంగీతము తాళ లయాశ్రయము. లయాతాళములు శబ్దాశ్రయములు. ఆ శబ్దము లనుప్రాసాను ప్రాణితములు. కావున గీతములు పదములు అనుప్రాసలతో కూడియుండును. జయదేవుని యష్టపదులు, నారాయణ తీర్థుల వారి తరంగములు పరిశీలించి చూచినచో నిందలి సత్యము తెల్లము కాగలదు. మచ్చునకు

శరణం భవ కరుణా మయి కురువీర దయాళో
కరుణా రస వరుణాలయ కరిరాజ కృపాళో

అని నారాయణతీర్థులవారు.

పశ్యతి దిశి దిశి రహసి భవంతం
త్వ దధర మధుర మధూని పిబంతం

అని జయదేవుడు. సంగీత విద్వాంసులు ప్రాయు కవిత్వమునందీ లక్షణములు కనిపించుచుండును. నారాయణ దాసు నెరుగని వారు లేరు. ఆయన సంగీత విద్వాంసుడు, హరిదాసు. సంస్కృతాంధ్ర సాహిత్యవేత్త. శాస్త్ర పండితుడు. వీణానాదమునందు సంగమేశ్వర

శాస్త్రిగారికి కొంచెము కుడి యెడమ యని చెప్పతగినవాడు. ఆయన నౌకాభంగాది కావ్యములు పెక్కు రచించెను. వారి రచన లన్నియు ననుప్రాసలతోను యమకములతోడను నిండి యుండును. సంగీత విద్వాంసులకు శబ్దము ప్రధానము. సాహిత్య విదులకు రసము ప్రధానము. వేంకటకవి సకల కళాప్రవీణుఁడ నని గద్యయందు చెప్పుకొనెను. దానిని బట్టి సంగీత విద్యయందు కూడ రఘునాథరాయల కొలువునందలి యితర కవులు పండితుల వలె కోవిదుడయి యుండవచ్చును. అదికాక రాజు మహాగాయకుడు, పండితుడు, కవి. వీరందరు శబ్ద ప్రియులు. వీరిని మెప్పించుటకు నీ కవి శబ్దాలంకారములను వాడియుండును. తన ఘనత నందు చూపుటకు అందరిని మించిన శబ్ద చమత్కారములను ప్రదర్శించెను. ఈ శబ్దచిత్రములు గారడి విద్యల వంటివి. అవి రసిక హృదయములను రంజింప చేయనేరవు. పైగా రసస్రుతి కానకట్టలయి జీవన కంటకములుగా నుండును.

శ్రీకృష్ణు డర్జునుని వెంట కొనిపోయెను. కన్యాంతఃపుర సమీపమునందలి యుద్యానమున విడియించెను. సుభద్రను సేవకు నియోగించెను. అసలు సంగతి రుక్మిణీ సత్యభామలకు వినిపించెను. రహస్యము వెల్లడి కాకుండ కట్టడి గావించెను.

> చందురకావి పావడ పిసాళి రుచి ల్సరిగంచుఁ జీరపైఁ
> జిందులు ద్రొక్క వేణి కటిసీమ పయి న్నటియింప జాళువా
> యందెలు మ్రోయఁ జంటి అవికంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ
> జందన గంధి వచ్చె రభసమ్మున నమ్మునిరాజు సేవకున్

నిజముగా నా రభస మీ పద్యమునందు కనిపించుచున్నది. ఇచ్చటి నుండి నిసర్గమయిన రసవంతమగు చక్కని కవిత్వము విజయ విలాసమునందు ప్రారంభమగును. సారంగధర చరిత్రమునందు సహితము విజయవిలాసమునందు వలెనే వేంకటకవి మొదటి రెండాశ్వాసముల లోను శబ్ద చిత్రములకొరకు పట్టి పెనుగులాడినాడు. మూడవ యాశ్వాసమునందు కవిత సహజ స్వరూపమును తాల్చి జాలువారినది. విజయ విలాసమునందు కూడ సుభద్రా వివాహ ఘట్టమునందు

శబ్దాలంకార బంధములను చాలవరకు త్రెంచుకొని రసమయమయి నిజరూపమున జాలువారినది. సారంగధర తృతీయాశ్వాసములోని రచనకంటె విజయవిలాసములోని యీ కథాభాగమునందలి రచనలో నందచందములు గలవు. శయ్య మిగుల సాఫీతనము వహించినది. కాని సారంగధర చరిత్రమునందు నాయికా నాయకాది వర్ణనలందు చూపిన శిల్పకళా వైశద్యము విజయవిలాస మంతయు వెదకినను కనిపించదు. దీనినిబట్టి వేంకటకవి శిల్పరచనా చతురత కల రసవంత మగు కవిత్వము వ్రాయగల కవి యగుట స్పష్టము. కాని వాని శాబ్దిక దృష్టి సాహిత్య కళా దృష్టిని కప్పివేసినది. సుభద్ర యర్జును నకు సేవలొనరించు చుండెను.

కరము సాచి నవాంబు కలశమీ విడివడ్డ
కుంకుమాంకపు ముద్దుఁ జంక మెఱపు
ననలు దేఁబోఁగాళ్ళఁ బెనఁగు నంచ నదల్పఁ
జూచు జంకెన వాఁడి చూపు బెళుకు
పూరెమ్మ వంచుచో జాఱు పయ్యంటఁ దాఁ
గిలిమూఁత లాడు గుబ్బల బెడంగు
పొలఁతి కాయో పండొ పోయిన పని యన్న
చిలుక మాటకు నవ్వు సొలపుఁ దేట
మఱియు మఱియును జూడనే మనసు వాఱి
వారి కుసుమ ఫలంబులు దేరఁ బనుపుఁ
దొలుతటివి చాల వని యా వధూలలామ
నే మనఁగ వచ్చు వివ్వచ్చునేమ మింక.

సుభద్ర జగదేకసుందరి. ఆమె కొరకు యతివేషము బూని వచ్చినవా డర్జునుడు. అతని భాగ్యమున నప్పుడుబోడియే సేవచేయుట కరుదెంచి నది. వాని మనస్సు తత్తరింప కేమగును. ఉబికి యువ్విళులూరినది. మరియు నామెవంకనే చూచుటకు కోరిక లొదవించినది. అతడు చూచినాడు. అది మానసిక ప్రవృత్తి. ఇది కాముకు లయిన మానవుల స్వభావము. అనుభవము మీాద వర్ణించినాడు కవి

సుందరి రానిచో నెదురు సూచుచు నుండని పట్టె వచ్చుచో
నిందు నిభాస్య చక్కఁదనమే కని చొక్కుచు నుండఁ బట్టె నీ
సందడి చేతనే యరుగ సాగెను బ్రొద్దిఁక వేళ యెప్పుడో
సందె జపంబు నర్చనలు సల్పుట కా కపట త్రిదండికిన్.

వెలఁది కెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ
దరుణి లేఁగౌనుఁ గని హరి స్మరణ మఱచెఁ
గడమ యన నేల వేస మొక్కటియ తక్క
మరచె నన్నియు నా కృత్రిమ త్రిదండి.

ఇది భావోదయము. జపతపాదికముల సంగతి యిట్లున్నది. ప్రొద్దొక సింగారముతో సుభద్ర యరుదెంచును. అర్జునుని మోహము శ్రుతి మించినది. రాగమున పడినది.

బలిమినిఁ బట్టఁగాఁ దివురుఁ బట్టిన నొప్పక యిట్ట టన్నచో
బలువు రెఱింగిరేని నగుఁబాటని కొంకుఁ దలం పెఱుంగకే
కలయఁగ జూచుటల్ తగవు గాదని యుండు నతండు కాంత నె
చ్చెలుల నొకింత పాసి తన చెంత మెలంగుచు నున్న వేళలన్.

ఇది భావ సంధి. త్రిదండివేషమునం దున్నను అర్జునుడు 'రాజు' నను మాట మరచిపోలేదు. అత డాత్మాభిమానము కలవాడు. ధర్మము నీతి విస్మరింపలేదు. పర హృదయము గుర్తించినఁగాని కార్యాచరణ మునకు పూనుకొనుట తొందరపాటు. వికటించిన యపకీర్తి. ధీరో దాత్తుండగు నాయకు డది సహింపలేడు. దానిలో నతడు ఉలూచి యనినట్లు రసికశేఖరుడు. రసిక శేఖరుడు బలవత్సమాగమమున కిచ్చగింపడు. దాన సుఖం బుండదని వాడెరుగును. కావున నీ యను మానము గుంజాటన.

వేంకటకవి యర్జునుని పాత్ర నీ పద్యముచేత చక్కగా పోషించినాడు. పాత్రపోషణలో వేంకటకవి యారితేరిన దిట్ట యన వలయును. మోహము తల మున్కలయినది. సుభద్ర వినయము మదికింపౌనఁగఁగఁ గంకణ రవములు పొసఁగఁగ నారసి రసాన్నములు

వడ్డించును. ఆ కంకణ రవములలోనే శృంగార రసము కనుల కెగ తట్టించు నుద్దీపన విభావ మున్నది. అందలి రహస్యము పూర్వకవుల యనుభవములలో ముద్రపడి యున్నది. కావుననే నన్నయాది కవి మాన్యులు నాయికకు జాళువా యందెలు రత్నకంకణ కాంచీ కింకిణు లలంకరింతురు. అవి లేనిది వారికి శృంగారము నడువదు. దేనికయి నను అనుభవ ముండవలయును. ఇప్పటి నవ నాగరిక నాయికలకు, కవులకు కాంచీ మంజీర కంకణాభరణములు మోటయినవి. అసలు శృంగార మనిన వారికి తల కంట కించును. ఒడలు నీరసించును. మాటలో నీర్ష్యాసూయలు జనించును. పూర్వ కవుల నూరక నాడి పోసి కొందురు. ఆ రసమును ఆధునిక కవులు వేంకటేశ్వరస్వామికి సమర్పించిరి. వేంకట కవి యా శ్రేణిలోనికి రాలేదు. నవీనుడయ్యును వాని కా కంకణ రవములలోని మహత్త్వ మనుభవమునం దున్నది. వానికే కాదు తంజావూరు కవు లందరికి ననుభవ మున్నది. మగ ఆడ యను తేడాలేదు. ముద్దుపళని రాధికా స్వాంతనమే దానికి తార్కాణము. కథకు త్రిదండి మరొక తార్కాణము.

చిలుకలు కొల్కి వే యెడమచే ముడి గొల్పెడు జాఱుకొప్పు నిం
పులు పులకింపుచుండు భుజమూల రుచుల్ జిలుగుం బయంటలోఁ
గులుకు మిటారి గబ్బి చనుగుబ్బలు సూచుటె కాని క్రీడి క
ర్మిలి మఱి లేదు భోజనము మీది యపేక్ష యొకించుకేనియున్.

కవికి శాస్త్ర పరిచయమే కాదు లోక పరిచయముకూడ ఉండ వల యును. ఆ రెంటిని స్వానుభవమునకు తెచ్చుకొనవలయును. ఆమీద నొక మెట్టు ముందునకు పోయి స్వకీయమగు నూహా ప్రపంచము నందు సంచారము చేయవలయును. అది వినూతన కావ్యసృష్టికి దారి చూపించును. అది లేనివాడు భట్టుమూర్తివలె పరులపై నాధారపడి యుండవలసి వచ్చును. ఉన్నవాడు సౌందరనందము వంటి కావ్యములు సృష్టించును.

వేంకటకవి లోకానుభవము కలవాడు. దానిని స్వంతము కావించుకొని యీ పద్యము రచించెను. స్త్రీలకు పని చేయునప్పుడు

తలముడి వీడుటయు, మాటి మాటికి పైట జారుటయు సహజము. ఆ సంగతి గుర్తెరింగి పోతన్నగారు ముందుగానే జాగ్రత్తపడి వేణిన్ జొల్లెము పెట్టించి సంఘటిత నీవీ బంధను గావించినాడు సత్యభామను నరకాసుర వధలో. ఆమె యతి ప్రౌఢ. సుభద్ర కడు ముగ్ధ. అమాయకురాలు. ముందు వెనుక లెరుగనిది. మొదట తల ముడి సరిగా దిద్దుకొనవలయునని తెలియదు. వంగి వడ్డన కారంభించినది. అసలే యది జారు కొప్పు. యావనంపు టొయారములో మరింత జారినది. కుడిచేయి యెంగిలిది కాబోలు. ఎడమచేయి పయికెత్తి సిగముడి సవరించుకొనినది. ఇంకేమి? సందు దొరికిన దర్జునునకు. కనుల పండువుగా భుజమూల రుచులు చనుగుబ్బలు చూచుట కారంభించినాడు. మనోహర మగు వినూతన సంఘటనమును కావ్యమునందు సృష్టించుట కవి ప్రతిభ. దానిని మృదులములగు పద జాలముతో పద్యమునందు భావానురూపముగా చిత్రించుట చాకచక్యము. ఆ రెండు ఈ పద్యమునందు విశదముగా కనిపించుచున్నవి.

రమణి యొయ్యారములపైఁ బరాకుచేతఁ
జవి యెఱుంగఁడు వడ్డించునవి యెఱుఁగఁడు
భోజనము చేసి లేచె నా రాజసుతుఁడు.

నిగనిగలాడు చంద్రకాంతపుఁ జగతిపయిం గూరుచున్నాఁ డర్జునుడు. సుభద్ర వెనుకం బగడపుఁ గంబము చాటున మొగ మించుక కానిపింప నిలిచినది. సావకాశము లభించినది. సంభాషణ ప్రారంభించినాడా కపట త్రిదండి. అదియు పెండిలిని గురించిన సంగతి. సందర్భమునకు తగియున్నది. 'ఏకాంతమునందున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లాగింతియ గాక' యనిపించుకొను భూసురేంద్రుడు కా డర్జునుడు.

చెలువ నిను రాజ కీరంబు చెట్టపట్టెఁ
గలికి నిను రాజహంసంబు కాలు ద్రొక్కె
మంచి శకునంబు లివి నాదు మాట చూడు
కన్నె యీలోనఁ బెండ్లి కాఁ గలదు నీకు

అన్నాడు. మంచి శకున శాస్త్రవేత్త అర్జునుడు. అతని వేషము వంటిదే యీ జ్యోతిషము. లేకపోయిన రాజకీరము రాజహంసము లే దొరుకునా శకున ఫలితములు చెప్పుటకు. ఇందు శ్లేష. కవికూడ చమత్కారము కలవాడే అవును. కళనుబట్టి కళాకారుడు. లజ్జా వనత వదన తామరస మైనది శుభద్ర. కాదామరి! శృంగార రసా విర్భావమునకు భావోదయ మొదవినది ఆ జవరాలికి. వీరు మహా త్ములు. తాను చేసిన సేవకు మనమలరి వచించినారు స్వాము లని తలంచినది. నిజ మామె కేమి తెలియును? అది నిగూఢము. కొంత చనువు దొరికినది సుభద్రకు.

మీ రింద్రప్రస్థముఁ గని
నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా?

అని ప్రశ్నపై ప్రశ్న వేసినది. సమాధానమునకైనను వేచియుండ లేదు. ఆమె యావేగ మామెది. నాలుగు నాలుగు మేడ మెట్లవంటి ప్రశ్నలు. ఒకదానిని మించిన దింకొకటి. మొదటి రెండు ప్రశ్నలు తరువాత ప్రశ్నల కుద్బోధకములు. భూ ప్రదక్షిణ మొనరింపగ బోయె నర్జును డని సుభద్రకు తెలియును. అతడు తిరిగి వచ్చెనో రాలేదో యని సందేహము. తన్నివృత్తి కొఱకు మూడవ ప్రశ్న యడిగినది. నాలవ ప్రశ్నలో ఒక విశేషము తగిలించినది. అది యాతని మీది యనురాగము వాని ఘనత వెలయించునది. అప్పటి కైన సమాధానముకొఱ కాగలేదు. ఇంటికి చేరనిచో నెచటనైన కనిపించియుండునేమో యని గుర్తులు చెప్పి తెలిసికొను నంతవర కామె మన స్సాగలేదు. ఆ తొందరపాటూ వర్ణనలో దాగుడు మూత లాడినది.

ఎగు బుజంబులవాఁడు మృగరాజ మధ్యంబుఁ
బుణికి పుచ్చుకొను నెన్నడుము వాఁడు
నెఱి వెండ్రుకలవాఁడు నీలంపు నికరంపు
మెఱుఁగు చామనచాయ మేనివాఁడు
గొప్ప కన్నులవాఁడు కోదండ గుణ కిణాం
కములైన ముంజేతు లమరువాఁడు
బవిరి గడ్డమువాఁడు పన్నిదం బిడి డాఁగ
వచ్చు నందపు వెన్నుమచ్చవాఁడు
గరగరనివాఁడు నవ్వు మొగంబువాఁడు
చూడఁగలవాఁడు మేలైన సొబగువాఁడు
వావి మేనత్త కొడుకు కావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు.

అని వావి వరసలతో సహా వివరించినది. ఇట్లు మొదటి రెండింద్ర గణములలో సంకుచిత వాక్యము మిగిలిన యన్నిగణములలో కలిపి యొక వివరణ వాక్యము కలుగునటుల సంభాషణమునందు రచించిన సీసము మాటలాడు వ్యక్తిలోని ముగ్ధత్వము, బోళాతనము, వానితో పాటు తత్తరపాటు సూచించును. మొదటి వాక్యమునందు కంటె రెండవ వాక్యమునందు ఉదాత్తత స్ఫురించును. ఇది కుతూహలము వలన చిత్తవిక్షేపము గల ముద్దియల మాటలలో నధికముగా కని పించును. ఇందలి రచనా చాతుర్యము అనుభవము కలవారికిగాని యవగతము కాదు. ఇది యాత్సుక్యము. అర్జును డంతయు వినినాడు. సుభద్ర మనసు తెలిసినది. సందేహము నివృత్తియైనది. ఇంక మనసు నూరింప మొదలు పెట్టినాడు సుభద్రకు.

తీర్థయాత్ర కావించు నెడం గనుఁగొనినారము సంక్రందన నందనుని అన్నాడు కపట త్రిదండి. సుభద్ర కుతూహలము మరింత హెచ్చినది.

ఎచ్చటఁ గంటిరో విజయు నిక్కువ నిక్కువ మౌనె రాఁడుగా
ఇచ్చటి

కన్నది సుభద్ర.

తీర్థములను గ్రుంకి దేవతా సేవలు
చేసికొనుచుఁ బెక్కు వాసరములు
కూడి యతఁడు మేము గోకర్ణమునయందు
నుంటి

మనినా డర్జునుడు. సుభద్రకు వలపు తల కెక్కినది.

ఎక్కడ గోకర్ణం బన
నిక్కడి కది యెంత దూర మింతకు నతఁ డీ
చక్కటికి వచ్చునో లే
కక్కడనే యుండి యవలి కరుగునో చెపుఁడా

యని ప్రశ్నించినది. ఆ ప్రశ్నలో మాటి మాటి కనురాగము తేట పడినదట. ఇంక అర్జునునకు మన స్నాగ లేదు. ఓర్పు నిలువ లేదు.

అక్కఱతోడ మంతనమునం దిటు వేఁడెదు గాన నంతయున్
నిక్కముఁగాఁగఁ దెల్పనగు
ఆ కవ్వడి యతి వేషము
చేకొని యున్నాఁడు నీకుఁ జెంత నె యెన్నా
ళ్ళో కలదు వచ్చి యిఁక నే
నీ కీలక మించుకైన నీ వెఱుఁగవుగా

అని యున్న నిజము చెప్పివేసినాడు. చేయి పట్టుకొని గాంధర్వంబున పరిణయ మాడు మని బ్రతిమాలినాడు. ఇది భావ శబలత. సాత్త్విక భావము లన్నియు నొక్కసారి ముంచుకొని వచ్చినవి. మీదు మిక్కిలి కట్టుకొంగు సైత మిసుమంత వీడినదట సుభద్రకు

పట్టిన మాత్రన దేవకి
పట్టి కరాబ్జము లలాట పట్టిక చెమటల్

పట్టి గగుర్పొడిచెం జను
కట్టోక యిసుమంత వీడఁ గట్టుం గొంగున్

స్వేదము రోమాంచము నిందు సూచింపబడినవి. పాప మామె మాత్ర మేమి చేయును! మరు డంత బేసితూపులు ధరించి సరి కోలల బడనేసినను సహించినది. ఆమె కుల శీలములు గల కన్నియ. పితృ పరాధీన

మేరలా యివి మీ యంత వారలకును
బెద్ద లున్నారు వారెర్గి పెండ్లి సేయఁ
గలరు వేగిరపా టింత వల దటంచు
విన్నపము సేయరాదె యో చిన్న చిలుక

అని యన్యాపదేశముగా సమాధానము చెప్పినది. ఇది ధైర్యమను శృంగార చేష్ట. ఇంతటితో ద్వితీయాశ్వాసము ముగిసినది. వేంకట కవి మహా చతురముగా కథ నడిపినాడు. స్వభావసిద్ధమును మిగుల రసవంతమునగు కవిత యీ కథా భాగమునందున్నది.

వేంకటకవి కళాసృష్టి కల్పనాశక్తి గల మహాకవి. ఈ కథా భాగమే దానికి నిదర్శనము. తెనుగు కావ్యములందు శృంగార నైషధములోని నల దమయంతుల యొక్కయు, మనుచరిత్రలోని వరూధినీ ప్రవరుల యొక్కయు సంభాషణలు ప్రశంసింపతగినవి. తరువాతి కావ్యములందు విజయవిలాసములోని సుభద్రార్జునుల సంభాషణ పేర్కొన తగినది.

సుభద్రార్జునుల వివాహముతో తృతీయాశ్వాస మారంభ మగుచున్నది.

అంతిపురమునఁ బ్రమదా వనాంతరమునఁ
గృష్ణ కృష్ణా యటంచు నా కీరవాణి
రామ రామా యటంచు నా రాజసుతుఁడు

హరినామ స్మరణ మిషమున నొండొరులను తలంచుకొనుచు నా రేయి గడపిరి. కృష్ణుడనగా నర్జును డని యర్థము. సుభద్ర యర్జునుని

తలంచుకొనినది. రామ యనగా స్త్రీ. ఇచట సుభద్ర. అర్జునుడు సుభద్రను తలంచుకొనినాడు. వియోగులగు నాయకా నాయికలు పరస్పరము తలంచుకొనుట సహజము. రామ కృష్ణ శబ్దములు విష్ణు వాచ్యములు. శ్రీకృష్ణుడు విష్ణువు. సుభద్రార్జునులు కృష్ణుని స్మరించి నారు. కష్టమునం దున్నవారు తమ యిష్టదైవమును తలంచుట స్వభావము. ఇందు సుభద్రార్జునుల కృష్ణభక్తి వ్యంజితమగుచున్నది. భక్తపరాధీనుడు కృష్ణుడు. కావున తన భక్తుల మనోభీష్టము తీర్చి నాడు. సుభద్రార్జునుల వివాహఘట్టమున కిది నాంది. తెల్లవారినది. సుభద్ర లక్షణములను కనిపెట్టినారు సత్యభామా మిత్రవిందాదులు. ఇంక వేళాకోళమునకు దిగినారు.

పులకించె నేమేని తలఁచుకొంటివె యంచు
మేలంబు పచరించె మిత్రవింద
యిన్నాళ్ళవలె మనసిచ్చి మాటాడవే
యెందు దృష్టి యని కాళింది తెగడెఁ
జెలి పెండ్లి కత సెప్పఁ జెవి యొగ్గి వినవేమి
కలదులే యని గేలి సలిపె భద్ర
వలపు వాసన మించెఁ గలికి నీ మొగమంచు
ద్రస్తరి నెఱపె సుదంత కొంత
జాంబవతి నవ్వె లక్షణ సరస మాడె
నేలగడు చేసెదరు ముద్దరాలి ననుచుఁ
బలికె రుక్మిణి సత్య కన్గిలిపె నపుడు
చిన్ని మరదలి మోహంపుఁ జిన్నె లెఱిఁగి

వారు నెఱజాణలు. నాలుగు వైపుల నలుగురు చుట్టు ముట్టినారు. సుభద్ర ముద్దరాలు. అందులో చిన్నది. వారి ముందెందులకు పనికి వచ్చును! వారి హాళాహాళికి తాళలేకపోయినది. సమాధానము

చెప్పలేక తల వంచుకొనినది. సత్యభామ సంగతి చెప్పనక్కరలేదు. మగనిని తల తన్నిన మగువ. ఒకపట్టున నూరకుండునది కాదు. మరింత రేగినది. మాట చతురతకేమి తరుగు లేదు. కన్గిలిపినది. కన్గిలిపినట్లూరకుండ లేదు.

క్రాగి యున్నది మిగుల నంగంబు సూడఁ
గలవరించుచు నున్నది కలదొ యేమొ
పోఁకు డల్ల సన్న్యాసికే చూపవలయు
భామ నని పల్కెనా సత్య భామ నగుచు.

అసలు సంగతి బైట పడినది. సుభద్రకు మదనతాపము మరింత హెచ్చినది. చెలికత్తెలు శిశిరోపచారముల కారంభించినారు. పరంపరాగతమయిన యాచారము మదన మలయ మారుతాది కోపాలంభములు. అవి సాగినవి. ఇట్టివానిని చూచియే నవ నాగరకులు తెలుగు కావ్యములన్నియు ననుకరణ సామగ్రి కలవి. ఒకటి చదివిన చాలును అన్నియు నదేమాదిరి యని పరిహాసింతురు. ఆ మాట అంగీకరింపక తప్పదు. కొంత దానియందు సత్యమున్నది. సంస్కృత కావ్యములం దీ యనుకరణములు చాల తక్కువ. మహాకవు-లొకరు పోయిన దారి నింకొకరు త్రొక్కలేదు. ఒకరు వ్రాసిన కావ్య మింకొకరు వ్రాయలేదు. సుభద్రార్జునుల వివాహమునకు సన్నాహము లన్నియు జరిగినవి.

మంచి మగఁడు వలయునంచుఁ గోరుచునుండ
మంచి మగఁడు గల్గె మఘువ సుతుఁడు
మన సుభద్ర సుకృత మహిమ యేమన వచ్చు
మనసు భద్రమయ్యె మనకు నెల్ల

అనుకొనినా రందరు. వేంకటకవి చూచి వచ్చినట్లు పూస గ్రుచ్చి నటుల వివాహమంతయు విపులముగా వర్ణించినాడు. అందుండి రెండు మూడు పద్యములు

వియ్యంపు మర్యాద వేగు జామున శచీ
జాని బువ్వాన భోజనము చేసి
గుమ గుమ వాసించు కుంకుమ కస్తూరి
యమర వల్లభుని హ స్తమున కిచ్చి
గంబూర గుల్కెన తాంబూల మింద్రుఁ డం
దుకొనఁ బో సేనాని దోయిట నిడి
పీతాంబరములు విప్పి యనేకము ల్వజ్రి
చేతి సంజ్ఞ జయంతు చేతి కొసఁగి
కేలఁ గేల్వట్టి కొన్ని వాకిళ్ళు గడచి
రాఁగ విచ్చేసి యుండుఁడు రావల దని
బలిమి బలభేది యెదురుగ నిలిచి మ్రొక్క
వేడుక మురారి గేల్మోడ్చి వీడుకొలిపె

వేంకటకవి రఘునాథ నాయక మహారాజు నాస్థానకవి. రాజ మర్యాదలు రాజుల యింటి పరిణయములు చూచినవాడు. కావున సుభద్రార్జునుల వివాహము అంత చక్కగా వర్ణింపగలిగినాడు. శ్రీనాధుడు హర విలాసమునందు పార్వతీ పరమేశ్వరుల పరిణయమును వర్ణించెను. అది చాల రమణీయముగా నున్నదని నేను తలంచుచుందును. విజయ విలాసములోని సుభద్రార్జునుల వివాహవర్ణన దానికే విధమునను తీసిపోలేదు. ఒకొక్కప్పుడు దానిని మించినదేమో యని కూడ అనిపించును. వేంకటకవి పలుకులో మాధుర్య మున్నది. కవితలో రస మున్నది. రచనలో చాతుర్య మున్నది. సంభాషణలలో సరసత్వము తొణికిసలాడుచుండును. ఇటు చూడుడు.

రుక్మిణీదేవి తమ యత్త మ్రోల శచికిఁ
బసిఁడి గిన్నియఁ గస్తూరి యొసఁగ నామె
చేఁ దిగిచి దేవకీదేవి మీఁదఁ జిలికి
వదినెగా-రని యొకకొంత వావి నెఱపె

నట. పద్యము చాల చిన్నది. భావము కొండంత యిమిడ్చినాడు. రుక్మిణికి అత్తగారు దేవకి. అత్తగారిని వేళాకోళము చేయ చూచుట కోడలి స్వభావము. అది తాను స్వయముగా చేయరాదు. వావి వరుసలు కలవారిచేత చేయించవలయును. నోటితో చెప్పకూడదు. కావున రుక్మిణి తన యత్త మ్రోల నంగనాచివలె నెరుగ నటుల నిలిచినది. పసిడి గిన్నియఁ గస్తూరి యందించినది. ఇందులోన రుక్మిణి జాణతనము అత్తగారి యందలి గౌరవము పైకి కనిపించు చున్నది. మొదటి రెండు పంక్తులలో రుక్మిణి శీలము చక్కగా పోషించినాడు వేంకటకవి. ఆ యందము ఘనత 'మ్రోల' యను శబ్దములో నున్నది. శచి సామాన్యురాలు కాదు. ఆమె త్రిలోకవిభుని యిల్లాలు. సరసత నేర్చినది. ఎంతవరకు నా సరసత నెరపవలయునో తెలియును. ఆమె కస్తురి చేఁ దిగిచి దేవకి మీద చిలికించినదట. వెకిలితనము లేని సరసత్వము. పనిలోనె కాదు పలుకులో కూడ అంతయె. వదినె గారని యొక కొంత వరుసలాడినదట. మిత భాషిత్వము మిత సరసత్వము ఉత్తమ స్త్రీ లక్షణము. చక్కని పద్యము. ప్రతి పదము నందు రస ముట్టిపడుచున్నది. దీనిలో నే యక్షరము తొలగించినను భావము చెడిపోవును. పాత్ర పోషణ రసపోషణ భావ ప్రకటన యంత నిండుకొని యున్నది. పదములు తూచి నటుల పడినవి. ఏమి యెరుగ నట్లుండి పరులచేత తాను తలంచిన పని చేయించుటలో రుక్మిణి ఘనత యున్నది. గ్రహించుకొన వలయునుగాని విజయ విలాసమునం దిట్టి రస భావ గర్భితము లయిన పద్యములు చాల కలవు. వేంకటకవి గొప్ప యింటి యువతుల సరసత్వము లెరిగిన వాడు. శచి దేవకీదేవితో నిట్టు లన్నది తరువాత

వీయపురాల వైతిగదవే యిపు డత్తవు తొంటి వాని నో
తోయజనేత్రుఁ గాంచిన వధూమణి నీ సుతఁ బెండ్లి యాడఁగా
నాయము నా కుమారునకు నర్మిలి హత్తఁగ నత్త వావిచే
నాయువు గల్గువాఁ డవు నటంద్రు శుభంబగు దీన నెంతయున్

సత్యభామను చూచినది శచీదేవి. పారిజాత వృక్షము మాట జ్ఞాప కమునకు వచ్చినది. ఆమెతో నిట్టు లన్నది

చెల్లెల లెస్సలా పెరటి చెట్టుగ నాటిన పారిజాత ము
త్ఫుల్ల నవీన సూనములతో విలసిల్లుచు నున్న దా సదా
యుల్లము దాని మీఁదటనె యుండును నాకది ప్రాపుఁబ్రోపుఁ బు
ట్టిల్లును జొచ్చినిల్లు నయి వృద్ధి యొసంగెడు నీకు నెంతయున్

విజయవిలాసములోని మొదటి పద్యములకును ఈ పద్యములకును గల శయ్యలోని తారతమ్యమును చదువరులు గమనింతురుగాక. రాను రాను ఆచ్ఛిక పదజాలము తగ్గినది; దేశీయములు హెచ్చినవి. వేంకటకవి శృంగార రస ప్రదర్శనమునందే కాక వీరమునందు కూడ ఆరితేరిన కవిత వెలయించెను. యాదవ వీరులు చుట్టుముట్టిరి.

తేరు గడపఁగ మా యన్న దిద్దె నన్ను
నేయ నేరిపె వింట నొక్కింత నాకు
నా వదినె సత్యభామ మున్నరక వైన
నిలిచి మున్నరకాసురు గెలిచెఁ గాదె

అనినది సుభద్ర. భారతజాతి స్త్రీలు పురాణకాలము నుండియు సంగీత సాహిత్య శాస్త్ర విద్యలందేకాక రణవిద్యయందు నారితేరిన వారు. ఈ యదృష్ట మితర దేశ స్త్రీలకు నెవరికి లేదు. అర్జునుడు

నీ వేడు కేల గాదన
గావలె నటు వలెనె తేరు గడపు మటంచున్
జే విలు నమ్ములుఁ గైకొనె
నా విజయుఁడు సమర సన్నహన దోహలుఁడై

ఎత్తిన యాయుధంబు లవి యెన్నియొ యన్నిటి నన్ని తూపులన్
దుత్తునియల్గఁ జేయు మఱి తోడనె పూనఁగఁ జేతు లాడ నీఁ
డ త్తరుణీ రథాశ్వముల యండకు రా విడఁ డంప తున్కయే
న త్తఱి నాతఁడే మనఁగ నా శర లాఘవ సావధానతల్

> రకపుం జెయ్యోలం దా వినోదముగ సారథ్యంబు గావించు క
> న్యకపైఁ బెట్టిన చూపెకాని యిటు సేనం జూచుటా లేదు సా
> యక పంక్తుల్ నడుచున్ సహస్రములుగా నయ్యారె విన్వాచ్చు చే
> తికిఁ గన్నుల్ గలవంచు నెంచి రపుడెంతే వీర యోధాగ్రణుల్.

'విన్వాచ్చు చేతికిఁ గన్నుల్ గలవంచు నెంచిరట' చక్కని దేశీయము. ఇదే కాదు ఇట్టివి రతనములవలె విజయవిలాసము సారంగధర చరిత్రలందు పెక్కు వెదజల్లినాడు వేంకటకవి. మేనత్త వావిచే నాయువు కల్గువాఁడవును. ఇత్యాదులు సందర్భోచితముగా వాడుట వలన పద్యములకు జీవము పోసినట్లయి శోభను కలిగించినవి. వానిని చదివినప్పుడు పాఠకున కొక విధమగు నానంద మొదవును. వీనికి తోడు లోకోక్తులు వేంకటకవి సమయానుకూలముగా రెండు కావ్యములందు దాదాపు నలుబదివరకు వాడినాడు. ఇన్ని లోకోక్తులు పూర్వ కవులలో వాడినవారు లేరు. అలంకారముల మాటటుంచుడు. అవి భావ స్ఫూర్తికలవియై మనస్సునకు కథకు వికాసము కలిగించినవి. ఈ సంగతి యా యా చోటులందు వివరించితిని. అతడచ్చ తెనుగు పదముల కొటారు. వానితో సమాసములు కూర్చుటయం దాతనికున్న చతురత మరే కవికి లేదు. ఎంతటి సమాసమైన నల్లగలఁడు. అది రచనకొక యందము తెచ్చును. "కుందనపుఁ బసిండి కుళ్లాయి జగలు, మేలిపసిండి గాజుల సమేళపుఁ బచ్చల కీల్కడెంపు డా కేలు" ఇత్యాదు లరయునది.

ఏ పదము నేవిధముగా మలిపిన నే యర్థ మెట్లు మారునో వేంకటకవికి బాగుగా తెలియును. పెద్ద లెంచు క్వార్థక ఇకారాది సంధులు మొదలగు దోషములు నేను దోషములుగా తలంపను. రసానుకూలముగా లక్షణము నతిక్రమించుట కొకొక్కప్పుడు మహాకవులకు స్వతంత్ర మున్నది. ఒక్క తెలుగు భాషయందే కాదు. అన్ని భాషలయందు నా నిరంకుశత్వము కలదు. శబ్ద యమకాది అలంకారములు కొంత రసస్రుతి కడ్డుపాటు ఘటించినను పదునేడవ శతాబ్దము నా తరువాతి శతాబ్దము లందలి కవులలో వేంకటకవి యగ్రగణ్యు డనుటలో సందేహము లేదు.

## ౫

## విజయరాఘవ నాయకుడు

రఘునాథ నాయకుడు క్రీ. శ. 1630 వ సంవత్సరమునందు మరణించెను. ఆ మహారాజునకు అచ్యుత నాయకుడు, అచ్యుత రామ భద్ర నాయకుడు, విజయరాఘవ నాయకు డను ముగ్వురు కుమారులు కలరు. రఘునాథ నాయకుని యనంతరము మొదటి కుమారుడగు అచ్యుత నాయకుడు రాజ్యమునకు వచ్చెను. ఏ కారణముననో తంజా వూరు రాజ్య సింహాసనముకొరకు మూడు సంవత్సరములు అన్న తమ్ములలో నెడ తెగని పోరాటము తటస్థించినది. క్రీ.శ. 1633వ సంవత్సరమున విజయ రాఘవ నాయకుడు తంజావూరునకు రాజయ్యెను.

ఇతడు క్రీ. శ. 1633 మొదలు 1673 వరకు నలుబది సంవత్సరములు మహావైభవముగా తంజావూరు రాజ్యమును పరిపాలించెను. విజయరాఘవ నాయకుడు వీరాధివీరుడు.

వీరుఁడౌ సవరము వేంకటపతిని
బాఱఁదోలించి నీ పనుపులచేతఁ
బట్టైన సీమలోఁ బందనల్లూరు
కట్టించిన

సాహసవంతుడు

శ్రీరంగ రాయలఁ జేపట్టి నిల్పి
యారాయ కార్యంబు లౌఁగా దటంచు
దుండగించిన పాండ్య తుండీర పతుల
ఖండించి వాకిలిఁ గావఁ జేసి

న పరమ విశ్వాస పాత్రుడు. వేంకటరాయల యనంతరము శ్రీరంగ రాయలు కర్నాట, విజయనగర, రాజ్యసింహాసన మధిష్ఠించెను. మధుర చెంజి మండలాధిపతులు రంగ రాయల నెదిరించిరి. రఘు

నాథ నాయకుడు వలెనె విజయరాఘవ నాయకుడు రంగరాయల పక్ష మవలంబించి మధుర చెంజి మండలాధిపతులను సంగ్రామము నందు ఓడించెను. 'జీర్ణ కర్ణాట సామ్రాజ్య సింహాసన సంస్థాపనాచార్య' యను బిరుదము వహించెను.

పిడుగులు కురిపించు మేఘుడు చల్లని యమృతమును వర్షించును. కన్నులు మిరుమిట్లు గొలిపించు నబ్బురంబగు మెఱపు తీగెలను పుట్టించును. ఘనుల యంతరంగములు నవరసములకు జన్మ స్థానములు.

విజయరాఘవ నాయకు డెంత మహావీరుడో యంత రసికుడు. ఎంత రసికుడో యంత కళాకోవిదుఁడు, కళా పోషకుడు. రఘునాథ నాయకుని వలె నాతడు కవి. సంగీత నాట్య విద్యలయం దారితేరిన దిట్ట. ఆయన కాలమున తంజావూరొక సకల కళామందిరము వలె నుండెనని ప్రతీతి. ప్రతీతియే కాదు దానికి తగిన నిదర్శనములు గ్రంథములందు పెక్కు కనిపించుచున్నవి. చెంగల్వ కాళకవి రాజగోపాల విలాసమునందు

వినత రాజన్య కోటీర వివిధ రత్న
సమితి యీ రీతి నుపచార సరణిఁ గూర్ప
విజయ రాఘవ మేదినీ విభుని యంఘ్రి
నౌర సాహిత్యరాయ పెండార మమరు

అని నుడివినాడు. అతని కవితను గురించి

ఒక్కొక్క యెడఁ జీని చక్కెర పానకం
బానిన ట్లాహ్లాద మావహిల్ల
నొక్కొక్క యెడఁ దావి నెక్కొన విరవాది
సరము లెత్తిన రీతిఁ బరిమళింప
నొక్కొక్క యెడఁ జవు లుప్ప తిల్లఁగ మంద
మారుతంబులు వీచు మహిమ చెలఁగ
నొక్కొక్క యెడ మేనఁ జొక్కు సంపాదించు
వెలఁది వెన్నెల తేట విధము మించఁ

గవిత రచియింప విజయ రాఘవ విభుండె
నేర్చునని వాణి నర్తించు నేర్పు మెఱయఁ
జామరానిల కందళి చలిత మగుచుఁ
దనరు సభలోన నల శారదా ధ్వజంబు.

అని వర్ణించినాడు. విజయరాఘవుని సభయందు శారదా ధ్వజ మొకటి యున్నదట, నైషధ కావ్యకర్తయగు శ్రీహర్షుని కాలము నందు కాశ్మీరమున శారదావిగ్రహ ముండెడిదనియు, అది చాల మహిమ కలదనియు ప్రతీతి కలదు. ఆ కాలమునందు కాశ్మీరము సరస్వతీ మహాదేవికి నాట్యమందిరమయి కవులకు పండితులకు నిలయముగా నుండెను. బిల్హణకవి కాశ్మీర నివాసి. ఆయన విక్ర మాంక దేవ చరిత్రమునందు కాశ్మీరమును గురించి విపులముగా వర్ణించెను.

తంజావూరు చివరి నాయక రాజుల కాలమున విశేషించి విజయరాఘవ నాయకుని కాలమున నాట్య నాటక సంగీత సాహిత్య కళలకు శారదా పీఠమయి విలసిల్లినది. దానికి కారణము విజయ రాఘవ నాయకుని కళాపాండిత్యము. పండితుడు పండితాభివృద్ధి వాంఛించును. అతడు కళాపోషకు డైనాడు. కళాకారు డైనాడు. తండ్రి గుణములే యీ మహారాజున కబ్బినవి. దిగ్గహ గహనంబులు దద్దరిల్ల నరాతి వీర వాహినీ నివహంబుల గుండె లవియించు సింహ గర్జా నినాదంబు లొదవించు కఠిన శిలా కర్కశంబైన హృదయ కుహరమునుండి కావ్యరస సుధా వాహిని దుముకు లాడినది. అమిత మృదు మనోహర పద జాలములు పరవడులు త్రొక్కినవి. దేశీయ తాభిమానము తీర్పులు దిద్దినది. పితృభక్తి పెనవేసికొనినది. కత్తి పట్టి కదన రంగములో కంఠము లుత్తరించిన చేతితో పసిడి గంటము నందికొనినాడు విజయరాఘవ వీర నరపాల శిరోమణి. కవియై కావ్య రచనకు పూనుకొనినాడు.

ద్విపద చ్ఛందమునందు రఘునాథ నాయకాభ్యుదయము

వ్రాసినాడు. అది యా మహారాజున కిష్ట దైవమును దక్షిణ ద్వారకా విభుండు నగు మన్నారు దేవుని యానతి. ఆ దైవము స్వప్నమున సాక్షాత్కరించి

మా యవతారమై మహి నుదయించి
మీ యయ్యయై ధైర్య మేరువై మించి
యఘటన ఘటనా సమర్థుండై వెలయు
రఘునాథ మేదినీ రమణుని చర్య
ధీ కౌశలము మించ ద్విపద గావించి
మా కంకితము సేసి మనుము వే యేండ్లు

అని నుడివినాడు. అందలి సత్యాసత్యము లెటు లున్నను విజయ రాఘవ నాయకుని దైవభక్తి, పితృభక్తి వేయి ముఖముల చాటు చున్నది. 'నా విష్ణుః పృథివీ పతిః' అనుటచేత రఘునాథ నాయకుడు విష్ణు నవతార మని పాఠకు డంగీకరింప వచ్చును.

తండ్రి కన్నను వేరె దైవంబు లేద
టంద్రు భూసురులు నే నది మది నెంచి

ఘన వచో రచన గావించిన విజయరాఘవభూపతి మన్నారు దేవుని యవతార మని తండ్రిని వర్ణించుటలో నతిశయోక్తి లేదు. ఆ మహారాజు గురుభక్తియు నంతటిదే. తన స్వప్న వృత్తాంతము కుల గురువగు తిరుమల తాతాచార్యుల వారికి వినిపించెను. ఆయన విజయరాఘవ భూపతిని ఆయన వంశము వారిని పేరు పేర వినుతించెను.

సాక్షాత్కరించి ప్రసన్నుండై యున్న
దక్షిణ ద్వారకాధ్యక్షుండై మించు
తిరుమల శ్రీతాత దేశికోత్తముండు
కరుణించి యనుమతి గావిం

చినాడు కావ్య రచనకు. దక్షిణ ద్వారకా విభుడట తిరుమల తాతాచార్యులవారు. గురుదేవోభవ. దీనిని చూచియే కాబోలు ముద్దు

పళని తన స్వప్న వృత్తాంతమును గురు దేవులకు విన్నవించి ఆయన శిష్యుని చేత తన్ను తన వంశమును కైవారము చేయించుకొనినది. తన్ను తాను వినుతించుకొనుట ఆత్మ హత్య వంటిది. అది యెరింగి శ్రీకృష్ణరాయ లాముక్త మాల్యదయందు పెద్దనగారి పద్యములను గ్రహించినాడు. అది విలోకించి యాముక్త మాల్యద పెద్దన రచించి రాజు పేరు పెట్టినను ప్రవాదు బయలుదేరినది. నాలుకకు నరము లేదు.

రఘునాథ నాయ కాభ్యుదయము నాయక రాజుల కాలము నందలి తంజావూరు ఛాయా చిత్రము. మహారాజుల యాచార వ్యవహారములకు ప్రతిబింబము. పూర్వ కవి కావ్యములకు అనుకరణము. విజయ రాఘవ నాయకుడు తన కావ్యమును తంజావూరు వర్ణనతో నారంభించెను.

కోట బైట జలంబు గ్రోల నేతెంచు
మేటి మత్తేభముల్ మేఘముల్ గాఁగ
పాతాళమున నున్న పన్నగ రాజ
శాతోదరులు తటిజ్జాతముల్ గాఁగఁ
దగు పుండరీకముల్ దారలు గాఁగ
గగన సమానమై గనుపట్టు పరిఘ

యటుపై మిన్నంటు ప్రాకారము. దాని నంటి చుట్టు సోమ సూర్య వాస్తువుల విభవంబు ననుసరించి రాజవీథులు. వాని కిరువైపులందు బంగారు వ్రాత పని మించు గొప్ప యుప్పరిగలు. వాని చెంత సుగంధ ద్రవ్యములు మణి విశేషములు పూవుల సరములు నమ్మ నంగడి మళిగలు. అందందు కలువలు తమ్ములు వాసించు కొలకులు. బహు శారికా కీర పారావతములతోడి యారామములు. వాని నంటి భావ భవ కళా పరమ రహస్య కోవిద లగు సాని కూతుల యిండ్లు గల చుట్టు వీథులు. వాని నడుమ ప్రహరి. దానిలోపల బంగారు కలశములు పైని మిటారించు కొలువుకూటము. ఏన్గుల శాల, గుఱ్ఱపు శాల, నగరి సంప్రతి కరణములు జతకూడి వ్రాయు విశాల శాల.

శ్రీరామచంద్రుని చిత్రపటము గల రామభద్రశాల. సేనాధిపతులగు రాజులు దొరలు నుండు లక్ష్మీవిలాస మందిరము. పున్నాగ తరు శీతల చ్ఛాయ నున్న అచ్యుత రంగకూటము, గరడి కూటము, నాటకశాల, మదనగోపాల విలాస మందిరము, శ్రీరామ సౌధము. నగరి నడుమ రాజభవనములు; వానిలో నిందిరా మందిరము ప్రధాన మయినది. దానికి బంగారు కవాట మార్గములు గలవు. చంద్ర కాంతపు వింత పనులు విలసిల్లు జగతిమీద పగడాల బటువు కంబ ములు దంతపుఁ జేరుళ్ళ తుదల మలచిన చీన పత్తులు. కెంపుటా పనుల బోదియలు. పచ్చ టా పలకలపై కప్పు ఇంద్రనీలముల లోవరి. చలువ గోడలు. రావి రేకుల తోరణములు. వైడూర్యంపు దార బందములు మొదలగు వానితో నిందిరా మందిరము విరాజిలు చుండును. దానిని నిరంతరము కంచుకీ వర్గము కాచుచుండును. దాని వెంబడి విజయరాఘవ విలాస మందిరము కలదు. ఇది తంజాపురీ చిత్రము. రమణీయముగా నూరు పంక్తులలో వర్ణింప బడినది. తెనుగు సారస్వతమునందు పెక్కు కావ్యములు కలవు. వానియందు పుర వర్ణనలు గావింపబడినవి. ఇంత విపులముగా కన్నులకు కనిపించునటుల వర్ణించిన కవి యొక్కడును కానరాడు. పరంపరాగతములయిన యాచారముల ననుసరించి లాంఛనము కొరకు పరిఘా ప్రాకార సౌధారామాది వర్ణనములతో వారు తనివి నొందిరి. కావున వర్ణనలు పరిపూర్ణత్వమును బొందలేదు.

విజయరాఘవ భూపాలుడు తాను నివసించి నిత్యము విలో కించుచు విహరించు నగరము తంజాపురము. దాని నిర్మాణ వైభ వాదికములందు ప్రత్యేక గౌరవాదరములు గలవు. అది తాను పరి పాలించు రాజధాని. అందుమూలమున ప్రతి విషయము ఛాయా చిత్రమునందువలె కనుల యెదుట నిలిపినాడు. క్రీడాభిరామమునందు ఓరుగల్లు వర్ణింపబడినది. ఆ వర్ణనలలో నగరము కనులకు పొడ కట్టు ననుటకు సందేహము లేదు. కాని ఇందున్న ఐక్యత దాని యందు లేదు. పురవర్ణనయందే కాదు, రఘునాథ నాయకుని దిన

చర్య వర్ణించు నప్పుడును కనుల యెదుట జరుగుచున్నటులను భ్రమింతుము. అది యీ స్వాభావిక రచనా విధానములో నున్నది. తన కనుల యెదుట ప్రవర్తిల్లినది. కావున విజయరాఘవ నృపాలు డట్లు వ్రాయగలిగెను. భారత రామాయణములలో నున్న ఘనత యదియే. వ్యాస వాల్మీకులు చూచి యనుభవించిన కథలవి. వానిలో తమకును భాగమున్నది. వా రందలి పాత్రలు. కావున విపులముగా ప్రతి విషయమంత చక్కగా నుడువ గలిగిరి. విజయరాఘవ నరపాలుడు దర్శించి యానందించిన విషయము. అందు తా నొక పాత్ర కావున అంత విపులముగా రమణీయముగా రఘునాథ నాయకుని దిన చర్య వర్ణింప గలిగెను. ఈ కావ్యమునకు రఘునాథ నాయకుడు నాయకుడు. ఆ నరపతి

మేటి రాజుల కెల్ల మేల్బంతి యగుచు
ధరణిపైఁ గృతయుగ ధర్మంబు నడపఁ
బరమ దయాళుఁడై ప్రజలఁ బాలించె.

రఘునాథ భూపతి దానధర్మములు నిత్యకృతానేకసహస్ర బ్రాహ్మణ సమారాధనలు ధర్మసత్రవులు దీనికి తార్కాణములు. ఆ మహారాజొకనాడు

సకియలు మేల్కొల్ప సంతోష మెసఁగ
నిద్దుర మేల్కాంచి నిద్దంపు నిలువు
టద్దంబుఁ గని యిద్దరయగార్లఁ జూచి
బంగారు బిందెలఁ బాలు కన్గొనుచు
మంగళ ప్రదు గరుత్మంతు నీక్షించి

నాడు. ఇది నిద్దర లేవగానే నాయకరాజులు గావించు నిత్యకృత్యము. విజయరాఘవ నరపాలుడు సహితము నిట్లే.

నిదుర మేల్కొని పెద్ద నిలువు టద్దంబు
కపిల ధేనువు పూర్ణ కలశముల్ చూచి
యపుడు భూదేవ ద్వయంబు నీక్షించి

అని యాది యందు వ్రాసికొనెను. ఉప్పడమయిన పిదప రఘునాథ నాయకుడు నారీ మణులు చేదండ లొసగ, వచ్చి మెఱుపుల మంచంబు మీాద కూర్చుండెను. పుత్ర పౌత్ర కళత్రములు చుట్టుచేరి కొలువు తీర్చిరి. మహారాజు సంగీత సాహిత్య నాట్యకళా విద్వాంసుడు. నిత్యము నా యీా కళలు బిరుదు పాత్రలు విజృంభించి యీా రాజవరు నెదుట ప్రదర్శించుట యలవాటు. అందులో

పదచాళి గొనియె రూపవతీ వధూటి
కొద లేక పేరణిc గొనెc జంద్రరేఖ
జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు
ననబోcడి యగు లోకనాయకీ కాంత
వనజలోచన కీరవాణి లతాంగి
దురుపదకేళియు దురుత

నటించిరి. పదచాళి నృత్త గీత వాద్యములతో నభినయము జోడించి చేయు నాట్యము. పేరణి భాండోపరి నృత్యము. జక్కిణి యొకరక మగు నాట. ఇది కత్రి పల్లటి మొదలగు భేదములచేత నాల్గు రకములు. కందుక క్రీడ జడ బంధాదులు వీనిలోని రకములని కొందరి యభిప్రాయము. దురుపద కేళికయు దురుతయు మాకికము లనియు నృత్యమునకే యందు ప్రాధాన్యము కలదనియు కొందరు నాట్య శాస్త్ర విదులు చెప్పుచున్నారు. ఇవికాక

కొరవంజి శివలీల గుజరాతి దేశి
విరిబోండ్లు కొందఱు వినిపించి

రట. కొరవంజి యడవిజాతి వారొనరించు సమిష్టి నృత్యము. శివ లీలయు నట్టిదే యై యుండవచ్చును. కాని శివతాండవమే శివలీల యని కొందరి అభిప్రాయము. గుజరాతి ఘూర్జర దేశ నాట్యము. అది దాదాపు లంబాడీల నృత్యమును బోలియుండును. దేశి గ్రామీా ణుల నాట్యము. ఇవి నాట్య వినోదములు. ఇంక గానవాద్య వినోద

ములు పెక్కు కలవు. వీణె, మురళి, రబాబు, తంబుర, దండె, చెంగు, స్వరమండలము, రావణహస్తము మొదలగునవి. ఇవి యానాటి జంత్రవిశేషములు, చివరికి సాహిత్య గోష్ఠి. ఇందు రఘునాథ భూపాలుడు రచించిన కావ్యములు పఠించుట, సమస్యలు పూరించుట మొదలగునవి జరుగును. దీనిని గురించి యదివరకు ప్రస్తావించితిని. ఈ విద్యలు ప్రదర్శించువారు స్త్రీలు. వారికి సువర్ణ విభూషణాంబరముల నొసంగి గౌరవించుట యొక నిత్యకృత్యము. దీనినిబట్టి తంజావూరు నాయక రాజుల కాలమునందు సంగీత సాహిత్య నాట్య నాటక కళలయం దెంత ఘనత వహించినది మన మూహించుకొన వచ్చును. రాజులు స్వయముగా నాటకములు యక్షగానములు రచించిరి. వానిని ప్రదర్శించి ప్రచారములోనికి తెచ్చుటకు నాటకశాలలు కట్టించిరి. శ్రీకృష్ణదేవరాయల కాలమునం దిట్టి నాటక ప్రదర్శనములు జరిగినట్లు గాని నాటకశాల లున్నటులగాని కనిపించదు.

కొండవీటి రాజుల కాలమునందు వసంతరాయల పరిపాలనయందు నిట్టి నాటక నాట్య ప్రదర్శనములు వసంతోత్సవ సమయములందు జరుగుచుండెడి వని ప్రతీతి. అందు కాటయ వేమారెడ్డికి ప్రాధాన్యము కలదు. అతడు నాట్యశాస్త్రవేత్త, పండితుడు. వామన భట్టునకు సహాధ్యాయి. శాకుంతలాది నాటకములకు వ్యాఖ్యాత. ఆ కాలమున కొండవీటియందు నాట్యకళామందిరము కలదనియు, నందు సంస్కృత నాటకములు యక్షగానములు, నాట్యములు ప్రదర్శించుచుండెడి వారనియు గ్రంథములందు కలవు. అటు తరువాత అంతకు మించిన కళానిలయమైనది తంజానగరము. ఇప్పటికి నా ప్రతీతి యట్టులనే నిలిచినది. పిమ్మట రఘునాథ నాయక మహారాజు మజ్జన మాచరించి

చలువ పంచ ధరించి జవ్వాది తావి
సన్నజాదులు సరుల్ చక్కఁగాఁ జుట్టి
వన్నె మీఱంగ దువ్వలువ పైఁ జేర్చి

రంగు రుమాలు చెరంగులు జాఱ
బంగారు సరిగ దుప్పటి చారి గట్టి
ముద్రికాభరణంబు ముత్యాల రొంట్లు
భద్రమా శ్రీరామ భద్ర తాళియును
ధరియించి
తిరుచూర్ణ రేఖతోఁ దిరుమణి నుదుట
ధరియించి మేన ద్వాదశ పుండ్రములను

సవరించును. రఘునాథ నాయకుడువీరవైష్ణవ మతావలంబకుడు. అయిన నేమి, పరమత సహనము గల మహారాజు. శివపూజా ధురంధరుడు రాజరాజనరేంద్రుడు. వాని కథ సారంగధర చరిత్ర. దానిని కృతి గైకొనినాడు రఘునాథరాయలు. అది రాజలక్షణము. సకల జనులను రంజించువాడు రాజు.

శ్రీకృష్ణరాయలు వైష్ణవుడు. ధూర్జటివంటి వీరశైవునకు తన కొలువులో నాశ్రయమిచ్చినాడు. ఉత్తముల యంతరంగములు మిక్కిలి విశాలములయినవి. సంకుచిత భావముల కందు తావు లేదు. పై పాదములందు మూర్తీభవించిన వైష్ణవాచార సంపన్నుడగు రఘునాథ నాయకుని రూపము చక్కగా చిత్రింపబడినది. ఆ కట్టు బొట్టు అలంకారములు నామతీర్థమున కరుగునప్పటి యాకారము. అటు తరువాత అష్టాక్షరీ మంత్ర జపము గావించి తిరువారాధన మాచరించును. పిమ్మట భాగవత రామాయణ శ్రవణము. నిత్య దానములు. చివరకు ఆచార్యుల మంత్రాక్షతలు తలయందు ధరించును. ఇవి నిత్యకృత్యములు. ఇట్టి మహారాజును కన్న తెనుగు తల్లి యదృష్టవంతురాలు. తరువాతి కార్యక్రమము కొలువు సింగారము. దీనిని ముప్పది పంక్తులలో తీర్చిదిద్ది నవ మన్మథాకారుని గావించి విజయరాఘువ భూపాలుడు రఘునాథ నాయకుని పాఠకు నెదుట నిలిపినాడు. చేమకూర వేంకటకవి చిత్రరూప రచన దీనియందు గోచరించును. ఇరువురు మహారాజులను కన్నార చూచినవారు.

అల్లసాని పెద్దనగారు సైతము రాయల రూప ప్రతిబింబమును అంత రమణీయముగా చిత్రింపలేకపోయినాడు. పెద్దనగారే కాదు; ఏ కవియు నే మహారాజును అంత విశదముగా విపులముగా రూప కల్పన చేయలేదు. వారి లేఖినులు కావ్య శిల్పమునకు తడుములాడి సహజత్వమును కోలుపోయినవి. విజయరాఘవ నరపాలుని గంటము ఉన్నది యున్నటుల చిత్రించి కళాజీవము పోసినది. ఏకధాటిగా నిట్లు వర్ణించుటకు ద్విపద చ్ఛందము మిగుల సాయపడినది.

సంపంగి పువ్వుల సరములు చుట్టి
సొంపు రాణింపఁగా సుప్పాణి గొప్ప
ముత్యాల కుళ్ళాయి మోహన లీల
ముత్యపు రావులు ముదువుగాఁ బూని
నిద్దంపుఁ జెక్కుల నీటులు తేర
పెద్ద చౌకట్టులు ప్రియముతోఁ బూని
యవిరళ నవ కుంకుమాంగరాగంబు
సవరించి వీనుల జవ్వాది నించి
సరిగ ముత్తెపుఁ గుట్టు జంటిపై మెఱయ
హారువైన పైఠిణీ యరచట్టఁ దొడిగి
బంగారు చుంగులు పై మిటారింప
రంగారు పీతాంబరము కటిఁ గట్టి
కంటి కింపై మించు కంఠ మాలికలు
కంట సరంబునుఁ గడు వేడ్కఁ బూని
పచ్చల పదకంబు బవిరి చెక్కడపు
హెచ్చు ముత్తెపుఁ దాళి యెదపై నమర్చి
మొలక కెంపుల పిడి మొలవంకిఁ జెక్కి
తళుకు వజ్రముల యుత్తరిగలఁ బూని
చెలువైన వజ్రాలచే సరుల్ కెంపు
కళుకుల మెఱపుల కడియముల్ దాల్చి
సరిలేని నవరత్న సంఘు సంఘటనఁ

బురుణింపఁగా బాహుపురులు ధరించి
అకలంక నూత్న రత్నాంగుళీయములు
చికిలి వైడూర్యంపుఁ జేయంబు పూని
పరగ పాండ్య నృపాల ఫాల పట్టమున
మురువైన నవరత్నములఁ దీర్చినట్టి
బిరుదు పెండేరంబు పెరిమె దీపింపఁ
జరణాంబుజంబున సవరించి

రఘునాథ నాయకావనీ విభుని విజయరాఘవ నాయకుడు పాఠకుని యెదుట నాపాద మస్తకము గోచరించునటుల చిత్రించి నిలిపినాడు.

శ్రీనాథుడు పలనాటి వీరచరిత్రయందు కొలువు సింగారములు గావించుకొనిన నలగామరాజును పదునైదు పంక్తుల ద్విపదలో వర్ణించినాడు. అది యింత విపులముగా లేదు. విజయరాఘవనాయక విభుడా వర్ణనను చూచి యీ రచన గావించి యుండవచ్చును. నలగామరాజు సభయందు జరిగిన సంగీత నాట్య కళాగోష్ఠి రఘునాథ నాయకాభ్యుదయమునందు కంటె విపులముగా వర్ణింపబడినది. కాని రఘునాథనాయకాభ్యుదయమునందు సూచించినన్ని వాద్యసాధనములు నాట్య భేదములు పలనాటి వీరచరిత్రమునందు కనుపించవు. శ్రీనాథుడు

కస్తూరి రసమును గలిపిన యట్టి
శ్రీ చందనము మేనఁ జెలువుగాఁ బూసి
తగటు కూనంబులు ధరియించి తలకు
ఒక వింత యుష్ణీష మొప్పుగాఁ గట్టి
నవరత్నమాల కంఠంబున వ్రేల
డంబుగాఁ గర్ణకుండలములు మెఱయ
భుజకీర్తు లనియెడు భూషలు దాల్చి
మేనికి రక్షయై మించు తాయెతులు
దండ చేతులు రెంట ధారణ చేసి
మురుగులు గొలుసులు ముంజేతులందుఁ

దిరముగా వ్రేళ్ళ ముద్రికలను బెట్టి
నవరత్న ఖచితంపు నడికట్టు దాల్చి
గండ పెండేరంబు కాలికిఁ బెట్టి
బంగారు దుప్పటి పైనను గప్పి
పావు కోళ్ళను రెండు పదములఁ దొడిగి

అని నలగామరాజును వర్ణించెను. ఇది యూహాగానము. రఘునాథ నాయక వర్ణన అనుభవ గానము. ఆ తారతమ్యము చిత్ర నిర్మాణములో చదువరులకు గోచరించును. శ్రీనాథుడు పదునైదవ శతాబ్దము లోనివాడు. విజయరాఘవనాయకుడు పదునేడవ శతాబ్దము లోనివాడు. వస్త్రధారణమునందు నలంకారములందు ఆ తారతమ్యము కనిపించును. విరోధి రాజులను జయించి వారి ప్రతిమలు చెక్కిన గండపెండేరము కాల దొడిగికొనుట అప్పుడు కల యాచారము. రాయల వారికి మూరురాయరగండ పెండేరము కాల నుండెడిది. విజయరాఘవ భూపాలుడు వర్ణన విషయములందు ఆరితేరిన దిట్ట. అతని లేఖినికి తీక్ష్ణదృష్టి యున్నది. అమృతము మకరందముతో కలయ కలిపి జాలువారించు హృదయ మున్నది. చూచినదానిని అనుభవమునకు తెచ్చుకొని హృదయపాత్ర యందలి రసాయనములో ముంచి భావోచితములయిన పదములను వెలువరించును. వానిలో కర కంకణంబుల ఘలంఘులలు, పదమంజీరంబుల జళంఝుళలు, తాలింపుల ఘుమ ఘుమలు బయలు వడుచుండును. రఘునాథ నాయకుడు

జీలి పట్టు గద్దియను
పట్టంపుఁ జెలులతోఁ బంతిఁ గూర్చుండఁ
గిలుకు మట్టెలు మ్రోయఁ గీర సల్లాప
కులుకుచుఁ బచ్చడుల్ గొని వచ్చె నొకతె
జాళువా కడియముల్ సరిమ్రోయ నొకతె
శాలి తండులపుఁ బ్రసాదంబుఁ దెచ్చె
ముంగాముఱంబులు మెఱయఁగా నొకతె
బంగారు చాయల పప్పులు తెచ్చె

తరుణియొక్క తె సంది దండలు ద్రోయ
సరగునఁ దెచ్చెను సద్యో ఘృతంబు
సరిపెనల్ తడఁబడఁ జయ్యన నొక్క
గురుకుచ శాకపుఁ గూరలు దెచ్చె
నప్పడాల్ నువుఁ బొడి హవణించి నట్టి
కప్పుర కోడి యొక్క లతాంగి తెచ్చె
తురిమిన టెంకాయ తునియలు గూర్చి
కరివేఁప పొడి చల్లి కమ్మని నేతఁ
బొంకంబుగాఁ దాల్చి పొదిగిన యట్టి
కుంకుమ కోడిఁ గైకొని వచ్చె నొక తె
చణక చూర్ణంబుతో సగఁబాలు గాఁగ
మినుప చూర్ణముఁ గూర్చి మేదించి మిగులఁ
గమ్మగా వండిన కస్తూరి కోడి
కొమ్మ వేఱొక్క తె కొనివచ్చె నపుడు
చవు లుట్టిపడఁ జీని చక్కెరఁ జల్లి
నవనీత ఖండముల్ నవముగాఁ గూర్చి
మృదు పాకముగ నొనర్చిన పాల కోడి
యుదుటు గుబ్బల చెలి యొక్క తె తెచ్చె
లశున ఖండములు పలాండు ఖండములు
విశదంబుగాఁ గూర్చి వేఁపుడుం బొల్లు
కలయంగఁ జల్లిన కట్టుకోడియును
నులువ కోడియుఁ దెచ్చె నొక చకోరాక్షి

ఒక కోళ్ళలోనె యిన్ని రకాల వేపుడు కూరలు. తినుట కలవాటు పడి యుండవలయునుగాని చదువు కొలంది నోరు నూట లూరించు కమ్మని పోపులతో తాలింపు గుమాయింపులతో వెలిచెల కటకట్లు చేపల యూర్పు.

జాపత్రియును గురాసాని యోమంబు
వేఁపుళ్ళ కొతిమరి విత్తులు గూర్చి

రంజిలునట్టి బిరంజి, రొయ్యల యూర్పు, ఇంకా యెన్నెన్నో కలవు. పిండివంటల సంగతి చెప్పవలసిన పనిలేదు. పేణీలు, మండెగలు, లడ్వాములు, కజ్జాయములు, మణుగుబూరెలు, దధి వడలు, ఆమ్రపు వడలు, టెంకాయ రొట్టె, సంబారు రొట్టె, పప్పుకుడుములు, పన్నీరు పాయసము, చలువ పాయసము ఒకటేమిటి మనము కని విని యెరుగని పెక్కు రకములు కలవు. ఇంక రసాయనములందుమా యుప్పు రసము, అతి రసములు, టెంకాయ పాలు, పండ్లకు అంతు లేదు. తట్టలతో తెచ్చి రసదాడి, తియ్య మామిడి, ద్రాక్ష, ఖర్జూర, నేరేడు, దాడిమ వరుసగా వడ్డించెడి వారు వడ్డించుచునే యుండిరి. ఆ వడ్డన కళ్ళయెదుట జరుగు చున్నటుల కనిపించును. అది నిరంతరాయమైన వడ్డన. నెలతల రాకపోకలు, తడబాటులేని వేగిరపాటు, సందడి, ఆ రచనా విధానములో నిరవుకొనినది. ధనికుల యిండ్లలోని పెండ్లి విందులందైన నా వరుస వడ్డన సాగదు. అందుకనే మహారాజుల యిండ్లు నిత్య కళ్యాణము పచ్చ తోరణము అందురు. విజయరాఘువ నరపాలవల్లభుని వర్ణనలో వైశద్య మున్నది. సినిమా చిత్రమునందువలె వేగిరపా టున్నది. కన్ను మలిపిన కావలసినది దాటిపోవును. అందలి ప్రతిపదమునకు విశిష్ట ప్రామాణ్యాము ప్రాధాన్యము కలదు. విడిచి పెట్టినచో వెనుకకు తడుముకొనవలసివచ్చును. అది యీ రచనలోని వైచిత్రము. మహారాజుల నిత్య జీవితమున కా కవిరాజు రచించిన రఘునాథ నాయకాభ్యుదయ కావ్యమొక ప్రతిబింబము. చూచినకొలంది చూడవలయు ననిపించును. చదివిన కొలంది సాహిత్య ప్రియులకు విమర్శకులకు చదువవలయునని పించును. విసుగు పుట్టింపదు. శయ్యా పరుగులు వారును. పాల్కురికి సోమన, రంగనాథుడు, గౌరవ, శ్రీనాథాదులు ద్విపదలు రచించిరి. వారు ప్రౌఢకవులు. నా దృష్టికి వారందరిలో శ్రీనాథుని రచనయందు

జను లెల్ల భక్తిచేఁ జదువుట కొరకు
సంగీత సాహిత్య చాతుర్య కవిత

నాగులేటి నీటి వరదల పరవళ్లు త్రొక్కినది. అది యీ వీర రసము నకు చిరమగు నాయువు పోసినది.

సంగీత సాహిత్య సరణి నే నొక్క
శృంగార కావ్యంబు సేయ నూహింప

తలపెట్టితి ననిన విజయ రాఘవ నరపాలుని రఘునాథాభ్యుద యమునందు కవితలో కావేటి నీటి తరంగాల వెల్లువ నెలకొన్నది. ఆ నిండిక శృంగార రసానికి జీవము పోసినది. అడుగడుగున రాజ సము గాంభీర్యము వెలయించినది. శ్రీనాథుని ద్విపదను, విజయ రాఘవ భూపతి ద్విపదను చక్కగా పరిశీలించి చూచినచో విజయ రాఘవ నాయకుడు శ్రీనాథుని రచనా విధానమును హృదయ గతము గావించుకొని

పలుకు చిల్కలకొల్కి పైఁ బణీ చలువ
జిలుగుఁ బయ్యెద విదల్చిన రువారమున
వర వచో రచనల వాసనల్ గులుక
విరిదేనె లొలుకఁగా
పలుకు జవ్వని మోవి పంచదారలను
దిలకించు తీయని తేట మాటలను

రస రీతుల కనుగుణముగా తీర్చిదిద్ది వినిర్గతము గావించినాడు. అతడు

నవరసికుల కెల్ల నాయకుడైన, కవిరాజు

ఆ భూపతి జీవిత చరిత్రమే దానికి తార్కాణము. రాజరికములోని నిండిక, రసికత్వములోని పలుకు మెత్తందనము, కవిరాజుతనములోని మాధుర్య మా కవితలో కనిపించును. దానికి

తన తండ్రియే కుల దైవమటంచు
ననిశంబు కొలుచు మహారాజ యోగి

విజయ రాఘవ భూపతి. ఆ భక్తి రసావేశ మా మహారాజును వర్ణనా విధానములం దొక యక్షర మాత్రమయిన లోపము రానీయ

ఖండ చేసినది. అట్లు లోపము చేయుట తండ్రియెడ మహాపరాధ మనిపించినది. నరక హేతువని కూడ తలపించినదేమో. అడు గడుగునకు పితృపాదుల మూర్తి నంతరంగమునం దుంచుకొని కావ్య రచన సాగించినాడు. అట్లు కానిచో అంత విపులముగా నంత యాకర్షణీయముగా నాటకమువలె కనుల యెదుట జరుగుచున్నటులు వర్ణింపలేరు.

రఘునాథ నాయకుని ఆయిన యాస్థాన కవులు కవయిత్రులు బహువిధముల వర్ణించిరి. కావ్యములు సృష్టించిరి. వారి రచనలలో నీ స్వాభావిక శిల్ప చాతుర్యము లేదు. ఈ గడితేరిన రాజసంపు చిత్ర రచనా వైశిష్ట్యము కనిపించదు. వారు చూచి యానందించిన వారు. ఆనందించి యనుభవమునకు తెచ్చుకొనినవాడు విజయ రాఘవ భూపతి. కావున ఆయన వర్ణనలో మనసును మరపించి తనలో విలీనము కావించుకొను శక్తి యీ కవితలో నెలకొని యున్నది. పాల్కురికి సోమనాథునిలో శివభక్తితో సమ్మిళితమయిన మతావేశమున్నది. ఉద్రేకము మతావేశమునకు ప్రాబల్యము సమ కూర్చినది. అది కవితగా పరిణమించి రచనలో చిందులు త్రొక్కినది. సోమనాథుని బసవపురాణము పండితారాధ్య చరిత్రలలో కనిపిం చున దిది. స్త్రీ పురుషులు పాడుకొనుట కీ కావ్యములు రచింప బడినవి. దానికి ద్విపద చక్కని సాధనము. సంగీత సాహిత్యముల సమ్మేళనముతో నితివృత్తము నిరాటంకముగా సాగిపోవును. వర్ణ నలు అవికల్పముగా పరుగులు వారును. కావున విజయరాఘవ భూపాలుడు రఘునాథ నాయకుని కథా ప్రదర్శనమునకు ద్విపద సాధనముగా గ్రహించెను.

రఘునాథ నాయ కావనీపతి పట్టపుటేనుంగుపై నెక్కి పరి వార సహితముగా సకల రాజ లాంఛనములతో వాహ్యాళికి బయలు దేరినాడు. ఇది తొల్లింటి మహారాజుల కొక యలవాటు. శ్రీకృష్ణ రాయలవారికి కూడ ఈ యలవాటు కలదు.

ఎదురైనచోఁ దన మద కరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించుకొనియె

అని యలసాని పెద్దనగారు చెప్పుకొనిరి. ఇట్టి సందర్భములందే యీ సంఘటనము జరుగు చుండెడిది. రఘునాథ నాయకుని పట్టపు ఏనుంగునకు ఐరావత మని పేరు.

ఐరావత సమానమై ప్రకాశించు
నైరావతం బను నల భద్ర గజము
గుంపైన పచ్చల గుజరాతి జాతి
కెంపుల బవిరిఁ జెక్కిన కొమ్ముకట్లు
వెల హెచ్చు నీలాల వేడెంపుఁ బనుల
తళుకు వజ్రమ్ముల తల మాళిగయును
మొలక వెన్నెల లీను ముత్తెపు సరులుఁ
జెలువై మిటారించు చెవుల జిల్లులును
ఘనమైన పుష్యరాగపుఁ జెక్కడమునఁ
గనుపట్టు ఫాలాది గంటల బారు
మకరత వైడూర్య మాణిక్య రుచుల
వరలుచున్న యురస్త్ర వాలత్రములును
హురమంజి ముత్యాల యొరిజతో నంటె
మెఱయు వైడూర్యంపు మెడ గంట గొలుసు
ప్రతిలేని కెంపుటా రావి రేకలును
రతనాల పనిమించు రవల యందియలు
సరిగ బొమ్మల కుట్టు చాలఁ గన్పట్టు
మెఱుఁగుల నును పట్టు మేలిమి జూలు
ముత్తియంపు బవంతి ముద్దులు గులుకు
క్రొత్త సూరెపుటంపుఁ గుఱుచ గద్దిగము
మొదలైన సవరణ ముస్తీబు చేసి

మహారాజు నెదుట నిలిపినారు. ఇందతిశయోక్తి యేమియు లేదు. మహారాజులు తమ పట్టపు ఏనుగును, స్వారిచేయు గుఱ్ఱమును

తమతోపాటు రత్నాభరణములతో నలంకరించుట యొక సగర్వమగు మోజు. శ్రీనాథుడు నలగామరాజు పట్టపు టేనుగ్ని ట్లే వర్ణించినాడు.

గంటలు మువ్వలు గట్టిగాఁ గట్టి
చుట్టు ముత్యపుఁ జేర్లు శోభిల్లఁ జేసి
మణిమయ మంజరి మధ్య వ్రేలాడ
చిరుత గంటల పేర్లు చెలువైన కరికి
కరమందుఁ గూరిచి ఘంట సంధించి
పంచ వర్ణంబులు ఫాలమం దునిచి
ముత్యాల జల్లుల మొనసిన పటము
కుంభ స్థలంబునఁ గొమరొప్పఁ జేసి
శుభ్ర దంతంబుల శోభిల్లు నట్టి
తపనీయ వలయముల్ దట్టించి మొనల
ఘన శిత శస్త్రముల్ ఘటనఁ గావించి
బంగారు గొలుసులు పదములఁ గట్టి
గంటలు ప్రక్కల గణ గణ మ్రోయ
తొండంబు గొలుసులతోడ రంజిల్ల
శృంగార మీ రీతి శీఘ్రమే చేసి

శ్రీనాథుని ద్విపద పాద పాదమునందు యతి స్థానము నొద్ద పద మాగిపోవుచుండును. అది చదువునప్పుడు పాడు నప్పుడు దరువునకు సరిపడి యుండును. అది మంజరీ ద్విపద. ప్రాస లేదు.

విజయరాఘవ నాయకుని ద్విపద అట్లు కాదు. యతి దగ్గర ఒకొక్కప్పుడు పద మాగిపోవదు. ప్రాస నియమ మున్నది. ఈ రచన కొంచెము కష్టము. కాని చదువుటకు చాల బాగుండును. విజయరాఘవ నాయకుడు చక్కని యచ్చ తెలుగు పదముల పొందికతో ద్విపద చివరివరకు నొక్క తీరుగా నడిపించెను. శయ్యాలో మార్పెచ్చటను కనిపించదు. ఇట్లు తొంబది యైదు పంక్తులలో వాహ్యాళి వర్ణించినాడు. అందు మహారాజుల ఠీవి ధారపట్టి పోసినా

డా కవిరాజు. ఒకొక్కప్పుడు పూర్వ కవుల రచన వాని రచన ముందు పనికిరాదనిపించును. శ్రీకృష్ణరాయల శయ్యాలో అందందు కరుకుతన ముండును. ఆ మాత్రము కూడ యిందు కనిపించదు. సరి పోల్చి చదువు సాహిత్య ప్రియుల కది విదితము కాగలదు.

రఘునాథ నాయకుడు వాహ్యాళికి బయలుదేరెను. పౌరాంగ నలు వాని యంద చందములు గాంచి మురిసిపోయిరి. వాని మీద సేసలు చల్లిరి. ఒక ప్రాయంపు జవరాలు వానిమీద మరులు కొని నది. ఆమె వేశ్య. చిత్ర రేఖ యను పేరు కలది. ఇచ్చట నుండి పూర్వ కవుల కావ్యముల కనుకరణములు ప్రారంభమగును. చిత్ర రేఖ మరుబారికి తాళలేక పోయినది. ఆమెకు తాప మెక్కు వయి నది. చెలికత్తెలు శిశిరోపచారములు గావించిరి. తాపము తగ్గలేదు. మన్మథ పూజ చేయించిరి. లాభము లేకపోయినది. మద నోపాలం భాదులు సాగినవి. ఒక చిలుకను చీరి రాజు కడకు రాయబార మంపినది. నల దమయంతులకు రాయంచ రాయబారమే నాడు నడపినదో కాని యప్పటి నుండి కావ్యములందు వీలు చిక్కినప్పు డెల్ల పక్షులతో రాయబారాలు బలిసిపోయినవి. ఇంక వేరు విధ ములు వారికి తోచినవి కాదు కాబోలు. ప్రభావతీ ప్రద్యుమ్నములో చిలుక రాయబారము. రాధామాధవములో రాధికా సాంత్వన ములో లక్షణా పరిణయములో చివరికి రఘునాథ నాయ కాభ్యు దయములో కూడ ఒకటే పంథ. పురాణ కాలములో పక్షులు మాట్లాడేవి కాబోలు నని సరిపెట్టుకొనినను పదునేడవ శతాబ్దము నందు పక్షులు పాములు మాట్లాడిన వనినచో నమ్మువా రెవరు నుండరు. మన్మథ పూజ ఉపాలంభములు శిశిరోపచారము లయిన నంతగా ననిపించవేమో గాని శుక దౌత్యము రఘునాథ నాయ కాభ్యుదయమున కొకపాటి పరిహాసమును కలిగించు ననక తప్పదు. అది సాంఘిక ప్రబంధము, పౌరాణికము కాదు. పాఠకుడు దానిని సాంఘిక దృష్టితో పరిశీలించును. ఈ కల్పనను చదివి పరిహాసించును. కల్పన కథకు మెరుగు పెట్టవలయును గాని తరుగును కలిగించ

కూడదు. కథ యందలి యౌచిత్యమునకు భంగము కలిగించును. విజయరాఘవ భూపాలుడు మరొక విధముగా కథను మలచిన చాల బాగుండెడిది. తరువాత చివరివరకు కథ చక్కగా నడిచినది. వర్ణ నాదులు కథకు అనుగుణముగా క్రొత్త దారులు త్రొక్కినవి. మచ్చునకు

పద్మినీ ముఖ పద్మ బాంధవం బెంచి
పద్మలోచన తన పతిఁ గూడు వేళ
తా నుండ రాదని తగ నెంచి నట్లు
భానుండు చనియెను పశ్చిమాంబుధికి

నా గంధగజ యాన కధిపతి మీఁద
రాగంబు గతి సాంధ్య రాగంబు పర్వె
నాయకుం డచటికి నడ తెంచుకొఱకు
నా యిందువదన కట్టాణి ముత్యముల
గమకమా చందువా కట్టించె ననఁగ
నమర పథంబునం దమరెఁ దారకలు

వల్లభుం డింటికి వచ్చు వేళకును
బల్లవాధర కడు భక్తి మీఱంగ
నవరంజి పళ్ళెంబునందు నందముగఁ
గపురంపు టారతి కైసేసె ననఁగ
నుదయ రక్తిమ చాల నొరపు మీఱంగ
నుదయాద్రిపైఁ జంద్రుఁ డుదయించె నంత

రఘునాథాభ్యుదయ కావ్యమునందు నాయకురాలు సామాన్య. అందు తాను సాలంకృతయై ప్రియాగమన సమయమునకు శయ్యా గృహాదు లలంకరించి యెదురు చూచుచుండు యువతి కావున వాసక సజ్జిక. నాయకుడు ధీరోదాత్తుడు. అందు బహు ప్రియా సదృశ శీలు డగుటవలన దక్షిణుడు. ఇట్టి రకపు కావ్యములకు 'ఉలా' యని తమిళ భాషయం దందు రనియు, నది యా భాషయందు నతి పురా

తవ మయిన దనియు, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగా రభిప్రాయ పడుచుండిరి. అయిన కావచ్చును. చెలికత్తెలు చిత్రరేఖను

వలిప చెంగావి పావడఁ గట్ట నిచ్చి
బంగారు సరిగంచు పయ్యెద మించ
శృంగారముగఁ జల్వచీరఁ గట్టించి
ఘనసార కాశ్మీర గంధసారములు
మన సారఁగాఁ గూర్చి మైనిండ నలఁది
పద్మిని కప్పుడు బంగారు సరిగ
పద్మరేఖల కుట్టుపని గనుపట్టు
కీలు రత్నపు గుండ్ల కెంబట్టు ఆవిక
లీలగాఁ దొడిగించి లేములు ప్రేమఁ
గురులు దువ్వి మిటారి కొప్పమరించి
పరువంపు విరిసరుల్ బటువుగాఁ జుట్టి
ముంగాముఠారియు ముత్యాల కంటె
రంగు మీటిన పెంచు రతనాల కుచ్చు
మెచ్చుగఁ గులికెడు మేటి కిరీటి
పచ్చరా పలకల పాదపల్లవము
ముంగర ముత్యాల మురువుల బవిర
లుంగరంబులు మించు నొడ్డాణములును
కంట సరంబులు కంఠ మాలికలు
గంటల మొలనూలు కంకణంబులును
పుంజాల దండలు బుగడలుఁ గమ్మ
పంజుల పదకముల్ బన్నసరములు
సందిట దండలు జాళువా గొలుసు
లందియల్ మట్టియ లాదిగాఁ గల్గు
నవరత్న మణి భూషణంబు లందీయ
వివిధాంగ శృంగార విధు లాచరించి

రి. ఇవి పదునేడవ శతాబ్దములోని యువతుల యలంకారములు. వీనిలో కొన్ని యిప్పటికిని మన దేశమున పల్లెపడుచుల యలంకారములందు చూడగలము. నాయకురాలు విభుని రాక కెదురు చూచుచుండును. రఘునాథ భూ వల్లభుడు కై సేసికొని పుర వీథులందలి వినోదము లరయుచు చిత్ర రేఖ యింటికి వచ్చును. వా రిరువురకు సమాగమ మగును. ఇది మూ డాశ్వాసముల గ్రంథము. మొత్తము రెండువేల పదారు పంక్తులు గలవు. ఇందలి శయ్యా మార్దవము పద లాలిత్య కథా సరళి పాఠకుని ప్రారంభము నుండి చివరివరకు కన్ను మలపనీయకుండ నాకర్షించుకొని పోవును. విజయరాఘవ భూపాలుడు ద్విపద రచనయందు చక్కని యనుభవము కల కవి యని యొప్పుకొనవలసి యున్నది.

విజయరాఘవ నాయకుడు ఈ ద్విపదను సందర్భానుసారముగా నుపయోగించుచు కొన్ని పదములు, కీర్తనలు, చేర్చి నాట్యమున కుపయోగించు నటుల రఘునాథ నాయకాభ్యుదయ మను యక్షగానము గూడ రచించెను. దానికితోడు విప్రనారాయణ చరిత్ర శ్రీకృష్ణవిలాస మను యక్షగానములు కూడ వ్రాసెను. వీనిని గురించి తరువాత ప్రస్తావింపబడును. ఈ గ్రంథములే గాక రుక్మిణీ కల్యాణము మొదలగు నాటకములు, పెక్కు ప్రబంధములు కూడ రచించెనని తెలియవచ్చుచున్నది. అవి యేవియు ప్రకటింపబడి యుండలేదు. విజయరాఘవ నాయ కావనీ విభుడు నిజముగా తండ్రిని మించిన తనయుడు. సమరావనియందు విజృంభించి విరోధి రాజుల నుక్కడంచెను. సాహిత్య సామ్రాజ్యమున కధినేతయై దాదా పేబది గ్రంథములను రచించి సాహిత్య గండపెండేరము కాల తొడిగించుకొనెను. సంస్కృతాంధ్ర భాషాపోషకుడయి పెక్కుమంది కవుల నాదరించెను. అమితములగు దాన ధర్మములు గావించెను. జనరంజకముగా రాజ్యము పాలించెను.

విజయరాఘవ భూపాలుని కాలమందు తెలుగు కవితా సరస్వతి వివిధ రూపములను దాల్చి తంజాపురీ సంస్థాన రంగమున మగ

రాల మెఱుంగు లిరవుకొను బంగారు నూపురంబులు ఘులు ఘుల్లని మొరయ కరకంకణ కాంచీగుణ కింకిణీ రవంబులతో ప్రబంధ గతుల నాట్యము గావించినది. వీణాశ్రుతులు మేళవించి సంగీత సాహిత్యంబుల సమ్మేళనంబుతో ద్విపదలు యక్షగానములు పదములు కీర్తనలు మంజరులు నాలపించినది. కనకాభిషేక సన్మానములను పొందినది. స్త్రీ పురుషులు కవనంపుఁ దెరగుల బిరుదుపాత్రులయి కృతి పుటంబుల కర్పూర నీరాజనంబు లర్పించినా రా మహాదేవికి. కామరుసు వేంకటపతి సోమయాజి, కోనేటి దీక్షిత చంద్రుఁడు, చంగల్వ కాళకవి, పురుషోత్తమ దీక్షితులు, కృష్ణాంబ, రంగాజమ్మ మొదలగు విద్వాంసులు విదుషీమణులు విజయరాఘవ భూపాలుని కొలువు నలంకరించినవారిలో ప్రధానులు.

## ౬

## రంగాజమ్మ

రంగాజమ్మ యష్టభాషా కవితా సర్వంకష మనీషా విశేష శారద. రాజనీతి విద్యా విశారద. విచిత్రతర పత్రికాశత లిఖితవాచి కార్థావగాహన ప్రవీణ. విజయరాఘవ నాయకున కామెయం దమితాభిమానము కలదు. మహారాజామెకు కనకాభిషేకము చేయించెను. స్త్రీలలో కనకాభిషేక సన్మానమును పొందిన కవయిత్రి, పండితురాలు, రంగాజమ్మ తప్ప మరెవ్వరు తెలుగు సారస్వత చరిత్రయందు కనిపించరు. ఈమె యింటిపేరు పసుపులేటివారు. తండ్రి వేంకటాద్రి. తల్లి మంగమాంబ. రంగాజమ్మ వేశ్య యనియు, విజయరాఘవ నాయకుని యుంపుడుకత్తె యనియు కొందరభిప్రాయ పడుచున్నారు.

ఏ వనితల్ మముం దలఁప నేమి పనో తమ రాడువారు గా
రో వలపించు నేర్పెరుఁగరో తమ కౌఁగిటిలోన నుండఁ గా
రా వది యేమిరా విజయరాఘవ యంచిలు దూరి బల్మిచేఁ
దీవరకత్తెనై యిటులఁ దీసుకు వచ్చితినా తలోదరీ

యని రంగాజమ్మ చెప్పి పంపిన పద్యము ప్రబల సాక్ష్య మని వారి వాదము. విజయరాఘవ నాయకుడు నిరంతరము రంగాజమ్మయం దనురక్తుడై యుండుట సహింపనేరక యక్కన్సు కొలంది రాజదేవేరి దూతీ ముఖమున కబురంపె ననియు దానికి రంగాజమ్మ యీ సమాధాన మంపె ననియు నందురు. పై పద్యమునకు రంగాజమ్మ పద్య విధానము నకును రచన హస్తి మశ కాంతర మున్నది. ఆ పద్యము రంగరాజమ్మ చెప్పెననుట నమ్మతగినది కాదు. ఒకవేళ చెప్పినను రంగాజమ్మ వేశ్యయనిగాని యుంపుడు కత్తెయనిగాని యీ పద్యము వలన నిర్ణయించుటకు సాధ్యము కాదు. విజయరాఘవ నాయకుడు కవి. రసిక శేఖరుడు. రంగాజమ్మయు కవయిత్రి. శృంగార రసతరం

గీత పద కవిత్వ మహనీయ మతి స్ఫూర్తి యగుటచేత గొప్ప రసికు రాలనక తప్పదు. కావున విజయరాఘవుని చిత్తవృత్తి యామె యందు నెలకొని యుండుటలో విపరీత మేమియు లేదు. అసలు రాజులు శృంగార ప్రియులు. నెఱజాణ యగు సౌందర్యవతి చేతి కందుబాటులో నున్నప్పుడు విడిచి పుచ్చుట వారి స్వభావము కాదు. పైకి మాటలు చెప్పవచ్చును గాని యెవరు మాత్రము విడిచిపెట్ట గలరు. మునులకే చేత కాలేదు. "ఇనుప కచ్చడా ల్కట్టిన ముని ముచ్చులెల్లఁ దామరస నేత్ర లిండ్ల బందాలు గారె!" యన్నది వరూధిని. సత్యము. 'రత్నహారీతు పార్థివః' రంగాజమ్మ వంటి నారీ రత్నము దొరికినప్పుడు విజయరాఘ వావనీపతి యెట్లు త్రోసిపుచ్చ గలడు. సముచిత లక్షణ సంపన్నుడు సరసుడు నగు మహారాజభిల షించి నప్పుడే రసికురా లగు పడతి పెడమొగము పెట్టగలదు? అందులో నాశ్రయురాలు రంగాజమ్మ. కావున రంగాజమ్మకు విజయ రాఘవునకు సన్నిహిత సంబంధ బాంధవ్య ముండుటలో నాశ్చర్య మేమియు లేదు. కాని యా బాంధవ్య మెట్టిదని యాలోచింప వలయును. వేశ్య కుటుంబములలో పసుపులేటివారు కలరు. ఆంధ్ర దేశము నుండి తంజాపురమునకు చాలమంది వలె రంగాజమ్మ పూర్వీ కులు కూడ వలసపోయి యుందురు. అంతవరకు నంగీకరింప వచ్చును. రంగాజమ్మ కులముచేత వేశ్య కావచ్చును. కాని విద్యా వివేక సంపన్నురాలు. రాజనీతి విశారద. అంత తేలికగా నీచమగు పడుపు వృత్తికి లోబడదు. ఆమె మన్నారు దాస విలాస నాటకమునందు "అచ్యుత విజయ రాఘవ సార్వభౌమ ధర్మపత్నియై రంగుమీఱు రంగాజమ్మ" యని వ్రాసికొనినది.. కావున రంగాజమ్మ యథా శాస్త్రీయముగా విజయరాఘవ నాయకుడు పరిణయమాడిన ధర్మ పత్ని యగుటలో సందేహము లేదు. మన్నారు దాసవిలాసమునందు రాజ కులగురు వగు శ్రీనివాస తాతాచార్యులవారు

చతురాస్యుం డనఁ దగు నీ
పతి యిటు నిను గారవించి బహుమతి మీఱన్

గృతి రచియింపు మనన్ భా
రతికిన్ బ్రతి వత్తువమ్మ రంగాజమ్మా

యనియు, నుషా పరిణయమునందు

నీ పతి మన్నరు దాసుఁడు
గోపాలుఁడు కనుక నితఁడు కోర్కెలు హెచ్చన్
జేపట్టి మనుప నెలకొను
నా పలుకుల నెలఁత నీ ముఖాంబుజ సీమన్

అనియును సాక్ష్యమిచ్చినారు. ఇంక కాదనగల వా రెవ రుందురు? ఇట్టి లిఖితములగు ప్రబల సాక్ష్యము లుండగా రంగాజమ్మ విజయ రాఘువుని యుంపుడుకత్తె యనుట సాహసము. ధర్మపత్ని యన్నంత మాత్రమున పట్టమహిషి కానక్కర లేదు. శాస్త్ర విధిగా పరిణీత యైన చాలును. రాజానో బహు వల్లభాః—రఘునాథ నాయకునకు రామభద్రాంబయు నిట్టి ధర్మపత్నియే. విజయరాఘువునకు మన్నారు దాసను నామాంతరము గలదు. ఆ నరపాలుడు శ్రీకృష్ణుని యవ తారమని శ్రీనివాస తాతాచార్యులవారి వ్యాఖ్యానము. అధికారు లను నధిపతులను నవతార పురుషులుగా నొనరించుట యాశ్రితుల చేతిలోని పని.

రంగాజమ్మ మొదట వ్రాసిన కావ్యము "మన్నార దాస విలాసము" ఇది యైదాశ్వాసముల గ్రంథము. రెండు మూడు తక్కు వగా నైదు వందల పద్యములు గలవు. ఇందలి యితివృత్తము విజయ రాఘువ భూపాలుడు కాంతిమతిని పరిణయమాడుట. కాంతిమతి రాజ చంద్రుని కూతురు. విజయరాఘువ నాయకుడు

శృంగారైక రసంబులోఁ బదములన్ జెల్వొంద మెప్పించి తొ
సంగీతజ్ఞులు మేలు నా నుభయ భాషా చాతురి న్మీ వికన్
రంగత్ప్రౌఢిఁ బ్రబంధ మొక్కటి యొనర్పంగా వలె న్మత్కథన్
రంగాజీ! భవదీయ వాగమృత ధారావైఖరుల్ మీఱఁగన్

అట్టి ప్రబంధమును శ్రీరాజ గోపాలున కంకితంబు గావింపుము. మఱియు నేత త్ప్రబంధంబునకు నత్యధిక మహత్వము గలుగ మన వీటం జెన్నారు మన్నారుల ఫాల్గుణ మహోత్సవాది దివ్య వైభవం బులు వర్ణింపుము; అని యానతిచ్చెను. దాని కనుగుణముగా తంజా పుర వర్ణనతో రంగాజమ్మ తన కావ్యమును ప్రారంభించినది.

సతతము తత్పురిన్ ద్విజులు సల్పెడు యజ్ఞములన్ భుజింపుచుం
గుతకము మీఱ నం దిరవుకొన్న సుపర్వులఁ గూడు వేడ్కచే
నతుల విమాన సంగతుల నచ్చటికిం జను దెంచు నట్టి త
త్సతు లన సాలభంజికలు సౌధముల న్విలసిల్లుఁ జారుతన్

శ్రీనివాస తాతాచార్యులవారు రాజ కులగురువు. ఆయన యెడ విజయ రాఘవ నాయకునకు భక్తి వినయ విశ్వాసములు మెండు. రంగాజమ్మకు సహిత మాయనయం దమిత భక్తి కలదు. ప్రతి కావ్య రచనకు ముందు మహారాజు నాదేశము ననుసరించి యాయన యాశీ స్సును పొందుచు వచ్చినది. ఆయన నూరు యజ్ఞము లొనరించెను. కావున శతక్రతు శ్రీనివాస తాతాచార్యులవా రని యాయనకు పేరు వచ్చినది. ఆయన యజ్ఞములు తంజావూరునందు నిరంతర ముగా సాగినవి. ఆ సంగతి మనసునం దుంచుకొని రంగాజమ్మ యీ పద్యము వ్రాసియుండును. ఆ యజ్ఞములందు దేవతలకు ముప్రొద్దు లను హవిర్భాగములు దొరికినవి. వానిని భుజించుచు మాటి మాటికి రానేల పోనేల యని తంజావూరునందు నివాస మేర్పరచుకొనినారు దేవతలు. వారిని విడిచి యుండలేక వారి సతులు విమానములమీద వచ్చిరా యను నట్లున్నవి తంజాపురియందలి సాలభంజిక లని యుత్ప్రేక్షింపబడినవి. మనోహరమగు కల్పన.

కాలమునకు కావ్యమునకు సన్నిహిత సంబంధ ముండును. ఆ సంబంధము గుర్తించినప్పుడే పద్యమునందలి భావమును పాఠకు డవగతము చేసికొని యానందింప గలుగును. లేనిచో సత్యము గ్రహింపలేడు. ఇప్పటి దృష్టితో పూర్వకాలపు కావ్యములను పరి శీలించి విమర్శించినచో తాను తప్పు దారియందు నడచుటయే కాక

పాఠకులను కూడ విమర్శకుడు తప్పుదారియందు పెట్టును. అందు మూలమున సారస్వతమునకు, కవికి మహా ద్రోహము చేసినవాడగును. ఇటీవల ఆంధ్ర ప్రభయం దొక వ్యాసము చూచితిని. అందు ఇతర సంగతుల మాటటుంచి యొకటి మనవి చేయుదును.

ఏక కస్య శమనే పరం పున
ర్జాగ్రతం శమిత మస్య వేక్ష్య తం
జాత వహ్ని వర సంస్మృతిః శిరః
సా విధూయ నిమిమీల కేవలం

అను నైషధ శ్లోకమును చూపి విమర్శకురాలు శ్రీహర్షుని కాలము నందు విద్యుద్దీపములు కలవని నిర్ణయించినది. శ్లోక మందరికి నర్థము కాదని కాబోలు

ఒక దీప మార్పిన నున్న దీపంబులు
నప్పుడు తమకుఁ దా మారుటయును

అను శ్రీనాథుని పద్యము కూడ నుదాహరించినది. లోకము సంగతి యెటు లున్నను అటు సంస్కృత శ్లోకము కాని యిటు తెనుగు పద్యముగాని ఆమె కర్థము కాలేదు. అర్థమయిన చో "జాత వహ్ని వర సంస్మృతిః" "వరశక్తి కల్పన" అనువానియందలి నిగూఢ భావ మవగతము కాలేదో మరి తెలియదు. నల దమయంతుల కథ పురాణ కాలము నాటిది. ఇప్పటి విద్యుద్దీపము లప్పు డెక్కడ నుండి వచ్చును? అది మంత్ర బలము వర ప్రసాదముల బలము కల కాలము. నలున కగ్ని దేవుడు తలంచిన చోట నగ్ని పుట్టుటకు నారుటకు వర మిచ్చెను. భారతము అరణ్య పర్వమునందు "ఆ నలునకు నింద్రుండు వాని యజ్ఞంబులయందు నిజ రూపంబు చూపను, నగ్నియు వరుణుం డును వాని వలచిన చోటన యగ్ని జలంబు లుత్పాదింపను, ధర్ముండు ధర్మువునందు వారి బుద్ధి వర్తిలను వరంబు లిచ్చి "అనియు" కేశినియు బాహుకునందు దైవతాద్భుత క్రియల చూచి వచ్చి దమ యంతి కిట్లనియె.

వినవమ్మ తృణముష్టిఁ గొని వాఁడు వీచుడు
నందగ్ని యుదయించి యతని వంట
లమరు నంతకు నింధనము లపేక్షింపక
యుడుగక మండుచు నుండు''

అనియు నున్నది. తెనుగు భారతమైనను వారు చదివి యుండరు. ఆ వర శక్తివలన నలమహారాజు నవ్వులాటకు దీపము లన్నియు నొక్కసారిగా నారిపోవునట్లు చేసెను. మరల వెలుగునట్లు చేసెను. ఆయన క్రొత్త శోభనపు పెండ్లికుమారుడు. తన చతురత దమయంతి యెదుట చూపించినాడు. ఆ సంగతి వ్యాసము రచించిన వారికి తెలియదు. విమర్శకులు కావ్యమును, కావ్యకర్తను, కాలమును బాగుగా నవగతము చేసికొని పరిశోధించి విమర్శింపవలయును. లేనిచో పరిహాసములకు పాలగుదురు. విమర్శన తేలిక పనికాదు. విజయరాఘవ విలాసములోని పై నుదాహరించిన పద్యమునందలి యుపమానము కూడ చక్కగా నతికినది. దేవాంగన లనిమేషలు. వారికి కనురెప్పపాటుండదు. సాలభంజికలకు కన్నార్పుటయుండదు. పోలిక సరిపోయినది. పద్యమునందు మనస్సు రంజింపచేయు భావము సారస్యము నుండవలయును. ఆ రెండు నిందు కలవు. మరొకటి

నూత్న గృహాగ్ర సీమను మనోహరయా పురలక్ష్మి చాలుగా
రత్నపు దీవియల్ వెలయ రాజెదుట న్నటనం బొనర్చుచో
యత్నముతోడఁ జూచు విబుధావళి పూవుల వాన తద్ధరా
రత్నము మీఁద నించె నన రాజిలుఁ జుక్కలు దానిపైఁ బయిన్

ఇది రాత్రులందు తంజాపుర వర్ణన. రాజశబ్దమునకు చంద్రుడనియు విజయరాఘవ రాజనియు నర్థములు. బుధు లనుచోట దేవతలనియు పండితు లనియు శ్లేష. చంద్రుని యెదుట నటించుచున్న పురలక్ష్మి మీద దేవతలు చల్లిన పూవులా యను నట్లు నక్షత్రము లున్నవి యని యర్థము. విజయరాఘవ నాయకుని యెదుట నటించు పురలక్ష్మి మీద పండితులు చల్లిన పూవులా యనునట్లు నక్షత్రము లున్నవని యర్థాంతరము. శ్లేషానుప్రాణిత మయిన యుత్ప్రేక్ష యిందు

కలదు. పై పద్యమునం దుత్ప్రేక్ష మాత్రమే కలదు. ఇందు పుర సౌధములు చంద్ర మండలము నక్షత్ర మండలము నంటుకొనుచున్న వని యతిశయోక్తి ధ్వనించు చున్నది. ఇది యలంకార కృత యలంకార ధ్వని. భావములు బాగున్నవి. కాని యందలి అతుల, చారుతన్, యత్నముతోడ, దానిపైఁ బయిన్ అను పదములు ప్రాసల కొరకు పాదపూరణము కొరకు వాడబడినవి. ఆ పురమునకు అధిపతి విజయ రాఘవ నరపాలుడు. ఆ భూపతి చంపక వనాధినేతయగు శ్రీగోపాల స్వామికి ఫాల్గుణోత్సవము చేయింప నిర్ణయము గావించెను. అంతటితో ప్రథమాశ్వాసము ముగియును.

వసంతకాలపు వర్ణనతో ద్వితీయాశ్వాస మారంభ మయినది. ఈ సందర్భమున కవిలోక సామాన్య మగు

కొమరు మీరిన నవ పల్లవముల కాంతి
గాటమౌ సాంధ్య రాగంబు కరణి మించ
నపుడుఁ గనిపించె నందంద యందముగను
దారకంబు లనంగను గోరకములు.
మలయ నిలయానిలుం డను మంత్రవాది
యచట భ్రమరాక్ష సరముఁ ద్రిప్పుచును మఱియుఁ
బొసఁగఁ గుసుమ పరాగంబు భూతిఁ జల్లి
సల్పె యువతి మాన గ్రహోచ్చాటనంబు

ఇటువంటి పద్యములతో వసంతకాలమును వర్ణించినది రంగాజమ్మ. ఈమె పద్యములందు పదముల కూర్పులో నొక యందముగాని బిగువుగాని లేదు. వ్యర్థ పదములు పెక్కు కనిపించుచుండును. పై పద్యములందు అపుడు, అచట, మరియు పొసగ అను పదములు లేక పోయినను భావమునందుగాని యర్థమునందుగాని యే లోపము కలుగదు. ఇట్టి పదములు రచనలో బిగువును సడలించి పద్యమును తేల్చి వేయును. ఇట్టి వ్యర్థపదములు మన్నారుదాస విలాసములో దాదాపన్ని పద్యములందును గనిపించును.

తరుణీ జన మాన మద
ద్విరదంబుల మద మడంపఁ దివురు మరునికిన్
దరమగు రత్నాంకుశముల
మురువునఁ గనుపట్టె నపుడు మోదుగు మొగ్గల్

పద్యమంతయు బాగుగా నడచినది. చివరి పాదములోని అపుడు అవుడు కరిపించినది. విజయ రాఘవ భూపాలుడు శ్రీరాజ గోపాల స్వామి యుత్సవమును దర్శింప నరుగుటకు నలంకరించుకొనును. ఈ సందర్భమున విజయరాఘవ నాయకుడు రఘునాథ నాయనాభ్యుదయమునందు చూపిన యా రచనా సౌష్ఠవము గాని పద లాలిత్యము గాని రంగాజమ్మ వర్ణనయందు గోచరింపదు. చేమకూర వేంకటకవి ప్రదర్శించిన శిల్పకళా వైశద్యము అసలు కనిపించదు. ఉత్సవము బయలు దేరినది. విజయ రాఘవ నాయకుడు ముందు నడచుచుండెను. రాజచంద్రుని కూతురు కాంతిమతి

అందమౌ పదముల యందెల రవళి రా
యంచలు వెనువెంట నంటి నడవఁ
గవికి చూపులచేతఁ గనుఁగొన్న యెడ లెల్ల
గలువల వెదజల్లు చెలువు మీఱ
ముద్దు గులుకుడు మోము మొలక నవ్వుల కాంతి
నెలకొని పండు వెన్నెలలు గాయఁ
బసిఁడి సలాకతోఁ బ్రతివచ్చు నెమ్మేను
మెఱుఁగుఁ దీగెల చాయ మించఁ జేయ

దండ నుండెడు చెలుల కైదండఁ గొనుచుఁ
జెలు వలరు హేమ సౌధంబుఁ జేర వచ్చి
రాజచంద్రాహ్వయుండైన రాజు పుత్రి
కాంతిమతి చూచెఁ గోపాలుఁ గాంతుఁ తీర.

పిమ్మట విజయరాఘు వావనీపతిని కాంచినది

కాంచి సుపర్ణుపై మునుపు గాంచిన చక్కని మన్ననారు లే
యంచిత లీల నిప్డు జలజాక్షులు సేవ యొనర్పఁ జుట్టున
న్మించిన వేడ్క నీ గతిని మేదిని వచ్చుచు నున్నవారొకో
యంచుఁ దలంచి యల్ల విహగాధిపుపై హరిఁ గాంచెఁ గ్రమ్మరన్.

ఇరువురు నొక్కపోలిక నున్నారు. శతక్రతు శ్రీనివాస తాతాచార్యులవారు దీనికి కారణము చతుర్థాశ్వాసములో వివరించినారు.

ద్వాపర యుగమునఁ జంద్రుఁడు
గోపాలుని చెంతఁ జేరి కోర్కెలు మీఱన్
శ్రీపతి! రవి శశి లోచన!
తాపస హృదయాబ్జ మిత్ర దానవజైత్రా!

తామరసాప్త పుత్రి యయి ధారుణి మీఱు కళింద కన్యకన్
స్వామి వివాహ మాట విని చాల ముదం బొనకూడె నెమ్మదిం
బ్రేమ మదీయ పుత్రికను బెండ్లయి యిప్పుడు వేడ్క మీఱఁగా
మా మన వాలకింపుచు సమంబుగఁ జూడుము రెండు కన్నులున్.

అన విని గోపాలుఁ డా చంద్రుఁ గనుఁగొని
పలికె నిట్లనుచును భావ మలర
నీ ముద్దు చెల్లెలి నేము పెండ్లాడఁగాఁ
గోడ లయ్యెను నీదు కూతు రిపుడు
కలి యుగంబునఁ జాల ఘనుఁడైన రఘునాథ
భూపాల వరునకుఁ బొడమి యేను
విజయరాఘవుఁడనై విఖ్యాతి మీఱెద
దక్షిణ ద్వారకా స్థలిని నీవు

రాజచంద్రుఁ డనందగు రాజ వయిన
నపుడు నీ కన్యఁ బెండ్లాడి యందముగను
సంతసం బొనరించెద సరగ ననిరెఁ
గాన వినుమింక విజయ రాఘవ నృపాల.

నీవె శ్రీరాజగోపాల దేవుఁడ విలఁ
జంద్రుఁడే యెంచ నా రాజచంద్ర నృపతి
ఘనత నా రాజ సుతయైన కాంతిమతిని
పెండ్లి చేసెద నే నీకుఁ బ్రేమ మీఱ

విజయరాఘవుని జన్మ ప్రకారమును గురించి రంగాజమ్మ పీఠికలో

శ్రీరాజ గోపాల శౌరిఁ జెంగమ లేశు
వేడ్కతో భావింప వెన్నుఁ డలరి
యెదుట సన్నిధి సేసి నీ కిత్తు వరము
వేఁడు మన సంతసంబున విజయ మహిమ
నీ మహీ మండలం బెల్ల నేలఁ జాలు
తనయు మా కిమ్ము దేవకీ తనయ యనిన.

మెచ్చితిమి నీదు కోర్కికి
నచ్చుత రఘునాథ భూప! యటులనె నీకున్
మచ్చికఁ దనయుఁడనై ధర
నచ్చుగ నీ సాధ్వి గర్భమం దుదయింతున్

అని నట్లు వ్రాసినది. ఈ యుపాఖ్యానమునందలి సత్యాసత్యము లందరు తెలిసికొన గలరు. నేను వేరే వ్యాఖ్యానింప వలసిన పని లేదు. శ్రీనివాస తాతాచార్యులవారు స్వయముగా రాయబారము నడిపిరి. కాంతిమతీ విజయ రాఘవులకు పరిణయము గావించిరి. వివాహంపు కార్యక్రమము లన్నియు వివరముగా పంచమాశ్వాసమునందు వర్ణింపబడినవి. రంగాజమ్మ పాండిత్యము గల యువతి. అలంకార కల్పనలయందు ఘటికురాలు. కాని పద్య రచనయందు కాని, పదముల కూర్పునందు కాని, విజయరాఘవ వేంకటకవులతో సరి కానేరదు. వారు సిద్ధహస్తులు. ఈమె యందంతగా చెప్పుకొనతగిన విశేషములు లేవు. మీఁదు మిక్కిలి రంగాజమ్మ కవితయందు నిరర్థకము లయిన పదములు పెక్కులు గలవు. అవి యన్నియు గణ పూరణకొరకు యతి ప్రాసలకొరకు వాడబడినవి. పూర్వ కవులందు

మాత్రము వ్యర్థపదములు లేవా యని మీారనవచ్చును. లే వనను. కాని యవి కంకణమునం దతుకు పెట్టిన చోట టంకము వలె మెరుగులు తీరి పద్యములో కలిసి పోవును. అట్లు తీర్చిదిద్దగల చతురత రంగాజమ్మకు లేదు. ప్రతి పద్యమునందు పడికట్టు రాళ్ళవలె చాల వ్యర్థపదములు వేరుగా కనిపించును. అందుమూలమున నడకలో కుదింపులు కలిగి శయ్యలో బిగువు తగ్గిపోవుచు వచ్చినది. మచ్చునది

ఏనుఁగను డిగ్గి యప్పుడు
మానినియునుఁ దాను మిగుల మచ్చిక మీాఱం
గానుకలు వేడ్కఁ నొసఁగుచు
శ్రీనిధి మన్నారులకును జెలఁగుచు మ్రొక్కెన్

ఇందలి అప్పుడు, మిగుల మచ్చికమీాఱన్, వేడ్కఁ, శ్రీనిధి, చెలగుచు మ్రొక్కెన్, అనునవి నిరర్థకములు. అల్లికలో జిగి బిగువులు లేనిది కావ్యంపు కవిత రాణింప నేరదు. బిగువు సడలిన పడంతి యెడ సరసుని చిత్తవృత్తి వలె నట్టి కవితయందు సారస్వత ప్రియుల మనస్సు పెడ మొగము కల దగును.

మన్నారుదాస విలాసమునందుకంటె ఉషాపరిణయము నందలి కవిత్వము కొంచెము గ్రుడ్డిలో మెల్ల యనిపించును. ఉషాపరిణయము శృంగార రస ప్రబంధము. దాని కంగము వీరము. ఇందలి నాయకుడు శ్రీకృష్ణుని మనుమడగు ననిరుద్ధుడు. నాయకురాలు శోణపురాధీశుడగు బాణాసురుని కూతురు ఉష. వారిరువురి వివాహమందలి యితివృత్తము. ఈ గ్రంథమును తంజావూరు సరస్వతీ మహాలు పుస్తక భాండాగారమువారు ప్రచురించిరి. అందు నాలుగాశ్వాసములు మాత్ర మున్నవి. నాల్గవ యాశ్వాస మసంపూర్తిగా కనబడుచున్నది. అందును చివరి పద్యములు నిండుగా లేవు. ఈ యాశ్వాసమునందు శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధము వర్ణింపబడినది. అదియు సంపూర్తిగా లేదు. ఉషాపరిణయ మైదాశ్వాసముల గ్రంథమనియు నైదవాశ్వాసమున ఉషానిరుద్ధుల వివాహ ఘట్ట ముండియుండుననియు ప్రచురణకర్త లభిప్రాయపడు చున్నారు. అది

సత్యము. దొరికినంతవరకు నీ కావ్యమునందు మూడు వందల యెను బది పద్యములు గలవు.

భారత భాగవత ఉత్తర హరి వంశములందు ఉషా పరిణయ వృత్తాంతము కలదు. వాని నాధారముగా చేసికొని కనుపర్తి యబ్బయామాత్యుడు అనిరుద్ధ చరిత్ర మను పేరుతో కావ్యముగా రచించెను. దీనిని మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారు ప్రకటించిరి. ఉషా పరిణయమను పేరిట దామెర్ల అంక భూపాలు డీ కథనే కావ్యముగా రచించెనని వినికిడి. అది ప్రకటింప బడలేదు. తాళపాకము తిరువేంగళ నాథుడు ఉషా కళ్యాణ మను పేరుతో నీ కథను ద్విపద కావ్యముగా వ్రాసెను. విరిపాటి నృసింహ రాజు, నడిమింటి రామజోగి, చెన్నయ మొదలగువారు యక్ష గాన ములుగా ప్రబంధించిరి. ఇవి సరస్వతీ మహాలు పుస్తక భాండాగార మునం దున్నవి. ఇంకను ప్రకటింపబడి యుండలేదు. వ్యాస కృత మగు ఉత్తర హరి వంశమునందలి కథను ప్రధానముగా తీసికొని రంగాజమ్మ ప్రబంధమున కనుగుణముగా కథను పెంచి ఉషా పరిణ యమును రచించినది. సంస్కృత ఉత్తర హరి వంశములోని శ్లోక ముల కనువాదము లిందు కనిపించుచున్నవి. అది విజయరాఘ వావనీపతి యాదేశము. విజయ రాఘవ నాయకుడు సతీ సుత పౌత్ర సహితుండయి రాజగోపాల విజయ సౌధమునం దుండి శ్రీనివాస తాతాచార్యులవారు చెప్పు హరివంశ కథా ప్రసంగం బాలించెను. రంగాజమ్మ మన్నారుదాస విలాసమును వినిపించెను. తరువాత మహా రాజు

పరగ హరివంశమున నుషా పరిణయ కథఁ
దెనుఁగుఁ గావింపు మిక నీవు తేఁటగాఁగ

యని సబహుమానంబుగాఁ దాంబూల జాంబూన దాంబర మాల్యా భరణంబు లొసంగెను. రంగాజమ్మ కావ్యరచనకు పూనుకొనినది. ఆమె యితర కావ్యములందు వలె పుర వర్ణనతో కథ ప్రారంభింప లేదు.

జనమేజయ జన పాలుఁడు
విని వీనుల విందుగాఁగ వెన్నుని కథలన్
దనివొందక వైశంపా
యనునకు నిట్లనియె మఱియు నాదర మొప్పన్

అను పద్యముతో ప్రారంభించినది. ముక్కు తిమ్మనార్యుడు తన పారిజాతాపహరణమునందు కథ నిట్లే ప్రారంభించెను. అందలి యితివృత్తము హరివంశము నుండి గ్రహింపబడినది. తరువాత జనమేజయు డొక సీసపద్యములో కథా విషయమును గురించి వైశంపాయనుని పృచ్ఛించును. ఆ పద్యము ననుసరించి రంగాజమ్మ ఉషాపరిణయమందు తరువాత నొక సీసమును వ్రాసినది. కథా ప్రారంభ సంవిధానమునందు రంగాజమ్మ తిమ్మనార్యు ననుకరించినది. 'హరి నరకాసురుం గెలిచి' యను పద్యముతో నసలు కథ కుపక్రమించినాడు తిమ్మన. "ఓ వైష్ణవాగ్రేసరా! బలి తనూభవు డగు బాణాసురుం డొక్కనాడు" అను వచనముతో ప్రారంభించినది రంగాజమ్మ. పార్వతి వరమున బాణాసురేంద్రునకు ఉషయను కుమార్తె జన్మించెను. ఆమె పెరిగి పెద్దదయ్యెను. ఒకనాడు

పల్లవంబుల మించు పదముల రతనంపు
టందియల్ ఘల్లు ఘల్లనుచు మ్రోయ
ఘన నితంబములందుఁ దనరారు బంగారు
మొలనూలి ఘంటలు మురువు చూప
శృంగారముల మీఱు కెంగేలుఁ దమ్ముల
నీలంపు గాజులు చాల మెఱయఁ
దపనీయ మయ రత్న తాటంకములు మంచి
నిద్దంపుఁ జెక్కిళ్ళ నిగ్గు లీన
సరులఁ బెనఁగొని పాలిండ్లు సారెఁ గులుకఁ
గాను లసియాడ మదహంస గతులు మెఱయ

వనితలును దాను శృంగార వనముఁ జేరె
భావమిగురింప నల యుషా భామ యపుడు
మన్నారు దాస విలాసమునందు కాంతిమతిని
అందమౌ పదముల యందెల రవళి రా
యంచలు వెనువెంట నంటి నడవ
కలికి చూపులచేతఁ గనుఁగొన్న యెడ లెల్లఁ
గలువల వెదచల్లు చెలువు మీర

అను పద్యముచేత వర్ణించినది. దీనికంటె పై పద్యము శయ్యలో కొంచెము బిగువు గలిగి సాఫుగా నడచినది. కొంత శిల్పము కూడ కలదు. కాని సంపూర్ణముగా నా యౌవనవతుల రూప ప్రతిబింబము పాఠకుని కనుల యెదుట నిలుపలేకపోయినది రంగాజమ్మ. మూడవ పాదములోని 'చాల' నాల్గవ పాదములోని 'మంచి' అను పదములు ప్రాసయతికొరకు గణ పూరణము కొరకు వాడబడిన పడికట్టురాళ్ళు. ఇంక 'మీఱు' శబ్దము చెప్పనక్కరలేదు. పై పద్యములోను క్రింది పద్యములోను నెక్కడ పడితే యక్కడెల్ల యధానులాపముగా వచ్చి వాలుచుండును. రంగాజమ్మ కయితలోని పదములు చాల మృదుల ములు. కాని ఇట్టి వ్యర్థపదములు నడకకు నెడరు వాటించుచున్నవి. ఆమెకు కవిత్వానుభవము చాల తక్కువ

ముక్కంటి గౌరి యవ్వని
మిక్కిలి ప్రేమంబు మీఱ మెఱయంగా నా
మక్కువ గని యుష తన మది
నక్కట యిట్లుండ వలదె యనుచుఁ దలంపన్

వైశాఖ మాసమునందలి శుక్లపక్ష ద్వాదశి రాత్రి నీ కలలో నిన్నె వ్వడు పొందునో యతండె నీ పతి యగునని గౌరి యామెకు వర మిచ్చినది. అట్లే యా నాడు ఉషకు కల వచ్చినది. కలయందు కనిన యా పురుషునిపై విరాళి గొనినది యుష. ఇది ప్రథమాశ్వాసము లోని కథ.

పద పద్మముల చాయ పారిన యెడలను
బఱచిన చెంగావి బాగు మీఱ
నెమ్మోని కాంతులు నిండిన దిశలను
బంగారు నును పూత రంగు గులకఁ
గలికి లేఁజూపులు గలిగిన బయిటను
గలువ తోరణముల చెలువు వెలయ
నెఱి కొప్పు బలుకప్పు నిగ్గు దోచిన చోట్ల
నీలముల్ వెదచల్లు నీటు దనర

బాణ నందన యైనట్టి పద్మగంధి
మందయానలు గొలువంగ నందముగను
మనసు నాథునిపై నిల్పి మచ్చికలర
వన్నె మీఱిన యుద్యాన వనము చేరె

అను పద్యముతో ద్వితీయాశ్వాస మారంభమగును. ఇందు మొదటి రెండు పాదములలోను తద్గుణాలంకారము కలదు. కాని ప్రబంధ కవిత్వమున కుండవలసిన బిగువు ఈ పద్యమునందు లేదు. పదములు మృదులము లనుటకు సందేహము లేదు. ప్రాసలకొరకు తడుము లాడుకొను నలవాటు తప్పినది కాదు. గీత పద్యమును చదివిన సాహిత్య తత్త్వవిదులు అందముగను, మచ్చికలర, వన్నె మీరిన మొదలగు పడికట్టు రాళ్ళు గ్రహించుకొనగలరు.

మన్నారు దాస విలాసమునందే కాక యుషా పరిణయ మందును సీసపద్యములు యతి స్థానముల యొద్దను ప్రతి యర్థపాదము తోడను ఆగిపోవును. గీతపద్యములు సైతము యతి యొద్దను పాదాంతములందును ఆగిపోవుచుండును. ఇట్టి విధము పద కవిత్వమునందు నందము సమకూర్చును. రంగాజమ్మ శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయ మతి స్ఫూర్తినని గద్యయందు వ్రాసికొనినది. ఆ మహనీయ మతి స్ఫూర్తి కావ్యములందలి సీస పద్యములందును ప్రదర్శించినది. ఉషా తరుణి చెలిమికత్తెలతో వన విహారము గావించును. ఇచట రగడలలో వారి మాట చతురతలు సరసములు

చాల మనోహరముగా వర్ణించినది రంగాజమ్మ. నడిమి ప్రాయంపు బిగువు గుబ్బెత లా వనితలు. చతురుల కేమి తక్కువ.

మల్లె మొగ్గలు మీరె మరుని శర గోల లన
నెల్లెడలఁ దన చాయ లెనయు నిదిగో లలన!
బింబోష్ఠి యేనె దగఁ బెంచి తిటు సాలమును
డంబైన యట్టి నీడల నీ రసాలమును
నెంత దూరము చనియె నిందుకే యీ లేమ
కంతుపూజకునన్నఁగనకములె యీ లేమ
వేడుకలు నించె నిట వెలఁది నారంగములు
నాడఁగా గుంపులై యలరె సారంగములు
అవుర! బంగరు చాయ నమరె జంబీరములు
యువతి! నీ కుచము లెనయునె వట్టి బీరములు
గురువెంద గుత్తిఁ గైకొను మేల జగడంబు
పరికింపు వీనికిఁ బ్రతి యగునె పగడంబు
చాలు నిక నన లనుచు సరసోక్తులను బెనుచు
బాళి మీరఁగఁ జాల బాణ నందన మ్రోల

చక్కని అంత్య ప్రాసలతో సరసంపుఁ బద జాలముల కూర్పుతో రచన యందముగా సాగినది. వనకేళి సలిపిరి. పిమ్మట జలకేళి. యావల మన్మథారాధన. ధ్యానావాహనాస నార్ఘ్యాదికములు ముగిసినవి. సూర్యుడస్తమించెను. చంద్రు డుదయించెను.

ఆ యెడ వలరాయఁడు బలు
రాయిడి కెందమ్మి జిగి కరాచూరులచే
నాయమ్ములు గాయమ్ములు
సేయ న్మదిరాక్షి బెగడెఁ జిత్తములోనన్

ఉషకు మరుతాప మగ్గల మయినది. సఖులు శైత్యోపచారములు గావించిరి. కలలోపల గలసినట్టి కాంతుఁ డెదుట నిలిచి నటుల తోచినది ఉషకు. ఇక ప్రలాపము లారంభించినది.

జూటుకాఁడగు వీఁడు జుణిఁగి పోవక యుండఁ
దోయజాక్షిరో! తల్పు మూయవమ్మ
కన్నగాఁడగు వీడు కదలి పోవక యుండఁ
బడతి! సందిటఁ గ్రుచ్చి పట్టవమ్మ
వంచకుండగు వీఁడు వదలి పోవక యుండఁ
జంచలేక్షణ! యడ్డగించవమ్మ
దిట్టయై తగువీఁడు తేలిపోవక యుండ
నతివ! పేరేమని యడుగవమ్మ

సొరిది నల పోటుటిఁగకుఁ జొరఁగ రాని
యిచ్చటికి నేటి కీ వేళ వచ్చి తనుచు
మంచి మాటలచే వీని మనసు తలఁపుఁ
గలువ కంటిరో! తేటగాఁ దెలియవమ్మ

ఇట్లు ఆరు సీసపద్యములందు ఉషా ప్రలాపములు తెలుప బడినవి. తరువాత మదన దూషణ కలదు. మన్నారు దాస విలాసము నందు సహితము కాంతిమతి యీ యవస్థలన్నియు పొందినది. వన కేళి, జలకేళి సూర్యాస్తమయ చంద్రోదయములు మదన తాపము ప్రలాపములు మొదలగున వన్నియు యథాక్రమముగా నడచినవి. కాంతిమతి ఉషా కన్య వలెనే విజయరాఘవు రూపు నెదుట చూచి

చక్కఁదనము చూచి సొక్కితి నా సామి
బటువు గుబ్బలు కేలఁ బట్టవేర
మక్కువ నీ తేటమాట కే వలచితిఁ
ముద్దువెట్ట వదేర ముచ్చటలర
నీ రాజసముఁ జూచి నీకు నే దక్కితి
జెక్కు నొక్క వదేమి చెలువు మీఱ
సొగసైన నీ హొయల్ సూచి నేఁ గోరితిఁ
గాఁగలింప వదేమి కాఁక తీర

నింత నన్నేతురా పంత మేల నిన్నుఁ
జాల నమ్మిన దానరా జాణరాయ
పచ్చవిల్తుని కేళిని బాగు మీఱ
విజయరాఘవ నన్నేలు వేడ్క మీఱ

అని మరింత మోహాము కొలది నారు సీసపద్యములలో ప్రలాపించి నది. మాటలందు కాని మరులందు కాని యొకరి నొకరు తీసిపోలేదు. కాంతిమతియు మదనుని నోరార నిందించినది. రంగాజమ్మ వ్రాసిన యీ కావ్యములందే కాదు. తంజావూరు కవులు వ్రాసిన ప్రతి కావ్యమునందు మదనోపాలంభాదులు కలవు. అవి లేకపోవుట మహా కావ్యమున కపరాధ మని తలంచిరి కాబోలు. ఆ పనిని మూడు కాళ్ళ ముసలి రాజరాజున కంటకట్టినాడు సారంగధర చరిత్రలో చేమకూర వేంకటకవి. ఒక తంజావూరు కవులనియే కాదు. శృంగార ప్రబంధములు వ్రాసిన యే యిద్దరు ముగ్గురో తప్ప మిగిలిన వారందరు ఒకనిని మించి యింకొకరు ఈ యుపాలంభాదులకు పూనుకొనిన వారే. వరూధిని ప్రారంభించిన యీ కార్యము నాటినుండి నేటివరకు చివరికి తిరుపతి కవుల లక్షణా పరిణయమునందును సాగుచునే వచ్చినవి.

ఇట్టి లోపములు సారస్వత ప్రియులకు తెలుగు కావ్యముల యెడ నేవగింపు పుట్టించినది.

ఒకసారి కట్టమంచి రామలింగారెడ్డి గారనియే నాకు జ్ఞాపకము, తెనుగు కావ్యములలో నొకటి చదివిన చాలును. మిగిలిన వన్నియు నకిలీ కావ్యములు. ఆంగ్లేయ సంస్కృత భాషలం దట్లు కాదు అన్నారు. నిజము. అలసాని పెద్దనగారు మనుచరిత్ర రచించిరి. వెంటనే భట్టుమూర్తి వసుచరిత్ర నందుకొనినాడు. శృంగార కావ్యము లన్నియు కొంచెము భేదముతో వాని దారి ననుసరించి నవి. పింగళి సూరన రాఘవ పాండవీయము వ్రాసినాడు. నే నెందుకు వ్రాయ రాదని భట్టుమూర్తి హరిశ్చంద్ర నలోపాఖ్యానము రచించెను. తరువాత యాదవ రాఘవ పాండవీయము. నల యాదవ

రాఘవ పాండవీయాదులు బయలుదేరినవి. అంతకంటె మిగుల విచారణీయము, ఒక యితివృత్తమును వేరు వేరు కవులు కావ్యములుగా రచించినవారు కలరు. ఉత్తర రామాయణము తిక్కన, కంకంటి పాపరాజులు వ్రాసిరి. ఉత్తరహరి వంశము నాచనసోముడు, ఎఱ్ఱన వ్రాసిరి. ఇట్లు చెప్పవలసి వచ్చినచో చాల కలవు. ఒక్క రామాయణమును బండ్ల కెక్కించ వచ్చును. చివరి కేమయిన మిగిలినవి యున్నచో కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు భారత భాగవతముల దగ్గరనుండి అన్ని కావ్యముల నకిలీలు తయారు చేసినారు. ఆయన శతాధిక గ్రంథకర్త. మరీ చివరి రోజులలో రోజున కొక గ్రంథము తయారుచేసిరి. చదివేవారు మాత్రము లేరు. ఏమిటి తాతయ్యగారు ఈపని అంటే వానిమీద విరుచుకు పడేవారు.

తిక్కన భారతంపు నుడి తేనెల తీపి పసందు పెంపు తీ
రెక్కడ కృష్ణభారత మదెక్కడ నక్కకు నాక భూమికిన్
రిక్కకు నజ్జబాంధవ మరీచులకుం గల భేద ముండఁ ద్రు
ప్పెక్కిన యుక్కుఁ దీగె యన నేటికి మాటికి మచ్చరింపఁగన్

అన్నాడొక మహాకవి తన గురు దక్షిణలో. ఇట్లు ఒకరు వ్రాసిన కావ్యమును మరొకరు వ్రాయుట తమ ఘనతను ప్రకటించుకొనపోయి యగౌరవమును సంపాదించుకొనుట. సంస్కృత కవులం దీయలవాటు లేదు. ఒకరు గ్రహించిన యితివృత్త మింకొకరు కైకొనలేదు. ఒకరు పోయిన దారి నింకొకరు పోలేదు. కావుననే సంస్కృత కావ్యములు నాటకములు సర్వసామాన్యముగా దేని కది ప్రత్యేకత కలదయి పాఠకుని మనసు నాకర్షించు చుండును. సంస్కృత కవులలో నాలుగైదు కావ్యములు వ్రాసినవారును గలరు. కాళిదాసు రఘువంశాది కావ్యములు శాకుంతలాది నాటకములు రచించెను. ఒక దానియందున్న కథా విధాన మింకొక దానియందుండదు.

షేక్స్పియరు ఆంగ్ల మహాకవి. పెక్కు నాటకములు రచించెను. ఒక దానిలోని సంఘటనము లింకొక దానియందు కనిపించవు.

అర్నాల్డు షెల్లీ గోల్డుస్మిత్ మొదలగువారు పెక్కుమంది కలరు. ఒకరి నొకరనుకరించలేదు. ఎవరిదారి వారిది. అది వారి ప్రతిభాదులను ప్రకటించును. ప్రతిభా సంపన్నుడు ఒకరి మార్గ మనుకరించడు.

కస్తూరికా జనన శక్తిభృతా మృగేణ
కిం సేవ్యతే సుమనసాం మనసాపి గన్ధః

అట్టి ప్రతిభాశక్తి తెనుగు కవులందు చాల మందికి కొరతపడియున్నది. కావున అనుకరణలు అనుసరణలు తెలుగు కావ్యములందు అధికముగా కనిపించును. లక్షణ కర్తలు కావ్యములకు నాటకములకు లక్షణములు నిరూపించిరి. అవి యన్నియు కావ్యములందు రావలయునని తలంచుట కవి యవివేకము.

మేఘసందేశము మహాకావ్యమని నిర్ణయింపబడినది. దాని యందు మన్మథ దూషణాదులు లేవు. దాని కేలోపము కలిగినది? కవి లక్షణ నిర్మాత. లక్షణమునకు దాసుడు కాడు. అది యెరుగరు తెలుగు కావ్య కర్తలు. కావున లక్షణ గ్రంథములలోని వర్ణనలన్నియు తమ కావ్యములందు జొనిపించిరి. కావ్యము లన్నియు నొక్క రకముగా తయారయినవి. ప్రతిభా విహీనత కిది తోడయినది. తెనుగు కావ్యములను పరిహాసమునకు పాలుచేసినది. రంగాజమ్మ మొదట మన్నారుదాసవిలాసము వ్రాసినది. విజయరాఘవ భూపతి యభిమతము ననుసరించి కథకు ఘనత మహాత్త్వము కల్పించినది. అంతవరకు కథా విధానము బాగున్నది. కాంతిమతి స్వప్నమునందు విజయరాఘవుని గాంచుట, మోహావేశమున ప్రలాపించుట కొంతవరకు మానవ స్వభావమని యంగీకరింపవచ్చును. అంతలో మహాకావ్య లక్షణములు జ్ఞాపకమునకు వచ్చినవి కాబోలు! వనకేళి జలకేళి మన్మథపూజ చంద్రోదయము విరాళి శైత్యోపచారాలు, మదనోపాలంభాదులు పూర్వ కవులవలె దాదాపు నూరు పద్యములు వ్రాసినది. పాడినదే పాట. విసుగు పుట్టించకేమగును? అదే పని యుషా పరిణయమునందు చేసినది. రెండు ఒకే రకమగు కావ్యములుగా తయారయినవి. ఇతివృత్తమునందు చాల భాగము

చర్విత చర్వణమయినది. మన్నారుదాస విలాసములోని భావములే యుషా పరిణయమునందును ప్రదర్శింపబడినవి

పణతి యొక్కతె చేరి బంగారు పావాలు
పదములఁ గీలించె బాగుమీఱ ఉషా. ప.
రంగు మీఱిన యట్టి రతనంపుఁ బావలు
పదములఁ గీలించెఁ బణతి యొకతె మ. దా. వి

ఇత్యాదు లరయునది. పదములలో మార్దవ మున్నది. అంత మాత్ర ముచేత కావ్యమునకు రమణీయత ఘటిల్లదు, బిగువు సడలని శయ్యా సౌందర్య ముండవలయును. వానికి హృద యాకర్షణీయములగు నలంకారములు తోడు కావలయును. వినూతనములగు సారస్యములు, తొణికిసలాడు భావములు ప్రతిపాదింపవలయును. రసము జీవమయి వికాసము నొదవింపవలయును. అప్పుడు కాని కావ్యాంగన సర్వాంగ సుందరియై పాఠకుని యంతరంగము నాకర్షించి తన్మయత్వ మొదవింపజాలదు. ఆ యుపజ్ఞత రంగాజమ్మయం దంతగా కనిపించదు.

చిత్రలేఖ యనిరుద్ధుని తోడ్కొని వచ్చినది తన మాయా బలముచేత. ఉష శయ్యాగారమున నిలిపినది. అతడు కనులు తెరిచి చూచినాడు. ఉలూచీ యర్జునుల సమాగమ ఘట్టమునకు సర్వవిధము లందు సరిపోలిన ఘట్టమిది. చేమకూర వేంకటకవి చూపిన యా రచనా చమత్కారముగాని, సంభాషణా నైపుణ్యముగాని, ఆ వర్ణన లోని చిత్రకళా వైదగ్ధ్యము కాని, రంగాజమ్మ రచనలో నే మూల కనిపించలేదు. కావ్యమునకు సంభాషణ చమత్కారము ప్రాణము పోయును. తిక్కనగారి రచనలోని విశిష్టతలో నది యొకటి. అనిరుద్ధుని చూచినది యుష. వాని చక్కఁదన మొక పద్యములో వర్ణించి తన చెలిమి కత్తెతో చెప్పినది.

ఇందు బింబముతో నెనవచ్చు నీతని
నెమ్మోము చూడు మిందీవరాక్షి
భాను సమానుడై భాసిల్లు నీతని
తేజంబు చూడు మంభోజనేత్ర

చక్కెర లొల్కెడు చక్కని యాతని
కెమ్మోవిఁ జూడుము కీరవాణి
పండు వెన్నెల చాయ భాసిల్లు సీతని
కుఱు నవ్వు చూడు చకోరనయన

యరులపై బాణ వర్షముల్ కురియు కతన
జ్యా కిణాంకిత మించు బాహా యుగంబుఁ
బరుల తలమెట్టు మృదు పాద పంకజముల
భామ వీక్షింపు కన్నుల పండువుగను.

అనిరుద్ధుడు కనులు తెరిచినాడు.

చెలులు చుట్టును గొల్వఁ జిగురాకు విల్కాని
మోహనాస్త్రంబన మురువు మీఱి
సిగ్గుచే తలవంచి చిరునవ్వు నవ్వుచుఁ
గ్రేఁగంటఁ దనుఁ జూచు కీరవాణిఁ
బసిడి సలాకతోఁ బ్రతి వచ్చు నెమ్మేని
కాంతులు దిక్కులఁ గలయఁ బర్వ
మిక్కిలి ప్రేమచే మేను చెమర్చంగఁ
దనలోన రతిఁ గూడఁ దలఁచుదాని

బాణసుతఁ జూచి

నాడు. ఈ రెండు పద్యములందును శిల్పమే కోశమునను గనిపించదు. శిల్ప విరహితమగు వర్ణన కావ్యము పెంచుటకే కాని కళా సౌభాగ్యమునకు కాదు. ఉషాకన్య అనిరుద్ధునిపై మరులు కొనుటయు, తాను వానిని గొనివచ్చుటయు, మొదలుగాఁ గల వృత్తాంతము వినిపించినది చిత్రలేఖ. ఉషానిరుద్ధుల సంయోగ వియోగ శృంగారములు తరువాత వర్ణింపబడినవి. ఇది వరుసగా వచ్చుచున్న యలవాటు. రఘునాథనాయకాభ్యుదయమునందు విజయరాఘవ భూపతితో ప్రారంభించినది. రంగాజమ్మ దాని ననుకరించినది. అది

పత్నీత్వము. తరువాత బాణాసు రానిరుద్ధుల యుద్ధము. అందొక పద్యము

అనిరుద్ధుండును రోష భీషణత రాహంకార హుంకారుఁడై
దను జానీకముఁ దేరి చూచి నగుచున్ దర్పంబు మీఱం గడున్
దునియల్ గాఁ బడ వ్రేయ నద్దనుజులన్ దుర్వార ఖడ్గంబుచే
ననికిం జాలక పాఱి రందఱును హాహాకారముల్ మీఱఁగన్

ఎట్లెట్లో కడనెగ్గించినది కావ్యము. వచ్చిన భావములే మరల మరల ప్రదర్శించుచు, నిచ్చిన పుక్కిటి విడెంబులే మరల నిప్పించుచు, చీరిన చను గుబ్బలను మరల మరల చీరించుచు, వచ్చిన 'మీఱ' అను పడికట్టు రాయి గణ పూరణకొరకు మరల మరల వేయిసారులు వాడుచు; విజయరాఘువ నాయకుని మనసు తీర్చినది. మహారాజామెకు కనకాభిషేకము చేయించినాడు. రాజు తలచుకొనిన నేమైన చేయ గలడు. అభిమాన మొకటి యుండవలయును.

౮

## చెంగల్వకాళ కవి

విజయరాఘవ నాయకుని కొలువు కూటమునం దున్న కవులలో కాళయకవి పేర్కొనఁ దగినవాడు. అతడు శ్రీవత్స గోత్రుడు. పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. ఆయన తాత కాళయమంత్రి. పితామహి గంగమాంబ. తండ్రి వేంకటయ్య. తల్లి కృష్ణమాంబ. తండ్రియగు వేంకటయ్య రణరంగ గంధవారణ బిరుదాంకితుడగు శ్రీకంఠ భూపతి మంత్రి. ఆయన పార్వతీ పరిణయ మను కావ్యమును రచించెను. కాళయకవి శివపూజా ధురంధరుడు. శ్రీమ త్కాళహస్తీశ్వర కరుణా కటాక్ష లబ్ధ సిద్ధ సారస్వత నయుడు. విజయ రాఘవ భూపాలునకు ప్రియ మిత్రుడు. వారి మైత్రి

విందునకుఁ దాము గరితలు వేడ్క వచ్చి
వరుస సొమ్ములు తమయింటి వారి కొసఁగి
యాత్మజులకెల్లఁ జతురంత యానములను
మహిత భూషణములు బహుమతులు

నొసంగు నంతటి సన్నిహిత మయినది. ఇట్టి యాదరాభిమానములు రాజులకు కవుల యెడ అనాది సిద్ధము. వాల్మీకి జనక మహారాజున కాప్తమిత్రుడు. ఆ మైత్రియే సీతామహాదేవి కాశ్రయ మిచ్చినది. కాళిదాసు భోజునకు పరమ ప్రియుఁడు. ఆయుర్దాయమునందు సగ భాగము పంచుకొనిరి. అలసాని పెద్దన రాయలవారికి గురుతుల్యుడు. పురమేగఁ బల్లకిఁ దన కేలఁబట్టి యెత్తినాడు. రఘునాథ నాయకునకు చేమకూర వేంకటరాజకవి ప్రాణప్రియుడు. అతడు తన కృతుల నా రాజున కంకిత మొసంగి, సేవింప ప్రతిన పట్టెను. విజయ రాఘవ భూపతి కాళయ కవి యింట విందు భోజనము లారగించెను. వాని పుత్ర కళత్రములకు బహుమతు లొసంగెను. ఆ మైత్రి ఒకనాటిది కాదు. బాల్యాదికమై యుండవలయును.

అయ్యా దినముల రామభద్రమ్మవారు
నేడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి
వినికి సేయుట లెల్ల మీ ఘనతఁ గాదె
కవి వినుత చర్య చెంగల్వ కాళనార్య!

అని ప్రశంసించినాడు కాళయ కవిని విజయ రాఘవ నాయకుడు. రామభద్రాంబను గురించి కవితా గోష్ఠియందు విపులముగాఁ బ్రసంగించితిని. ఆమె రఘునాథ నాయకుని యాస్థాన విద్వాంసురాలు. రఘునాథాభ్యుదయాది కావ్యములను సంస్కృతమునందు రచించిన కవయిత్రి. రఘునాథ నాయకుని ధర్మపత్ని. కృష్ణాంబ విజయ రాఘువావనీపతి యాస్థాన విద్వాంసురాలు.

ప్రస్తార సంఖ్యను పదమూఁడు కోటులు
నలువది రెండు లక్షలు పదేడు
వేలు నేఱ్నూఱును వింశతియును నాఱు
వృత్తంబులందు నీ వృత్తమునకు
నీ వర్ణన సమస్య నీవు గూర్పు మటన్న
నా వృత్తమున సమస్యను రచించి
యందుకు శ్లోకంబు లాశువుగాఁ జెప్పి
యవి తెనుంగుననుఁ బద్యములు చేసి

యిరువదాఱును ఛందంబు లెఱిఁగి యిట్లు
కవితఁ జెప్పిన వార లీ భువినిఁ గలరె
యనుచు నందఱు వినుతింప ఘనతఁ గాం

చిన పండితురాలు కృష్ణాంబ. వీరిరువురు చెంగల్వ కాళకవికి శిష్యురాండ్రు. కావున కాళయ రఘునాథ నాయకుని కాలమునుండియు ప్రసిద్ధిగాంచిన కవి యని చెప్పవచ్చును. కాని రఘునాథ నాయకుని యాస్థాన కవులలో కాళయ పేరెందుకు గానరాదు? ఇందుమూలమున నీ కవి రఘునాథ నాయకుని యాశ్రితులలోని వాడు కాడని నిర్ణయింపవచ్చును. రాజాశ్రయమునందు కంటె యువరాజు నాశ్ర

యించి జీవించుటలో కొంత స్వాతంత్ర్య మున్నది. కొలువు సేవల యందు కట్టుబాటులు తక్కువ. మాట విలువ యెక్కువ. కాళయకవి యది గుర్తించి విజయ రాఘవ నాయకు నాశ్రయించి యుండును. రఘునాథ నాయకుని కాలమున విజయ రాఘవ నాయకుడు యువ రాజు. వయసున చిన్నవాడు. అందుమూలమున కాళయకవి విజయ రాఘవుని హృదయమును పరిపూర్ణముగా తన వైపున కాకర్షించు కొన గలిగెను. ఆశ్రయము మైత్రిగా పరిణమించినది. ఆ మైత్రి అంతఃపుర పరిచయమునకు క్రమ క్రమముగా దారి తీసినది. అది యంత కంతకు నభివృద్ధి నొందినది, ఒండొరుల యింట విందు భోజన ములకు సహపంక్తి భోజనములకు నలవాటు పరచినది.

ఇట్టి పరిచయాభిమానములకు కృష్ణాంబయు చంద్రరేఖయు కొంత కారణమై యుండ వచ్చును. కావున కాళయకవి 'రాజగోపాల విలాసము' పీఠికయందు 'ప్రస్తార సంఖ్యను పదమూడు కోటులు' అను పద్యముచేత కృష్ణాంబను అంతగా వినుతించెను. ఒక పక్షమున తన సామర్థ్యమును గూడ నందుమూలమున ప్రకటించుకొనెను. ఆశ్వా సాంత పద్యములందు 'ముద్దు చంద్రరేఖా నాథా, ముద్దు చంద్రరేఖా ప్రేమ స్థేమాభిరామా, ముద్దు చంద్రరేఖా మదనా' యని చంద్ర రేఖను స్మరించెను. పీఠికయందు

తీగె మెఱుంగుల తీరున నిరుగడ
వరుస బంగారు పాపడలు మెఱయఁ
బఱపుగా వలగొన్న భాను మండలముల
హారువున నపరంజి హారిగె లమర
మొగిలు మొత్తంబులు మోహరించిన రీతిఁ
బ్రమ్ము సాంబ్రాణి ధూపమ్ము లలర
విద్యా విశేషముల్ వేర్వేర వివరించు
హావణిక బిరుద వాద్యములు మొరయ
వీర వేంకటరాయ పృథ్వీ మహేంద్ర
దత్త బహు విధ బిరుదముల్ దనరు చుండ

సముఖమున నిల్చి యా ముద్దు చంద్రరేఖ
వివిధ విద్యలు వినిపించె వింత యనఁగ

నని పొగడినాడు. చంద్రరేఖ నాట్యకర్త్రి. మొదట వీర వేంకట రాయల నాశ్రయించెను. తరువాత క్రీ. శ. 1614 ప్రాంతమున తంజావూరు చేరినది. విజయ రాఘవ నాయకుని తన విద్యలచేత మెప్పించినది. అప్పుడాయన యువరాజు. మురిసి మున్పందు మయినా డామె కళా విలాసములకు. లోబడి చేపట్టినా డామెను. రాజు కాగానే చంద్రరేఖను పరిణయ మాడినాడు. ముద్దు చంద్రరేఖా నాథు డైనాడు.

రాజానుగ్రహ ముండ వలయును గాని భోగభాగ్యముల కేమి కొదవ? కాళయ కవిని వివిధ రాజ చిహ్న చిహ్నిత భాగధేయుని గావించినాడు విజయ రాఘవ భూపతి సింహాసన మధిష్ఠించిన యనంతరము. అప్పటికే కాళయకవి రాజగోపాల విలాసము విరచించెను. అందలి పద్యము లప్పుడప్పుడు విజయ రాఘవునకు వినిపించి యుండును. నాయక రాజులు మిగుల శృంగార ప్రియులు, భక్తి పరులు. విశేషించి చివరి రాజుల సంగతి చెప్పనక్కఱ లేదు. రాజ గోపాలుని గూడ తమతోపాటు దక్షిణ నాయకుని గావించి శృంగార బద్ధునిఁ జేసిన కాళయకవి పోకడల కుప్పొంగిపోయినాడు విజయ రాఘవ పతి. తాను రాజు కాగానే

పదియార్వన్నె పసిండికిన్ వలపు పైపైఁ జెందు చందంబునన్
చదురుల్ మీఱు భవ త్ప్రబంధముల నిచ్చల్ దక్షిణ ద్వారకా
సద నాస్థాన కథానుషంగములచే సంభావ్యమై మించె నే
డది మా కంకిత మీ వొనర్పు మని యాహ్లాదంబు సంధిల్లఁగా

అర్థించినాడు విజయ రాఘవ నాయకుడు. కాళయ కవికి సహ్యజా తటి నగ్రహారంబులు, పచ్చల పల్లకి, భద్ర కరులు, తార హారములు, అంగుళీయాది రాజార్హ భూషలు

కేళాకూళుల సజ్జల
కేళీ వనములను మించు గృహ రాజంబున్
శ్రీలెసఁగ

నొసంగెను.

విజయ రాఘవ నాయకుడు చంపక వన క్షేత్రమునందలి రాజగోపాల స్వామివారి పదభక్తుడు. ఆయన పేర తన కృతు లన్నియు నంకిత మొనర్చిన మేధావి. కాళయ కావ్యమును కృతి నర్థించుటలో ముఖ్యకారణ మది. కాళయ విజయ రాఘవ నాయకుని మనోవృత్తిని గుర్తించియే రాజగోపాల విలాసమును వ్రాసి యుండ వచ్చును.

కాళయకవి ఆశు కవిత్వము చెప్పగల ప్రజ్ఞావంతుడు. గడి యకు నూరు పద్యములు చెప్పగలవాడు. చిత్ర కవిత్వము, మధుర కవిత్వములం దారితేరినవాడు. పరహృతేతర యుక్తి భాగ నూతన కథా చాతుర్య ధుర్యుడు. పరులు పోయిన దారిని పోవక వినూతన విధానమున కావ్యమును నడిపించుటయందు చతురుడు. కావున రాజగోపాల విలాసమునందు శ్రీకృష్ణుని యెనిమిదిమంది దేవేరులను నెనిమిది రకముల శృంగార నాయికలుగా నిరూపించి కథను క్రొత్త దారియందు నడిపించెను.

రాజగోపాల విలాస మొక విధముగా లక్ష్యగ్రంథ మని చెప్ప వచ్చును. ఇంతలి యితివృత్తము చంపకారణ్య మాహాత్మ్య మను స్థల పురాణము నుండి గ్రహింపబడినది. చంపక వనమునందు గోప్రళయుడను ముని తపము గావించెను. హరి వానికి ప్రత్యక్ష మయ్యెను. ఆ మునివరుడు గోపాలుండవయి పదునారు వేల గోపికల తోడను, నెనమండ్రు దేవేరులతోడను చంపక వనమునందు కాపురం బుండు మని హరి నర్థించెను. హరి యందుల కంగీకరించెను. నాటినుండి యా క్షేత్రమునకు దక్షిణ ద్వారక యను పేరు వచ్చెను. హరి శ్రీకృష్ణ భగవానుడయి అష్ట మహిషులతో నచట క్రీడించు

చుండును. ఆ క్షేత్రమునకు సమీపమున హారిద్రా స్రవంతి ప్రవహించు చుండును. అది సకల పాపహారి.

రాజగోపాల విలాసము నాలుగు వందల డెబ్బది పద్యములు గల ఐదాశ్వాసముల శృంగార కావ్యము. మొదటి నాలు గాశ్వాసములందు శ్రీకృష్ణుండు తన దేవేరులతో వినోదించుట కలదు. ఐదవ ఆశ్వాసమునందు హారిద్రా నదీ మాహాత్మ్యము వర్ణింప బడినది. కాళయకవి రాజగోపాల విలాసమునందలి పీఠికలో విజయ రాఘవ నాయకుని సభావైభవమును వర్ణించెను. అందు

మహనీయ నవరత్న మయ భూషణ ద్యుతుల్
భూ నభోంతరములఁ బొదివి కొనఁగఁ
కాశ్మీర కస్తూరికా సంకుమద సాంద్ర
సౌరభ విభవంబు సందడింపఁ
గటి తటాభోగ సంఘటిత హాటక చిత్ర
వసన దీప్తులు చుట్టు వలగొనంగఁ
బాద పీఠోపరి భాగ సంవేశిత
పాదాంగద ప్రభల్ పల్లవింపఁ

దార గంభీర రవము లుదారముగను
జనత 'సామి! పరాకు హెచ్చరిక' యనుచు
హెగ్గడులు వేత్రములు పూని హెచ్చరింప
నిండు కొలువుండె యా మేదినీ విభుండు.

అని కవి విజయ రాఘవ నాయకుని వర్ణించెను.

కాళయకవి సమకాలికుడు చేమకూర వేంకటకవి. అతడు రఘునాథ రాయలను

కుందనంపుఁ బసిండి కుళ్లాయి జగలపైఁ
జౌకట్ల నిగనిగల్ చౌకళింప

అను పద్యముచేత వర్ణించెను. చేమకూర వేంకటకవి పద్యమునందు గోచరించు సజీవ మగు శిల్ప కళా వైశద్యము కాళయ పద్యము

నందు లేదు. వేంకటకవి దేశీయములగు జాను తెలుగు పదముల కూర్పుచేత పద్యమున కొక వింత యందము నాపాదించెను. పసిండి కుళ్లాయి జగల మీఁది చౌకట్లు, ముత్యాల యరచట్ట పైని పతకంపు హారములు, పీతాంబరమ్ము మీఁది కెంపుల జముదాడి, పాదాగ్రంబు నందు గండపెండారము, కరములందలి కంకణములుతోడి రఘునాథ నాయకుని రూపము చిత్రపటమునందు వలె నయన గతము కావించెను. కాళయకవి సంస్కృత సమాస సంఘటితముగా పద్యమునల్లి యతిశయోక్తిని పొందుపరచెను. ఇంత పాటు పడినను విజయ రాఘవ భూపాలుని యాకారము పాఠకుని కనుల ముందు నిలుపలేక పోయినాడు.

శ్రీకృష్ణ రాయల వారిని అలసాని పెద్దన
ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల
శరదిందు ముఖులు చామరము లిడఁగ

నను పద్యముచేత వర్ణించెను. అందు మహారాజు రాజస వైభవము గోచరించును. అలసాని పెద్దన యా పద్యమునందు దీర్ఘసమాసములు వాడెను. వానియందలి పదముల కూర్పు రాయలవారి రాజసంపు రీవికి ప్రతినిధులా యనిపించును. ఆ రచనా ప్రాగల్భ్య మయినను కాళయ పద్యమునందు కనిపించదు.

కాళయకవి వర్ణనలలో శిల్పము లేదు. అతడు శిల్పకవి కాడు. రూప కల్పనయందలి చతురత వాని కావ్యమునందు వెదకిచూచినచో నెందును కనిపించదు. మహారాజు కొలువునందు శారదా ధ్వజము కలదు. దానిని రెండు సీస పద్యములలో వర్ణించినాడు కాళయకవి.

ఒక్కొక్క యెడఁ జీని చక్కెర పానకం
బానిన ట్లాహ్లాద మావహిల్ల
నొక్కొక్క యెడఁ దావి నెక్కొన విరజాది
సరము లెత్తిన రీతి పరిమళింప

నొక్కొక్క యెడఁ జల్వ లుప్పతిల్లంగ మంద
మారుతంబులు మించు మహిమ చెలఁగ
నొక్కొక్క యెడ మేనఁ జొక్కు సంపాదించు
వెలఁది వెన్నెల తేట విధము మించ

కవిత రచియింప విజయ రాఘవ విభుండె
నేర్చు నని వాణి నర్తించు నేర్పు మీఱ
చామ రానిల కందళ చలిత మగుచుఁ
దనరు సభయందు నల శారదా ధ్వజంబు

పద్యమున కేమి? పదము లర విచ్చు కన్నె గులాబి రేకులలోని మెత్తదనము పుణికి పుచ్చుకొనినవి. యతి కొరకు ప్రాస కొరకు తడుము లాడినటుల కనిపించదు. పదములు తమంతట తాము వచ్చి వాలినట్లే యగుపించును. కాని అసలు శారదా ధ్వజ స్వరూప నిరూపణ మిందు కనిపించదు. విజయ రాఘ వావనీ విభుని కవితను గురించిన కైవారము విపులముగా కనిపించును. తరువాత

నవ నవోల్లేఖన నవన యోగ్యము గాని
పద్యంబు జనులకు హృద్య మగునె

అను పద్యము నిట్టిదే. అందును శారదా ధ్వజ రూప మిట్టి దని నిర్ణయించ లేదు. సర్వజ్ఞ సింగ భూపాలుని కొలువునందు శారదా విగ్రహము కలదు.

ఎటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
సకల సద్గుణ నికురంబ శారదాంబ!

యని శ్రీనాథుడు నుతించినాడు. ఇందుమూలమున అది శారదా విగ్రహ మని స్పష్టమగు చున్నది. కాశ్మీర భూపతి శారదా నిల యమునందు విగ్రహము కలదు. అది మహిమ కలది. శ్రీహర్షుని నైషధ కావ్య ప్రాశస్త్యమును నిర్ణయించు పట్ల పరంపరగా వచ్చు చున్న కథ దానికి తార్కాణము. ఇంక విజయ రాఘవ నాయకుని

కొలువునందలి శారదా ధ్వజ మెట్టిదో కాళయకవి పద్యములందు కానరాదు. రఘునాధ నాయకుడు

చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసి నట్లు కుంకుమ పైపైఁ
గప్పిన క్రియ విరి పొట్లము
విప్పిన గతి ఘుమ్మనం గవిత్వము సభలన్

అని కవిత్వ గుణమును వివరించెను. విజయ రాఘవ నాయకుడు

విరవాది తావులు విరిసినరీతి

అనియు

పలుకుఁ జిల్కల కొల్కి పైడిణీ చలువ
జిలుఁగుఁ బయ్యెద విదల్చిన రువారమున
వర వచో రచనల వాసనల్ గులుక
విరి తేనె లొలుకఁగా

కవిత చెప్పవలయు ననియు నిర్ణయించినాడు. కాళయకవి రచించిన మొదటి పద్యము చదువు నపు డీ రెండు రచనలు జ్ఞాపకమునకు వచ్చును. తరువాత కాళయ సభా నాట్య గాన ప్రదర్శనములను వివరించెను. ముందు చంద్రరేఖ వివిధ విద్యలు వినిపించెను. అనంతరము

చాపద కేళిక రూపవతీ కాంత
శబ్దచూడామణి చంప కాఖ్య
చెలు వగు జక్కణి చెలువ మూర్తి వధూటి
కొరవు కోమలవల్లి గురు సితంబ
నవ పదంబులు లోకనాయికా లోలాక్షి
యల దేశి శశిరేఖ కాబ్జ నయన
దరుపదంబులు రత్నగిరి నితంబినియును
పేరణి విధము భాగీరథియును

మదన పద దూత్య నవరత్న మాలి కాది
బహు విధాలక్ష్య నాట్య ప్రపంచ మెల్ల
ఘనత విలసిల్లఁ దక్కిన కాంత లెల్ల
నభినయించిరి తమ నేర్పు లతిశయిల్ల

ఈ పద్యము రఘునాథ నాయ కాభ్యుదయములోని

పదచాళిఁ గొనియె రూపవతీ వధూటి
కొదలేక పేరణిఁ గొనె చంద్రరేఖ

ఇత్యాది ద్విపద పాదములకు ననుకరణము. ఇవి యన్నియు నాట్య విశేషములు. అనంతరము

వీణ వాయించెను శోణాధర యొకర్తు
కిన్నరఁ బలికించె కన్నె యొకతె

అని గాన ప్రదర్శనముల జాబితా కూడ

వేణీ విలోచన యింపుగా నొకతె
వీణె వాయించెను వింత రాగముల

నను ద్విపద పంక్తులను బోలి యున్నది. వీనిని ఇతర యనుకరణలను బట్టిచూడగా కాళయకవి విజయ రాఘవ భూపాలుని రఘునాథ నాయకాభ్యుదయ కావ్యము రచించిన తరువాత రాజగోపాల విలాసము కృతి యిచ్చియుండునని తోచు చున్నది. విజయ రాఘవ భూపాలుడు సర్వ విధములను తండ్రిని పోలిన కుమారుడు. కొలువులోని కార్యక్రమములందు సహితము తండ్రి యడుగు జాడల ననుసరించెను. వానిని యథాతథముగా వివరించినాడు కాళయ. వాని పీఠికయందలి మొదటి యిరువది యెనిమిది పద్యములలో పదునారు పద్యములు విజయ రాఘవ నాయకుని సభా రంగమునకు ప్రతిబింబములు. కాళయ విజయ రాఘవుని పరాక్రమమును తొమ్మిది పద్యములలో వర్ణించెను. అందుండి యొక పద్యము

పర గూఢ తంత్ర ప్రబంధార్థములు దెల్ప
వ్యాఖ్యాన మెవ్వాని వచన రచన
నిఖిల శాత్రవ భూత నిగ్రహం బొనరించు
మంత్రంబు లెవ్వాని మంత్ర శక్తి
గంధాంధ పరిపంధి గంధేభముల నిల్పు
నిగళంబు లెవ్వాని మగతనంబు
ప్రత్యర్థి పార్థివ ప్రతిమల నాడించు
సూత్రంబు లెవ్వాని సూక్ష్మ బుద్ధి
అతడు చెలువొందు విశ్వంభ రాతిశాయి
విక్రమ క్రమ విద్విష ద్వీర కోటి
కుంభినీ ధర గుంభిత కూట కోటి
కఠిన శతకోటి విజయ రాఘవ కిరీటి

చక్కని రచన. హృదయాహ్లాదకరమగు భావము. ఆ రెంటికి నంద మొదవించు శబ్దార్థాలంకారములు. ఈ పద్యమునందు రూపకము కలదు, వ్యాఖ్యానము, మంత్రము, సూత్రములకు శ్లిష్టరూపకము చెప్పవలయును. మొదటి పాదమునందు శ్లేష. వీనికి తోడు రచన కొక రకమగు చణుకు నాపాదించు వృత్త్యనుప్రాస లాటాను ప్రాసలు. పర=ఉత్తమములైన, గూఢ=రహస్యములగు, తంత్ర= శబ్దశాస్త్రముయొక్కయు, ప్రబంధ=కావ్యముల యొక్కయు అర్థ ములు=అర్థములు అని యర్థము చెప్పినచో విజయ రాఘవ నాయ కుని వ్యాకరణ సాహిత్య పరిజ్ఞానము ప్రకటితమైన ట్లగును. అప్పుడు శ్లేషాలంకార ముండును.

కాళయకవి పద్య రచనకును, మిగిలిన తంజావూరు కవుల పద్య రచనకును చాల తారతమ్యము కలదు. రఘునాధ నాయకుని మొదలు ముద్దు పళని వరకు గల కవు లందరు ఆచ్ఛిక వైకృతములు దేశీయ వ్యావహారికము లగు పదములతో సమ్మిళితము గావించి అందందు తత్సమ పదములు చొనిపి పద్యములను రచించిరి. కావున వారి శయ్య సన్నంపు సున్నితంబగు తెమ్మెరల తాకునఁ బొరలెత్తు

జల తరంగముల మురజ్ఝ రారావములతోడి హృదయాహ్లాద మొదవించు కమలాకరమువలె ప్రసన్న శీతలంబయి యుండును. భావములు ప్రతిబింబించు నీడవలె పరిస్ఫుటముగా నగుపించును. మచ్చునకు

కురులు కెంపుల బొగడల నెరయ దువ్వి
నిక్క చను గుబ్బలఁ బయటఁ జక్కఁ జేర్చి
పలికెఁ గలకంఠి మోమునఁ దెలివి తొలక
ము_త్తియపు ముంగర యొకింత మోవిఁ గదియ. (వి. విలా)

ఆ నుడికారములోని చక్కందనము ఒకింత మోవి కదలించి వెలారించిన ముంగరలోని ము_త్తియంపు తళుకుల వలెనే యున్నది. ఇంక చెంగల్వ కాళయకవి పద్య రచన చాల వరకు దీర్ఘ సమాసముల తోడి తత్సమ పదములు పెనఁగొని యంత రాంతరములందు ఆచ్ఛికముల తళుకలు వెలయించు చుండును. శయ్యా వాలు టద్దము తలపై బడిన యావగింజ వలె పద్య మారంభించిన దాది యంతము వరకు విరామము లేకుండ పరుగులు వారును. అందు నిరంత రోత్తుంగ తరంగ సంఘాతముల ఘుమం ఘుమారావములతో పరుగులువారు సెలయేటి ప్రవాహంపుఁ దీవ్రత కలదు. అంతర్గతములగు భావములంత సులువుగా గోచరింపవు. పాఠకుని పక్షమునందు కొంత ప్రయత్నము కావలయును. కాళయకవి పద్యము లొక్కొక్కప్పుడు. నన్నయ పెద్దన శ్రీనాథుల పోకడలను తలంపునకు తెచ్చుచుండును.

జలధి విలోల వీచి విల సత్కల కాంచి సమంచి తావనీ
తల వహాన క్షమంబయిన దక్షిణ హ_స్తమునం దదున్నమ
ద్గళ దురు ఘర్మ వారి కణ క్రమ కరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన్

ఇది నన్నయగారి పద్యము. నన్నయ దీర్ఘములగు సంస్కృత సమాసములు పద్యమునందు వాడుచుండు ననుటలో సందేహము లేదు. కాని పద్యమంతయు నొక్క సమాసముగా చేయుట వాని మతము

కాదు. మధ్య మధ్య పై పద్యమునందు వలెనే చిన్న చిన్న పదములచేత సమాసములను వేరు చేయుచుండును. వృత్త్యను ప్రాస సమాసములం దుపయోగించును. అదియు రెండు మూడు పదములకు మారిపోవు చుండును. అను ప్రాసలు లయానుగతములయి యుండును. పద్యాంతమునందు రెండు వ్యస్తములగు పదములం దనుప్రాస వాడును. చదువు నపుడు వానిలో ముగ్ధాయింపు స్ఫురించును. పై పద్యమునం దీ లక్షణము లరయ వచ్చును. ఆయన సమాసము లన్నియు మృదులాక్షర సంయుతములై యుండును. సాధ్య మగునంత వరకు వర్గ యుక్కులను వాడడు. అందుమూలమున సమాసములలో ప్రసన్నత నెలకొని యుండును. చదువు నప్పుడు హృదయాహ్లాద కరములుగా నుండును. రచనలో మార్దవము కనిపించును. నడకలో మెత్తందన మావహిల్లును. ఇట్టి రచనా విధానమును సరిగా ననుసరించినవాడు అలసాని పెద్దన. 'అటఁ జని కాంచె' అను పద్యము నరయునది. కాని పెద్దన యొకొక్కప్పుడు పద్యమంతయు నొక్కటే సమాసముగా నడిపించిన తావులు గలవు. 'ఉల్లలదలకా జల కణ' అను పద్య మటువంటిది. ఇంక శ్రీనాథుడు సమాసముల కూర్పులో నీ నియమము లంతగా పాటింపడు. నయాగరా జల పాతము వలె పదములు పుంఖాను పుంఖముగా ధారలు కట్టి దొరలి పోవుచుండును. నన్నయ పెద్దనల సమాసములలోని మార్దవము ప్రసన్నత వానియం దంతగా నుండదు. మచ్చునకు

ఎంచి నుతింప శక్యమె మహేశ్వరు నంతటి వానికైన ర
త్నాంచిత రోచి రుద్గమ నిరస్త రవీందు మరీచి జాలమున్
గాంచన కందరా యవని కాయిత వారిధ రాంతరాళ ని
ర్వంచిత దేవతామిథున వాంఛిత మూలము శీతశైలమున్.
(హ. విలా)

కాళయ సంస్కృత సమాస కల్పనలయందు శ్రీనాథుని రచనా వేగము, నన్నయ పెద్దనల యక్షర రమ్యత నెలకొని యుండును. అందలి గాన లయా తాళ సరళి యిందుండదు. అయినను మృదు

మధురములగు పదముల కూర్పుతో సమాసములు చెవుల కింపుగా నుండును.

మలయ తటీ పటీర తరు మాంసల సౌరభ భార మంద సం
చనల సమీర లోల జలజాత సుజాత పరాగ రాగ సం
కవిత మనోహ రా స్తరణ కాంత నిశాకర కాంత వేదికా
తలమున నుండి యవ్విక చ తామర సాక్షిఁ దలంచి నెమ్మదిన్

హరియించె వారి బడలిక
పరిసర కాసార తీర పరిచిత హంసీ
గరు దంచల హతి చంచల
సరసిజ దళ తాళవృంత జాతా నిలముల్

ఇత్యాది పద్య రచన లరయ వచ్చును. పద్యాంతమునందు నన్నయ పెద్దనల రచనలోని యీ ముద్దాయింపు వినిపించదు. కాళయకవి విజయ రాఘువ మహీ పాలుని పాదమునందలి సాహిత్య రాయ పెండేరమును అయిదు సీసపద్యములలో వర్ణించెను. ప్రతి పద్యము నకు చివర 'నౌర సాహిత్య రాయ పెండార మమరు' నను మకుటము కలదు. ఇట్టి రచనకు కావ్యమునందు దారి చూపినవాడు చేమకూర వేంకటరాజ కవి.

మగరాల నిగరాల మొగపుల నిగనిగ
లభిషేక జలముల హావణు గాఁగ
నందంద నందమా కుందనంపు మెఱుంగు
రంగైన కనకాంబరంబు గాఁగ
గుంపుగా సంజాతి గుజరాతి కెంపుల
విడి కుంకుమపుఁ బూఁత విధము గాఁగ
బవిరిగాఁ జెక్కిన బటువు ము త్తెపు డాలు
బొండుమల్లియ గుండు దండ గాఁగ
నలరఁ గై సేసి యఖిల విద్యానవద్య
సింహ పీఠంబు నెక్కిన చెలువు మీఱ

విజయరాఘవ మేదినీ విభుని యంఘ్రి
నారఁ! సాహిత్య రాయ పెండార మమరు

సాహిత్య రాయ పెండారముయొక్క స్వరూపమిందు వర్ణింప బడినది. అందు రవ్వలు, గుజరాతి కెంపులు, గుండ్రని ముత్తెములు, పొదివిన బంగారు మంజీరము. విజయరాఘవుని కాలియందు వీర బిరుద పెండేరము కూడ కలదు. మహారాజు జయించిన వైరి నృపతుల ప్రతిమలందు చెక్కబడినవి. అది విజయరాఘవ నాయకుని పరాక్రమము వెల్లడించుచుండును.

అందె సింగారించ నందిచ్చు నెపమున
ధవునిఁ గన్గొనియె మాళవ వధూటి
కీలు పొందిక సేసి కీలించు నెపమున
భర్తఁ గన్గొనియె నేపాల బాల
పాద పీఠము నిల్పు పని నెపంబునఁ జేరి
మగనిఁ గన్గొనియెను మగధ కాంత
చరణాంబురుహ సేవ సవరించు నెపమున
విభుని గన్గొనియె సౌవీర తరుణి

ఇట్లు కనుగొని యరి కాంత లెలమిఁ జెంది
విజయరాఘవ మేదినీ విభుని యంఘ్రి
బిరుదు పెండెంపు బొమ్మకా ప్రియులఁ గాంచి
వగతు రాత్మల నిట్టూర్పు నిగుడనీక

విజయరాఘవ నాయకుఁడు మాళవ. నేపాల, మగధ, సౌవీర, నృపతులను జయించి వారి భార్యలను తనకు పనికత్తెలుగా నియమించుకొనెను. ఆ రాజుల ప్రతిమలను పెండారమునందు చెక్కించుకొనెను. ఆ యా రాజకాంత లా యా రాజుల ప్రతిమలను అందె కాలను తొడుగు నెపమున పరికించి విలపించుచుందు రని యిందలి భావము. ఈ సంగతి యెంతవరకు నిజమో చరిత్రను పరిశీలింపవలసి యున్నది.

కాళయకవి రాజగోపాల విలాసము మొదటి నాలుగాశ్వాసములు సంభాషణా విధానమున నొక నాటకముగా కథను నడిపించెను. నాలుగాశ్వాసములు నెనిమిది రంగములు గావించెను. ఒక్కొక్క రంగమునందు నొక్కొక్క దేవేరి నొక్కొక్క శృంగార నాయికగా చేసెను. శ్రీకృష్ణుడు నాయకుడు. అతడు దక్షిణుడు. మొదటి రంగము రుక్మిణి యంతఃపుర సౌధము. అందు

జాళువా కుందనపుఁ దీవె చాలు పూచి
కలయ రాల్చిన యకరుల గమి యనంగ
పఱపు గల కుంకుమపుఁ బూవు పఱపు దనరఁ
జవికె టాకున మించు మంచమున

కూర్చున్నది రుక్మిణి, నీరజనాభుడా చేరువఁ బొంచి యుండెను. రుక్మిణి తనలో

ఏలా కొండెము వింటి ప్రాణ విభుతో నేలా చలం బూనితిన్
వేళల్ గా నలుగంగ నంచుఁ జెలియల్ వేమారు చాటింపఁగా
నేలా నే విననైతి నిట్టి వెతచే నేలాగు వేగింతు నిం
కే లీలన్ విభు వేడుదాన నని యెంతే వంతఁ జింతింపుచున్

చెలులు గనకుండ నేర్పునఁ జెలువ విభునిఁ
జిత్రపటమునఁ గస్తూరిచేత వ్రాసి
గబ్బి గుబ్బల తుదలు సోకంగఁ జేర్చి

నది.

కలలో నైనను నీదు మాటలకు నోఁగాదంచు మాటాడుటల్
గలవో? వాడల వాడలం దిరిగి రాఁగా నీకు మొండొడ్డుటల్
గలవో? చూచినవార లందఱు నగంగా నిన్ని విన్నాణముల్
గలవో? మానవతీ విలాస మకరాంకా! యింక నేమందురా!

ఏలాగు విహరింతు లీలా సరః ప్రాంత
కాంత నిశాకాంత కాంత సరణి
నేలాగు సైరింతు నేలాతి సౌరభ
భ్రమ జాతి విభ్రమ భ్రమర గీతి
నేలాగు వసియింతు నీలాశ్మ కృత వేశ్మ
జాల శీతల మరు జ్జాలకములు
నేలాగు చెవిఁ జేర్తు లోలామ్ర దళ వలత్
కలకంఠ కుల కంఠ కల రవంబు

నెటులఁ గనుగొందు నకట! పూర్ణేందు బింబ
సౌధ రసపూర రరిధౌత సౌధ యూధ
టంక ముఖ క్షప్త చిత్రవిటంక నీడ
చంచ చాంచల్యవ చ్ఛల చ్ఛంచు విహృతి

అని బహువిధముల విలపించినది. ఈ వరుసను పదిరెండు పద్యములు కాళయకవి రచించెను. అవి యన్నియు మిగుల రసవంతము లయినవి. రుక్మిణి స్వీయపాత్ర సామగ్రీ శీలార్జవ కోమల కమనీయ స్వీయ యని కావ్యాలంకారము. అందు అలుకచేత నధిపుని తెగడి అనుశయము చెందుచున్నది. కావున కలహాంతరిత యగును.

తలఁచ వైతివి కదా కల ధౌత మయ సౌధ
కలిత మన్మథ కథా కథన సరణు
లెన్న వైతివి కదా సన్నుత పున్నాగ
పారావ తారావ పరిచయములు
చూడవైతివి కదా క్రీడా గృహ క్రీడ
గూఢ గాఢ నవోపగూహనములు
తెలియవైతివి కదా దృఢ మాన మానస
ప్రమదార్థ శపథ సంభాషణములు

కొదను నెల నెలవంకల కొదలు దీర్చు
నభినవ నఖాంకములు గుబ్బలందు వెలయఁ

బ్రణయ బంధంబు వేఱైన పట్ల నిపుడు
మరచు టే వింత తొల్లింటి మమత లెల్ల

అని అనుకొనినది రుక్మిణి. పారిజాతాపహరణమునందు

కృతకాద్రి కందరా కేళీ నిగూహన
వేళా పరస్ప రాన్వేషణములు
పోషిత మాధవీ పున్నాగ పరిణయో
త్సవ కల్పి తానేక సంభ్రమములు.

అను పద్యమునకు పై పద్యము కొంచె మించుమించుగా నడకలో భావమునందును పోలి యున్నది. అక్కడక్కడ చెంగల్వ కాళికవి పోకడలు పారిజాతాపహరణమునందు కనిపించును. అందుమూలమున నంది తిమ్మనను చెంగల్వ కాళకవి యనుకరించె నని తలంచుటకు వీలులేదు. కవి తా నెంత స్వతంత్రించి కావ్యము వ్రాయ తలంచినను పూర్వ కవుల పోకడలు భావములు నందందు రాక మానవు. వానిని స్వతంత్రములుగా మెరుగులు దిద్దుటలో కవి చతురత యమరి యున్నది. ఆ నిపుణత కాళయ కవియందు కలదు. దానికి పై పద్యములు తార్కాణములు.

అట్లు పరితపించు చున్న రుక్మిణిని సమీపించినది చెలికత్తె యొకతె.

పలికిన మారు పల్కనని పంతము లాడితి వింత మాత్రమా
నిలిచిన వాని చెంతలనె నిల్వ నటంటివె యొంటి పాటునం
గలికిరో! నేడు చిత్రఫలకంబున నా భువనైక మోహనున్
సొలపున వ్రాసి వేండికొనఁ జూచినఁ జూచినవారు నవ్వరే

యని యెగతాళి చేసినది. రుక్మిణి మానవతి.

వినుము లతాంగి! యేఁ గొలుచు వేలుపు వేఁడితిఁ గాని నెమ్మదిం
గినుక దొలంగ వల్లభునిఁ గీర్తన సేయఁగ నీవు వింటివా?

యని సమాధానము చెప్పినది. అందు పాత్ర శీలార్జవములు వెల్లడి యగుచున్నవి. పిమ్మట శ్రీకృష్ణుడు ముందర నిలిచెను. రుక్మిణి

కోపము తీర్చెను. సరసకేళీ వినోదంబులందు సంతృప్తను గావించెను. అంతటితో ప్రథమాశ్వాస మంత మగును.

సంభాషణ రూపమున నాటకము వలె కథను నడిపించుటకు మొదట దారిని చూసినవాడు నన్నయ. దుష్యంతోపాఖ్యానము, యయాతి చరిత్రలం దా విధానము కనిపించును. అట్టి రచన హృదయాకర్షణీయముగా నుండును. ఆ దారి ననుసరించినవాడు తిక్కన. కీచకుని వృత్తాంత మొక నాటకరంగము గావించెను. ఉత్తర కుమారుని కథ విరాట పర్వములో మరొక నాటకరంగము. అందు వర్ణనలు సైతము సంభాషణలలో నిమిడ్చెను. ఆ పద్ధతిని కావ్యమునం దంతటను ప్రదర్శించినవాడు పింగళి సూరన. ప్రభావతీ ప్రద్యుమ్నమును దృశ్య రూపమయిన శ్రవ్య కావ్యముగా వ్రాసెను. దాని ననుసరించినవాడు చెంగల్వ కాళకవి. కాళయ తుదివరకు నా పద్ధతిని సమర్థింపలేక పోయినాడు. రుక్మిణీ కృష్ణుల రతీవినోదములు వర్ణనాత్మకములుగా నొనరించెను. ఆ విషయమున ముద్దు పళని సమర్థురాలు. రాధా మాధవ రతీ వినోదములు సంభాషణలలో స్ఫురింప చేసినది. ఆమె నెఱజాణ. ఆ నెఱజాణతనము కాళయ కవియందు లేదు.

వలుద గుబ్బల గోరువంక లేడవి రాధ!
యవి నీ వెఱుంగుదు వంబుజాక్ష
చక్కెర కెమ్మోవి నొక్కు లేడవి రాధ!
యవి నీ వెఱుంగుదు వమర వంద్య

ఇత్యాదిమైన రాధికా సాంత్వనములోని పద్యాదు లరయునది. దీనిని గురించి తిరుపతి కవుల సాహిత్య సమీక్షలో విపులముగా వివరించితిని.

భద్ర లక్షణల వృత్తాంతము ద్వితీయాశ్వాసమునందు కలదు. వీరిరువురను జారిణుల జాబితాలో కవి చేర్చెను. జారిణి యను శబ్దమునకు వ్యభిచారిణి యని యర్థము. లక్షణ రీత్యా జారిణి సామాన్య యగును. భద్రా లక్షణలు సామాన్యలు గారు. వారును స్వీయలే.

అంచు భద్ర కవి నిరూపణను బట్టి అభిసారిక యగును. శ్రీకృష్ణుడు విచిత్ర చిత్ర రాజి రాజిలు నొక సౌధ రాజమందు వెలలేని రత్నముల నెంతే వింతయౌ తిన్నెపై దూతి రాక మది నాకాంక్షించి కూర్చుండెను.

ఎల్ల గరితలు తన జాడ లెఱుంగ కుండ
జార భావంబు మదిఁ గోరు శౌరి కడకు
భద్ర చెంతకు పంపిన ప్రౌఢ దూతి

యరుదెంచెను. ఆమె 'స్వామీ! యెంచిన కార్యంబు సఫలమయ్యె. నెచట సంకేతమో యానతీయవలయు' నని యడిగినది. అందులకు శౌరి

కలికిరో! నీవు వచ్చు దనుకన్ సురపొన్నల పజ్జ గొజ్జగుల్
వలగొను తేట మంచు తెలి వాఁకల చెంతల మావి మోకలన్
మలకలుగాఁగ నల్లికొను మాధవికా లతికల్ మరందముల్
చిలికెడు పువ్వు చప్పరము చెంగటి యా పొదరింట నుండెదన్

అని సంకేతము తెలిపినాడు. ఆమె వెడలిపోయినది.

కాళయకవి సంస్కృత పదముల కూర్పుతో పద్యము నెంత మృదు మనోహరముగా నడిపించునో తెనుగు పదముల యల్లికలో కూడ నంత రమణీయముగా నడిపింపగల ప్రతిభావంతుడు. రెండు రకముల రచనలందు పద్యము శరవేగముతో పరుగెత్తును. ధారా శుద్ధి ప్రశంసింప తగినది. పై పద్యము నరయునది. ఒక యా పద్యమే కాదు అన్ని పద్యము లట్లే యున్నవి. వ్యర్థ పదములు వెతికినను కనిపించవు. పదముల కొరకు తడుములాట అంతకంటె కనిపించదు. ఇటువంటి రచనకు ముక్కు తిమ్మన చాల పేరుపొందెను. సత్యభామ

తన శృంగార వనంబులోన గిరి పొంతం జక్కఁగాఁ దీర్చి ది
ద్దిన పూఁదేనియ యేటి కాలువ దరిం జెంగల్వ పుష్పాళ్ళ నిం
చిన చంద్రోపల వేదిపై సరస గోష్ఠిన్ బోటియుం దాను

నుండిరి. అని పారిజాతాపహరణమునందు రంగ నిర్మాణము గావించెను. ఈ పద్యమునందు కంటె కాళయ పద్యమునందు జిగియు బిగియు కలదు. దూతి భద్రను చేరినది. ఆమెతో

సమయోచిత శృంగారము
సముచితముగఁ బూనవమ్మ సారసముఖి! నీ
రమణుఁడు నాతోఁ జెప్పిన
సమయస్థలిఁ జేర నిపుడె చనవలయుఁ జుమీ

అన్నది. ఇందుమూలమున భద్ర యభిసారిక యగును. ప్రియాభిసరణ శీలా అభిసారికా. కృత సంకేతం ప్రతి యా ప్రియ మభిసరతి సాఽభిసారికా ఇతి. కామార్తాఽభిసరే త్కాంతం సారయే ద్వాఽభిసారికా. కామార్తా సతీ యా కాంత మభిసరేత్ స్వయం అథవా అభిసారయేత్ ఇతి అభిసారికా. ప్రియుని గురించి సంకేత స్థలమునకు అనుసరించిపోవు యువతి అభిసారిక యగును. అందును

కోలము సాము లటంచుఁ గూడి రాకుండను
బాదాంగదమ్ములఁ బరిహరింపు
మొగిలి మొత్త మటంచు మూక సేయక యుండ
గీలు గంటునఁ జేర్పు మేలి ముసుఁగు
వెలఁది వెన్నెల యంచు వెంట రాకుండను
తళుకుఁ గన్నులఁ జూపు బెళకనీకు
మనుఁగుఁ జుట్టమటంచు నంటి రాకుండను
జన్నులఁ బయ్యెద జారనీకు
మనుచుఁ గైసేసి నవ చంద్రి కార్ద్రముగను
హంస కేకీ చకోర రథాంగ కులము
లనుసరింపక యుండ నుద్యానమునకు
నెలతఁ దోడ్కొని వచ్చెను నేర్పు మీఱ.

అనుటచేత భద్ర జ్యోత్స్నాభిసారిక యగును.

కాళయకవి జారిణి భద్ర యనుట యుచితము కాదు. నాయికలు స్వీయ, అన్య, సామాన్య భేదములచేత మూడు రకములు. అందు స్వీయ ముగ్ధ, మధ్య, ప్రౌఢ యని మూడు విధములు. మధ్యా ప్రౌఢలు మరల నొక్కొక్కటి ధీర, అధీర, ధీరాధీర భేదములచే త్రివిధములు. వారు జ్యేష్ఠ కనిష్ఠ యను భేదములచేత పంద్రెం డగుదురు. ముగ్ధతో కలిసి స్వీయ పదమూడు విధము లయినది. అందొక్కొక్క నాయిక స్వాధీనపతికాది అష్ట విధ శృంగార నాయికల భేదములచేత నూటనలుగు రగుదురు. కావున స్వీయయు నభిసారిక కావచ్చును. ఆమె జారిణి కాదు. కావున భద్ర కూడ స్వీయ యగును. ఒక్క రుక్మిణియే కాదు. శ్రీకృష్ణుని దేవేరు లందరు స్వీయలే యగుదురు. వారిలో భద్ర ప్రస్తుత కావ్య స్థితిని బట్టి జ్యోత్స్నాభిసారిక యను నుత్తమ శృంగార నాయిక యగును. జారిణి కాదు.

భద్ర రాయంచల యొయ్యారంపు నడకలు కలది. అందుమూలమున నామె కాలి యందెలు మరాళంపు రావముల నొనరించును. ఆమె నెఱికొప్పు మొగిలుల మొత్తమువలె నల్లగా నుండును. తళుకు బెళుకు చూపులు తెల్లని వెన్నెలను గాయుచుండును. చనుదోయి రథాంగములను బోలియుండు నని పైపద్యమునందు ప్రకరణాంతరమున వర్ణింపబడినది. గీతమునందు క్రమాలంకారము కలదు. ఒక విషయమును వర్ణించుచు నింకొక విషయమును కూడ పద్యమునందు స్ఫురింపచేయుట యుత్తమ కవుల లక్షణము. చేమకూర వేంకటకవి సౌధము మెట్లు నెక్కుచున్న చిత్రాంగి వర్ణనమునం దిట్టిభావ మిముడించెను. ఈ విషయ మచట విపులీకరించితిని. ఇంక లక్షణ విషయము

వారము నేడె యంచు యదు వల్లభు రాకను గోరి లక్షణా
సారస గంధి కేళి మణి సౌధము తాఁ గయుసేసి వేడుకన్
హార పదాంగద ప్రముఖ హారిణియై తపనీయ మందిర
ద్వారమునందు నిల్వ నొక వారిజ లోచన చేరి యిట్లనున్

అని యుండుటచేత లక్షణ వాసకసజ్జ యగును. ప్రియాగమన వేళ గృహముందనువు సవరించు నింతి వాసకసజ్జ. జారిణి లక్షణయనుట విచారణీయము. జాంబవతిని విప్రలబ్ధగాను, మిత్రవిందను ఖండిత గాను, సుదంతను విరహోత్కంఠితగాను, కాళిందిని ప్రోషితభర్తృక గాను, సత్యభామను స్వాధీనపతికగాను లక్షణముల ననుసరించి కాళయకవి కథలను నడిపించెను. ఐదవ ఆశ్వాసమునందు గోప్రళయుడు తప మొనరించుటయు హరి వానికి ప్రత్యక్ష మగుటయు

వారిజనాభ ! నీవు మును ద్వారకలోపల గోప గోపికా
వారము రుక్మిణీ ప్రముఖ వారిజ నేత్రలు సేవ సేయఁగా
వారిధి తీర శైల వన వాటికలన్ విహరించు నట్టి యా
మేరలు చంపకాటవి సమీపమునన్ మెఱయింపు మింపుగన్

అని వరం బడుగుటయు, హరి యందుల కంగీకరించుటయు, పదునెనిమిది పద్యములలో కలదు. తరువాత సౌరాష్ట్ర దేశాధిపతి కథయు హరిద్రా నది మహాత్మ్యము నున్నది. అందుండి యొక పద్యము

ఆభీర భీరూ కుచాద్రులతో నేఁడు
　　వియ్య మందెడు నట్టి వేడ్కఁ గలిగె
గోరూపవతి సురూపేక్షణములతో
　　సయ్యంబుఁ గావించు సౌఖ్య మబ్బె
వల్లవ వల్లవీ వదన పద్మములతో
　　నెయ్యంబు సవరించు నెనరుఁ గలిగె
ఘోష యోషామణీ కుంతలంబులతోడఁ
　　గలసి మెలంగు విఖ్యాతి యొదవె

　　ననుచు రంగత్తరంగ రథాంగ మీన
　　కమల శైవాల కల్హార గరిమ మెఱయఁ
　　దన రుచులు నెల్ల దిక్కులఁ దనర నలరు
　　ధర్మముల దొంతి యల హరిద్రా స్రవంతి.

కాళయకవి పద్యములు మృదులములగు పదముల కూర్పుతో మనో రంజకముగా నుండు ననుటలో సందేహము లేదు.

కావ్యమునకు శయ్య యొకటే ప్రధానము కాదు. అది యువతి మేన తాల్చు చీరవంటిది. కావ్యాంగనకు కథ శరీరము. అది చక్కని సన్నివేశములతోడను సంఘటనలతోడను సంభాషణల తోడను హృదయాహ్లాదకరముగా నుండవలయును.

రాజగోపాల విలాసమునందలి కథలో పాఠకు నాకర్షించు ఘట్టములుగాని సంభాషణలుగాని లేవు. పాడిన పాటలు, ఆడిన ఆటలు, ఎనిమిది మంది దేవేరులు నెనిమిదిమంది శృంగార నాయికలు. కథలో నూతనత్వము లేదు. అందము లేదు. అది యొక లక్ష్య గ్రంథముగా తయారయినది. కావ్యత్వముకొరకు ద్వారకా పురవర్ణ నాదులు చేర్చెను. అవి యతుకు పెట్టినట్టు లున్నవి.

కావ్యమునకు జీవము రసము. అది మనస్సు నుద్రేకింపచేయు భావములతో కూడి యుండవలయును. ఆ భావములు సముచితాలంకార సహితములయి నప్పుడు పాఠకుని చిత్తము త్తేజిత మొనరించి యానం దోత్తరంగితము గావించును. అట్టి క్రొత్త భావములు గాని యందమగు నలంకారములుగాని రాజగోపాల విలాసమునం దెచ్చటను గానరావు. శ్రీకృష్ణపాత్ర కావ్యమునకు దారసూత్రము. ఎనిమిదిమంది నాయికలను ఆట బొమ్మలుగా చేసి కృష్ణ సూత్రమునందు గుచ్చిపెట్టి నట్లున్నది కథా సరళి.

రాయంచ బంగారు జరీయంచుల పట్టు చేలమును సింగారించిన నిరుపేద యిల్లాలు వలె నున్నది కావ్యము. ఇది మహాకావ్యమని కాళయకవి నిర్దేశించెను. కాకి పిల్ల కాకికి ముద్దు.



# ముద్దుపళని

కాల చక్రము పరిభ్రమించినది. నాయక రాజుల పాలన మంతరించినది. తంజావూరు భోసల వంశీయులగు మహారాష్ట్ర విభుల కైవస మైనది. ఏకోజీ మహారాజు పరిపాలన మారంభించెను. ఆయనకు వెంకోజీ యను నామాంతరము కలదు. ఏకోజీ మహారాజునకు శహాజీ, శరభోజీ, తుక్కోజీ యను కుమారులు గలరు. తుక్కోజీ మహారాజు క్రీ. శ. 1729 మొదలు 1735 వరకు తంజావూరు రాజ్యమును పరిపాలించెను. తుక్కోజీకి తౌళజ మహారాజను పేరు కూడ కలదు. ఈయన నాయక రాజుల వలెనె పండితుడు. కవి. సంస్కృతము తమిళము తెనుగు నభ్యసించెను. ఆ భాషల యందు కావ్యములు రచించెను. తెనుగు భాషయందు 'రాజరంజనవిద్యావిలాసము' అను పేరుతో వేదాంత సంబంధమగు నాటకమును వ్రాసెను. అది సంస్కృతము నందలి ప్రబోధ చంద్రోదయమును పోలి యుండును. తౌళజ మహారాజు తరువాత ఆయన కుమారుడగు ప్రతాపసింహ మహారాజు రాజ్యమునకు వచ్చెను. ప్రతాపసింహ మహారాజు తండ్రివలె మిగుల విద్వాంసుడు. సంగీత సాహిత్య నాట్య కళా ప్రియుడు. కళాపోషకుడు. ఈ మహారాజును

ఏ రాజు కువలయం బెల్ల రంజిలఁ జేసి
    జైవాతృ కాఖ్య నిచ్చలుఁ దలిర్చు
నే కలాబాంధవుం డిలఁ దమాంబు లడంచి
    చక్ర ప్రమోదంబు సంఘటించు
నే ఘనుండు శరంబు లేవేళఁ గురియించి
    పరవాహినుల నెల్ల భంగ పఱచు
నే యీశుఁ డార్యానాయత్త మతిఁ గాంచి
    కీర్తింప సర్వజ్ఞ మూర్తి యాను

వాఁడు నృప మాత్రుఁడే రఘూద్వహా దయా ప్ర
వాహా వర్ధిత భోస లాన్వయ పయోధి
సోమ తోళజేంద్రుని తనూజుండు శ్రీ ప్ర
తాప సింహ క్షమాపాల తల్లజుండు.

తన యార్య నుత మహౌదార్య విస్ఫురణంబు
లేఖ్రదుఁ బండ్లిగిలింపఁ జేయఁ
తన రామ భక్తి ప్రధాన మానస శుద్ధి
నారదు వెలవెలఁ బారఁ జేయఁ
దన సర్వ విద్యావధాన మేధా స్ఫూర్తి
పన్న గేంద్రుని తలల్ వంపఁ జేయఁ
దన యభేద్య గభీర తానారత ఖ్యాతి
యంభోధి భంగ పాటొందఁ జేయ

నమర శీతాద్రి సేతు మధ్యావనీ త
లాంతర నిరంతర యశో విశాల భాస
మానభోసల తోళజ రాణ్మణి సుత ప్ర
తాప సింహేంద్ర మౌళి ప్రతాప హేళి.

అని యభినుతించినది ముద్దు పళని.

ఇందువలన ప్రతాప సింహ మహారాజు ప్రజారంజకు డనియు, పరాక్రమవంతుడనియు, పండిత పోషకుండనియు, రామభక్తి ప్రధాన మానసుండనియు, సర్వ విద్యావిధాన మేధా సంపన్నుం డనియు విశదమగుచున్నది.

ముద్దుపళని ప్రతాపసింహుని యాస్థాన విద్వాంసురాలు. ఆమె యసలు పేరు పళని. ముద్దు వంశ పరంపరాగత మయిన బిరుద నామము. పళని వేశ్య. వేశ్యయనినంత మాత్రముచేత కొందరికి నిరసన భావము కలుగవచ్చును. పాండిత్యమునకును, కులమునకును సంబంధము లేదు. నన్నయ వైదికి కావున భారతము వ్రాయలేదన వచ్చును. అసూయా పరులయి యక్కస్సు కొలంది యాడిపోసికొన

వచ్చును. కాని మహాదేవి యగు సరస్వతికి జాతిమత ద్వేషములు లేవు. సుకృత పరిశీలన మామె గుణము. పక్షపాతమున కామె చిత్తమునందు తావు లేదు.

బెంగుళూరు నాగరత్నము లోక విదితమైన గాయకురాలు. మహారాజు లామెను గౌరవించిరి. పండితులు వినుతించిరి. కవులు పద్యమాలికల నలంకరించిరి. ఆమె కంఠమెత్తిన చాలును. ఆ రాగాలాపమునకు కోయిలలు విస్తుపోవును. వీణలు వ్రేళ్ళు కరచును. ధనకోటి 'నీపాట కోటి ధన' మనిపించుకొనినది. ఆమె వేశ్య. గానము, నాట్యము వారి జన్మహక్కులు. వారిని కాదనినవారు లేరు.

స్వామి వివేకానందు నంతటివాడు వేశ్యయని గానమును తిరస్కరింప లేకపోయినాడు. ముఖే ముఖే సరస్వతి. విద్యను నిరాదరించుట సరస్వతిని తిరస్కరించుట. అట్టి వాని యందామె పెడమొగము పెట్టును. ఆ కారణముచేతనే రాజాధిరాజులు కుల మత భేదములు పాటింపక విద్వాంసులను పూజించిరి. విద్వాన్ సర్వత్ర పూజితః-ప్రతాపసింహ మహారాజు కళాపోషకుడు. పళని సంగీత సాహిత్య భరతశాస్త్రాది విద్యాపారంగతురాలు. వీరరాఘవ దేశిక సార్వభౌముని సన్నిధానమునందున్న విద్వజ్జనంబు

ఘటియింప నేర్తువు కవన జాతు లెటింగి
పలుకుల కల్కి వెల్వేలనఁ బాఱ
నీయఁగా నేరుతు విలఁ గోరిన వరాలు
నగరాజ సుకుమారి సగము గాఁగఁ
జెల్లింప నేర్తువు చెప్పిన రీతిగాఁ
గని ద్రౌపదీ సతి కాన కేఁగ
నటియింప నేర్తువు నవ రసంబుల నంటి
తగు రంభ యనిమిషత్వము వహింప

నని పళనిని వినుతించిరి. ఆమె రసవంతమగు కవితా పాటవమునకీ పద్యము మొదటి సాక్ష్యము. ఇందు శ్లేష జొనిపించి పద్యభావములో సారస్వత ప్రియుల చిత్త మూరించు రెండు మారంద బిందు

వులు చిందించినది ముద్దు పళని. మొదటి చివర పాదము లందంత పొగడ వలసిన దేదియు లేదు. వరహా యొక్క రూపాంతరము వరా. ఇది పూర్వకాలమునందలి బంగారు నాణెము. దీనికి బహు వచన'లు' వర్ణము చేర్చగా 'వరాలు' అగును. వరమునకు బహు వచన'లు' వర్ణము చేర్చి 'ము' వర్ణమునకు లోపము చేయగా పూర్వాచ్చునకు దీర్ఘమువచ్చి 'వరాలు' అని కూడ అగును. కోరిన వరము లీయ గలవని యర్థము. కోరిన వరహా లీయగలవని శ్లేష. ఇంక మూడవ పాదమునందు కానక+ఏగన్ = కాన కేగన్ = కనపడ కుండ పోవునట్లు అని యర్థము. కానకున్+ఏగన్ = కాన కేగన్ = అడవుల కేగునట్లు అని శ్లేష. ఈ శబ్దముల మీాద నిట్టి శ్లేషలు పూర్వ కవు లెవరు నిరూపించ లేదు. ఇది పళని యుపజ్ఞత ప్రకటించు చున్నది. గోదా దేవి తిరుప్పా వను ముప్పది పాశురములను విరచించి నది. వానిలో పది పాశురములను తెనిగించినది పళని. 'మార్గళి త్తింగళ్' అను పాశురము తెలిగించుచు

శ్రీనివాస గురుని తలఁచి చిత్తమునను ముద్దు పళని
పూని చేయు ద్రవిడ పాటలోని భావమై
చెలఁగి తెలియ వాణి తనదు జిహ్వా కొనను నిలిచి యిటులఁ
బలికెఁ దిరుప్పావు సప్తపది పదంబుగా

అని చెప్పుకొనినది. వీనిని పాడియు, నభినయించియు, మహారాజు మెప్పును పొందినది పళని. పూర్వపు తంజావూరు కవయిత్రులలో నభి నయము నేర్చిన వారెవరు లేరు. ఇంక సంగీతము పళనికి వంశ పరంపరగా లభించిన విద్య. ఈమె పితామహి తంజనాయకి.

వీణ వాయించెనా వివిధ చిత్రాద్భుత
ప్రతిమ లెల్లను తలల్ పరగ నూచు
తీవి నటించెనా దేవ లోకపు రంభ
కొంచక యాదల వంచు కొనును

గానంబు వినిపింపఁ బూనెనా యా మహా
గిరిరాజ మైనను గరఁగిపోవు
సభల మాటాడెనా చల్లగాఁ బన్నీరు
చిలికిన రీవను జెలువు మీఱు

నని దొరాదొర లెన్నఁగా ఘనత కెక్కెఁ
బ్రోడ చేడెలలో నీడు జోడు లేక
తత సుగుణ పేటి దివ్య సౌందర్య వాటి
యతను మదఘోటి తంజనాయకి వధూటి

ఇంట పుట్టిన విద్య ఒంట పట్టినది. పళని సంగీత నాట్య కళలందప్రతి మాన ప్రజ్ఞావంతురా లయినది. సాహిత్య మందుమా సరసంపు నడక తీరులు మహాకవులకు సైత మనుసరణీయములైనవి. తిరుపతి వేంకట కవులు లోకప్రసిద్ధులు. ఆధునిక సారస్వత యుగమున కాదికర్తలు. వారి శ్రవణానందమునందు పళని పద్యంపు నడక దారుల ననుకరించిన చోటులు పెక్కు గలవు.

పాడెనా గంధర్వ పాటలాధరల వీ
ణా నినాదంబు చిన్న తన మూను
ఆడెనా రంభా ముఖాప్సరో భామినీ
వర్గ మెల్లను దలల్ వంచుకొనును

ఈ పద్యమును పై దానితో సరిపోల్చుకొన వచ్చును. ఇంకొకటి

అధరామృతమ్ము నీవానితివో కృష్ణ
యది లేఁజిగురు వగరంతె రాధ
కఠిన స్తనము లెదఁ గలఁచితివో కృష్ణ
అవి లేఁత లికుచంబులంతె రాధ
లలితోరు లూరుల మెలఁచితివో కృష్ణ
అవి యనంటుల త్వక్కులంతె రాధ
లీలాంగములు కౌఁగిలించితివో కృష్ణ
అవి ననలత కూనలంతె రాధ

చతుర సమరతి సుఖ మొనర్చితివో కృష్ణ
నవ సమాగమమున సౌఖ్య మవునె రాధ
యుపరతుల నిన్నుఁ గూడెనేమోయి కృష్ణ
యా చమత్కృతి ముగ్ధ కెట్లబ్బు రాధ

ఇది యిళా సమాగమానంతరము రాధాకృష్ణుల యేకాంత కేళీ సంభాషణ.

లక్షణ నీరీతి లాలన చేయుదే
యన మంచిదానవే యనియె శౌరి
యా బోటిపై మనం బతికెనే యీ రీతి
నన లేదు లేదు లేదనియె శౌరి
యా యింతి కీ వింత లన్నియు నేర్పితే
యన వెఱ్ఱివాఁడనే యనియె శౌరి
యా నాతి కీ ప్రీతి యమరెనే నీ మీఁద
నన నించు మించుగా ననియె శౌరి

యా లలన యెన్నఁడేని నన్నడిగెనే య
టన్న నెఱుఁగునో యెఱుఁగదో యనియె శౌరి
చెప్పకుందువె నాతోడఁ జెప్పు వనిన
నబల! నీ కలయిక సాక్షి యనియె శౌరి

ఇది లక్షణతోడి సమాగ మానంతరము రాధా కృష్ణుల సంభాషణ. పై పద్యమును మనస్సునం దుంచుకొని యీ పద్యమును తిరుపతి కవులు రచించిరి. ఇద్దరూ యిద్దరే. ఒకరిని మించిన రసికు లింకొకరు. ఈ పద్యములను గురించి తిరుపతి కవుల సాహిత్య సమీక్షయందు ముచ్చటించితిని. రెండు పద్యములందు శ్రీకృష్ణుడు దక్షిణ నాయకుడు. రాధ పరకీయ, అందును ప్రౌఢ. ముగ్ధా ప్రౌఢల వివిధాంగ విభేదములను నిరూపించినది పళని. రాధ మానసిక తత్త్వమును వెలయించినారు తిరుపతి కవులు. ఇరువురు ప్రౌఢాసమాగమ సుఖములే వ్యంగ్య రూపమున నభివర్ణించిరి. వీనిని వ్యాఖ్యానింప వలయు

ననిన కొన్ని పుటలు నిండును. పళని యన్ని విధముల నతిప్రౌఢు రాలు. అనుభవముకల యంగనామణి. కావుననే

ఆశు కవిత్వంబు లల్లితేనే సరా
చిత్ర ప్రబంధముల్ సేయ వలదె
గోటి తోడను వీణె మీటితేనే సరా
కొంచక రా గ్గరఁగించ వలదె
పదచాళి రాగముల్ పాడితేనే సరా
హిత వొప్ప వర్ణంబు లెత్త వలదె
యల నాట్య భేదంబు లాడితేనే సరా
నవ రసంబుల నంటి నడువ వలదె

వింత వింతగ కలిసిన యంత సరియె
యెమ్మెకాని మనోభావ మెఱుఁగ వలదె

యని రాధ నోట ననిపించినది. పళని యిన్నిటియందు చతురురాలు. చతురురాలే కాదు ప్రజ్ఞావంతురాలు. తిరుపతి కవులంతటి వారామె కవితా రీతుల ననుకరించి రనినచో నామె ఘనత వేరే చెప్పవలసిన పనిలేదు. ఆమె సీసపద్యములలోని నాల్గు పాదములు తూచి నటుల సమానమగు తీరు నడక కలిగి యుండును. అది యొక విశిష్టమగు లక్షణము. శ్రీనాథుడు సీసమునకు పెట్టినది పేరు. ఆయన సీసము లొకొక్కప్పుడు సడలి పోవుచుండును. పళని వట్లు కాదు. చివరి గీత పద్యమునందు నా. తూకము సాగివచ్చును. పై పద్యములు పరిశీలింపవచ్చును.

పళని పద్యములలో దేశీయములకు వ్యావహారికములు పొదిగించి సమయానుకూలముగా వాడుచుండును. అవి పద్యమున కొక వింత యందము నొదవించును. జీవము ప్రతిష్ఠించును. తంజావూరు కవులలో గాని, విజయనగరపు కవులలోగాని యీ పద్ధతి యంతగా కనిపించదు. 'అశుకవిత్వంబు' అను పద్యములో నీ విధానము గోచరించును. 'దొరాదొరలు' అను పద మటువంటిదే. ఏ సందర్భమునం దెటువంటి యెంత ఊతపదమును వాడవలయునో పళని బాగుగా

నెరుంగును. ఆ యూతమునం దెట్టి సారస్య మిమిడియుండునో యూమెకు విశదముగా తెలియును. 'అతను మదఘోటి' యట తంజ నాయకి వధూటి. ఘోటి యను శబ్దము నుపయోగించుటవలన దృఢ మగు దేహ సౌష్టవము పుష్టికరములగు నవయవములు శ్రమను సహింపగల దార్ఢ్యత స్ఫురించును. ఆ యూ లక్షణములతో నా రూపము మనస్సునం దగుపించును. అంత్య ప్రాస లా పదమునకు మరింత బలిమి సంపాదించినవి. లోకమునందు బలిష్ఠమగు నంగ పుష్టిగల ప్రాయంపు టెంతులను గజ్జెల గుఱ్ఱమని వాడుట కలదు. ఇష్టే సాలంకృత యగు నిళను

గందవడిలోన దుమ్మాడి మంద గతుల
వచ్చె నెరితావి కళుల చాల్వాలగొనంగ
చిన్ని మరు దంతి

యని వర్ణించినది. సందర్భమునకు తగిన యుపమానము.

ఇళ శోభనపు పెండ్లికూతురు. కోరికలు పెల్లుబికి పట్టపగ్గ ములు లేక మేను పొంగారుచున్న యువతి. మదోద్రిక్తతచేత కన్ను మిన్నుగాన కెప్పుడెప్పుడా యని మనసులో దుబ్బిస లాడుచున్నది. ఆమె మరునిదంతికాక యేమగును. ఆమె ముగ్ధ కావున చిన్ని మరు దంతి. ఇట్టి మాన వానుభవమునం దున్న యుపమానములను వాడి రూపమును పాఠకుని హృదయమున కగుపించు నటుల చేయుటలో పళని యందవేసిన చేయి. తంజావూరు కవులలోగాని యితర కవు లలోగాని యీ ప్రతిభ లేదు. తన్ను గురించి 'మేటియై మీాతె నతను ఘోటి భవ్య వాగ్ధాటి శ్రీ ముద్దుపళని బోటి' యని చెప్పు కొనినది.

వేశ్యకు నంగ పుష్టి యవయవ పుష్టి యందము ప్రధానములు. ఆ మూడు ఆ ఘోటి యను పదములో స్ఫురించును. మరేపదము వాడినను ఆ రూపము గోచరించదు. పళని సంగీత సాహిత్య నాట్య కళాశాస్త్రములందు నిగ్గు తేరిన మహారసికురాలగు ప్రౌఢ యని

పై పద్యములవలన విశదమగుచున్నది. ఆమెను సరిగా నర్థము చేసి కొనినచో

చిన్ని వెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిఁ పుట్ట జంత్ర గాత్రముల జొల్లరఁగించు
విమల గాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబు లుంకువలు మాకు
గనక నగ సీమ కల్ప వృక్షముల నీడఁ

బచ్చరా చట్టు గమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గ సభలు
సాము గరిడీలు మాకు గోత్రామరేంద్ర!

అని చెప్పుకొనిన వరూధిని జ్ఞాపకమునకు వచ్చును. సాహిత్య విజ్ఞానము లేదు వరూధినికి. అంతకంటె ఒకా కెక్కువ చదివినది పళని. కావుననే ప్రతాపసింహ మహారాజు అనేక చామీక రాంబ రాభరణములతో నామెను బహూకరించినాడు. ఈ సంగతి యెత్తిచూపి కందుకూరు వీరేశలింగం పంతులుగారు అసూయ కొలంది పళని ప్రతాపసింహుని యుంపుడు కత్తె యని నిరూపించినారు. అది పొరపాటు. ఇట్టి పొరపాటులు వారి కవుల చరిత్రలో చాల కలవు. ఉంపుడుకత్తె కొసంగు చామీక రాంబ రాభరణములు బహుమానము లనిపించుకొనవు. ఆ సమానసమునం దుంపుడుకత్తె యని నిర్ణయించుటకు తగిన యధారము లేదు. పళని మాయ మర్మములు లేనిది. ఆమె కుల వృత్తియం దామెకు గౌర వాభిమానములు గలవు.

ముద మొప్పఁ దన గోము మోముఁ గాంచినవాఁడె
తేజమొందిన రాజరాజు గాఁగఁ
బ్రతి లేని తన కటి ప్రతిమఁ జెందినవాఁడె
తెరగొందు భూతలాధిపుఁడు గాఁగఁ
గొమ రొప్పఁ దన గబ్బి గుబ్బ లంటినవాఁడె
నిరుపమ దుర్గాధినేత గాఁగఁ
నలువు మీఱిన తన నాభి చేకొనువాఁడె
వైభ వోన్నత చక్రవర్తి గాఁగఁ

తెలఁగు కలిమియుఁ జెలిమియుఁ దెలివి గలిగి
కళయుఁ జెలువము తళుకును బెళుకు నళుకు
చెలువు గురికేడు వలపుల సొలపు మిగుల
మిగులు రామా వధూటియన్ సుగుణ పేటి

అని వర్ణించినది పళని. అవును. ఎవరి కుల వృత్తి వారికి ఘనము. ఈ పద్యమునందు చంద్రుని వంటి ముఖము. భూవలయమువంటి కటి, దుర్గములవంటి స్తనములు. చక్రమువంటి నాభి కలది రామావధూటి యని ప్రకరణాంతరమున వర్ణించినది. పళనిని గురించి

చెన్నొందు రంభ కాకున్న చో నుబ్రతాప
సింహేంద్రు పెంపును జెందనేల
ప్రతిలేని యల కల్ప లతిక గాకున్న చో
లలి ముద్దు లక్ష్మితోఁ బుట్ట నేల
తగు దివ్య సుగుణ రత్నంబు కాకున్న చో
ముత్యాలలో నుండి పొరల నేల
యిల సుగంధప్రద మిదియె కాకున్న చో
శ్రీనివాస ప్రాప్తిఁ జెలఁగ నేల

పేఁక గల చంద్రరేఖయె కాకయున్న
లలిత సకల కళా ప్రౌఢ వెలయ నేల

అని విద్వజ్జనులు పొగడిరి. ఇది తన్ను గురించి తాను చెప్పుకొనిన పద్యము. పళని కల్పనా శక్తి వినుతింప తగినది. రంభ అచ్చర. ఇంద్రుని కొలువునందు నాట్యకత్తె. మొదటి పాదమునందు ప్రతాప సింహు నింద్రునిగాను తన్ను రంభగాను చెప్పుకొనుటచేత ప్రతాప సింహుని యాస్థానమునందు రాజనర్తకినని చెప్పుకొనినది. పళనికి లక్ష్మియను చెల్లెలు కలదు. లక్ష్మితో బుట్టినది కావున కల్పలతికకు పోల్చుకొనినది. కల్పలత కోరికల నిచ్చును. పళనియు విద్వచ్ఛ్రేణిని ధనము లిచ్చి తనియించినది.

ఈయఁగా నేరుతు విలఁ గోరిన వరాలు
నగరాజు సుకుమారి సగము గాఁగ

అనియు

ఏనారి నీదారి నెలమి విద్వచ్ఛ్రేణిఁ
దనియించె నెద మెచ్చి ధనము లిచ్చి

అనియు విద్వజ్జనులు పొగడిరి పళనిని. ఆమె సుగుణములు గల రత్నము. అట్లు కానిచో ముత్యాలలో నుండి యేల పుట్టును. ముత్యము నవ రత్నములలో నొకటి. అట్టి ముత్యముల నుండి పళని జన్మించినది. ఆమెయు ముత్యమే. సుగుణములు గల రత్నము. పళని తండ్రి పేరు ముత్యాలు. ముత్యాలు కూతురని ధ్వని. తల్లి పేరు శ్రీపోటి. ఇంక నాల్గవ పాదము. సుగంధప్రద యనఁగా భూదేవి. 'గంధవతీ పృథివీ' యని. పళని భూదేవి. అట్లు కానిచో శ్రీనివాసుని ప్రాపించుట యెట్లు కలుగునని భావము. శ్రీనివాసు డనగా విష్ణువు. విష్ణువును సేవించుట యెట్లు కలుగునని యభి ప్రాయము.

పళని విష్ణుభక్తురాలు. వైష్ణవ మతావలంబకురాలు. శ్రీనివాసాచార్యులు పళనికి సాహిత్య విద్యా గురువు. పాశురములను తెనిగించుచు 'శ్రీనివాస గురునిఁ దలచి' యని చెప్పుకొనినది పళని. కావున శ్రీనివాసాచార్యులను సేవించుట యెట్లు కలుగునని యర్థాం

తరము. ఇంకొక విశేషముకూడ కలదు. శ్రీ యనగా సంపద. భూమి సకల సంపదల కునికిప ట్టయినది. 'వసుంధరా=భూమి' యని. పళని సకల సంపదలకు స్థాన మయినదని యర్థాంతరము. ఇటువంటి హృద యమున కాహ్లాదము కలిగించు భావములతో వ్యంగ్యములతోడను విచిత్ర కల్పనలతోడను పద్యములు రచించినవారు చేమకూర వేంకట కవి తరువాత తంజావూరు కవులలో మరెవ్వరు లేరు.

ఇట్టి పద్యములు పళని రచించిన రాధికా సాంత్వనము నందు పెక్కు గలవు. ఆమె పోకడలలో వినూతనత్వ మున్నది. శబ్దములలో మార్దవ మున్నది. రచనలో బిగు వున్నది. ఆమె విద్వాంసురాలు. పద్యములందు రంగాజమ్మ వలె గణ యతి ప్రాసలకు తడుముకొనుట గాని నిరర్థకములగు పదములను చొనిపించుటగాని కనిపించవు. ప్రబంధ మార్గములందు గడితేరిన నిపుణురాలు పళని. ఆమె శ్రీకృష్ణ భక్తురాలు. స్వప్నము నందు రాధా సహితుడయి శ్రీకృష్ణుడు పళనికి సాక్షాత్కరించెను.

చిన్ని కృష్ణుండ నే సాధు చిత్తమునకు
సమ్మతంబైన రాధికా సాంత్వనంబు
తగ నొనర్పు

మని యాన తిచ్చెను. తిరుమల వీరరాఘవాచార్యుల పాదము లాశ్ర యించిన యువతి పళని. ఆయన యనుమతిని పొంది కావ్యరచనకు పూనుకొనినది. తిరుమల వీరరాఘవాచార్యులవారు రాజగురువు. తాతాచార్యుల వంశములోనివాడు.

రాధికా సాంత్వనమైదాశ్వాసముల కావ్యము. అందు అయిదు వందల యెనుబది నాలుగు పద్యములు గలవు. ఈ కావ్యమునందు శ్రీకృష్ణుడు నాయకుడు. ఆయన దక్షిణుడు. బహు ప్రియాసదృశ శీలుడు. ప్రధాన నాయిక రాధ. ఆమె పరకీయ. ఇళ యుపనాయిక. అందును ముగ్ధ. ఇళ కుంభకుని కూతురు. కుంభకుడు మిథిలా నగర వాసి. జనకాధిపుని మన్ననలను పొందినవాడు. నందుని బావమరది.

యశోద యన్నగారు. ఆ కారణమున ఇళ శ్రీకృష్ణుని మేనమామ కూతురగును. కుంభకుని కూతురు నీళ యని నీలాసుందరీ పరిణయము చెప్పుచున్నది. ఆళ్వారులు విష్ణుభక్తులు. వారి ప్రబంధములందు నీళ శ్రీకృష్ణుని పట్టపు దేవేరి యని చెప్పబడినది. ఆండాళ్ళు 'తిరుప్పావై' యందు 'తూమణి మాడిత్తు' అను పాశురమున నీళ మేమమామ కూతురని పేర్కొనినది.

కులుకు తళుకు శయ్య నిద్ర గూరినట్టి మేనమామ
కూర్మి బిడ్డ గడియ తలుపు గొలుసు మలుపవే

అని యాంధ్రీకరణము.

నీలాదేవి పయోధరాద్రి నడుమ న్నిద్రించు శ్రీకృష్ణునిన్ "
అని బెంగుళూరు నాగరత్నముగారి యాంధ్రీకరణము.

నీళా తుఙ్గ స్తన గిరిత టీ సుప్త మద్బోధ్య కృష్ణం

అని దానికి మూలము. నీలకు ఇళ యను నామాంతర మున్నటుల గాని, కుంభకునకు నిళ యను కూతురున్నటులగాని, ద్రవిడ కథలందు కాని గ్రంథములందుగాని యెచ్చటను కనిపించలేదు. నీలకు ఇళ యని పేరు పళని కల్పించినదేమో యని తలంచవలసి యున్నది.

తేజరిల్లును బేరిళాదేవి యనఁగ
రాజగోపాలు పట్టంపు రాణి యగుచు

కాలనేమి యను రాక్షసుని కుమారులు ఆబోతులయి మిథిలా నగర మున జన్మించిరి. వారిని చంపి నీలను శ్రీకృష్ణుడు పరిణయ మాడి నట్లు నీలాసుందరీ పరిణయమునందు కూచిమంచి తిమ్మకవి రచించెను. రాధికా సాంత్వనమునందు

విడక దాదు లడుగులకు మడుగు లొత్తఁ
గను యశోదయు గారాబమునను జూడ
గరిమ నందుండు కన్నులఁ గప్పుకొనఁగ
రాధ పోషింపఁ దగు నిళా రాజవదన

యని పళని నుడివినది. ఇళ రాధ యొద్ద పెరుగుచున్నది. అప్పటి కామెకు పెండ్లియైనది. కాని పసిబాలిక. రాధ నందుని చెల్లులు. శ్రీకృష్ణుని మేనత్త. ఆమె

గురు కుచ కుంభము లుత్కఽధరము లాకున్న
    గోపాల కర ఘాతిఁ గొనఁగ నేల
కలికి వాల్గన్నులు కలువలు గాకున్న
    హరి చూపు కాంతిచే నలర నేల
తుల మించు మైదీగె యల మించుఁ గాకున్నఁ
    గృష్ణాంబుధరముతో నెనయ నేల
శ్రీపాద పద్మము ల్చిగురులు గాకున్న
    మాధవుచేఁ జెల్వా మంద నేల

యనుచు బుధ కోటి పొగడఁగాఁ దనరు కోటి
యన్నువుల మిన్న నందుని కన్నఁ జిన్న
వారిధర వేణి రాధికా కీర వాణి
ప్రబలును జెలంగ హరి ప్రాణపద మనంగ

ఈ పద్యము రాధికా సాంత్వనమునకు బీజము. రాధా మాధవుల యనురాగము బుధ కోటి పొగడుచుండునట. రాధికా సాంత్వన మతి భక్తి శృంగార కావ్యము. అందలి గూఢ మగు సత్యమును తెలిసి తెలియక విమర్శించువారి కిది యొక సమాధానము. బుధు లనగా దేవతలు, పండితులని యర్థము.

దేవతలు కూడ ప్రశంసింతు రట రాధా మాధవుల ప్రణయము. దానికి కారణము లేకపోలేదు. ఊర్ధ్వ లోకములందు గోలోక మొకటి కలదు. ఆ లోకమునందు కామధేనువు సంతానములు నివసించుచుండును. దాని కధిపతి శ్రీకృష్ణుడు. ఆయన పరతత్త్వము. త్రిమూర్తులు సకల దేవతలాయనను సేవించి యుందురు. శ్రీకృష్ణుని దేవేరి రాధ. ఆమె రాసము నుండి జన్మించిన ప్రకృతి దేవత. ఆమె రోమ కూపములనుండి గోపికలు గోపాలురు జన్మించిరి.

రాధకు శ్రీకృష్ణునియం దమితమగు ననురాగము కలదు. శ్రీధాముని శాప వశమున రాధ భూలోకమునందు జన్మింపవలసి వచ్చినది. దానికి శ్రీకృష్ణుని యాదేశము తోడయినది. ముందుగా వ్రేపల్లె యందు పుట్టినది రాధ. దేవ ఋషి బృందములు గోపికలై జన్మించిరి. ఈ సంగతి భాగవతమునందు లేదు. బ్రహ్మ వైవర్తక పురాణము నందు విపులముగా నున్నది. గర్గ భాగవతము నందున్నది. రాధా మాధవుల ప్రణయములోని రహస్యము దేవతలకు సువిదితము. కావున బుధ నుత మైనది.

రామానుజుడు విశిష్టాద్వైతమత కర్త. ఆయన 'తైల ధారా వత్ అవిచ్ఛిన్న స్మృతి సంతాన రూపా భక్తిః' అని శ్రీభాష్యము నందు నుడివెను. ధారా యను పదము తలక్రిందు చేసిన రాధా యైనది. శంకరాచార్యులు 'వశి' తలక్రిందు చేసిన 'శివ యగునని నుడివెను. తద్వత్ రాధా యైనదని వైష్ణవ ప్రతిపాదన. భాగవత తత్త్వము ఇది. కావున రాధ 'యవిచ్ఛిన్న స్మృతి సంతాన రూపా భక్తిః' అని తేలినది.

భక్తి స్వరూపురాలు రాధ. కావున పండితులకు రాధా మాధవ ప్రణయము వినుతిపాత్ర మయినది. ఈ రాధాకృష్ణ తత్త్వ మును మొదట బోధించినవాడు గౌరాంగ ప్రభువు. చైతన్యాదుల కంటె పూర్వీకుడు. ఆ భక్తియే రాధా మాధవుల యవిచ్ఛిన్న సంభోగ శృంగారముగా పరిణమించినది. అది పండితులకు విదితము. కావున వారు మెచ్చుకొందురు. వైష్ణవ తత్త్వ మెరుగనివారు పచ్చి శృంగార మందురు. ఈ రెంటిని కుదురు పరచి పళని 'బుధకోటి పొగడగా దనరు'నని వచించినది. తపస్సిద్ధుడైన దిగంబరుడు దారి వెంట పోవుచుండును. వానిని చూచి నవ నాగరికు లసహ్యించు కొందురు. స్త్రీలు సిగ్గుపడుదురు. వాని మనశ్శుద్ధి తెలిసిన తత్త్వ వేత్తలు వానిని పూజింతురు.

పళని భక్తి పరవశమున సమస్త ప్రపంచమును మరచి బాహ్యాంతరంగములందు నిరంతరము శ్రీకృష్ణుని తప్ప అన్యమును దర్శింపని మహావ్యక్తిగా రాధను తయారు చేసినది.

హరి యిదో నాదు లో వెలి నహర్నిశముం గనుపట్టు చుండెడిన్
విరహ మిదేలనో మిగుల వేదనఁ బెట్టు దురాగతంబునన్

అని రాధ తలంచినది. ఆమెకు శ్రీకృష్ణుడు పరమేశ్వరుడను బుద్ధి పరిపూర్ణముగా కలదు.

మును నిన్నుఁ గోరి చేరిన
దనుజాంగన ముక్కు పోయె ధర నని తెలియన్
విని కని వలచితి ననుచో
నిను దూరఁగ నేల నన్ను నే ననక హరీ!

ఇది రామావతారము నందలి కథ. రాధ కృష్ణునకు జ్ఞాపకము చేసినది. రాధా కృష్ణులు తోడు దొంగలు. ఒకరి సంగతి యొకరికి తెలియును.

అహాహ వితగాఁగ మీన కూర్మాది రూప
ములను దాల్చితి వెఱ్ఱినై ముద్దుగుమ్మ

యనినాడు శ్రీకృష్ణుడు రాధతో. ఇట్లు చెప్ప తలంచినచో రాధికా సాంత్వనమునందు చాల గలవు.

ముద్దుపళని శ్రీకృష్ణ భక్తురాలు. కృష్ణ తత్త్వమును బాగుగా నవగతము చేసికొనినది. అనుభవమునకు తెచ్చుకొనినది. రాధికా సాంత్వనము వ్రాసినది. ఆమెకు పూర్వము రాధామాధవ కవి రాధా మాధవ కావ్యమును రచించెను. వెలిదండ్ల వేంకటపతి రాధా మాధవ సంవాదమును వ్రాసెను. ఆ రెండు పళనికి నచ్చలేదు. నిజ మున కంతే యగును. అవి అచ్చ శృంగార రస ప్రధానములైన కావ్యములు. రాధికా సాంత్వనము భక్తిసమ్మిళితమగు శృంగారము ప్రధానమయిన కావ్యము. పళని శ్రీకృష్ణుని పరమాత్మునిగాను రాధను నిరవధికమగు భక్తి స్వరూపిణిగాను చిత్రించినది.

భక్తి రెండు విధములు. దాసభక్తి. మధుర భక్తి. అంబరీషాదులు ప్రదర్శించినది దాసభక్తి. గోపికలు ప్రదర్శించినది మధుర భక్తి. దానినే ఆళ్వారులును గోదాదేవియు ననుసరించిరి. దీనిని గురించి చివరి ప్రకరణమునందు విపులముగా చర్చింపబడును. 'తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణముఖ' అని చెప్పబడిన తొమ్మిది మార్గములు రెండింటను సమానములే యగును. ఆళ్వారులు విష్ణువును శ్రీకృష్ణునిగాను తాము గోపికలుగాను నిరూపించుకొని సేవించిరి. గోదాదేవియు నట్లే చేసినది. ఎంత యూహించుకొనినను ఆళువారు స్త్రీలు కాలేరు. గోదాదేవి స్వయముగా స్త్రీ. స్త్రీల హృదయము ననుభవము నామె కున్నది. కావున గోదాదేవి రచనలలో భక్తి రసము శృంగార సమాహితమయి మధుర రూపమున పరిణమించినది. అదియే మధుర భక్తి. నమ్మాళ్వారులు 'అవర్ పాల్ ముల ఇప్పాల్ ఇవర్ తలయిప్పాల్' అన్నారు. గోదాదేవిపాలు స్తనముల నుండి వచ్చినవి. ఆళ్వారుల పాలు తలనుండి వచ్చినవి. అవి స్వభావ జన్యములు. ఇవి యూహా జన్యములు. ఆమె రచనలో రసమున్నది వీరి రచనలలో రసములేదు, అని దాని భావము. మధుర భక్తి స్త్రీలకే చెల్లినది. అది శృంగార రస సమ్మిళితము. భక్తి పరిణామము చెందిన కొలంది శృంగారము స్థాయికి చేరుకొనును.

ముద్దుపళని వేశ్య కావున సిగ్గు విడిచి రాధికా సాంత్వన మంతయు పచ్చి శృంగారముతో నింపిన దని వీరేశలింగంగారు కవుల జీవితమునందు వ్రాసిరి. వారేకాదు చాలమంది యట్లే యనుట నేను వింటిని. వారికా మధుర భక్తి తత్త్వము తెలియదు. భాగవతమునందు పోతనగారు దశమస్కంధమున గోపికా వస్త్రాపహరణము, రాసక్రీడ మొదలగునవి వర్ణించిరి. అందు

చంచత్పల్లవ కోమల
కాంచన నవ రత్న ఘటిత కంకణ రుచిరో
దంచిత కర సంఛాదిత
పంచాయుధ గేహ లగుచుఁ బడతులు వరుసన్

పట్టినఁ గాని మనోవిభుఁ
బట్టఁగదా యంచు నొక్క బాలిక సఖి చే
పట్టుకొని చెప్పె ధైర్యము
పట్టెల్లను మరువిలెంకి పట్టుగ నధిపా!

ఇత్యాది పద్యములు రచించిరి. పోతన వేశ్యకాడు. పరమ భక్తుడు, అభిమానవంతుడు. భాగవతమువంటి దైవత గ్రంథములో నిట్టి పచ్చి శృంగారము వర్ణించెను. వాని నెవరు నిందించలేదు. నిందించినచో పరమ భాగవతులు 'నీకు భాగవత తత్త్వము తెలియదు. ఊరకుండుట మంచిది' అని సమాధానము చెప్పుదురు. ఇప్పటి కాలపు దృష్టితో పౌరాణిక కథలు విమర్శించిన యెడల నన్నియు పచ్చి శృంగారము లగును. భారత భాగవత రామాయణ కథలు అన్నియు రంకుపురాణము లగును. భారతీయ సంస్కృతి దూష్య మగును. కావున తత్త్వ మెరిగి విమర్శించుట యుత్తమము.

రాధికా సాంత్వనమునందు పళని వర్ణించినది భాగవతములోని గోపికల భక్తి వంటిది. రాధ గోపిక. ఆమెది మధుర భక్తి; పచ్చి శృంగారము కాదు. పచ్చి శృంగారమని యంగీకరించినను లాక్షణికులు శృంగార మొక రసముగా నిరూపించిరి. అది వియోగ శృంగారము, సంభోగ శృంగార మని రెండు రకములు. వానిని మూాల మట్టుగా వర్ణించినది పళని, ఎందరు వర్ణింపలేదు. కావ్యమునకు రసము జీవము. కావ్యమును చదువునపుడు కావ్య దృష్టితో చదువ వలయును. అట్లు చదువకుండుట పాఠకుని తప్పుగాని కవి తప్పుకాదు. అట్లు చదివినచో రాధికా సాంత్వనము శృంగార రసమునందు కోటికెక్కిన యుత్తమ గ్రంథమని తేలును. అట్టి గ్రంథములు మతమునుగాని మానవునిగాని పాడుచేయవు. పాఠకుని దృక్పథములో నున్నది. అగ్ని గృహ దహనములకొరకు కాదు పచనాద్యుపయోగముల కొరకు. కావ్యము లట్టివే యని గుర్తింపవలయును.

తిరుపతి కవులు శృంగార రస కావ్యములను నిందించు నవ నాగరికులను గురించి యిట్లు వ్రాసిరి. "ప్రపంచము శృంగార

మయము. అది లేనిది సకలము నీరస మగును. దాని ననుభవింప లేనివాడు నిష్ప్రయోజకుడు. రసికు డెవడు దానిని నిరసింపడు'' అని. అవును. ఆ మాట సత్యము. రసికుడు కానివాని జీవితము నిష్ప్రయోజనము. త్రిమూర్తులు శృంగార పురుషులు. అన్ని రసముల లోను శృంగార రసము ప్రధానము. శృంగారము నుండి సకల రసములు నుద్భవించుచున్నవని శృంగార ప్రకాశిక కారుని మతము. అట్టి శృంగార రసము సర్వజన శ్లాఘాపాత్ర మగుచున్నది. అది కావ్యగతమయి యానందాపాది యగుచున్నది. దానిని పచ్చి శృంగార మని నిరసించుట శోచనీయ మగు విషయము.

రాధ యిళకు సంగీత సాహిత్య నాట్యాభినయములు నేర్పినది. సకల విద్యా ప్రవీణురాలను గావించినది.

నలు గలఁదు జలక మార్చును
జలువలు గట్టించు షడ్రసాన్నము లుంచున్
చెలనాకు మడుపు లిచ్చును
గలికీ రమ్మనుచుఁ దీసి కవుఁగిటఁ జేర్చున్

సతి నిట్లు రాధికా మణి
సతతము గసుగందనీక చనువున మనిచెన్
రతి మగని తోఁటలోపల
లతకూనను బెంచి నటుల లలితముగాఁగన్

పళని రాధికా సాంత్వనమునం దుపయోగించిన పదజాలము సర్వజన సామాన్యమునకు తేలికగా నర్థమగు చుండును. పెద్దనాది పూర్వ కావ్య కవులందువలె తత్సమ సాంస్కృతిక పదములనుగాని, చేమకూర వేంకటకవి విజయరాఘవ నాయకుల వలె మిక్కుటముగా నచ్చ తెనుగు పదములనుగాని వాడలేదు. వాడుక యందున్న దేశీయములు వ్యావహారికములగు జాను తెనుగు పదములను కావ్యమునం దంతటను వాడుచు వచ్చెను. అందుమూలమున ప్రతి పద్యము చక్కగా నర్థమగు చుండును. పదముల పొందికలో గాని కూర్పులో గాని బిగువు సడలలేదు. అందు మనోహరములగు శ్లేషలు, అర్థాంతర

న్యాసములు, నుపమాలంకారములు పొదిగి పద్యమును మరింత యందచందములుగా రూపొందించినది. మచ్చునకు

కొమ్మ కటు యౌవన వసంత గుణ మెసంగఁ
దొలుతఁ గనుపట్టు బాల్య జాతులు తొలంగఁ
గరము చివురులు తోవ రెక్కఁ గడమ తావు
లొలుపు మీఱెను గోకిల స్వరము లొదవె

అరయఁ దన జోడు బయలాయె ననెడు వంత
చిత్తమున నాట నానాఁట జిక్కఁ గాను
మానహానికి సైతురే మహిని దలఁప
బట్ట కట్టిన బలు గుణవంతు లెల్ల

చిన్న పద్యములలో చక్కని యలంకారములు కూర్చుట పళనిలోని యొక విశేషమగు ప్రజ్ఞ. ఇట్టి ప్రజ్ఞ శ్రీనాథునియం దున్నది. హర విలాసమునందు

మాట లేటికిఁ జాలింపుమా తపంబు
హరునిఁ గూర్చి సరోజ పత్త్రాయతాక్షి
వధ్యు దివియంగఁ బాఁతిన వాఁడి కొఱ్ఱు
యూప సత్క్రియ కర్హమై యున్నె చెపుమ

నైషధమునందు

అధిక తరులైనఁ గాని దిశాధి పతులు
కౌతుకము నాకు నీ వంశ కథలయందు
దప్పి కొన్నట్టి వారి కా దప్పి తీర
సలిల పూరంబు హితవా యాజ్యంబు హితవా

ఇట్టి పద్యములు రచించెను. ఈ శక్తి తంజావూరు కవులలో నితరు లెవరియందును కనిపించదు. అది యొక ప్రతిభా విశేషము. ఇళ

శుభ దినమ్మున సప్తమ శుద్ధి కలిగి
చెలఁగు వేళను గుఱుమాపు చీరతోడ

సరస రుచిరాన్న భోజనోత్తరమునందు
నీడెఱుంగని చేడియ యీడు మీాతె

నట. ఇది మొదలు పది పద్యములలో దక్షిణ దేశాచారములను వెలయించుచు నప్పటి వేడుకల నొకటి వెంట నొకటిగా నన్నియు వర్ణించినది పళని. నాల్గవనాడు

తమ్మి గుమ్మితి దొరచేతి తలిరు టాకు
చికిలి బాకును తేజమాల్ చేసి నటుల

స్నాన మాడించినారట యిళను.

అవ్వగల చివ్వలకుఁ గాలు ద్రవ్వకొనుచు
మరుని పడివాగెపై గోవ మట్టు మనఁగ

ఇళను ముస్తీబు చేసినారు. ఆచ్ఛిక సమాసములను కల్పించుటయందు చేమకూర వేంకటకవి సిద్ధహస్తుఁడు. తరువాతి కవులలో నట్టి చతురత పళనియందు కనిపించును. పై పద్యములలోని సమాసములరయునది. శ్రీకృష్ణుని సైతము జలక మాడించిరి. తరువాత యిళామాధవుల శోభన సన్నాహము.

వలిపె చెంగావి పావడ కొసల్ బిగియించి
కుంకుమ పువ్వంచు కోక గట్టి
కలపంబు నెమ్మేన కలయంగ మేదించి
హావణిల్లు ముత్యాల రవికె తొడిగి
గేదంగి రేకులఁ గీల్జడ ఘటియించి
చంద్ర సూర్యాది భూషణము లుంచి
పొలుపు సంచపు రేకు బుక్కాము మైఁ జల్లి
కస్తూరి తిలకంబు సిస్తు పఱచి
గోవ జవ్వాజి మెడను గీల్కొల్పి జఘున
మునకు నగురు సాంబ్రాణి క్రొంబొగలు పట్టి
కనులఁ గాటుక రేకలు కదియఁ దీర్చి
రాధికామణి యిళకు నలంకరించె

జఘనమునకు నగరు సాంబ్రాణి క్రొంబొగలు పట్టినారట. ఈ యలవాటు కావ్యములం దెవ్వరు సూచించినవారు లేరు. పళని యొక్క తెయే తెలిపినది. ఆమె వేశ్య, రసికురాలు గడసరి, కావున అందలి విశిష్టత గుర్తింప గలిగినది. అది ప్రథమ సమాగమము. శ్రీకృష్ణుడు గడితేరిన శృంగార నాయకుడు. ఇళ లేఁబ్రాయంపు గోమలి. కావున నే యా క్రొంబొగలు పట్టుట. తరువాత యిళా మాధవుల శోభనము కావ్య పద్ధతిని వర్ణింపఁ బడినది. చివరి గీత పాదమునందు రకార లకారములకు యతి వాడబడినది. అది యంత అంగీకరింప తగినది కాదు, కాని యహోబల పండితుడు కొంతవర కంగీకరించెను. అది యీ విషయమునందు కాదని నా తలంపు. 'చలువలు కట్టించు మద్ర స్నానము లుంచున్' అని యాఖండ యతి వాడినది పళని. ఇట్టివి పూర్వకవుల కావ్యములం దందందు నరుదుగా కలవు. వేదండాదులం దివి చెల్లునని లాక్షణికులు. ఇవి తప్పులని నేను నిరూపించుట లేదు. ఆధునిక కవుల యుపయోగముకొరకు నిరూపించితిని.

పళని కళాచతురురాలు. కథా కల్పనయందు అందెవేసిన చేయి. ఇళా వృత్తాంతమును పళని సృష్టి చేసినది. ఇది కావ్యేతి వృత్తమునకు బిందువు. ఈ కథ రాధికా సాంత్వనములోని ఉత్తరకథ వ్యాప్తి చెందుటకు కారణభూతమైనది. రాధా మాధవమునందు కాని, రాధా మాధవ సంవాదమునందు కాని కథాకల్పనలో చమత్కారముగాని, కళా కౌశలముగాని లేదు. నూతనత్వము లేదు. పళని యిళ కథ నాధారముగా చేసికొని రాధా మాధవుల వియోగము, రాధ కోపము, కృష్ణుని సాంత్వనము, వియోగానంతర సంయోగము సృష్టించినది. రాధా మాధవ సంవాదమునందు శ్రీకృష్ణుడు మధుర కరగుటవలన రాధ వియోగ మనుభ వించినది. అది యంత రమణీయముగా లేదు. ఇళా మాధవులను కుంభకుడు శోభనానంతరము రాధ యనుమతిని బొంది మిథిలకు తీసికొని పోయినాడు. రాధ వియోగ తాప మనుభవించినది. ఇది స్వాభావ సిద్ధముగా నున్నది. దానికి తోడు చిలుక కొండెములు ఇళా

మాధవుల మీద కోపకారణములయినవి రాధకు. ఇంక చెప్పవలసిన దేమున్నది. మూలుగుచున్న నక్క తలమీద తాటికాయ పడినది. బాధ యినుమడించినది. పళని ముందుగా కథా విధానము నంతయు చక్కగా నాలోచించి కావ్య రచనకు పూనుకొనినది. నీలకు యిళ యను పేరు మార్చినది నీలాసుందరి పరిణయ గాథ తలంపునకు రాకుండ. అది కథకు క్రొత్తతనము నాపాదించినది. ఇళ రాధ యొద్ద పెరిగినట్లుల నుడివినది

హరిని గని రాధ యల యాట లాడుదాము
పడక టింటికి రమ్మని తోడరి పిల్వ
నాడ నేఁ గూడ వచ్చెద నను నిళయును
నవ్వి రాధికా మాధవుల్ రవ్వ సేయ

పళని మానసిక తత్త్వము బాగుగా నెరిగిన ప్రోడ. అందుకనే

వింత వింతగఁ గలిసిన యంత సరియె
యెమ్మొకాని మనోభావ మెఱుఁగ వలదె

అన్నది. ఇళ బాలిక. అమాయకురాలు. అప్పటికి లోక మెరుగదు. బాలికలు, బాలురు పెద్దవాళ్ళ వెంటఁ బడుట స్వభావము. ఆ స్వభావమును మదియం దుంచుకొని పళని యీ పద్యము వ్రాసినది. దీనిని చదువునపుడు ఇళ అమాయికతకు నవ్వు వచ్చును, కొంత హాస్యము. ఇట్టి చమత్కారములకు హాస్యమునకు తావు కల్పించుకొనినది పళని. ఇట్టి కల్పనచేత ఈ వరుస పద్యములన్నియు నవ్వు పుట్టించును. పళని కల్పనకు వహవ్వా యనిపించును. దానికి తోడు ఆమె వాడు వ్యావహారికములు సంభాషణలో నైసర్గిక సౌందర్యమును తెచ్చిపెట్టును. అందుమూలమున పద్యమాకర్షణీయముగా నుండును. ఆట లాడుదాము. నోచ్చినె, ముస్తాబు, నూకులు, బిత్తల, ఆవ త్రావిన జోక, హుషారు, దొరసాని, నా కోసరము, నేల రాచ కున్న–ఇత్యాదులు వందల కొలది కలవు. అవి కవితకు స్వభావతను

కలిగించును. రాధా మాధవ సంవాదమునందు తప్ప యింత వ్యావహారికముగా కవితను నడిపిన కవులు పూర్వమునం దెవరు లేరు.

తెనుగు కవితా వాహిని నన్నయ భారత కథాకాశమున మందాకినియై ప్రవహించినది. అది బుధావగాహన యోగ్యము. తిక్కన భారతంపు హిమాచలాగ్రములందు చేరి కవిసిద్ధులకు సంసేవన యోగ్యమయినది. తంజావూరు కవుల కావ్య కలాపములలో మలుపు తిరిగి పళని రాధికా సాంత్వనమునందు మైదాన ప్రదేశమున మర్మరారావములతో మురువులు కురిపించినది. సకల మానవులకు గమ్యమాన మయినది. రసానుభూతికి ప్రథమ ఘట్టమయినది. తిరుపతి కవులు సృజించిన కావ్య ప్రపంచమునందు పరవడులు త్రొక్కొని ముందునకు సాగినది. పళని కామ శాస్త్రోపాధ్యాయిని. స్వానుభవముగల రసికురాలు. కళా రహస్యము తెరిగినది. రంగాజమ్మ పళని వలె రసికురాలు ప్రౌఢయు కాదు. అనుభవ మున్నను అవగతము చేసికొను శక్తి లేదు. ఇతర కవుల యూహా గానములు అనుభవజ్ఞురాలయిన పళని ముందు పనికి రాలేదు. ఈ సంగతి ఆళ్వారుల వృత్తాంతమునందుమనవి చేసితిని.

పళని రాధికా సాంత్వనమునందు మూడురకముల సంభోగ శృంగారములను వర్ణించినది. ఒక దానితో నింకొక దానికి సంబంధము లేదు. వియోగ శృంగారమును సైతము రెండు రకములుగా వర్ణించినది పళని. తనకు ప్రియమైన వస్తువు నితరు లనుభవించుచున్నపుడు తాను పొందు పరితాప మొకటి. తా నసూయను పొందినపు డనుభవించు వియోగ తాపము రెండవది. ఇట్లు ఉత్తర కథ యందు సంభోగ వియోగ శృంగారములను వివిధ విధములందు పరిపూర్ణస్థితుల వర్ణించినది పళని. ఆమె సమగ్రముగా నుత్తీర్ణురాలయినది.

ఉసికొల్పి వంచించి దుసికిలు చను దోయి
చే నంట 'నమ్మ నొచ్చె నె' యనును
మొనసి యేమరఁ జేసి మోవాన గమకింప
వడి నుల్కి కర పల్లవములఁ గప్పు

నల్లందులకుఁ జొచ్చి యటు నీవి వదలింప
మిట్టి మీానై బెట్టు కొట్టుకాడు
విభుఁ డందుఁ జెనకి తా వికవిక నవ్వుచో
నటు గిరుక్కున మళ్ళి యలుక నించు

తను గురించినఁ గని తన కనులు మూయుఁ
గవకవల్ నించుచో వ్రేళ్లు చెవులఁ జొనుపు
కొను నిళా మానినియు ముగ్ధతనమునఁ బూని
రాజ గోపాల సంగమారంభ వేళ.

గొనకొను సిగ్గు మోహమును గూడఁగ నొక్కటి కొక్క టెక్కుడై
పెనఁగొనఁ గేలు మోముపయిఁ బెట్టుక మెల్లన వ్రేళ్ళ సందులం
గనుఁగవ రెప్ప లార్పక యెగాదిగ కన్గొను శౌరి వక్త్రమున్
మనసిజకేళి నైపుణిని మానక మానిని యప్పు డెంతయున్

ఇది ముగ్ధా సమాగమము. ఇళ చెయిదములు చాల స్వభావ సిద్ధముగా వర్ణించినది పళని. ఇట్లు వర్ణించినవా రెవరు లేరు. ఆ రేయి యంతయు పరితాపమున వేగినది రాధ.

సొమ్ము లియ్య వచ్చు సొమ్మంద మియవచ్చు
నియ్యరాని ప్రాణ మియ్య వచ్చు
తనదు విభుని వేరు తరుణి చేతికి నిచ్చి
తాళ వశమె యెట్టి దానికైన

అని తలంచినది. తెల్లవారుజామున శ్రీకృష్ణుని యొద్దకు వచ్చినది. తనలోని వంత నన్యాపదేశముగా శౌరికి తెలియచేసినది. అతడు నెఱజాణ

అది విని శౌరి రాధ కర మల్లనఁ బట్టి బిరాన చేసరాల్
గుదురుగఁ గంకణంబులునుగూడఁగ ఘల్లుమటంచు మ్రోయఁగాఁ
గదియఁగఁ దీసిన న్గలికి కాంతుని పేరెద

వ్రాలినది. వారు మత్తేభముల వితాన

కొసరు పల్కులఁ గ్రమ్మి గోటి కత్తులఁ జిమ్మి
కాసెలోఁ జెయివేసి కదియఁ దీసి
కన్నాత లాగించి కౌఁగిటఁ గదియించి
సరి బిత్తలల నెత్తి చనుల నొత్తి
యల్లందులకుఁ జొచ్చి కల్లమ్ములకు వచ్చి
మెఱుఁగుఁ జెక్కిలి గొట్టి కురులు పట్టి
తొడ కంబముల నాని తోపు నూకుల నూని
సందు చేసుక నొక్కి ముందు కెక్కి

యదలుపులు కీలుగొట్లు నెయ్యంపుఁ దిట్లు
గళ రవంబులు దుడుకులు చెలఁగ రాధ
మాధవుండును గడితేరి మారుసాము
హాయిగాఁ జేసి సరిగెల్పు లంది రపుడు

అవును ఇద్దరు తగినవారు. ఒకరిని మించినవా రొకరు. సమ యుజ్జీలు. కావున వారు సరి గెల్పు లొందిరి. అనుభవము మీద వర్ణించిన పద్యము. ఇట్లు ఎవరు వర్ణింపలేదు. ఇది ప్రౌఢా సమాగమము. శ్రీకృష్ణుడు మిథిల నుండి తిరిగి వచ్చినాడు. వానిని చూచినంతనె అసూయా కోపములు మరింత పెరిగినవి రాధకు.

అందపుఁ బైట కొంగు వదనాబ్జముపై నిడి శౌరి చూడనా
యిందునిభాస్య యేడ్చె నెలుగెత్తి కలస్వన మొప్ప వెక్కుచున్
సందగు గబ్బి గుబ్బలను జారెడు తన్నయ నాంబు పూరముల్
మందర మేరు శైలముల మాటికి బాలు ఝరంబులో యనన్

అని యుత్ప్రేక్షించినది. చనులు మందరము మేరువులట. సమ పీన స్తని రాధ. సంతోష సమయమునం దవి నిరంతరములయి యుబికి యుండును. 'ప్రాంచ ద్భూషణ బాహు మూల రుచితో పాలిండ్లు పొంగార' అని పెద్దనగా రందుకనే అన్నారు. దుఃఖసమయములం దవి వికాసము వీడి సడలు వారును. అందుమూలమున రెంటికి మధ్య అంతర మేర్పడును. కావున 'సందగు గబ్బి గుబ్బలు' అన్నది పళని.

పళని యనుభవము కల రసజ్ఞురాలు. ఇట్టి వింత సంగతులు రాధికా సాంత్వనమునందు పెక్కు నెలకొల్పినది. వానిని చదివి నపుడు నవ్వొ పొడమును. బాగు బాగనిపించును

హారి పేరురముఁ జూచినంతఁ జన్గుబ్బలు
సిగ్గు మాలుచు రైక చిటుల నుబ్బు

నట. ఎంత యనుభవము మీద చెప్పిన మాట? ఏమి వింతభావము. మోహము పెల్లుబికి నప్పుడు కళాస్థానములు విరివితనమును పొందును. ఈ సంగతి రసికుల కందరకు తెలిసినదే. దానిలో నిగూఢ భావము స్త్రీ గావున స్వానుభవము మీద తెలిసికొని పాఠకుని మనస్సునకు సూటిగా తగులునట్లు చెప్పగలిగినది పళని. అనుభవ మొక్కటే కావ్య రచనకు చాలదు. తూచినట్లు భావమును ప్రద ర్శింపగల శక్తియు నుండవలయును. అట్టి శక్తి పళనియం దమితముగా గలదు. అంతేకాదు. ఏ పదము నందెంత యావేగము నూత మున్నదో పళనికి తెలిసినట్లు తంజావూరు కవులలో నింకెవరికిని తెలి యదు. ఆమె పదములే వేరు.

చిలుక వజీరుఁ డత్తరిని జిందర వందరఁ జేతు నంచు నా
చిలుకల కొల్కి పైఁ గదిసి చివ్వలి రవ్వ లడంగ జాతి పెం
జిలుకు లకోరి కోల లటు చేఁదెను దుమ్మొద నారి మ్రోయఁగాఁ
గలికి మెఱుంగు గుబ్బలను ఖంగు ఖణేలు ఖచిక్కు రింగనన్

ఆ యనుకరణ ధ్వను లెంత సహజముగా నున్నవో పరిశీలింపఁదగును. ఈ యనుకరణ శబ్దములచేత స్తనముల గట్టితనము ప్రదర్శింప బడి నది. తగులగానే ఖంగున మ్రోగినవి. ఖణేలున గుచ్చుకొనినవి. ఖచిక్కుమని దిగబడినవి. రింగున గింగురెత్తించినవి. ఇట్టి వసంఖ్యా కములు గలవు. అవి యన్నియు చదివి తెలిసికొనవలసిన దేగాని వ్రాయుటకు చోటు చాలదు.

చెలి యటు లేద్వఁ జూచి హారి చేరి పదంబులు పట్టి కూర్మిచే
నెలతరో యేద్వ నేల నిను మించినవాఁడనె కోప మంతగాఁ

గలిగిన నన్నుఁ జేయఁగల కార్యము లన్నియుఁ జేసికొమ్ము నేఁ
దలఁపఁగ నీదు సొమ్మనుచుఁ దాఁ బలిమిం గొని కౌఁగలించినన్

అంతఁ బడంతి మైమరచె నంబుజ నాభుఁడు మోవి యాని నీ
మంతిని చెక్కు నొక్కి హరిమర్మము లంటె మిటారి ముద్దిడెన్
గాంతుఁడు గోట మీఁటెఁజెలి గన్గొనె వెన్నుడు నీవి విప్ప నా
కంతుని దంతి తారసిలెఁ గమ్మ వజీరుని పోరుకున్ వడిన్

ఇది సాంత్వనానంతరము రాధా సమాగమము. ఆ యా చెయ్దముల లోని తొందరపాటు ఈ పద్యమునం దరయ నగును. ఈ మూడును మూడు రకములుగా వర్ణించినది పళని. అనుభవమున్నగాని యిట్లు వర్ణించుట సాధ్యము కాదు. అనుభవ హీనమగు కైత రసవంతముగా నుండదు. కావున కవికి అనుభవ ముండవలయును. మిగిలిన ముద్దు ముచ్చటల సంగతి యిచ్చట ప్రసంగించవలసిన పని లేదు. ఇట్లు విపులముగా సంయోగ వియోగ శృంగారములను వర్ణించిన కవి యింకొకడు లేడు. ముక్కు తిమ్మన యీ కవయిత్రికి ఒరవడి పెట్టి నాడు. వాని చాయ లందందు గోచరించును.

కవి సౌందర్యోపాసకుడు. ప్రకృతిలోని యందమగు వస్తువును పరిశీలించును. దాని నవగాహనము గావించుకొనును. హృదయ గత మొనరించుకొనును. స్వానుభవమునకు తెచ్చుకొనును. తన ప్రతిభా శక్తిచేత దానికి వినూతనత్వ మాపాదించును. రస పుష్టి కల్పించును. మనోహరత చేకూర్చును. ప్రకృతికంటె భిన్నముగా దానిని తయారు చేయును. కవితా శిల్పమున తీర్పులు దిద్ది మెరుగులు తీర్చి కావ్యకళా స్వరూపమున ప్రతిష్ఠించును. అది యెంత ప్రగాఢముగా చిత్రించగలిగిన మానవ హృదయము నంత దరిదాపుల కది యాకర్షింపగలిగి యుండును. కవిత్వము లలిత కళా సమ్మేళనము. అందు కవి యొక మహా శిల్పి. సునిశితమగు తన బుద్ధిని వినియోగించి రూపకల్పనలు గావించును. అవి యుట్టి పాంచాలికలు కావు. వాని యందు ఉద్దీపన శక్తి యున్నది. చిత్తమును కరగించి భావోద్రేకము కలిగించును. వానికి మనస్సున్నది. మనస్సుతో మనస్సు నైక్యము

కావించుకొని సంభాషణమును సాగించును. హావ భావ విలాసాదుల చేత మేను మరపించును. తనలో విలీనము కావించుకొనును. ఆనంద పదవియందు విముగ్ధునిఁ గావించును.

కవి చిత్రకారుడు. ప్రకృతి చిత్రమును లిఖించును. దానిలో జీవము పోయును. అవి చిగురులు నిగుడించును. కమ్మ తావులతో పూలు పూయును. తుమ్మెదల రొదలతో శుక పిక శారికాదుల గీతాలాపములతో కనుల యెదుట సాక్షాత్కరించును. వహావ్వా యనిపించును. చల్లని పిల్ల తెమ్మెరలు మేన సోలయ నరమోడ్పు కనులతో స్వప్న లోకమునందు పాఠకుడు విహరించును.

తాళ లయాత్మకము గానము. అది ఛందో బద్ధము. మృదు మనోహర పద విన్యాసములతో వృత్త విపంచి శ్రుతులను సవరించి గీత మాలపించును. అది బ్రహ్మానంద పదవి. ఒక విచిత్రమగు వింత లోకమునందు దివ్య సుందరాకారముల నడుమ పాఠకుడు సమాధి నిష్ఠితుడయి సర్వము మరచిపోవును. కళాస్వరూపుండయి తనలో తాను నవ్వుకొనును. గొణుగుకొనును. పాడుకొనును. ఆడుకొనును. ఆనందించును. ఇది కావ్యలోకము.

గాథే జర్మను దేశ పండితుడు. కాళిదాసుని శకుంతలలోని శ్లోకములను పాడుచు నాట్యము చేసినాడు. ప్రపంచమును విస్మరించి చిందులు త్రొక్కినాడు. భార్య చకితురాలయినది. బంధు మిత్రులు పిచ్చి యెత్తినదని తలంచిరి. కళా ప్రభావ మటువంటిది. కళను కళా దృష్టితో పరిశీలించినప్పుడే యానంద మున్నది. అట్లు చూడక పోవుట పాఠకుని యవివేకము.

గులాబి సూనము విచ్చి వికాసము నొందినది. నెత్తావులు నలు వలంకుల నొలయించినది. దాని నొక నడిమి ప్రాయంపు యువతి చూచినది. పుణికి తలపై నుంచుకొన తలంచినది. భక్తుడవలోకించి నాడు. దేవ పూజకు తగినదని యూహించినాడు. వైద్యుని కంట పడినది. లేహ్యమున కుపయోగింప నెంచినాడు. ప్రకృతి శాస్త్ర జ్ఞుడు పరిశీలించినాడు. నిర్మాణ విధానము పరిశోధించుటకు ఆకర్ష

ణాది పత్రములను విదళింప యత్నించినాడు. కళారాధకుడు దాని సౌందర్యమును తనివితీర గంటల కొలంది విలోకించినాడు. దానిని హృదయ పీఠమునం దుంచుకొని గాన మొనరించినాడు. మానవ స్వభావమును బట్టి దృష్టి పరిశీలన ముండును.

కావ్యము ఒక యందమగు కళా ప్రపంచము. గాథే కళా రాధకుడు. శాకుంతలములోని శ్లోక చతుష్టయము లయాతాళ సహితముగా గానము చేసినాడు. రవివర్మ చిత్రకారుడు. శ్లోకానుగుణముగా శకుంతలా దుష్యంతులను చిత్రించినాడు. కవి రస పిపాసి. నాయికా నాయకులను రస స్వరూపులుగా నారాధించినాడు. శకుంతల వ్యభిచారిణి యన్న వారలు కూడ కలరు. రాధికా సాంత్వనమును కావ్యదృష్టితో పరిశీలించినచో మృదు మనోహర మగు పద గుంభనలతో రసపుష్టి కలదయి హృదయాకర్షణీయమగు కల్పనలతో కవులకు రమణీయముగా కనిపించును. సంకుచిత మానసులకు పచ్చి శృంగార మనిపించును. భక్తి తత్త్వమెరిగిన వారికి రాధికా సాంత్వనమునందు భక్తిరసము శృంగారంపు సన్నని తెర మరుంగుల నుండి తొణికిసలాడు చున్నటుల కనిపించును. రాధ వివాహిత. అత్త మామలు బావ మరుదులు తోడి కోడళ్ళు భర్త అన్న దమ్ములు కలది.

గోముఖ వ్యాఘ్రమై గుదిగొను మా యత్త
వదినగారికి మారు పలుక రాదు

అను పద్యముచేత విశదమగు చున్నది. వీరందరికి సున్నఁ బెట్టి తాను శ్రీకృష్ణునిఁ జేరినది. ఆమె శ్రీకృష్ణుని ఎత్తి పెంచినది. అప్పటి నుండియు నాతనియందు మరులు కొన్నది రాధ. దానికి ప్రధాన కారణము-శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుని యవతార మని యందరు గోపికలతో పాటామెయు నెఱుగును. తన యభిప్రాయమునం దామెకు దృఢవిశ్వాస మున్నది. వాని నా విధముగానే యారాధించినది. ఇళా సహితుండయి హరి మిథిలా నగరమున కరిగెను. వాని వియోగము సహింపలేక పోయినది రాధ. శ్రీకృష్ణుని తలంచు

కొని వాని ప్రత్యంగము నిరూపించుచు నాపాద మస్తకము వర్ణించి నది. అవి ముప్పది రెండు పద్యములు. ప్రతి పద్యమునందు భక్తి రసము వెల్లివిరియుచుండును. రాధ మాటెట్లున్నను పళని తానె రాధ ననుకొని యచంచల మగు చిత్తవృత్తితో నేక దీక్షగా శ్రీకృష్ణ పర తత్త్వమును హృదయమునం దుంచుకొని రసావేశమున ఆ పద్యములు విరచించి నటుల తోచును. అందు సందేహము లేదు. ఆ పదజాలము నట్లె యున్నది. అది యాళ్వారుల సాంప్రదాయము. వైష్ణవ మత ప్రసిద్ధము. ఆండాళ్ళు పాశురము లన్నియు నట్లు ప్రదర్శింప బడినవే. 'నాచ్చియార్, తిరుమొళి'యు దాదా పటువంటిదే. భక్తియందు గోదాదేవి పళనికి మార్గదర్శకురాలయినది.

కౌస్తుభంబుతోడఁ గనుపట్టు ఫణి రాజ
శాయి గళము శంఖమాయె ననుచుఁ
గనక పటముతోడఁ దనరు గోపాలక
స్వామి కటి యుగంబు చక్ర మయ్యె

ఇందలి యుపమానములగు శంఖ చక్రములు విష్ణు సామగ్రి.

ముజ్జగంబులు వెన్నని బొజ్జ నున్న
తెఱఁగు వివరించు దారి నాఁ ద్రివళు లమరుఁ
గదిసి వళి భంగములఁ దేలు కమల మనఁగ
నలువగుము లీను కృష్ణుని నాభి దనరు

ఇట్లు శ్రీకృష్ణుని విష్ణువుగా వర్ణించినది రాధ. ఆ కారణముననే రాధ నందనందనుని పొం దభిలషించి బాల ప్రాయముండియు చేర దీసి పెంచినది. అతడు దశావతార పురుషుండని రాధకు బాగుగా తెలియును.

మును నిన్నుఁ గోరి చేరిన
దను జాంగన ముక్కు పోయె ధర నని తెలియన్
విని కని వలచితి ననుచో
నిను దూఱఁగ నేల నన్ను నే ననక హరీ

యని నిందించినది. అందును హరీ యని సంబోధించుటచేత నందనం దనుడు నారాయణుడను భావనతో వరించి ప్రేమించి తన మాన ప్రాణము లర్పించిన దనక తప్పదు. దీనికి తోడు

విషకంధరు నెచ్చెలివై
విషకుచ చను బాలు గ్రోలి విషనిధి లోనన్
విషధరుపైఁ దగు నీదగు
విషమ గుణం బేల పోవు విషరుహ నయనా

అని శ్రీకృష్ణుని సమక్షమునందు వినుతి గర్భితముగా నిందించినది. అట్టి సకల లోకేశుడు తన వశమయి నప్పు డే యువతి తన సర్వ స్వము వాని వశము చేయకుండ గలదు. కావుననే రాధ

'హరి యిదో నాదు లో వెలి నహర్నిశముం గనుపట్టు చుండెడిన్

కనుఁగొన హరిమోము గనుఁగొననే కోరు
వీనులు హరి మాట వినఁగఁ గోరు
నాసిక హరి మేని వాసన ల్గొనఁ గోరు
నధరంబు హరి మోవి యానఁ గోరుఁ
జెక్కిలి హరి గోటి నొక్కు చెక్కులె కోరు
గుబ్బలు హరి ఱొమ్ముఁ గ్రుమ్మఁ గోరు
కరములు హరి నెంతొ కౌఁగలింపఁగఁ గోరు
మేను శ్రీహరి ప్రక్క మెలఁగఁ గోరు

నిన్ని యొక్కొక్కటే కోరు నిదిగొ నాదు
మనసు గోరెడి కోరికల్ మట్టులేవు
మర్మ మెందుకు మదన సామ్రాజ్య మిచ్చి
నెగడు హరియె యాయుర్దాయ మగుట శుకమ

యన్నది. ఇంతకంటె ఆత్మార్పణమే మున్నది. తన సకలావయవ ములు చిత్తము మానము హరి పరము కావించినది. తనకీ ప్రపంచ మున నొండేమియు వద్దనినది. భాగవతమునందు "కమలాక్షు నర్చించు కరములు కరములు" అను పద్యము స్మృతి పథమునం

దుంచుకొని యీ పద్యము పళని రచించినది. ఇంతకంటె భక్తికి పరమావధి లేదు.

శ్రీకృష్ణుడు గోపికల వస్త్రము లపహరించినాడు. కరము లెత్తి నాకు నమస్కరించి మీ మీ వస్త్రములు కొనిపొం డనినాడు. అచట ఆత్మాభిమానము వారి కడ్డము వచ్చి సిగ్గు తెరను కప్పినది. అది కూడ తొలంగి నపుడే భక్తి పరిపూర్ణత్వమును పొందును. అప్పుడే వారి కోరిక నెరవేరును. హరి ప్రసన్ను డగునని వైష్ణవ తత్త్వము. వైష్ణవ తత్త్వమే కాదు. శివతత్త్వము అంతే. "అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అని సర్వము హరి కర్పించిన గాని మోక్షప్రాప్తి లేదు. గజేంద్రుడు 'నీవే తప్ప యితః పరం బెరుగ' ననిన గాని హరి సంరక్షించ లేదు. ద్రౌపదికి హరి అక్షయ వస్త్రదాన మొనరించినదియు నా స్థితికి వచ్చిన తరువాతనే యని నమ్మాళ్వారులు వ్యాఖ్యానించిరి. వీరి నందరిని మించిన భక్తి రాధది. పళని యీ పాత్ర నట్లు తయారు చేసినది.

రాధా మాధవకవి వేంకటపతి కవుల కది చేత కాలేదు. వారి రాధ శృంగార నాయిక. పళని దిద్దిన నాయిక మధురభక్తి నాయిక. ఆమె రాధ మూలమున తన్ను శ్రీకృష్ణున కర్పించుకొనినది. తన్ను తా నర్పించుకొనుటయే కాదు. తాను ప్రేమించు ప్రతి వస్తువును పరమేశ్వరార్పణము గావించుట భక్తుని స్వభావము, రాధ యిళను అల్లారు ముద్దుగా బెంచినది. సకల కళా పారంగతురాలను గావించినది. మనసార ప్రేమించినది. ఇళను రాధ తన చేతులతో తాను నందనందనునకు పరిణయము కావించినది. వారిరువుర నొకటి చేసినది. ఇళ తన యనుభవమున కడ్డమయినది. మీదు మిక్కిలి "రాధికా మణిం దొరగు మటంచు వేడుకొనిన" దట. మాధవుడు 'సరె' యనినాడట. చిలుక వచ్చి రాధతో చెప్పినది. పళని స్త్రీ స్వభావము చక్కగా గుర్తించిన యువతి. తాను స్త్రీ. అనుభవము మీద నీ సందర్భమున నరువది పద్యములు వ్రాసినది. ప్రతి పద్యము నందు రసము చిప్పిలుచుండును. రాధ అక్కసు అసూయ కోపము

పరితాపము విషాదము నిండుకొని పద్యములు చదువు నవ్వు డొక విధముగా నవ్వ, రాధ యెడ జాలి, ఖేదము చుండును. ఇట్టి పద్య రచన పళనికే చెల్లినది. పళని కల్పనా శక్తి, కథలో నల్లిక తెరంగు నెంతవానికైన నబ్బురము కలిగించును.

ఇళ వృత్తాంతము రస పుష్టికొరకు కల్పించిన కథ. ముందుగా కథా నిర్మాణ విధానమును సరి చూచుకొని తరువాత రచనకు దిగినది. నిపుణురాలు పళని. కథా సంఘటనలను కల్పించుట యందు నెంత నిపుణురాలో రసవంతముగాను సర్వ జనాకర్షణీయముగాను పద్యము రచించుటయం దంత కంటె నిపుణురాలు. ఆమె వాడిన ప్రతి పదమునందు రసము తొణికిస లాడుచున్నది. తిరుపతి వేంకటేశ్వర కవుల శ్రవణానందము పాణిగృహీతలందు పళని దారులు, పోకడలు, పదములు దొరలాడిన వనిచో పళని రచన యెంత రమణీయమైనదో వేరే చెప్పనక్కర లేదు. మచ్చునకు

"వనజేక్షణ పలికె వలపు వడ్డికి పాటున్"
"ఔర శాబాసు మేలు బళారె బాగు
హాయి"

అని యేకదేశమునం దుద్రేకమును సూచించు పెక్కు ఆశ్చర్యార్థములు వాడుట పళని స్వార్జితము, వానిని తిరుపతి కవులు పుణికి పుచ్చుకొనిరి. భావములు పదములు చెప్పనక్కర లేదు. పళని మాత్రము సామాన్యురాలా? ఆమె రచనలో పరుల పోకడలు స్వంతము చేసికొన్నవి చాల కలవు. రాధ చిలుక మాటలు వినినది,

ఏమేమీ వెరపింత లేకయె యిళా హేమాంగి యిట్లాడెనే
యా మాటల్ విని మంచి దంచనియెనే యాధూర్త గోపాలుడున్
రామా! యట్లనె కాని మంచి పని రారాపేల యే మాయె నా
భామారత్నము గూడి తా సుఖముమై వర్ధిల్లినం జాలదే

అన్నది రాధ, రామా! విషాదార్థకము. పళని వైష్ణవత్వము ప్రదర్శించు చున్నది.

ఏమేమియీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యా మాట ల్చెవి యొగ్గి తా వినియెనా యా గోపికా వల్లభుం
డే మే మాడెను రుక్మిణీ సతియు నీ విం కేటికిన్ దాచెదే
నీ మోమోటలు మాని నీరజముఖీ నిక్కం బెఱిగింపవే

అన్నది సత్యభామ పారిజాతాపహరణములో. నందితిమ్మన గయ్యాళి తనములో ఆడవాళ్ళను చంపి పుట్టినాడు. ఎంత ప్రయత్నించినా ఆ గయ్యాళి గచ్చపొద తనము మరొకరి కబ్బదు. సత్యభామ నా విధముగా తయారు చేసినవారు తెనుగు సారస్వతమున నింకొకరు లేరు. అసలా మాటలు తమంత తాము ధారా వాహిక వలె పుట్టు కొని వచ్చినవి. పళని నిజమున కంతది కాకపోయినా, రాధ నా రక ముగా నే తయారు చేసినది. ఆమెలో భక్తి రసము నోడపోసి నింపి నది. తిమ్మన సత్యభామలో ఆ భక్తి లేదు. రోషాభిమానములు నిండిపోయినవి. భక్తికి తావు లేదు.

కీరవాణులచేతఁ గీళ్ళాకు లంపితే
శిరసా వహించు నో సరసిజాక్షి
నాతి యెవ్వత యైన నా మేర వేఁడితే
కను లెఱ్ఱఁ జేయు నో కంబుకంఠి
యెలమి నా కోసర మెంతవారల నైనఁ
దెగనాడఁ దలచు నో చిగురుఁబోఁడి
యేఁ జూచి చూడక యే మాటఁ జెప్పిన
జవదాట వెఱచు నో సన్నుతాంగి
యే పదార్థంబు లైన నా యెదుటఁ బెట్ట
కెవరికి నొసంగఁ బోవఁడో యిందువదన
చేరి యటు లున్న విభు డిట్లు చేసె నేని
తిరుగ బ్రతుకాడ వలెనటె శరదవేణి

అని రాధ.

కలలోన నైన నవ్వులకైన నా మాట
　　జవదాట వెఱచు నో చంద్రవదన
యే పదార్థంబు నా యెదుటఁ బెట్టక మున్న
　　యెవ్వారి కొసఁగఁడో యిగురుఁబోఁడి
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
　　లంచంబు లిచ్చునో చంచలాక్షి
తోడి చేడియలు నాతోడి వంతులకు రా
　　సయిరింపఁ జాలఁ డో సన్నుతాంగి

యరమరలు లేని కూరిమినవ్వఁగి పెనఁగి
కొదలు తీరని కోర్కులఁ గూడి మాడి
కపట మెఱుఁగని మమతలఁ గలసి మెలసి
యున్న విభుఁ డిట్లు నేయునే యో లతాంగి

యనినది సత్యభామ. ఇట్టి యనుకరణములు రాధికా సాంత్వనము నందు చాల కలవు. అరువుల సొమ్ము లయినను బరువుల చేటు కాలేదు. స్వకీయములలో కలిసిపోయినవి. పళని వాల్మీకి రామాయణాదులు చదివిన పండితురాలు

　　హారోపి నార్పితః కంఠే తవ విశ్లేష భీరునా

అను భావము పరిగ్రహించి

　　అలమి కౌఁగిటఁ జేర్ప నడ్డ మయ్యానని
　　　　హారంబు లొల్లఁ డో హంసగమన

మను సీసముగా పెంచినది.

　　　　నెఱతన ముడి గింటింటికిఁ
　　　　దిరుగుచు బతిమాలు హరికిఁ దెఱవలు కఱవా
　　　　తిరిపెం బెత్తెడు వానికిఁ
　　　　జెరుగుం గూడేమి భ్రాంతి విధుబింబ ముఖీ!

నందసుతుఁడు మున్ను నా మీఁది ప్రేమచే
నొకటి సేయఁ బోయి యొకటి సేయు
అత్త నెత్తిఁ జేతు లంగడిలోఁ గన్న
లాయె ననుచుఁ జెలియ లరసి నవ్వ

ఇట్టి లోకోక్తులు సందర్భాను సారముగా వాడుచు పళని రచన కొక యందము కొనితెచ్చినది. రాధ వియోగ గాధ రసవంతముగా నడిపినది పళని. భక్తపరాధీనుడు శ్రీహరి. గోవువెంటఁ దగులు కోడె భంగి భక్తుల వెంట తగిలి యుండును. మిథిలా నగరమునుండి తిరిగి వచ్చినాడు శ్రీకృష్ణుడు. ఈ సందర్భమున రాధా మాధవుల సంభాషణ చదువు నపుడు మిగుల నాహ్లాదకరముగా నుండును.

కావేటి కాల్వలై కడుఁ బారు కన్నీరు
వారక తుడిచెడి వారు లేక
విరహాగ్ని శిఖలచే వేగుఁచు బొరలాడ
నూరడిల్లు మనెడి వారు లేక
దిగులుచే నిలలేక తెగువ నేఁ జేయుచో
వల దని పలికెడి వారు లేక
మరుకోల లెద నాటి నెర కొట్టుకాడఁగా
భయపడ వలదను వారు లేక

కలఁగి మోహాబ్ధిలో మున్గి గాలి సోక
గట్టు గానక యుంటి నే గాసి పడెడి
నాటికే లేని మఱి నీవు నేఁటి కేల
చాల తడవాయె లెమ్ము గోపాలరాయ

ఇటువంటి మనసు కరిగించి జాలి గొలిపించు పద్యములు చాల కలవు. రాధ మాటలలో నిరాశ విషాదములు ధార పట్టి పోసినది పళని. ఆమె కవితయందు కళలయందు సిద్ధిపొందిన యువతి. ఆమె రచనలోని యందమును సరిగా గ్రహించినవారు తిరుపతి కవులు. వారి శ్రవణానందాది యుత్తమ ప్రబంధములు దానికి సాక్ష్యము.

వారు నిజమయిన కవులు. రస పిసాసువులు కళారాధకులు. రస వికాసము తెలియనివారు రాధికాసాంత్వనము పచ్చిశృంగార మని యవలకు త్రోయుదురుగాక. అది వారికి నపుంసకునకు రంభవలె ఆహ్లాదజనకము కాకపోవచ్చును. అది వారి దోషము. అంత మాత్రముచేత దాని గొప్పతనము నశింపదు. పంచ శుభం పంచా శుభం, తిక్కనను తిట్టినవారు గలరు. 'పళని సిగ్గు విడిచిన బోగంది' అన్నవారును గలరు. పరిశోధకులకు రాధికా సాంత్వనము నిగ్గుటద్దము.

అందు పళని కాలమునందలి సాంఘి కాచార వ్యవహారములు వస్త్రాలంకార ధారణములు పరిస్ఫుటముగా ప్రతిబింబముల వలె గోచరించును. రాధికా సాంత్వనమునందు పళని చిత్రించిన వ్రేపల్లె తంజావూరులోని వేశ్య వాటిక, కొంచె మించుమించుగా రఘునాథ రామాయణములోని వేశ్యవాటికా వర్ణనమును బోలి యున్నది. కాని పళని భాగవతము దశమస్కంధము త్తర భాగము 600 మొదలు 635 వరకు పద్యములు మనస్సునం దుంచుకొని వ్రాసినది. భోసల వంశీయులగు తంజావూరు మహారాష్ట్ర ప్రభువులు నాయక రాజుల వలెనె సంగీత సాహిత్య నాట్య కళా ప్రియులు. కావున ఆ కాలమునందు వేశ్య లా యా కళలను సాధన చేసిరి. వారిలో పళని ప్రముఖురాలయినది.

ఆశు కవిత్వంబు లల్లి తేనే సరా
చిత్ర ప్రబంధముల్ సేయ వలదె

అను పద్యము తన కంటె తక్కువ వానిని వెక్కిరించుచు పళని చెప్పిన పద్యము. లలిత కళలందు సంపూర్ణ పాండిత్యము సంపా దించుట వేశ్యలు ఘనముగా తలంచినట్టి దినము లవి. వేశ్యలే కాదు సంసారులకు నదే యభిప్రాయమయి యుండవచ్చును. ఆ నాటి యభ్యాసమే యిప్పటికిని దక్షిణ దేశమునందు అలవాటులో నున్నది. సంగీత నాట్య కళాభ్యాసము వారి కొక వేడుక. వీణ వాయించుట తంబుర మీటుచు గానము చేయుట పళని కాలమునందలి సంగీత సాధనము.

'మగరాల కంబాల నొగి యంత్ర పాంచాలి
కలు మీటు వీణెలఁ గులుకు రాగ
ముల సొక్కి తల యూచు'

"తంబుర మీటి గీతంబు పాడుచు నొక్క
మధురోష్ఠి సరిగమపధని యనఁగ"

యని వర్ణించినది పళని. రఘునాథ రాయల కాలమునం దున్నన్ని జంత్రములు పళని కాలమునం దున్నటుల తోఁచదు. నాట్య విద్య యందు సైతము వివిధ భేదము లంతరించినవి. దేశి గుజరాతి జక్కిణులు మాత్రము ప్రచారమునం దున్నవి. భరత నాట్యమునకు ప్రాధాన్యము లభించినది.

"గుజరాతి జక్కిణీ కోపులాడుచు నొక్క
భామిని జీవు సల్లా మనంగ"

"అల నాట్య భేదమ్ము లాడి తేనే సరా
నవరసంబుల నంటి నడువ వలదె"

అన్నది పళని. దీని మూలమున రసాభినయ భావ హస్తముద్రలతోడి భంగిమలు వర్ణింపబడిన భరత శాస్త్రము నభ్యసించిన వారికే ఘనత, గౌరవము ఆ దినములలో నాట్యమునందు కలదని స్ఫుటమగుచున్నది. ఇంక నాచార వ్యవహారములు పరిశీలించిన చో తెనుగు దేశమునకు దక్షిణమునకు చాల భేదము కనిపించుచున్నది. ఇళ వ్యక్తురాలయినది

చాన నిట్లుర పడకింటిలోని కనిచి
మొల్ల పూపాన్పుపై నత్తమిల్ల నునిచి
దగ్గరను నింబదళము బెత్తంబు నునిచి
యుగ్మలుల నందు జాగరం బుండఁ బనిచి

మాంత్రికులఁ బిల్చి యిలు చుట్టు మంత్ర యంత్ర
తంత్రములఁ గూర్చి నల్దెస లప్పిదారి

భూతముల నెందుఁ జొరనీక భూతిఁ జల్లి
కలికిఁ గాపాడెఁ గను రెప్ప గాచి నట్లు

వేడ్కఁ గావించి మరునాడు పిట్టుఁ బెట్టి
కలశముల నెత్తి సీమ సీమలకుఁ దనియఁ
బంచి పంచమ దినమునఁ బసుపు నూనె
యందరికిఁ బోసి చెలిని బెండ్లరుగు నుంచి

స్నాన మాడించినా రిళను. ఇది దక్షిణ దేశాచారము. ఈ యాచారములు తెలుగు దేశమునం దున్నటుల కనిపించవు. ఇంక ఇళా మాధవుల శోభనోత్సవము తాంబూల ఫల దానములు ముగిసినవి. ఇళా మాధవులు క్షీరాన్న మారగించిరి.

చలువ లెసంగు చప్పరపు జంత్రపు బొమ్మలు పావురంబులు
న్గిలకల మంచము న్విరులు నించిన సెజ్జయుఁ గీచు బుఱ్ఱయు
న్దలగడ దిండ్లు దోమ తెర తళ్కును డోలిక నిల్వు టద్దముల్
గల పడకింటి కేఁగి యట కంజవిలోచనుఁ డుండె నత్తరిన్

ఇది పడకింటి యలంకారము. కీచుబుఱ్ఱల తలగడలు నాయక రాజుల కాలమునుండి యుపయోగములోనికి వచ్చినవి.

వలిపె చెంగావి పావడ కొసల్ బిగియించి
కుంకుమ పూ వంచు కోక గట్టి
కలపంబు నెమ్మేనఁ గలయంగ మేదించి
హవణిల్లు ముత్యాల రవికె తొడిగి
గేదంగి రేకులఁ గీల్జడ ఘటియించి
చంద్ర సూర్యాది భూషణము లుంచి
పోలుపు సంచపు రేకు బుక్కాము మైఁ జల్లి
కస్తూరి తిలకంబు సిస్తు పరచి
గోర జవ్వాజి మెడను గీల్కొల్పి జఘన
మునకు సగురు సాంబ్రాణి క్రొంబొగలు పట్టి

కనులం గాటుక రేకలు కదియం దీర్చి
రాధికామణి యిళకు నలంకరించి

నది. బుక్కాము మైంజల్లుట, జఘనమునకు పొగలు పట్టుట, తెలుగు వారికి వింత యాచారము. ముత్యాల రవికెలు తొడుగుట ధనికుల యింటి యలవాటు. మొగలి మొల్ల సంపెంగపూల యుపయోగము, చోళరాజ్యమునం దధికముగా నలవాటులో నున్నటుల కనుపించు చున్నది. మల్లికాదుల విషయము తంజావూరు కవులు సూచించి నటుల కనిపించదు. కన్యలు త్వరగా వ్యక్తురాం డ్రగుటకు మందులు మాకులు వాడుట యొక యలవాటుగా నగుపించు చున్నది.

కలికి కన్నెరికంబు దొలంగం జెంచుల కెంతో
యిచ్చి తీసిన మందు లిచ్చు

చుండెడి దట రాధ యిళకు. ఇది వేశ్యల యలవా టని నా తలంపు. సంసారులందు నుండిన నుండవచ్చును. ఇట్టి వింత వింతలగు నల వాటులు రాధికా సాంత్వనమునం దచ్చటచ్చట కనిపించును. అవి యన్నియు గ్రంథ విస్తర భీతిచే నిచట నుడువలేదు.

పళని మానసికప్రవృత్తి రసోద్రేకము కలది. ఆమె యే రసమునం దైనను తేలికగా ప్రవేశింపగలదు. కవితావేశము పొంద గలదు. ఆమె చిత్తము నిరూఢమైనది. ఆ స్థితియందు గణ యతి ప్రాసలకొరకు తడుములాడు కొను నవసరము లేకుండ రసానుగుణము లగు పదములు యథాస్థితిగా వచ్చి వ్రాలుచుండును. అవి వ్యావ హారికము లయినను వైకృతము లయినను అన్య దేశీయములయినను గ్రామ్యములయినను పరిగణన లేదు. రసపుష్టి కలిగించిన చాలును. ఆ రసావేశ ముద్రేకించి నపుడు పదములు మరింత యూతము కల వయి కవితలో బిగువు హెచ్చుచుండును.

అల తంజ నాయకీమణి
కలిమియుం జెలిమియు గణింపగాం దర మగునే
తెలివో గెలివో వలపుల
చెలువం గెలువం దలంచుం జెలువముచేతన్

గోరుచేతనె కాదు సొరుచేతను గూడ
దారా వినోదంబు నాఱడించు

ఏబాల నీలీల నిటు దొరాదొరలచేఁ
బొగడొందె గడిదేటి పొలుపు మీఱి
తా నెత్తి పెంచఁగా దగు నిశాసతి మీద
వడినేల బలుకారు బారుచేసి
కురులు పట్టీడ్వకు గుట్టు దక్క దటంచు
చీకాకుగాఁ దీసి చిక్కు పఱచు

నిన్నుండే మానిసివై
నిన్నె వెలిసేయఁ బూనె నెలత భళారే

వదలితి చీర నా యెదుట నే బిత్తల
ననుఁ జూడఁబోకని నగితి వీవె

పై పద్య పాదములందలి తెలివో గెలివో, ఆఱడించు, దొరాదొరలు బారుచేసి, పట్టీడ్వకు, నిన్నుండే, చూడబోకని మొదలగు పదములే కాక తలకొట్లమారి ధాత, కొల్ల కొల్ల, కోటానుకోట్లు, జులుములు, జీవు సల్లాము, కందురు టీగ, బ్రతుకు బాగాయె, హుళక్కి, నొచ్చీను ఐతే, ఇటువంటి వ్యావహారిక పదములు పళని రాధికా సాంత్వనము నందు పెక్కు వాడినది. ఆమె జీవికయందు వలెనే భావములందును, రచనయందును స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కలది.

తారక లరుదెంచె మారుండు పథికులఁ
గూల్ప నించిన చిచ్చు గుండ్ల నంగ

తారకలను ఫిరంగి గుండ్లకు పోల్చినది రాధ.

వన చెండులను జెండు నాతి లేఁజనులకా
కలుకు గోటె ఫిరంగి నఱుకు లెల్ల

ఫిరంగి నరుకులట. ఇట్టి స్వతంత్రపుఁ బోకడలు నవీనములగు నుప మానములు అందందు కనిపించును. పళని యసలే 'యతను ఘోటి'

రసావేశమున అంతరంగ ముద్రేకించి నపుడు భావములు విజృంభించును. వానికి కట్టు త్రాళ్లుండవు. ఆ యుద్రేకము బ్రహ్మాకాశమును ముట్టినకాని సంతృప్తి నొంద నేరదు. ఆ స్థితియందు కవితావేశమును బొంది రచన కుపక్రమించుచుండును. కావున నే రసమునందైన నా యుద్రేకము కనిపించును. తదనుగుణములగు పదములు, భావములు పరంపరలుగా నుత్పన్నము లగును. చిలుక పలుకులను వినినది రాధ. ఆమెకు కోపము, అసూయ పట్టరానిదైనది. ఆ స్థితియందు లోకోక్తులు ఒకటి వెంట నొకటి సందర్భానుగుణముగా దొరలుకొనుచు వచ్చినవి. వాని జతపరచి వ్రాసిన పద్యములందా యుద్రేకము ఆవేశము కనిపించును. ఆ కవితా వాహినిలో లోకోక్తులు నిండార విచ్చిన చెంగలువలు నెత్తమ్ముల వలె నంద చందముల నొదవించినవి.

కాని పదరకు మీఁక మీఁద దాని మోము
గనఁగ వలదని శౌరిని గట్టిపెట్టి
బింకములు కూల నరకాలఁ బెట్టి నేల
రాచకున్నను నా పేరు రాధ కాదు

అన్నది. అది రాధ యుద్రేకము కాదు. పళని రసోద్రేకము. ఈ పద్యమును వ్రాయుచు పళని పండ్లు పటపట నూరినదేమో కూడ అనిపించును.

నిన్నుండే మానిసినైయె
నిన్నే వెలిసేయఁ బూనె నెలత భళారే
కొన్నంగడిలోపలనే
యన్నన్నా మాఱు బేర మగునే చెలియా
ఈక తోక లేని శ్రీకృష్ణు మాటలు
పొలతి నమ్మి నానఁ బోసికొనియెఁ
దగిలెనా తగులును దప్పెనా తప్పును
నాతి వెఱ్ఱివాని చేతి రాయి

అన్నియు వాడుక పదములు. చక్కఁగా నెదుట మాటలాడు చున్నటుల తోచును.

కవిత పళని చేతిలోని కీలుబొమ్మ యైనది. ఆమె తన భావాను గుణముగా నిష్టము వచ్చి నటుల నాడించినది. ఈ రకముగా కవితను స్వాధీనము చేసికొని రచన సాగించినవారు ప్రబంధ కర్తలలో కొలదిమంది మాత్రమే కనిపింతురు. ఆమె నిజముగా సిద్ధహస్తురాలు. ఆమె రసోద్రేకమే సంభోగ శృంగారమునందు కూడ తుది మెట్టువరకు నామెను తీసికొనిపోయినది. ఆ స్థితియందు తన యనుభవమును పద్య రూపమున చిత్రించినది. అందులో నామె కామ శాస్త్రోపాధ్యాయిని. కావున తారాశశాంక విజయము, వైజయంతీ విలాసాది శృంగార కావ్యములందు కంటె అతిశయత రాధికా సాంత్వనమునందు కనిపించును. అది యొకొక్కప్పుడు కొందరి 'కతి' అనిపించును. కవి మానస ప్రవృత్తికి ప్రతిబింబము కావ్యము. పళని అతను ఘోటి. ఆ యుద్రేకము శృంగారమునందును గనపరచినది.

కొసరు పల్కులఁ గ్రమ్మి గోటి కత్తులఁ జిమ్మి
కాసెలోఁ జెయి వేసి కదియఁ దీసి
కన్నాత లాగించి కౌఁగిటఁ గదియించి
సరి బిత్తలల నెత్తి చనుల నొత్తి
యల్లందులకుఁ జొచ్చి కల్లమ్ములకు వచ్చి
మెఱుఁగు చెక్కిలి గొట్టి కురులు పట్టి
తొడ కంబముల నాని తోపు నూకుల నూని
సందు చేసుక నొక్కి ముందు కెక్కి
యదలుపులు కీలుగొట్లు నెయ్యంపు తిట్లు
గళరవంబులు దుడుకులు చెలఁగ రాధ
మాధవుండును గడి తేరి మారు సాము
హాయిగాఁ జేసి సరిగెల్పు లంది రపుడు

రసావేశములో పళని చివరిమెట్టు వరకు దేనినయిన విపులముగా వర్ణించిన గాని తృప్తి నొందదు. ఆమె కనుభవ మెక్కువ. ఆ యనుభవము రస సిద్ధిని పొంది కవితా రూపమున రాధికా సాంత్వనమయినది.

౬

## రచనా వైలక్షణ్యము

కవి కాలముయొక్క ప్రతినిధి. వాని రచనలు కాల వాహినికి వ్యాఖ్యానములు. ఇతివృత్తములు మానసిక ప్రతిబింబములు. వర్ణనలు స్వరూప ప్రతిచ్ఛందములు. తెనుగు సాహితీ సముద్రయాన మొనరించు కవులకు నన్నయ ధ్రువ నక్షత్రము. అతడు సంహితాభ్యాసుడు. పురాణవేత్త భారతము తెనిగించెను. అది రాజరాజ నరేంద్రుని యాదేశము. అతడు అర్థ ధర్మ శాస్త్ర విదుడు. ఉదాత్త రసాన్విత కావ్య నాటక ప్రియుడు. ఆయన చిత్తవృత్తి నిరంతర మీశ్వరాగమములందు మోదించు చుండును. అప్పటి పండితులు సంస్కృత భాషోపాసకులు. వారి యడుగులకు మడుగులొత్తు దాసాను దాసులు మిగిలినవారు. ఇంకేమున్నది? గీర్వాణవాణి సగర్వముగా రొమ్ములు నిగిడించుకొని తెనుగు దేశమందెల్లెడల పచారు గావించి, లాక్షారుణములైన తన పాదముద్రలునిచినది. బ్రహ్మరథము పట్టించుకొనినది. రాజాధిరాజు మొదలుకొని సేవకుని వరకు మానవ లోకమంతయు నామెకు పాద పూజలొనరించినది. సభా భవనములందు మొదటి తాంబూల మామెది. కాక యేమగును! దేశ మంతయు నొక్కటే తీరు. వైదిక సంప్రదాయములు వెల్లివిరిసినవి. వైదిక మనగా వేద సంబంధ మని నాయభిప్రాయము.

తెలుగు మాట తలచినవారు లేరు. నూటికి కోటికి నొకరిద్దరున్నను వారి మాటంతగా పాటింపునకు రాదు. ఎవ్వరే గ్రంథము రచించినను సభల మెప్పు సంపాదింపవలయును. సభలలోని వారందరు సంస్కృత పండితులు. శాస్త్రవేత్తలు. వారు తలలూచిన గ్రంథము ప్రచారములోనికి వచ్చును. పెదిమె విరిచినచో నెంతటి రసవంతమగు కావ్యమైనను తలంపునకైన రాదు. తెలు

గనిన వారికి గిట్టదు. తెలుగొక భాష కాదనియు, తెనుగు సాహిత్య మొక సాహిత్యమేనా యనియు వారి తలంపు. అది యిప్పటి వరకు వేరులు పాతుకొని మ్రానులు కట్టి యూడలు దిగి సంస్కృత పండితుల చిత్త క్షేత్రము నాక్రమించు కొనిపోయినది. చీకటి మయము కావించినది. తెనుగు గడ్డపై పుట్టి, తెనుగు మాట్లాడుచు తెనుగును తెనుగు కవులను ద్వేషించుట వారి స్వభావమయినది. వారి చిత్త వృత్తి బాగుగా గ్రహించినాడు నన్నయ. ఆయన స్వస్థాన వేష భాషాభిమానములు కలవాడు. ఏమైన నేమి? వారు ఆమోదించినగాని భారతము శంఖతీర్థము కానేరదు. ఆలోచించినాడు ఉపాయము. శాస్త్రపండితులు శబ్దప్రియులు. అక్షరరమ్యత కమితానందము నొందుదురు. కాళిదాసాది మహాకవులు సైతము అట్టివారి కొరకు తమ కావ్యములలో అనుప్రాసాది శబ్దాలంకారములకు ప్రత్యేకముగా స్థానములను కల్పించిరి.

కవులు రస పిపాసువులు. సారస్యముగల రుచిరార్థ సంపదలందు వారి మనస్సు మోదించు చుండును. నన్నయ నానా రుచిరార్థ సూక్తినిధి. కావున,

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తి లో
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూ

క్తులతో భారతము తెనిగించినాడు నన్నయ. అవి ఆచ్ఛికములుగాని వైకృతములు గాని మైనచో పండితులకు నచ్చవు. కావున సాంస్కృతిక తత్సమ పదముల బాహుళ్యముతో అక్షర రమ్యత నెల కొల్పి కవిత నడిపించినాడు. ఇతరు లనగా పండితులని నన్నయగారి భావము. ఆ కారణముచేత నన్నయగారు తెనిగించిన భారత భాగములు దీర్ఘములగు సంస్కృత సమాసములతోను తత్సమముల తోడను నిండిపోయినవి. ఆయనకు కవితావేశము పెరిగిన కొలందియు సమాసములు పెరుగుచు వచ్చినవి. మాదిరికి

ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వార మదీయ బాహు పరివర్తిత చండ గదాభి ఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్ర రణాంతరంబునన్

ఇటువంటి పద్యములు ఘుమం ఘుమారావములతో గంగా వాహిని వలె దుముకులు పెట్టుచు విబుధ లోకమునకు నాహ్లాదము గొలిపించినవి. చిర పరిచయము మరువ రానిది. అది యెటువంటి వారినయిను దాసుల గావించుకొనును నన్నయ బాల్యాత్ ప్రభృతి సంస్కృతముతోడి సంబంధ బాంధవ్యములు కలవాడు. తెనుగు వాక్య రచనయందు సైతము "అగ్నులు విహరింపుము, ఇది నాకు తొల్లి వరింపబడిన భార్య. క్రచ్చర వేట వచ్చి, యయాతి కలిగి" ఇత్యాది వైదిక, సాంస్కృతిక సంప్రదాయములు చొరబడినవి. నన్నయ రచన కొక వింత వికాసము కలిగించినవి. ఈ రచనా విధానము నన్నయగారి కవిత కొక విశిష్టత్వమును ఆపాదించినది. సంస్కృత భాషాభిమానుల వినుతికి కారణ భూతమయినది. ఇట్లు నన్నయభట్టు ఆ కాలమునందలి పండితుల చిత్తమును తన వైపునకు మరలించుకొన గలిగెను. తాను రచించిన భారత భాగముల యెడ సభాసదుల యామోదమును పొందగలిగెను. నన్నయ తానువ్రాయుచున్నది తెనుగు భారత మను మాట మరచిపోలేదు. ప్రవాహమును దాట తలంచువాడు కొంత దూరము దానితోపా టీదుకొని పోవును. ప్రవాహమును తన వశము గావించుకొని దాట నుంకించును. అట్లే నన్నయ పండితుల చిత్తవృత్తిని తన రచనా విధానముచేత స్వాధీనము కావించుకొనెను. నడుమ నడుమ

అలిగి యాడు గఱచి యాకటి పెలుచన
నిలువ నోప కసుర నింగి దాకఁ
బెరిగి యరుగుదెంచె భీమ రూపంబుతో
నుగ్ర భంగి భీముఁ డున్న దెసకు

ప్రొద్దు నేఁడు పెద్దవోయె నిత్యము నిట
తెచ్చి యిచ్చు బలియుఁ దెచ్చి యీఁగ
నొల్ల కెలుఁగు లిచ్చుచున్నవాఁ డమ్మను
జాథముందు మెచ్చఁ డయ్యో యనుచు

ఇటువంటి పద్యములను చొనిపించుచు దేశీయమగు తెనుగు కవిత లోని తియ్యతనమును చవి చూపినాడు. తెనుగునందు వారికి గౌర వాభిమానములు కలిగించినాడు. తరువాతి కవులకు దారి చూపించి నాడు. దాని ననుగమించినవారు వీరశైవ కవులు. వారిది పౌరా ణిక మతము. ఆ చాయలు వారి రచనలలో కనిపించును. వారిలో మొదటివాడు పాల్కురికి సోమనాథుడు. ఆయన కాలమున తెలుగు దేశము సర్వ స్వాతంత్ర్యమైనది. మతాభిమానముతోపాటు దేశాభి మానము పెచ్చు పెరిగినది. ప్రభువులు తెలుగు దేశీయులు. దేశ భాష వైదిక సాంస్కృతిక సంప్రదాయ శృంఖలములను వదలించు కొని బైటపడినది. దేశీయములగు స్వతంత్ర రచనలు బయలుదేరి నవి. ఛందస్సు దేశీయము. భాష దేశీయమైనది. బసవ పురాణము, పండితారాధ్యచరిత్ర, ప్రభులింగ లీలలు మొదలగు గ్రంథములు వెలువడినవి. అందు

బండారి బలదేవ దండనాయకుఁడు
శివ భక్తునికిఁ బెండ్లి సేయుదు నన్న
ప్రవిమల మగు తొంటి బాస తలంచి
యిట్టి భక్తుని కీక యింక నా కూతు
నెట్టి వారికి మఱి నే నిత్తు నంచు
బసవ కుమారుని పాలికిఁ బోయి బ. పు.

సోమనాథుని గ్రంథములు ద్విపద చ్ఛందములో నున్నవి. తెనుగు సాహిత్యమునకు తెనుగుతనమును కల్పించినవాడు పాల్కురికి సోమ నాథుడు. వాని రచనలో దేశీయత తొణికిసలాడుచుండును. పూఁదేనియలోని తరితీపితనము ఉబికిసలాడుచుండును. కవిత సామాన్య మానవుల కందరకు నందుబాటులో నుండును. అందలి

యంద చందములు గ్రహించినవాడు తిక్కన. దానిని చంపువుగా రూపొందించి విరాట పర్వ మాది భారత కథా నాట్య రంగము మీఁది కెక్కించి లోకమునకు ప్రదర్శించినాడు. అది రసిక జనముల మనములు చూరగొనినది. కవిత లోకమున కాదరణీయ మైనది. మచ్చునకు

పలు పోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువ చందము
దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజవదనా! వి. ప.

తిక్కనయం దొక యపూర్వమగు శక్తి యున్నది. అది పూర్వ కవులలో నెవరికి లేదు. తాను చూచిన దానిని చూచినటుల కవితలో రూపొందించగలడు. అది తరువాత కవులందు అంతగా కనిపించదు. అది స్వయం సంభవము. ప్రయత్నించిన వచ్చునది కాదు.

అల్లదనంబున ననువు మైకొనఁ జూచు
నడపు కాంతికి వింత తొడవు గాఁగ
వెడ వెడ నూగారి వింతమై యేర్పడు
దేరని వళులలో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెరవుల కల మేర
నెల్లను బిగ్గి యెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁ గెక్కి
తారకంబులఁ గల్కి తనము దొడరఁ

జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపు చుండ నుత్తర చను దెంచె
నలరువిలుతు పువ్వు టమ్ము వోలె వి. ప.

ఇది యెల జవ్వాన మంకురించుచున్న యుత్తర రూప వర్ణనము. సంవత్సరము గడచినది. 'అడుగుల నును కాంతి'యను పద్యమునందు నర్తనశాల కరుగుచున్న యుత్తరను వర్ణించెను. అందు పరిపూర్ణ ములగు నంగ సౌందర్యములతో ప్రాయంపు దిట్టతనంబునం దున్న యుత్తర కనుల యెదుట కనిపించును. రెండు పద్యములలోని రూప కల్పనలు చక్కగా పరిశీలించి యనుభవమునకు తెచ్చుకొనిన వారికి తిక్కనగారి యూహా సామర్థ్యము, కల్పనా శక్తి, శిల్పరచనా నైపు ణ్యాము అవగత మగును. ఇట్టి ప్రతిభా చాతుర్యములు తెనుగు కవు లలో నెవరికి లేవు. ఆయన శిల్పకళా రచనకు జానగు దేశీయంపు తెనుగు పదముల కూర్పు మెరుగులు పెట్టినది. సంస్కృత తత్సమ పదము లెన్నిరకములు పొందుపరచినను ఆ రచనా సౌందర్యము రాదు. ఇట్టి రచనలో తిక్కన సిద్ధహస్తుడు. భారతకథా క్రమమున కీయన రచన వినూతనత్వ మాపాదించినది. ఇందు మూలమున తిక్కన కవిత అక్షరాస్యులగు సామాన్య మానవ సముదాయమునకు వినుతి పాత్ర మయినది. ఎచ్చటనో విబుధ లోకమునందు విహరించు చున్న భారత కవితా వాహినిని రస సిద్ధులగు మానవ లోకము నందలి కవుల కవగాహన యోగ్యమగునటుల హిమాలయశృంగము మీదికి తెచ్చినవాడు తిక్కన. వాని రచనలో శబ్దాలంకారములకు తావులేదు. వాని పద జాలము సహజ సుందరమైనది. దానికి వేరే బాహ్యాడంబర మక్కరలేదు.

తిక్కన ననుసరించినవాడు కేతన. అతడు దశకుమార చరి త్రమును రచించెను. పదునైదవ శతాబ్దాంతము వరకు మానవ చిత్తవృత్తులు పరమార్థము వైపునకు పరుగులు పెట్టినవి. దాదాపు కవులందరు పురాణములనో పురాణాంతర్గత భాగములనో తెనిగిం చుచు వచ్చిరి. ఇట్లనుటచేత స్వతంత్ర రచనలు కాని యితర రచ నలు కాని లేవని నా యభిప్రాయము కాదు. బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర, పల్నాటి వీరచరిత్ర–ఇత్యాదులు స్వతంత్ర కావ్యములు. పదునారవ శతాబ్దారంభము నుండియు ప్రబంధములు

విరివిగా బయలుదేరినవి. అప్పటినుండి ప్రబంధ యుగమని సారస్వత చరిత్రకారులు పేరు పెట్టిరి. శ్రీనాథుడు ప్రబంధ రచనకు దారి చూపె ననియు, నలసాని పెద్దన ఆది ప్రబంధకర్త యనియు వారి యూహ.

తెనుగు భాషయందు మొదట ప్రబంధ రచన గావించినవాడు నన్నెచోడుడు. అతడు చోళ వంశీయుడు. వీరశైవ మతస్థుడు. శివ పురాణములోని పార్వతీ పరిణయము నితివృత్తముగా తీసికొని కుమార సంభవ మను స్వతంత్ర కావ్యమును రచించెను. సంస్కృతమునందు కుమార సంభవమునకు దానికి నెట్టి సంబంధము లేదు. అతడు పండ్రెండవ శతాబ్దాదియందు నివసించి యుండెను. కావున ప్రబంధ రచనకు దారి చూపినవాడు నన్నెచోడుడు కాని శ్రీనాథుడు కాడు. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్రకు పాల్కురికి సోమనాథుని బసవపురాణాదులు మార్గదర్శికములు. మత వైషమ్యముల మాట యెట్లున్నను స్వతంత్రములగు ద్విపద కావ్యములను ప్రబంధములను విరచించి తెనుగు సారస్వతమునం దొక వినూతన మార్గమును కల్పించిన వారు వీరశైవులు.

నన్నెచోడుడు ఆది ప్రబంధ కర్త. కుమార సంభవము శృంగార కావ్యము. కాని యది వీర శైవ శృంగారము. సలక్షణమయిన చక్కని శృంగార రస ప్రబంధములు రచించిన వారు వైష్ణవులు. అది వారి మత సాంప్రదాయ సిద్ధమైన రసము. ఇంటఁ బుట్టి ఒంట జీర్ణించినది. దానిని వారు చక్కగా ననుభవించి యవగతము చేసికొని ప్రబంధరూపమున లోకమునకు పంచిపెట్టిరి. సద్యోవినిర్భిన్న సారంగ నాభికా హృతమైన మృగమదము పిసాళింపు, కసటువోబీటెండ కరగి కట్టుల నంటిన చొక్కపు జవాది కమ్మవలపు, పొరలెత్తి ఘనసార తరువులఁ దను దాన దొరగిన పచ్చకప్పురపు సిరముల ఘుమాయింపు. గొజ్జగి పూఁబొదలు గురియంగ బటికంపు దొనల నిండిన తుహిన జలములోని చలువతనము, వివిధ కుసుమ కదంబంబుల యంద చందములు, వారి కనుభవమునం దున్నఁయుల

మరెవ్వరికి నుండవు. ఇవి శృంగార ప్రియులకు నిత్యావసరములు. వానితోనే వారికి పనియున్నది. వారి యారాధ్య దైవము విష్ణువు.

ఆయన శివుని వంటివాడు కాడు. అచ్చ శృంగార పురుషుడు. గోపికా లోలుడు. ఆయన కీ సుగంధ ద్రవ్యములు కుసుమకదంబము లతో నిత్యము నవసరమున్నది. వానిని నర్పించువారు ఆయన భక్తులు. వారు గోపికామాత్రులయి యా పరమ పురుషునకు పన్నీట జలక మాడింతురు. మేన కలపముల లందుదురు. వస్త్రాలంకారముల నలవరింతురు. పూలమాలికల నలంకరింతురు. చూచి బ్రహ్మానంద మును బొందుదురు. తన్మయము వహింతురు. విష్ణువు పరమాత్ముడు. గోవు వెంటఁ దగులు కోడె భంగి వారియందు ఆయన క్రీడించు చుండును. వారికి కాక మరెవరికి శృంగార రసానుభవ ముండ గలదు. కావుననే యలసాని పెద్దన చక్కని శృంగార రస ప్రబంధము వ్రాయ గలిగినాడు. ఎవరికైన ననుభవ మున్నగాని రసావేశము కలుగదు. రసావేశ మున్నగాని భావము లుత్పన్నములు గావు. భావములు ఉత్పన్నములైనగాని కవిత నడువదు.

అలసాని పెద్దన శృంగార రసానుభవముగల కవి. కావుననే వరూధినీ ప్రవరుల సంభాషణ అంత రసవంతముగా చక్కని భావములతో వ్రాయగలిగినాడు. సంస్కృతమునందలి శుక రంభా సంవాదముకూడ అంత హృద యాహ్లాద కరముగా లేదు. తెనుగు సారస్వతమునందు మను చరిత్ర వంటి రసవంతమగు శృంగార కావ్య మింకొకటి పుట్టలేదు. అది తెనుగు ప్రబంధ ప్రపంచమునకు నేలిక సాని. ఆ కథా విధానమునందే యొక యపూర్వ విశేష మున్నది. నాయికా నాయకులు విరుద్ధ ప్రవృత్తులు గలవారు. వరూథిని కామ శాస్త్రోపాధ్యాయిని. గంధర్వాంగన. ప్రవరుడు వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుడు. మానవుడు. కవి వైదిక ప్రవృత్తికల శృంగార పురుషుడు. ఇంకేమి ఆయన లేఖిని ఇరు పక్షములందలి వాదములలో నమృతము ధార పట్టి పద్యములలో జార పోసినది. కవి తన కవితా శిల్ప రచన కనువగు కథ నెన్నుకొనుట

లోనే తెలివి యున్నది. అలసాని పెద్దనలో రూపకల్పనా చాతుర్య మున్నది.

ముడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె
మెగము తోలు కిరీటముగ ధరించి
కకపాల కేదార కటక ముద్రిత పాణిఁ
గుఱుచ లాతాముతోఁ గూర్చి పట్టి
యైణేయ మైన యొడ్డాణంబు లవణిచే
నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూట చ్ఛాయ నవఘళింపఁగఁ జాలు
బడుగు దేహమ్మున భస్మ మలఁది

మిట్ట యురమున నిడు యోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జల కుండికయును బూని
చేరెఁ దద్గేహ మాషధ సిద్ధు డొకఁడు.

అల్లసాని పెద్దన చక్కని కవితా శిల్పి. తిక్కనకు తీసిపోవువాడు కాడు. దేశీయములగు పదముల కాచ్ఛికములు వైకృతములు జత కూర్చి తత్సమముల పొందికతో రచన సాగించినాడు. ఆయనది ప్రబంధ కవిత్వము. మంచిబిగువు కలది. సంస్కృత సమా సములం దీ బిగువు వృత్త్యనుప్రాసలతో

ఉల్లల దలకా జల కణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మద బంభర
మల్ల ధ్వను లెసఁగ విసరె మరు దంకురముల్

ఇట్లు మరింత మనోరంజకముగా నుండును. మను చరిత్ర పరిపూర్ణ మగు ప్రబంధ లక్షణములు కలిగి శృంగార రస భావములతో తొణికిసలాడు నుత్తమ గ్రంథము. దాని కదే సాటి. తరువాత చెప్ప కొన తగినది పారిజాతాపహరణము. రెండు రెండు రకముల శృంగార

కావ్యములు. ఒకరి దారి నింకొక రనుసరించ లేదు. ఇద్దరు మహత్తర ప్రతిభాశక్తి కలవారు. తిక్కనాదుల దేశీయంపు రచనకు వ్యావహారికములను జోడించి కవితను

గట్టిన చేతలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేని పలు పోకల మాయలు నీకు వెన్నతోఁ
బెట్టిన వౌటెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడి పోయితి నేమి చేయుదున్

అని యిట్లు మానస హృదయంబునకు మరింత దగ్గరకు తెచ్చినవాడు నంది తిమ్మన. ఈ మహాకవి రచనలో కవితా వాహిని హిమాలయ ప్రదేశములను చూరవిడిచి దిగువ భూములకు దిగి వచ్చినది. దానిని సర్వ మానవుల కనుభవ యోగ్యముగా నుండు నటుల మలుపు త్రిప్పినాడు రఘునాథ నాయకుడు. వీని రచనలో పూర్వ కవుల ముమ్మరంబులగు సంస్కృత సమాసముల యాడంబరంపు వాద్య ఘోషములను దిగవిడిచి, తెనుగు కవిత, తెనుగు తనమును అలవరచు కొనినది. వ్యావహారికము లయిన వాడుక పదముల పొందికతో నిసర్గమైన మృదుత్వమును వహించినది. దానికి మాండలికము లయిన దేశీయ పదములు మరింత పుష్టిని కల్పించినవి. అందుమూలమున రఘునాథ నాయకుని రచన చదువువారికి తేలికగా నర్థమగును. చదివిన కొలంది ఇంకను చదువ వలయు నను బుద్ధి ముందునకు తరుముకొని పోవుచుండును. అన్వయము కొరకు గాని భావముల కొరకు గాని వెనుకకు తడుముకొన వలసిన పని లేదు. ఆ రచనా విధానమునకు పదముల పొందిక మరింత శోభను తెచ్చినది. మచ్చునకు

మినుకు మినుకున నొకనాడు మెఱుపుఁ గనము
గగనమున నెందుఁ జేటంత మొగులు లేదు
చినుకు బంగార మయ్యె నే మనఁగఁ దూర్పు
గాడ్పు నొక్కింత మెదల దే కారణంబొ.

కొండల వలె గోద మొగు
ల్గొండొండఁ బ్రభాత వేళ నుదయించి క్షణం
బుండి యడంగెడు మఱి వెలి
యెండలు గాయంగఁ దొడఁగె నేమన నింకన్.

అని తలంచినాడు రోమపాద నృపతి. చేటంత మొగులు, చినుకు బంగార మయ్యె, గోద మొగుళ్ళు, వెలియెండ, చక్కని వ్యావహారిక దేశీయములు.

ఎంత దూరంబు మీ వన మిచటి కనిన
దూర మేడది గడియెడు త్రోవ యింతె
వనముఁ గనుఁగొని పండ్లు తేవచ్చు నొడలు
కదల కుండంగఁ దొడుక పోయెదము నిన్ను

అన్నారు వేశ్యలు ఋష్యశృంగునితో. దూర మేడది, గడియెడు త్రోవ, ఒడలు కదలకుండ దొడుక పోయెదము. ఇవి ఎంత చక్కని వ్యావహారికములు. మాటలాడు చున్నటులనే యున్నది. చిన్న చిన్న వాక్యములతో పద్య రచన గావించుట రఘునాథ నాయకుని కవితలో నొక ప్రత్యేకత. అది తిక్కగారి పద్ధతి. మచ్చునకు

ఇదియ నిశ్చయ మిమ్మాట వదల కుండు
మనిన నీ వొక్కరుండవ యరుగు దేర
వలయు లేకున్న నయ్యెడ నిలుచుదానఁ
గానుజూ నిక్కువం బని పూని పలికి

నన్నయ పద్యమంతయు నొక్క వాక్యముగా నడుచును. అది పండిత సంప్రదాయము. ఇది కవి సంప్రదాయము. కాళిదాసు మహాకవి, ఆయన శ్లోకములన్నియు దాదాపు చిన్న చిన్న వాక్యముల పొందిక కలిగి యుండును. పదము లన్నియు తేలికగా నుండును. ఉదాహరణ

మానుషీషు కథంవా స్యా దస్య రూపస్య సంభవః
న ప్రభా తరలం జ్యోతి రుదేతి వసుధా తలాత్

అన్ని శ్లోకము లిట్లే యుండును. అది యా మహాకవి రచనలోని విశిష్టత. దాని యంద మనుభవమునకు తెచ్చుకొనినవాడు తిక్కన. ఆయనను చాలమంది యనుసరించిరి.

వ్యావహారిక పదముల పొందికతో రూప కల్పనలు జత పరచి కవనంపుఁ బోకడలకు మరింత మెరుగులు దిద్దినాడు రఘునాథ నాయక భూపతి.

బిగువుఁ జన్గవ మీాటు వగ లెల్లఁ గనిపించు
నలజాలుఁ బయ్యెద లంద మొదవఁ
జెలువంపు నెఱిక కుచ్చెలలపైఁ బచ్చి రా
మొగపుల యొడిదారములు పొసంగ
సన్న గేదఁగి రేకు వన్నె చొప్పడు కీలు
జడలు పిఱుందుల సందడింపఁ
జెక్కుల డిగ్గఁ బూసిన మేలి జవ్వాది
నిగ్గు వాసన దిశ ల్నిండికొనఁగ

గిలుకు మట్టెలు మొరయంగఁ గులుకు నడలుఁ
జీని బంగారు సురటలు పూని రోమ

పాదుని చేర నేతెంచినారట వేశ్యలు. ఇది రఘునాథ రాయల కాలమందలి తంజావూరులోని వేశ్యాంగనల యంద చందముల చిత్ర రచన. ఈ మొగలి పూరేకుల జడలు తంజావూరు కవుల కావ్యము లందన్నిటను విరివిగా కనిపించును. వీనికి తోడు సంపెగ పూలు నధికముగా గోచరించును. ఆ ప్రాంతములందు స్త్రీలు వాని నెక్కువగా వాడుదురు కాబోలు. ఆ మొగలి రేకు జడల ప్రభావమో లేక చెక్కుల డిగ్గఁ బూసిన మేలు జవ్వాది నిగ్గు వాసనల మహిమయో గాని, తిక్కనాది కవుల స్త్రీ వర్ణనలు చదువు నప్పుడు మనో నయనమునకు గోచరించు నవ నాగరికత గల నాజూకు రూపములు తంజావూరు కవులు వర్ణించిన పద్యము లలో కనిపించవు. అదేమి కారణమో కాని కొంత మోటుతనము

స్ఫురించును. ముద్దు పళని మరునిఘోటి, మదనుని దంతి, మొదలగు నూతము గల పదములు వాడుటలో నిదియే కారణమేమో యని పించును అయిన కావచ్చును. పళని రాధికా సాంత్వనమునం దా యువతుల మనోవృత్తికి నవయవ పుష్టికి తగినటు లంత ప్రగాఢముగా సంభోగ శృంగారము వర్ణించి నైజ స్థితిని వెల్లడించినది. పళని స్వయముగా 'అతను ఘోటి. అనుభవమునం దున్న యావేశములోని సత్య స్వరూపమును రాధ ముఖమున ప్రకటించినది.

కావ్యము కవి చిత్తవృత్తికి ప్రతిబింబమని పాశ్చాత్య పండితుల యభిప్రాయము. కవితా పాకమునకు సంస్కృత తత్సమములు లవణ ప్రాయములు. వానిని తగు మాత్రముగా వాడినచో కావ్యము మధురాతి మధురముగా నుండును. పరిమితిని మించినపుడు వెగటుగా నుండును. మానవ లోకము పరిహసించును. తక్కువయి నప్పుడు రుచికి లోపము కలుగును. అచ్చ తెనుగు కావ్యము లా కారణముననే జన సామాన్యమునకు రుచింపని వైనవి. ఆ సంగతి రఘునాథ నాయక భూపతి చక్కగా గ్రహించెను. కావున

హాటక మణి సౌధంబుల
నాటక శాలల నటించు నగర వధూటీ
కోటి తులాకోటి ధ్వని
మాటికి గుబ్బతిలుఁ బర్వి మబ్బులలోనన్

నిజమునకు కావ్యంపు కన్నియ కోమల పద పల్లవములకు తొడిగిన తులాకోటి ఘనం ఘన నినాదములు గుబ్బతిలఁ జెవులకు విందొనరించినది. ఏది ఎచట నెంత వరకు వాడ వలయునో యట్లు వాడుటలో రమణీయత యున్నది. ఇట్టి రఘునాథ నాయకుని దేశీయంపు తెనుగు కవితా రీతులకు శబ్దార్థాలంకారముల చేత మెరుగులు దిద్ది సారస్యంపు రస భావములను వ్యంగ్యములను పొందుపరచి కావ్యంపు దారులకు మలపిన వాడు చేమకూర వేంకటకవి.

కావ్యమునకు శబ్దార్థములు ప్రధానములు. 'తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి' ... 'తదదోషాపరిక్కృతౌ చవాగర్థౌ' శబ్దము కావ్యమునకు శరీరము. శబ్దజాల మెంత మృదులము

మనోహరముగా నున్న కావ్యము చదువుట కంత యాహ్లాద జనకముగా నుండును. దాని కను ప్రాసాది యలంకారములు జోడించి నప్పుడు వినుటకు మరింత యింపుగా నుండును దానినే నన్నయ యక్షర రమ్యత అన్నాడు. అందందు వృత్త్యనుప్రాసలను గూర్చి

క్వణ దణు కింకిణీ కలిత కాంచన కాంచి కలాపముల్ రణ
న్మణి కల నూపురంబులు

వెలయించుచు శబ్దార్థములకు సమ ప్రాధాన్య మొసగి భారత భాగములను వినుటకు చదువుటకు రమణీయముగా నుండు నటుల విరచించినాడు నన్నయ. తరువాత పోతన భాగవతమునందు నన్నయ దారి ననుసరించి వృత్త్యనుప్రాసల కంత్యాను ప్రాసలు జోడించి చెవులు గింగురెత్తు నటులు ముద్దాయింపులతో మృదంగ నాదములు ప్రమోయించినాడు. కాని యా యా తావులందు అర్థముకంటె శబ్దమునకు ప్రాధాన్యము మిక్కుట మగుటచేత కావ్యశోభ తరుగుచు వచ్చినది. రస ప్రియు లా దారిని మెచ్చుకొనరు. తిక్కన రసవాది. అడుసు త్రొక్క నేల కాలు కడుగ నేల-యని యటు వైపున కైన కన్ను మలప నిచ్చగింప లేదు. ప్రబంధకవులు తూకము తప్పనీయక

ఏలా లతా జాల డోలా సమాలోల
బాలామణీ గాన భాసురములు తా. శ. వి

అని వర్ణనాంశములం దచ్చు టచ్చుట శబ్దాలంకారములు వాడిరి. ఎవరెన్ని విధములగు శబ్దాలంకారములు వాడినను సంస్కృత పదముల మీదనే సాము చేసిరి. తెనుగు పదముల మీద చమత్కారములను స్వేచ్ఛగా ప్రదర్శించినవాడు చేమకూర వేంకటకవి. యమకములనిన వానికి ప్రాణము. అవకాశము కల్పించుకొని ఐనచోటను కాని చోటను యమకములు విరివిగా వాడుట వాని యలవాటు.

రవరవలు నెఱపు నీలపు
రవ రవణముతోడఁ జెలి యరాళ కచంబుల్

కవకవ నవ్వును వలి జ
క్కవ కవఁ గలకంఠ కంఠి కఠిన కుచంబుల్ వి. వి.

ఇది పాదాది యమకము

నలిన లీలల నంచు నలినలి గావించు
నించు మించు లాడు నించు మించు
లేమ నగవు చూపు లేమన నగు బాపు!
జగ మెఱుంగు దాని జగ మెఱుంగు వి. వి.

ఇది పాద మధ్య యమకము. పాద యమకములు కూడ కలవు. ఈ యమకములకు వృత్త్యను ప్రాస జోడించి

ఔర వీని మోహనాకార రేఖలే
మారు మాఱు హరి కుమారు మాఱు
వీని కన్ను దోయి విరి దమ్మి తొగల తీ
రేపు మాపు బాపు! రేపు మాపు సా. చ.

ఇట్లు కవితను శబ్దాలంకార నిబిడము కావించును. పాఠకుని మనస్సు నూగిస లాడించును. ఒకొక్కప్పుడు లాటాను ప్రాస ఛేకాను ప్రాసలను చొనిపించి

హిమ రసైక సైకతమునందు విహరించు
కైరవేషు వేషు ఘన నిభాంగు
నెనరు దవుల దవులనే చూచి క్రీడిగా
నెఱిఁగి యార! యార గేందు వదన

అని యిట్లు మనసు తారుమారు చేయును. ఇది హస్తలాఘవము-వంటిది. పదముల మీద ఆట. ఇటువంటి పద్యములు సారంగధర చరిత్ర, విజయ విలాసములం దెచ్చట చూచినను గలవు. వెతుకుకొన వలసిన పని యుండదు. ఇట్టి రచన కావ్యాంగనకు బరువుల చేటు. రస శ్రుతికి నడ్డుపాటు. ఇట్టి శబ్ద చమత్కారములను బలాత్కారముగా చొనిపించి యర్థంపుఁ దెరువులందు తికమకలు కొలు

పుటకంటె సహజ రమణీయమగు కవిత కావ్యమునకు మిగుల శోభ కలిగించును. శబ్ద చమత్కారము లధికముగా గల కావ్యము లధమ కావ్యములని లాక్షణికులు నుడివిరి. అట్లని వేంకటకవి కావ్యములను త్రోసి వేయుటకు వీలులేదు. వాని యందు మిగుల రసవంతమగు కవిత కలదు. ఆ విషయ మదివరకు ముచ్చటించితిని. శబ్దాలంకార ముల జోలికి పోక ముద్దుపళని వ్యావహారిక పదములతో దేశీయము లను గుచ్చెత్తి నిరక్షరాస్యులకు కూడ నర్థమగునట్లు రాధికా సాంత్వనమును రచించినది.

పళని కాలమునాటికి నాయక రాజుల రాజ్యమంతరించినది. మహారాష్ట్రులు దేశ పాలకులయిరి. వారి భాష మహారాష్ట్రము. అసలు దేశ భాష తమిళము. రెండు భాషల నడుమ నలిగిపోవుచున్న తెనుగు నంతగా మనసార నాదరించి యర్థము చేసికొనువారు తగ్గి పోవుచుండిరి. పళని లోకము పరిశీలించినది. అప్పటి పరిస్థితి గతుల కనువగు పద్ధతి నాలోచించినది. వ్యావహారిక భాష దేశీయంపు తెనుగునకు జతపరచినది. మానవ సామాన్యమున కర్థమగు నటుల రచన సాగించినది. మచ్చునకు

కుమ్మరికిఁ జూడ నొక యేడు గుదియ కొక్క
పెట్టటన్నట్టు దీని యెబ్బెట్టు తనము
లెల్ల నిదె తీరు నొకసారి యిటకు శౌరి
వచ్చి నిన్నేల నిందుకు వగవ నేల

ఎంత వేఁడిన బదులాడ వేమి చిలుక
కాల గతు లెట్టు లున్నవో గడచినామె
కాఁ గలది కాక మానదు గానఁ దెల్పు
చల్లకై వచ్చి ముంత దాచంగ నేల

ఇంతకంటె మరింత ముందునకు పోయి

పరులు వచ్చిన రిత్త పలుక నయ్యోయ్యానని
తెర యెత్త నియ్యఁషో శరదవేణి

అలమి కౌఁగిటఁ జేర్ప నడ్డ మయ్యానని
హారంబు లొల్లఁడో హంస గమన

అయ్యానని, ఎత్తనియ్యఁడు ఇటువంటి గ్రామ్యములు కూడ చేర్చినది. ప్రాణగొడ్డము, కఱకంఠుడు గ్రామ్యములు. భారత కవులు పరిగ్రహించిరి. తెనుగు సజీవమగు వాడుక భాష. కాల క్రమమున శబ్దముల రూపములు అర్థములు మారుచుండును, "ప్రవాహినీ దేశ్యా" సమయానుకూలముగా వానిని వాడుట దోషము కాదు. ఆర్య వ్యవహారంబగు భాష నుపయోగించ వచ్చునని వ్యాకరణకారుల మతము. ప్రతి సజీవ భాషకు నిట్టివి పొడముట సహజము. కవులు రచయితలు వానిని తమ రచనలం దుపయోగింతురు. భాష లక్షణము తెలియక యిట్టి ప్రయోగములు దుష్టము లనుట తప్పు. భాష పెరిగిన కొలంది భాషా లక్షణములు మారుచుండును. వానిని సంగ్రహించి భాషావేత్తలు వ్యాకరణములను మార్చి వ్రాయుచుందురు. ప్రపంచమునందలి భాష లన్నియు నిట్లే మారుచుండును. అవి దోషము లని ప్రచురణ కర్తలు దిద్దుట మహాపరాధము. వానిని నిషేధించుట పెరుగుచున్న తీగెను రెమ్మలు నరుకుటవంటిది. అది యొక విధముగా భాష కపకారము కావించుట యగును. పళనికి కొంచె మించు మించు సమకాలికు లయిన కవులు తెనుగు దేశము నందు పుష్పగిరి తిమ్మన. ఎలకూచి బాలసరస్వతి, ఏన్గు లక్ష్మణకవి మొదలగువారు పెక్కుమంది కలరు. వారు తొల్లింటి కవుల కట్టుబాట్లకు లోనయి తెనుగు భాషను పెరుగనీయక పట్టి బంధించి యుంచిరి.

గ్రాసము లేక స్రుక్కిన జరా కృశమైన విశీర్ణమైన సా
యాసమునైన నష్ట రుచి యైనను ప్రాణ భయార్తమైన సం
త్రాస మదేభ కుంభ పిసిత గ్రహ లాలస శీల సాగ్రహా
గ్రేసర భాసమాన మగు కేసరి జీర్ణ తృణంబు మేయునే

అని, తాము వ్రాయునది తెనుగు భాషా కవిత్వ మను మాట పూర్తిగా విస్మరించి తమ సంస్కృత పాండిత్యము నంతయు ప్రక

టించుచు సుదీర్ఘము లయిన సంస్కృత సమాసము లను పాశము లతో బంధించి తెనుగు పొడ కాననీయకుండ చేసిరి. ఇట్టి సంస్కృత సమాసములు గీర్వాణ భాషా కావ్యము లన్నియు గాలించి చూచిన దొరకునో దొరకవో యనునది సందేహామే. కాళిదాసువంటి మహా కవి 'బాహ్యోద్యాన స్థిత హర శిర శ్చంద్రికా ధౌత హర్మ్యాః' అని యొక్క పాదము సమాసము వేయుటకు వెనుక ముందులు ఆలో చించినాడు. తెలుగు కవులు వందల కొలంది సమాసములు నిర్లక్ష్య ముగా రెండు మూడు పాదముల పొడుగున కల్పించినవి తమ కావ్యములందు కలవు. ఆ పద్యములు చదువు నప్పుడు సంస్కృత కవిత్వమా తెలుగు కవిత్వమా యను సందేహాము కలుగుచుండును. ఇట్లు సంస్కృత భాషాభిమానముచేత తెనుగు భాషను తెనుగు కవులు దేశమునందు విరూపను గావించుచుండ, తంజావూ రాంధ్ర కవులు తెనుగు కవితకు తెనుగుతనము నలవరిచి సర్వ జన మాన సోల్లాస కరమగు వికాసము కల్పించినారు. వారు ధన్యజీవులు. వారి యుపకారము మరువ తగినది కాదు.

సాహిత్యము పండితులకు కవులకు మాత్రమే కాదు; సర్వ మానవ సామాన్యమునకు హృదయ గత మొనరించి నప్పుడే దాని ప్రయోజన మున్నది. అందలి రసమును ప్రజాసముదాయ మాస్వా దించి యానందించి నప్పుడే కవి ధన్యజీవి. లేనినా డా కవియు, వాని కావ్యము నిరుపయోగము. అట్లని భాష నధోగతి పాలు చేయుట నా మతము కాదు. వికారాకారము కల యువతి నభిల షించువా రుండరుకదా. రఘునాథ నాయకుని రచనలందు మలుపు తిరిగిన తెనుగు కవితా వాహినికి వ్యావహారికములను చేర్చి ముద్దు పళని మరింత రస పోషణము గావించినది. సకల జన సామాన్యము నకు నవగాహన యోగ్యము గావించినది. కావ్య రసమును పిపా సువులకు పంచి పెట్టినది. తరువాత కవులకు దారి చూపినది. ఈ విశేషమే తిరుపతి కవుల సాహిత్యమునకు ప్రత్యేక మగు వినూతన వికాసము నాపాదించినది. తెనుగు కవితకు నిజమగు తెనుగుతనము

కలిగించినవారు తంజావూరు నాయకరాజులు; వారి కవులు. ఈ సందర్భమునం దొక విషయము చెప్పవలసి యున్నది. రాధా మాధవ సంవాద మను శృంగార కావ్యమును వెలిదిండ్ల వెంకటపతి యను కవి రచించెను. అతడు తంజావూరు జిల్లాలోనివాడు. కావేరీ పట్టణ వాసి. కోనమాంబ తిరువేంగళార్యుల పుత్రుడు. పదియేడు వందల ప్రాంతములోని వాడు. కావున ముద్దు పళనికి కొంచెము పూర్వీకుడని చెప్పవచ్చును. ఆ కవి కావ్యమునందలి పద్యముల అనుకరణము రాధికా సాంత్వనమునందు చాల గలవు.

మినుకుఁ జెక్కుల గోటి చెనకు లేడవి కృష్ణ!
యదిగదా నీ వెఱుంగుదువు రాధ!
సొంపు కన్నుల నిద్ర మంపు లేడవి కృష్ణ!
యదికదా నీ వెఱుంగుదువు రాధ!
కెంపు వా తెరఁ బచ్చి కెంపు లేడవి కృష్ణ!
యదికదా నీ వెఱుంగుదువు రాధ!
నును మేనఁ జిఱు గాజు నొక్కు లేడవి కృష్ణ!
యదిగదా నీ వెఱుంగుదువు రాధ!

నిన్న మొన్నటి వాడవు నేడు చూడ
నేడ నేర్చితి వీ మాట లీవు కృష్ణ!
నాకు నాశ్చర్య మైనది నీకుఁ దెల్పఁ
గూడ దది గదా నీ వెఱుంగుదువు రాధ!

అని రాధా మాధవ సంవాదము. దీనిని పోలిన పద్యములు రాధికా సాంత్వనమునందు రెండు కలవు. అందొకటి

వలుద గుబ్బల గోరువంక లేడవి రాధ!
అవి నీ వెఱుంగుదు వంబుజాక్షు!
చక్కెర కెమ్మోవి నొక్కు లేడవి రాధ!
అవి నీ వెఱుంగుదు వమరవంద్య!

మిసిమి తెప్పలఁ దమ్మ రసము లేడవి రాధ!
　　అవి నీ వెఱుంగుదు వాదిదేవ!
తగు వెన్న సరిపెన దండ లేడవి రాధ!
　　అవి నీ వెఱుంగుదు వతనుజనక!

అనుచు నిరువురు గడితేరి హానువు మీాటి
యాని సరిపోరి కెమ్మోవు లానఁ జేరి
తమి చెలఁగఁ జేరి యల కేరజముల దారి
కోరి మరుబారి నలసిరి కొమరు మీాటి

అని రాధికా సాంత్వనము. మొదటి పద్యమునందు రాధ ప్రశ్నించి నది. కృష్ణుడు సమాధానము చెప్పినాడు. వారి సంభాషణ దిట్టలగు నాయికా నాయకులకు సహజమయినది. అందు రాధ సంపూర్ణ ముగా పరకీయ యగు శృంగార నాయిక. రెండవ పద్యమునందు శ్రీకృష్ణుడు ప్రశ్నించినాడు. రాధ సమాధానము చెప్పినది. వాక్యాంతములందు అంబుజాక్ష, అమరవంద్య, ఆదిదేవ, అతను జనక, యని సంబోధించినది. అవి శ్రీకృష్ణుని విష్ణుత్వమును ప్రక టించుచున్నవి. అందు రాధ భక్తి వెల్లడి యగు చున్నది. శ్రీకృష్ణుని మానవ మాత్రునిగా వరింప లేదు. విష్ణువుగా తన మేను సమర్పించి నది. కాన ఇందు భక్తి సమ్మిళితమయి శృంగారము గోచరించును. అది గోపికల భక్తి. మధుర భక్తి. రాధికా సాంత్వనమునందు వెల్లడ రాధ పాత్రయం దదియే కరడు కట్టి కనిపించును. పళని రాధా మాధవ సంవాద కావ్యమునందలి రచనా విధానమును బాగుగా హృదయ గతము గావించుకొనినది. ఆ యడుగుజాడల ననుసరించినది. అందలి కవిత మిగుల రసవంత మైనది.

తంజావూరు కవుల కావ్యము లన్నిటిలో విజయ విలాస ముత్తమ మయినది. తరువాత చెప్పుకొన తగినది రాధికా సాంత్వ నము. దానికి కవనంపు దారులు చూపినది రాధా మాధవ సంవా దము. అందుండి మరి నాల్గు పద్యములు.

దైవం బెంతకుఁ దెచ్చె నీ వలపు లేదా నాటికి న్నేటికిన్
ద్రోవల్ పుట్టెనె నాటి దీ గుణమొ కాదో నాటి విమ్మోనులే
కావో లేక యిదేమి యీ నడత లీ కైలాట లీ మోసముల్
నీవా కృష్ణుఁడ వేను రాధనుకదా నీరేజ పత్రేక్షణా.

ఇన్ని దినంబు లేఁ బ్రతుక నెంచుట యేమిటి కంటివేని యీ
కన్ను లదేమొ నిన్నుఁ దమ కాంక్షలు దీరఁగ జూడఁగోరె నే
నున్నది దేవుఁడుం దెలియ కుండునె దేవుఁ డటంచు నీకు లే
కున్నను మాకు బామరిక మున్నది యున్నది యీల లోపలన్.

వంచన మాని గుట్టు మగవారికి నాడుది మించి యియ్యరా
దంచు వచింతు రౌనది యథార్థము ముంగల నిన్ను నొక్క టా
సించిన దానఁ గాన నది చెప్పక తీరదు నేను పడ్డ పా
ట్లెంచగ రాధ దయ్యముసుమీ యిది యేమని చిత్తగించెదో.

ఒంటిగాఁ బవళింప నూరక నా గుండె
యదరంగ నెగవైచి నట్లు తోఁచు
వడి లేచి తెగువతో నడువ నూహించుచో
నడుముచుఁ బైఁబడి నట్లు తోఁచు
కాదని యటు లేవ గమకింప వడఁకుచు
నదియే మొ కుదియించి నట్లు తోఁచు
గోరంత యుబుసుగాఁ గూర్చుండఁ దలఁచుచో
నట్టె నివంబాడి నట్లు తోచు

వెట్టి పట్టఁ గోరంత వివేక ముండు
జలధిలోఁ బడ్డ నొక తెప్ప గలిగి యుండు
నింతగా దిక్కు దెస లేని యిట్టి వెతలు
నా తల నె పెట్ట వలెనె యా ధాత కైన.

అని రాధ తన వియోగంపు వెతలను శ్రీకృష్ణునకు చెప్పికొనినది.
భాష నిర్దుష్ట మగు చక్కని వ్యావహారికము. పదములు మనో

హారములు, భావములు రస గుంభితములు. శయ్య సెలయేటి నీటి తరంగముల వలె నిరంతరమయి దుముకులు పెట్టును. కావ్యమారంభము నుండి చివరి వరకు పాఠకుని చిత్తము తన్మయ మొనరించు కథా ప్రసంగములు ఒక నాటకము వలె రంగము వెంబడి రంగము నడచి పోవుచుండును. దాదాపు నాలుగు వందల పద్యములు కల మూడాశ్వాసముల గ్రంథము. ఒక్క పద్యము బాగుండ లేదని పించదు. ప్రతి పద రమణీయ మగు నిట్టి కావ్యము ఆ కాలమందింకొకటి కనిపించదు.

విజయ నగర సామ్రాజ్య మంతరించినది. ఆంధ్ర కవితా కల్లోలిని దక్షిణ దిశాభి ముఖముగా మరలినది. అచటి జనుల చిత్త వృత్తి తన వైపునకు మరల్చు కొనినది. కవుల మానసములు శృంగార రస ప్లావితములు గావించినది. పద నొదవించి శృంగార ప్రబంధములు పండించినది. పంటకాపులు వైష్ణవులు, గుత్త కొనిన వారు వైష్ణవులు. వారికి ప్రమాణ గ్రంధములు భాగవతాది పురాణములు. ఆళ్వారుల చరిత్రములుఆదర్శ ప్రాయములు. ద్రవిడ ప్రబంధములు నిత్య పారాయణ గ్రంథములు. ఇవన్నియు శృంగార రస ప్రధానము లయినవి. వారి యారాధ్య దైవము విష్ణువు. విష్ణు తత్త్వోపాసకుల చిత్తములు శృంగార రస కల్పితములు కాక మరేమగును యథా దైవ స్తదా భక్తః. వైష్ణవము పౌరాణిక మతము. భక్తి చేత మోక్షము లభించునని వారి సిద్ధాంతము. జ్ఞాన వైరాగ్య హటాది యోగములు నిరర్థకము లని వారి యూహ.

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జునా
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతజ

అని భగవద్గీతా వాక్యము. దీని నుపదేశించినవాడు శ్రీకృష్ణ భగవానుడు. ఆయన తత్త్వము భాగవతమునందు కథలు గాథలుగా ప్రదర్శింపబడినది. అది వైష్ణవులకు పరమ ప్రమాణమైన

లక్ష్య గ్రంథము. అందు నిరూపింపబడిన భక్తి తత్త్వమును వారను సరింతురు. అందు శృంగార రసము పరిపక్వ స్థితిని బొంది యుండును. వైష్ణవులు విష్ణువు నే రూపమునం దుపాసించినను భాగవత తత్త్వము ననుసరింతురు. శ్రీరంగ భర్త దక్షిణదేశీయులగు వైష్ణవుల కంద రకు నుపాస్య దైవము. వైష్ణవమున కాది కర్త లాళ్వారులు. శఠ కోపుడు, నాథముని, శ్రీరామమిశ్రుడు, యామునాచార్యులు, మొద లగు వారందరు శ్రీరంగవిభుని కృష్ణపరముగా సేవించిరి. పూజించిరి, వినుతించిరి. విష్ణుచిత్తుడు మహాభక్తుడు. విల్లిపుత్తూరులోని మన్నారు దేవుని కృష్ణపరముగా వినుతించెను. గోదాదేవి విష్ణుచిత్తుని కూతురు. ఆమె తండ్రి యడుగుజాడలలో వర్తించినది. విష్ణువును కృష్ణపరముగా వినుతించుచు ప్రబంధములను రచించినది. వారి రచన లన్నియు తమిళ భాషయందు దున్నవి. వానికి ద్రావిడ ప్రబంధము లని పేరు. అవి యన్నియు శృంగార రస భూయిష్ఠములు.

ద్రావిడ ప్రబంధములు వైష్ణవులకు నిత్య పఠన పాఠములు. రామానుజాచార్యులవారు వాని నాదరించి గౌరవించిరి. సంప్రదాయ సిద్ధముగా వారి యడుగు జాడలందు ప్రవర్తించు వైష్ణవుల రచ నలు శృంగార మగుటలో విచిత్ర మేమియు లేదు. ఆరాధ్యదైవము మొదలుకొని మతపరంపరాగతమయిన శృంగార రసమును పోషించు టందు వైష్ణవులు ఆరితేరినవారు. కావున వారి ప్రబంధములు అన్నియు శృంగార రస ప్రధానము లయినవి.

సారంగు తమ్మయ వైష్ణవ మతస్థుడు. కందాళ అప్పలా చార్యుల శిష్యుడు. తొండరడిప్పొడి యాళ్వారయిన విప్రనారా యణుని చరిత్ర వైజయంతీ విలాసమను పేర రచించెను. శేషము వేంకటకవి విష్ణు తత్త్వోపాసకుడు. కందాళ రామానుజాచార్యుల శిష్యుడు. తారా శశాంక విజయము రచించెను. వంగల సీనయార్యున కంకిత మొసంగెను. ఆయన వైష్ణవుడు. ఇవి శృంగార రస ప్రబం ధము లని నేను వేరె చెప్పవలసిన పనిలేదు. తంజావూరు ప్రభువు లందరు వైష్ణవులు. వారి నాశ్రయించిన తెనుగు కవులు కవయిత్రులు

వైష్ణవులు. వారి కావ్యములు శృంగార రస కల్పితము లైనవి. దేశమునందు శాంతి భద్రతలు నెలకొని యున్నపుడు పాలక పాలిత జనుల చిత్తములు శృంగారాయత్తములై యుండుననియు, ఆకాలము నందు కవులు రచించు ప్రబంధములు శృంగార రస ప్రధానము లయి యుండుననియు, సారస్వత చరిత్రకారులు విమర్శకులు నుడివిరి. దేశము శాంతియుతముగా నున్నప్పుడు కవులు ప్రబంధములు రచించుటయు సారస్వత ప్రియులగు రాజులు కృతు లందుకొనుటయు లోక ప్రసిద్ధము. కాని శృంగార రస ప్రబంధములను కవులు రచింతు రనుట విచారణీయము.

శ్రీకృష్ణరాయల కాలమునందు ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము రచించెను. అది భక్తిరస ప్రధానమగు కావ్యము. అలసాని పెద్దన మనుచరిత్ర విరచించెను. అది శృంగార ప్రబంధము. రాయలవారు స్వయముగా విష్ణుచిత్తీయము వ్రాసిరి. అది భక్తిరస కావ్యము. ధూర్జటి వీరశైవ మతస్థుడు. రాయలవారు వైష్ణవుడు. అనిసాని పెద్దన విశిష్టాద్వైతి. వారి వారి చిత్త ప్రవృత్తుల కనుగుణములగు కావ్యములను రచించిరి. వైష్ణవము నందు విశిష్టాద్వైత సంప్రదాయము కలదు. దానిని రామానుజాచార్యులవారు స్థాపించిరి. అది పండిత సాంప్రదాయము. వారు వేదములను ప్రమాణముగా నంగీకరింతురు. యజ్ఞయాగాది నిత్య నైమిత్తిక కర్మలవలన దేవతాత్వ స్థితి కలుగునని యొప్పుకొందురు. కర్మల వలన స్వర్గ సుఖానుభవములను బోధించు భాట్ట మతమును, జ్ఞానము మోక్ష సాధన మని నుడువు శాంకర మతమును ఖండింతురు.

పెద్దన మహాపండితుడు. ఆయన చిత్తవృత్తి మత విశ్వాసము మను చరిత్రలోని వరూథినీ ప్రవరుల సంభాషణలయందు స్ఫుటముగా నద్దములోని ప్రతిబింబమువలె గోచరించును. వారి వాద ప్రతివాదములలోని పూర్వపక్ష సిద్ధాంతములు పరిపూర్ణముగా నర్థము చేసికొనినచో పూర్వ మీమాంస మత ఖండన మని పండితులకు తేటతెల్లముగా తెలియును.

మనుచరిత్ర ద్వితీయాశ్వాస మంతయు విశిష్టాద్వైతమును బోధించు వేదాంతమునకు శృంగారమును జోడించి పండిత కవి జన మనోరంజకమగు సంభాషణతో కథా సంవిధానమును కూర్చినాడు. మహావిద్వత్కవి యలసాని పెద్దన. దానిని చదివినప్పుడు మనస్సు పరమానందమును పొందును. మనుచరిత్రవంటి గ్రంథము కావ్య ప్రపంచమునం దింకొకటి లేదు. ఇక ముందు పుట్టబోదు. అందుకనే 'పూత మెఱుంగులుం బసరుఁ బూప బెడంగులు చూపు నట్టివా కైతలు' అన్నాడా మహాకవి. దానిని సరిగా నర్థము చేసికొనినాడు శ్రీకృష్ణదేవరాయలు. ఆయన యెడ లుప్పొంగి పోయినది. "ఆంధ్ర కవితా పితామహ యలసాని పెద్దన కవీంద్ర" యని సంబోధించి నాడు. గురువుగా మిత్రునిగా తలంచినాడు. మనుచరిత్రం బందు కొనువేళ పురమేగఁ బల్లకిఁ దనకేలఁ బట్టి యెత్తినాడు. అంత కంటె మానవుడు పొందగలిగిన గౌరవ మింకేది కలదు. 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిం' రాయలవారి చిత్తవృత్తి యంత యున్నత స్థితి నందుకొనలేక పోయినది.

విష్ణుచిత్తీయమునందు పౌరాణిక వైష్ణవమును ప్రతిష్ఠించి నాడు. వీనిని గురించి వ్రాయవలయుననిన వందల కొలంది పుటలు పుట్టును. కాళహస్తీశ్వర మహాత్మ్యము శుద్ధసాత్విక భక్తిని బోధించును. అది వీరశైవ మత సాంప్రదాయము. కవి మానస ప్రవృత్తిని బట్టి కావ్య రచన యుండును. అది మత సాంప్రదాయముల మీద నాధారపడి యుండును. దేశమునందు శాంతి భద్రతలు కలయప్పుడు చిత్తము శృంగారము వైపునకు మరలు ననుట అనాలోచితమైన యూహ. కవి యితివృత్తమును కాల పరిస్థితుల కనుగుణముగా మలచి మనోవృత్తిని బట్టి కావ్య కన్యకను రూపొందింప చేయును. దానికి రస స్థితి కల్పించి ప్రాణప్రతిష్ఠ చేయును. రససిద్ధి కవి ప్రతిభా విశేషమును బట్టి యుండును. ఒక్క శృంగారమే యను నియమము లేదు. కాలము గతించిన కొలంది వైష్ణవమునందు వైదిక సాంప్ర దాయము లడుగంటుచు వచ్చినవి. సాంప్రదాయములు ప్రబలము

లైనవి. క్రమ క్రమముగా పారమార్థిక దృష్టి తగ్గిపోయినది. లౌకిక ప్రవృత్తి యావేశించినది.

విజయరాఘవ నాయకుని కాలము నాటికి మతము నిర్వీర్య మైనది. రాజగురువులకు మతము మీఁదకంటె పదవుల మీఁద నభిమాన మెక్కువయినది. రాజుల నవతార పురుషులను గావించినారు రాజ గురువులు. విజయరాఘవ నరపతి మన్నారురాజగోపాలుడయి నాఁడు. చంద్రుడు రాజచంద్రుడై నాఁడు. ఆయన కూతురు కాంతిమతి యైనది. భక్తి పరమేశ్వరునిలో కలిసిపోయినది. శృంగార మొక్కటి నిలిచినది. మన్నారుదాసవిలాసమువంటి ప్రబంధములు బయలు దేరినవి. ఇంక మన్నారు స్వామియే స్వయముగా రఘునాథ నాయ కుఁడు తన యవతార మని చెప్పుకొనినాఁడు. స్వామి దక్షిణ నాయ కుడను మాట లోక విదితము. తన్ను వలచిన వారిజాక్షుల కోర్కె తీర్చుట ఆయన పని. మిగిలిన సంగతుల మాట యెట్లున్నను, దక్షిణ నాయకత్వము రఘునాథ నాయక భూపతి యందు సర్వ విధముల తగిపోయినది. రఘునాథ నాయ కాభ్యుదయము ప్రబంధింపబడినది. రాజులు భగవంతులయినారు. దక్షిణ ద్వారకావాసు డయిన మన్నారు రాజగోపాలుడు మానవు డయినాఁడు. ఆయన భార్యలు స్వీయ జారిణీ మొదలగు అష్టవిధ శృంగార నాయిక లయినారు.

వరుసఁ దన రాక రాకేందు వదనలకును
దెలుప నియమించి యొండొరుల్ దెలియ కుండ
దూతికల నెల్ల బహుమతితోడ నపుడు
పంచె పంచేషు లీలా ప్రపంచ చరితుఁడు

మన్నారు రాజ గోపాలుడు. వారిని నేకాంత కేళీ వినోదముల తని యించినాడు. అది రాజగోపాల విలాసమయినది. తెనుగు ప్రబంధము లిట్లు శృంగారము లయినవి. ఇతి వృత్తములలో నీతి నియములు నశించినవి. కావున శృంగార ప్రబంధములకు మానసిక ప్రవృత్తి కారణము. దాని కాధారము మత సాంప్రదాయములు అయినవి. దేశ శాంతి భద్రతలు కావు.

## ౧౦

## యక్ష గానములు

గీత నృత్యాభి నయముల సమ్మేళనము యక్షగానము. గీతము గానాశ్రయము. నృత్యము తాళ లయాశ్రయము. భావాశ్రయము అభినయము. వీని కలయికతో కథా వస్తువును దృశ్యరూపమున ప్రదర్శింప బడునవి యక్షగానములు. ఇవి మొదట పదములతో ప్రారంభ మయినవి. పదములు భక్తి ప్రధానము లయిన శృంగార గీతములు. అవి దేవతల లీలావిలాసములను వర్ణించి చెప్పబడినవి. వానిని నృత్యాభినయములతో గానములను జోడించి వేశ్యలు దేవాలయములందు దేవతా సన్నిధిని ప్రదర్శించిరి. తెలుగునందు క్షేత్రయ్య మువ్వ గోపాల పదము లటువంటివే. సంస్కృతమునందు జయదేవుని అష్టపదులు, నారాయణ తీర్థులవారి తరంగములు అటువంటివి. కాలక్రమమున నేక వస్తు ప్రతిపాద్యము లయిన యీ పదముల సంపుటమును ఏక పాత్రాభినయముగా వేశ్యలే నిర్వర్తించిరి. వానిని వ్రాసినవా రందరు మహాభక్తులయిన కవులు, అన్నమాచార్యుల వంటివారు. వేశ్యలను అభినయమునకు తయారు చేసిన వారు భరత శాస్త్ర విద్యాపారీణు లయిన విద్వాంసులు. గాంధర్వ విద్యావేత్తలయిన భాగవతులు. అప్పటి కాలమునందు వేశ్యలు వారి చేతులలో మహా పండితురాండ్రు, సంగీత సాహిత్య నాట్యాదికములందు నిగ్గు తేరిన బిరుదు పాత్రలునయి యుండిరి. తంజావూరు రాజుల కాలమునందలి మధురవాణి, రామభద్రాంబ, రంగాజమ్మ, చంద్రరేఖ, తంజనాయకి. ముద్దు పళని మొదలగువారి జీవితము లిందుకు నిదర్శనములు.

రాధికా సాంత్వనము పీఠిక చదివి ఆనాటి వేశ్యల పాండిత్య ప్రతిభ లెట్టివో మనము కొంత గ్రహించుకొనవచ్చును. బందరులో చీమండ్ర వెంకటచలం పంతులుగారు సుప్రసిద్ధు లయిన ధనికులు.

వారి యింటిలో వివాహమయినది. విజయనగరమునుండి మహా విద్వాంసురాలగు నొక వేశ్య వచ్చినది. ఒక నా డామె నాట్య ప్రదర్శనము జరిగినది. సభ క్రిక్కిరిసిపోయినది. పండితులు కవులు గాయకులు ధనికులు పెక్కుమంది వచ్చిరి. సభ్యులలో చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగా రొకరు. నాట్యము ప్రారంభమయినది. భామ కలాపము అన్నారు. కొంత కథ నడిచినది. ఆ వేశ్య మహా పండితురాలని విన్నారు వేంకటశాస్త్రిగారు. అప్పటికి రాత్రి నడిజాము దాటినదట. శాస్త్రిగారు లేచి హఠాత్తుగా 'కాంతే దృష్టి పథం గతే నయనయో రాసీ ద్వికాసో మహాన్' అను పుష్పబాణ విలాస ములోని శ్లోకము నిచ్చి అభినయించమని అర్థించిరి. ఆమె సభికుల వంక చూచినది. అందఱు సమ్మతి సూచించిరి. ఆ నర్తకి పట్టిన హస్తం పట్టకుండ, చూపిన భంగిమ చూపకుండ పలు రకములుగా నా శ్లోక మభినయించినదట. పూర్తి యగునప్పటికి తెల్లవారినది. సభ్యులు పరమానందము నొందిరి. వేంకటశాస్త్రిగారు ఆమెను మెచ్చుకొని ఆశువుగా పది పద్యములు చెప్పి రనియు శ్రీపంతులు గారు ఆమెకు నూరు సవరసుల గండ పెండేరము కాలికి తొడిగించి రనియు మా గురుపాదులు చెప్పుచుండెడివారు. ఆనాటి వేశ్యల పాండిత్యము లట్టివి. ధనకోటి బెంగుళూరు నాగరత్నము మొదలగు వారు అట్టి కోవలోనివారు. వారు మహా గాయకురాం(డ్రు, విదుషీ మణులు.

వేశ్యలకు మహారాజులు మండలాధిపతులు మడి మాన్యముల నిచ్చి దేవాలయములందు నిత్య నాట్యాభినయ సేవలకు నియమించిరి. ఇప్పటికిని కొన్ని కొన్ని దేవస్థానములందు వారు వారి వృత్తులు మానుకొనినను క్షేత్రముల ఫలసాయముల ననుభవించు చున్నవారు కలరు. అందుకనే వారికి దేవ దాసీలను పేరు వచ్చినది. నాట్యకళ నభ్యసించుటచేత వేశ్యలు కళావంతులయినారు. ఆట పాటలు వారి కులవృత్తి అయినది. ఇది యనాది సిద్ధము. తరువాత భామ కలాపము, గొల్ల కలాపము, యశోద చూలు, దశావతారములు,

దేశీయచ్ఛందములందు వ్రాయబడినవి. వీనిని నృత్యాభినయ రూప కముగా వేశ్యలే దేవాగారములందు నుత్సవములందు ప్రదర్శించుచు వచ్చిరి. ఇంతవరకు వీని కలాపము లనియే పేరు.

కూచిపూడివారు పరమ భాగవతులు. భరత శాస్త్రమునందు మొదటినుండియు పరిశ్రమ చేసినవారు. నాట్యాభినయ విద్యా గురువులయి ప్రదర్శన సమయములందు వెనుక హంగు కావించుచు వచ్చిరి. కాలక్రమమున కూచిపూడివారే స్వయముగా నీ ప్రదర్శన ములకు పూనుకొనిరి. తెనుగు దేశమునం దెల్లెడల ప్రచారము గావించిరి. వారి నాట్యాభినయములకు మహారాజులు అబ్బుర పోయిరి. వేశ్యల ప్రదర్శనముల కంటె వారి ప్రదర్శనములు మిగుల నాకర్షణీయము లైనవి. ఇంతవరకు నన్నియు నేక పాత్రాభినయ ములే. సిద్ధేంద్ర మహాయోగి వీరి ప్రదర్శనములను చూచెను. పరమానందము నొందెను. అతడు భరత శాస్త్ర పారంగతుడు. అనేక పాత్రాభినయ రూపకములను వ్రాసి కూచిపూడివారి కొసం గెను. వానికి యక్షగానము లని పేరు పెట్టెను. వానిలో ఉషా పరిణయ మొకటి

భరతముని యక్షుల సహాయమున నాటకాభినయ ప్రదర్శన ములను దేవ లోకమున జరిపించెనని నాట్యశాస్త్రము తెలుపు చున్నది. గానము ప్రధానముగా గలిగి యక్షులచేత ప్రదర్శింప బడిన రూపకము గావున యక్షగాన మని పేరు వచ్చెను. ఈ సిద్ధేం ద్రుడు పంద్రెండవ శతాబ్దము లోనివాడని కొందర రభిప్రాయ పడు చున్నారు. మొత్తము మీద రాయనబాస్కరుని కంటె చాల పూర్వమునుండి కూచిపూడివారు ఉషాపరిణ యాది రూపకము లయిన యక్షగానములను ప్రదర్శించుచుండి రని కథలవలన తెలియు చున్నది. త్యాగరాజులవారు కూచిపూడివారి ప్రదర్శనములను చూచి నట్టు కలదు.

మధురా నగరిలో చల్ల నమ్మ పోయెద
దారి విడువుము కృష్ణా! కృష్ణా! ॥మధురా॥

అను కీర్తన గొల్ల కలాపము లోనిది. ఇది ఆనందభైరవి రాగము నందు వ్రాయ బడినది. దీనిని కూచిపూడివారు త్యాగ రాజులవారి యెదుట అభినయించిరట. అది చూచి త్యాగరాజుల వారు పరమానందము పొందిరట. కూచిపూడివారి ఆనందభైరవి రాగాలాపమునకు పరవశము నొంది తన రచనలలో ఆనందభైరవి రాగము నందు కృతి వ్రాయనని కూచిపూడివారికి మాట యిచ్చినారట. అందుకనే త్యాగరాజులవారి కృతులలో ఆనందభైరవి రాగము లేదని యొక కథ చెప్పుదురు. కావున యక్షగానములు మొదట తెనుగు దేశమునందు పుట్టినవి. మొదటి యక్షగాన కృతి కర్త సిద్ధేంద్రుడు. వానిని ప్రదర్శించిన వారు కూచిపూడివారు.

కురువంశజులనుండి యక్షగానములు పుట్టిన వని వేటూరు ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిరి. కోతిజాతికి మానవ జాతికి కొన్ని పోలిక లున్నవని మానవులు కోతుల వలన పుట్టి రనుట వంటిది వారి వాదన. ఈ యక్షగానములను ప్రదర్శన రూపమున దక్షిణ భారత దేశమంతట వ్యాప్తికి తెచ్చినవారు కూచిపూడి భాగవతులు. ఉషా పరిణయము, శశిరేఖా పరిణయము, ప్రహ్లాద వారి ప్రధాన ప్రదర్శనములు. ఈ ప్రదర్శనములందు నాయిక చేత దశావ తారములు పట్టించుట వారి యలవాటు. భామ కలాపము గొల్ల కలాపము వారి కభిమాన ప్రదర్శనములు. ఏబది యేండ్ల క్రిందటి వరకు వెంకటనారాయణగారు నాయికపాత్రను ధరించిరి. నృత్యాభినయములందు నపారమగు కీర్తిని గడించిరి. అంతటి అభినయ వేత్త మరెవ్వరు లేరు. తరువాత నాట్యము క్షీణ స్థితికి వచ్చినది. తంజావూరు నందును కూచిపూడివారు రూపకములను ప్రదర్శించిరి. మెప్పులను పొందిరి. వారి ప్రదర్శనములను చూచి ఇతరులు కూడ యక్షగానములను ప్రదర్శింప నారంభించిరి. కూచిపూడి వారి రూపకము లన్నియు విష్ణు సంబంధము లైనవి. శైవులు వాని ననుకరించి శివలీలలు, కామ దహనము మొదలగు యక్షగానములు రచించి యాడుటకు మొదలుపెట్టిరి. శ్రీనాథుడు

కీ ర్తింతు రెవ్వాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి

అనియు

సాని యీశానిమై మహోత్సవమునందుఁ
గేల నవ చంద్రకాంతపు గిన్నె పూని
వీధి భిక్షాటన మొనర్చు వేళఁ జేయు
మరులు నృత్యంబు జగముల మరులు గొలుపు.

అనియు భీమ ఖండమునందు నుడివెను. దీనిని బట్టి పదునైదవ శతాబ్దము నాటి కీ రూపకములు బాగా ప్రచారమునం దున్నవని విశదముగా తేలుచున్నది. యక్షగాన మంతటి ప్రాచీన కాలము నుండి తెనుగు దేశముననున్నను దానికి వ్యాప్తము జనాదరణమును గలిగినది. దానిని తంజాపురపు ఆంధ్ర నాయక మహీపతులు చేపట్టిన పిదపనే యని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిరి. అది కొంచె మాలోచింప వలసిన విషయము. నాయక రాజుల కాలమునందు పెక్కు యక్షగానములు రచింప బడినవను మాటలో నబద్ధము లేదు. కాని తెనుగు దేశమునందలి యక్షగానముల కున్న ప్రచారము వానికి రాలేదు. దానికి కారణ మున్నది. యక్షగాన ములు అన్నియు భగవంతుని సంబంధించిన పౌరాణిక నీతి కథలు. ఇప్పటి వరకు వెలువడిన నాయక రాజుల కాలమునాటి యక్షగాన రచనలు స్వార్థము ప్రధానముగా గలవి. సాంప్రదాయ విరుద్ధము లైనవి, నమ్మ తగనివి. ఏ భాగవత సంఘము వానిని ప్రదర్శించి బైటికి తెచ్చును. రాజులయెడ భీతివలన గాని, ప్రీతివలన గాని యెదుట బాగున్న వని మెచ్చుకొనినను చాటున లోకము పరిహా సింపక మానదు.

యక్షగానములకు కావ్యములకు చాల భేద మున్నది. కావ్యమునం దితివృత్తమును సౌందర్యముకొరకు మార్పులు చేయ వచ్చును. ఔచిత్యమునకు భంగము కలుగ కుండవలయును. యక్ష గానములందు ప్రసిద్ధమగు కథ కెట్టి మార్పు తెచ్చినను ప్రేక్షక

లోకము సహింపదు. ఆ మార్పు అనౌచిత్యమైనచో వేరే చెప్ప వలసిన దేమున్నది. విజయ రాఘవ నరపాలుడు విప్రనారాయణ చరిత్రమును యక్షగానముగా రూపొందించెను. విప్రనారాయణుడు శ్రీరంగవాసి. అనుదినము పూల మాలికలను నిర్మించి రంగేశున కర్పించుచుండెను. విష్ణు మాయా ప్రభావమున దేవదేవి అను వేశ్య యందు వలపు గలవాడయ్యెను, వీని కథ యంతయు శ్రీరంగము నందు జరిగినది. శ్రీరంగవల్లభుడు వీని భక్తికి మెచ్చి తొండర డిప్పొడి యాళ్వారని పేరు పెట్టెను. భక్తాంఘ్రిరేణువని దాని కర్థము. ఈ కథను భక్తాంఘ్రిరేణు చరిత్ర మనుపేర ఉత్తర రంగ కవి యక్షగానముగా రచించెను. దానిని శ్రీరంగేశున కంకిత మొన రించెను. అందు "నా యొనర్పం బూనిన భక్తాంఘ్రిరేణు విలాసం బను నాటకంబునకుఁ బ్రధాన గణ్యంబైన శ్రీరంగ నగరం బెట్టి దనిన" యని కథ శ్రీరంగమునందు జరిగినట్లే కలదు. మరియు "శ్రీరంగ నాయకులు విప్రనారాయణుని తో నేమనుచున్నారు"

"తావక భక్తికి మెచ్చితి
నా వాడవు నీవు విప్రనారాయణ నీ
వే వర మడిగిన నొసఁగెదఁ
గావలసిన కోర్కెఁ దెల్పఁ గా వలయు ననఘా!"

యని కలదు. ఈ కథనే పిడుగు వేంకటకవి విప్రనారాయణ చరిత్ర మను పేర ప్రబంధముగా రచించెను. సారంగు తమ్మయ వైజయంతీ విలాసమను పేర కావ్యముగా వ్రాసెను. ఎవ రెన్ని వ్రాసినను కథ శ్రీరంగమునందు జరిగినట్లే కలదు. విజయ రాఘవ నాయకు డింత లోక ప్రసిద్ధమయిన కథ తంజావూరు మండలములోని దక్షిణ ద్వారక యను పేరుగల మన్నారు క్షేత్రమునందు జరిగినటుల రచించెను. అదియు తన కాలమునందు జరిగి నటుల వర్ణించెను. విజయ రాఘవ భూపతి రాజగోపాలుని భక్తుడు. విప్రనారాయణుని వలన శ్రీరంగ విభుడు పొందిన కీర్తి మన్నారు నాథునకు తనకు లభింపవలయు నని ఆ మహారాజు నాశయము. తాను రాజగోపాలుని యవతార మని

మన్నారుదాసవిలాసమునందు రంగాజమ్మచేత వ్రాయించుకొనిన విజయ రాఘవున కిట్టి కోరిక కలుగుటలో నాశ్చర్య మేమియు లేదు.

రామానుజాచార్యులవారు పదునొకండవ శతాబ్దములోని వాడు. ఆయన కాలమున నూరేండ్లు పైబడిన వృద్ధు యామునాచార్యులవారు. కంచియందు రామానుజుని బాల్య దశలో విద్యాభ్యాస మొనరించుచుండగా చూచిరి. యామునాచార్యులకు ఆళ్వందారు లని పేరు. ఆయన తాత నాథముని. నాథముని గురువు శఠకోపుడు. ఆయనకు నమ్మాళ్వారులని పేరు. ఆయన తొమ్మిదవ శతాబ్దములోనివాడు. ఆయనకు పూర్వుడు తొండరడిప్పొడియాళ్వారు. ఎనిమిదవ శతాబ్దములోని వాడయి యుండ వచ్చును. అప్పటి విప్రనారాయణుడు తన కాలమునందు అనగా పదునేడవ శతాబ్దమునందున్నటుల కథ నిబంధించుట చాల సాహసము. పరిహాసాస్పదము. విజయ రాఘవ నాయకుడు విప్రనారాయణుని

యోగ విద్యాశాలి యుపనిష ద్వేది
పరమ పావనుఁ డేక ప్రత్నీ వ్రతుండు

అనియు

ఎంతో విరక్తుఁడై యిల్లిల్లు రోసి
తల్లియుఁ దండ్రి యుత్తరువుఁ బాలింప
నిల్లాలిఁ బుట్టిన యింటి కంపించి
ధరణిపై దీర్ఘ యాత్రాపరుండగుచుఁ
దక్షిణ ద్వారకా స్థలిఁ జేర వచ్చె.

నని సంసారిగా నిరూపించెను. ఇతర గ్రంథములు విప్రనారాయణుడు బ్రహ్మచారిగా చెప్పుచున్నవి. రాజ గోపాలస్వామి గుడిలోని పూజారుల సంభాషణ యంతయు తమిళ భాషయం దున్నది. తమిళ దేశమునందు జరిగిన కథ కావున తమిళము వాడి యుండ వచ్చును. కాని ఇటు తెలుగులకు అటు తమిళులకు విప్రనారాయణ చరిత్ర ప్రదర్శన యోగ్యము కాకపోయినది. విజయరాఘవ నాయకు

యక్ష గానములలో శ్రీకృష్ణ విలాసము పేర్కొన తగినది. చక్కని కథా సంవిధానము కలది.

వెలదులు వెయ్యారులు వెంట నంటి కొలువఁగా
నలరు విల్తుని రీతి నలరుచును
మలయుచు సొలయుచు మన్నారు దేవుండు
కొలువు కూటము చేరెఁ జెలువు మీఱ.

అను దరువుతో ప్రారంభ మగును. అంతలో రుక్మిణి చెలికత్తె యటకు వచ్చును. ఆమెతో

ఇదె వచ్చెదము హరిద్రా
నది చెంగట మించు కాంచన వనంబున కా
మదవతి నటుఁ దోడ్కొని రాఁ
గదవే తామసము చేయక చెలీ పదవే.

అన్నాడు శ్రీమన్నారు రాజ గోపాల దేవుడు. రుక్మిణి యింటి కరిగి నాడు స్వామి. అచట పాచికల నాడుచుండెను. సత్యభామ చెలికత్తె చూచినది. సత్యభామతో చెప్పినది. ఆమె కలుక పొడమినది. క్రోధాగారంబు చేరి తలుపులు బంధించు కొనినది. స్వామి సత్యభామ గృహంబునకు వచ్చెను. అలుక తీర్చి యేలుకొనెను. ఈ సందర్భమున సత్యా కృష్ణుల సంభాషణ చక్కగా నున్నది. ఈ రూపకమునందు విజయ రాఘవ భూపాలుని భక్తి చెప్పకొన తగినది.

దీని తరువాత విజయరాఘవ నాయకుని రఘునాథాభ్యుదయము రసవంత మగు చక్కని రచన కలది. రఘునాథ నాయకాభ్యుదయ కావ్యములోని ద్విపదలను సందర్భానుసారముగా వాడెను. పదములు దరువులు కీర్తనలు జతపరచి గద్యముల కూర్పుతో నీ యక్షగానము రచింపబడెను. విజయ రాఘవ భూపాలుడు మాతా పితృ భక్తి కలవాడు. మన్నారు దేవునియందు వినయ విశ్వాసములు గలవాడు. ఆ రెండు దీనియందు పరిస్ఫుట

ముగా కనిపించును. ఆ పితృ భక్తి రఘునాథ రాయలను శ్రీరామ చంద్రుని మూర్త్యంతరముగా జిత్రింప చేసినది. ఆయన నల్లే పోషించినచో కథావస్తువు చాల రమణీయముగాను జనాకర్ష ణీయముగాను ప్రశంసా పాత్రముగాను నుండెడిది. విజయ రాఘవుని శృంగార రసమునందలి యభిరుచి రఘునాథ నాయకుని దక్షిణ నాయకునిగా చేయించినది. చిత్రరేఖా వృత్తాంతము చేర్పించినది. కథ యంతయు చెడినది. రఘునాథ నాయకు డెట్టివా డయినను విజయ రాఘవుని పితృ భక్తికొక కళంకము నాపాదించినది. విజయ రాఘవ విభుడు సంగీత సాహిత్య నాట్య కళా కోవిదుడు తండ్రివలెనె ఆయన చిత్తవృత్తి శృంగారము కాక మానదు. అందులో నాదర్శ దైవము రాజగోపాల దేవుడు. కావున శృంగార రస సహితమైనది ఆయన భక్తికూడ. ప్రకృతి కనుగుణముగా నా రాజవిభుని రచన లన్నియు శృంగారము లయినవి. తాను చెప్పిన రంగాజమ్మచేత వ్రాయించిన మన్నారుదాసవిలాస మను యక్షగానము కూడ శృంగార మయినది. మన్నారుదాసవిలాస ప్రబంధములోని కథయే యక్షగానమునందు కలదు. నాయకుడు విజయ రాఘవుడు. నాయిక కాంతిమతి. విజయ రాఘవ నాయకుడు మన్నారు రాజగోపాలుడుగా నిరూపింపబడెను. ఇది మిగుల విచిత్రమగు సంగతి.

విజయరాఘవ భూపాలుని తనయుడు మన్నారు దేవుడు. తాత తండ్రుల వలె రాజగోపాల స్వామివారి యందు భక్తి కల వాడు. 'హేమాబ్జ నాయికా స్వయంవరము' అను యక్షగానము రచించెను. ఇందలి కథ దేవ దానవులు పాల సముద్రము మథిం చుట, లక్ష్మి జన్మించుట, నారాయణు డామెను పరిణయ మాడుట. ఇది సృష్ట్యాదియం దెప్పుడు జరిగినదో నిర్ణయింప నలవి కాదు. కృత యుగమునం దెప్పుడో జరిగి యుండవచ్చును. కలియుగమున విజయరాఘవుని కాలమునందు జరిగినట్లు వ్రాయబడినది. ఇంతకంటె పరిహాసింపదగిన సంగతి యింకొకటి కలుగదు. విజయరాఘవ భూపతి ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరించినాడు.

శృంగార వతులు తన చెంగట చేరి కొలువ
సంగీత మేళంబు సరస రాణింప
రంగు మీరఁగా విజయ రాఘు వేంద్రుఁడా వేళ
బంగారు మన్నారు పజ్జకు వచ్చె.

ఆ సమయమున స్వామి చెంగమాంబిక మీఁది మోహమున పరిత పించుచుండెను. స్వామిని ప్రశ్నించి కారణము తెలిసికొనినాఁడు విజయరాఘువ నృపతి.

రయమున నీ ప్రొద్దు కడలి రాజుతో మాటలాడి
ప్రియముగా నీ పెండ్లి మాకు నొనగూర్పుము.

అని యర్థించినాఁడు మన్నారు స్వామి. అంగీకరించినాఁడు మహారాజు.

వెల లేని తేజి నెక్కి విజయ రాఘు వేంద్రుండు
కలశాబ్ధి రాజు నగరికి కదలి వచ్చె నపుడు
ఘనత మీరఁ గడలిరాజు కైదండ యొసఁగి
తనదు నగరికి మన్నారుదాసుఁ దోడి తెచ్చె.

విజయరాఘువ భూపాలుడు వియ్యంపు రాయబారములు నడిపెను. చెంగమాంబా మన్నారుల పరిణయము జరిపించెను. ఇది విజయ రాఘువు ననుమతిని మన్నారుదేవుడు వ్రాసిన రూపకము. విజయ రాఘువుని కాలమునందు వెలసిన ప్రబంధములు యక్షగానములు. పరిశీలించి చూచినచో నా మహారాజు గుణ శీలములు చక్కగా గోచరించును. ఆయన భక్తి సంగతి యెట్లున్నను తాను దేవతయో దైవమో యను అహంభావము కలవాడని తేలుచున్నది. అంతటి స్వార్థపరులు కడపటి నాయకరాజులు,

తెనుగు దేశమునందు వెలువడిన యక్షగానములు పౌరాణిక తత్త్వము ననుసరించి వ్రాయ బడినవి. కావున నవి శివ సంబంధము లైనను విష్ణు సంబంధములైనను లోకవ్యాప్తిని చెందినవి. వేశ్యలు దేవక్షేత్రములందు, రాజ సభలందు యక్షగానములను ప్రదర్శించిరి.

కూచిపూడి భాగవతులు పెద్ద పెద్ద గ్రామములందు బస్తీలయందు రాజధానులయందు తమ ప్రదర్శనములను జరిపించి జనాదరణమును రాజ గౌరవములను పొందిరి. తరువాత జక్కులను నొక కులము వారును ఏనాది భాగవతులు యక్షగానముల నభ్యసించిరి. మాల గూడెములందు కుగ్రామములందు ప్రదర్శించుచు వచ్చిరి. వాని నెవరు రచించిరోగాని కూచిపూడివారి రూపకములకు జక్కులు ఏనాదు లాడు రూపకములకు కథ ఒక్కటైనను రచనలో నే సంబంధము లేదు. వారి ప్రదర్శనములలో హాస్యమునకు సింగి సింగడు పాత్రలు సృష్టించబడినవి. వేటూరు ప్రభాకరశాస్త్రిగారు కొరవంజుల ప్రదర్శనములలోని సింగి సింగడు, నలుడు, హరిశ్చంద్రుడు మొదలగు పాత్రలుగా మారినవని రచించిరి. యక్ష గానముల పుట్టు పూర్వోత్తరములు సరిగా నాలోచించినచో వారట్లు వ్రాసి యుండరని నా యూహ.

యక్ష గానములు పామర పండిత జనాదరముకొరకు కళావిదులైన పండితులచేత వాడుక భాషయందు మొదట వ్రాయబడినవి. వానియందలి యితివృత్తములు పౌరాణికములు. వానిని ప్రదర్శించినవారు భగవద్భక్తులయిన నాట్య సంగీత కళా కోవిదులగు భాగవతులు సాహిత్య విదులు. తరువాత జనాదరము మిక్కుటమయిన కొలంది తక్కువ జాతివారు సైతము వానిని అభ్యసించి ప్రదర్శించుచు వచ్చిరి. తెనుగు దేశమునందు వీధి నాటకములను పేరుతో యక్షగానములు మూల మూలలందు వ్యాపించినవి. కూచిపూడివారు దక్షిణ దేశమునందును వీనిని ప్రదర్శించిరి. విజయరాఘవ నాయకుని కాలమునం దీ యక్షగానములు చాలా వెలువడినవి. వానియం దనౌచిత్యములు పెక్కు లుండుటచేత తెనుగు దేశమునందలి ప్రాచీన యక్షగానములంత ప్రసిద్ధికి రాలేదు. విజయ రాఘవ నాయకునితో నాయక రాజ్య మంతరించినది. యక్షగానములు

వ్రాసినవి ప్రచారములోకి తెచ్చుటకు సావకాశము కూడ లేకపోయి యుండవచ్చును.

తరువాత కాలమునందు భోసల వంశీయులగు మహారాష్ట్రులకు తంజావూరు రాజ్యము వశమయినది. వారిలో తుక్కోజీ యను నామాంతరము గల తులజ మహారాజు రాజరంజన విద్యా విలాస మను యక్షగాన మొకటి వ్రాసెను. దానిని యక్షగాన మనుట కంటె నాటక మనుట యుచితము. నాటక లక్షణము లందు మిక్కుటముగా కనిపించుచున్నవి. నాంది, నాంద్యంతమున ప్రస్తావన, అందు సూత్రధార పారిపార్శ్వకులు, కవి కథావస్తువుల గురించిన సంభాషణ.

విలసిత కిసలయ నవ సుమ
ఫల పరిమళ శోభితములు భావజ చాపో
జ్వాల గుణ శుక పిక ముఖ రవ
మలయానిల భాసురములు మధు వాసరముల్.

అను వసంత ఋతువు వర్ణనము కలవు. సూత్రధారుడు నాటకాంతమువరకు నుండును. నాటకములోని చూళిక ప్రవేశకముల కార్యములను నిర్వర్తించును, యక్షగానములందు హాంగుదారుడు చేయు పని. ఇది వేదాంత సంబంధ మగు నాటకము. ఆత్మ మహారాజు గాత్రపురము నేలుచుండును. సంతోషుడు, మాయాదేవి, మోహుడు కర్మశర్మ. సుఖుడు, అధర్ముడు, పరమేశ్వరుడు మొదలగు వారిందలి పాత్రలు. సంస్కృతమునందు ప్రబోధ చంద్రోదయము ననుసరించి యీ నాటకము వ్రాయబడినది. తుక్కోజీ మహారాజు శివ భక్తుడు. తన నాటకమున

శ్రీమచ్చిదానంద! శివ! జగత్కంద?
సామాది నిగమ ప్రసవ మకరంద!
అతిశయాధార పద్మాంత రామోద
రత మధువ్రత! లస త్ప్రణవ స్వరూప!

పరిపూర్ణ! నిర్గుణ! బ్రహ్మాండ కోటి
సురుచిర మణి సూత్ర! సుజ్ఞాన దీప!
సరసాక్ష రాకార ! సజ్జనాధార !
కరుణించి రక్షించు కరుణా పయోధి.

అని నాందియందు నుడివెను. ఇందు శివున కుపయోగించిన 'అతి శయాధార, పద్మాంతరామోద రత మధువ్రత' యను విశేషము లను బట్టి శివ పంచాక్షరీ మంత్రో పాసకు డనియు, నాటకమునందు కథను బట్టి గొప్ప వేదాంతి యనియు తోచుచున్నది. కావుననే యిట్టినాటకము వ్రాయుటకు పూనుకొనెను. వీరిశైవ సాంప్రదాయ ములకు వీర వైష్ణవ సాంప్రదాయముల కిదే తారతమ్యము. వారిది స్వచ్ఛమయిన స్వాతిక భక్తి. వీరిది శృంగార సంయుత మయిన మధురభక్తి. వారిది నిశ్చలమగు హఠయోగ సమాధి. వీరిది నవ విధములగు దాస్య నిష్ఠా సమాధి. సంయమనము వారికి ప్రధానము. వీరి కది అప్రధానము. శివుడు పరమ యోగి. విష్ణు స్వరూపు డగు శ్రీకృష్ణుడు పరమ భోగి. వారి వారి మత సాంప్రదాయములను బట్టి భావము లుండును. కావుననే శైవ కవుల కృతులు వైరాగ్య విశిష్టములయి యుండును. వైష్ణవులగు కవుల గ్రంథములు శృంగార విశిష్టములయి యుండును. నాయకరాజులు శ్రీకృష్ణ భక్తులు. వారి యాస్థాన కవులు చాలవర కట్టివారు. కావున వారి రచన లన్నియు శృంగారము లయినవి.

## ౧౧

## వైష్ణవ మత ప్రభావము

కవి యొక ప్రవక్త. కావ్యము వారి ప్రబోధము. కవిత్వ మాతనిసాధనము. దానికిశయ్యా సౌందర్యములు పొందుపరచి కవి లోకమునకు ప్రదర్శించును. వాని రచనలు సాంఘిక ప్రవృత్తికి నిదర్శనములు. మత సాంప్రదాయములకు ప్రతిబింబములు, జాతి స్వభావములకు ప్రతినిధులు. భావి మానవ లోకమునకు మార్గదర్శకములు. అవి చిరంజీవములు. వానికి వినాశ ముండదు. జాతి యధః పతనము చెంది మానవ ప్రవృత్తి గాఢాంధకారమునం దలుకులాడు సమయమున సూర్యకిరణమువలె వెలుగును ప్రసాదించును. అవి జాతి జీవనమునకు మూల కందములు. మతమునకు ప్రాణాధారములు. కావ్యమునందలి యితివృత్తములకు జాతి మత సాంప్రదాయములు చైతన్యము నాపాదించును. పాఠకుల యూహా సౌజన్యముల నాకర్షించును. హృదయ ఫలకమునందు శిలాక్షరముల నొదవించును. దానివలన జాతి సజీవమై నిలుచును. ప్రపంచమునందలి యుత్తమ కవిరచన లన్నియు నా యా జాతులకు రూపు మాయని వెలుగు దీపములు. వానియందలి సాంఘిక పారమార్థిక తత్త్వములు జ్యోతిస్సముదాయములు. పాఠకుల చిత్తమునకు విజ్ఞాన దృష్టిని ప్రసాదించును. ఆ యా జాతుల జీవిత సర్వస్వము హృదయ గోచరమొనరించును.

పరిషియన్ జాతి అతి ప్రాచీన మయిన దని చరిత్రలు నుడువుచున్నవి. అవెస్తా వారికి ప్రమాణ గ్రంథము. దానియందు వారి మత సంప్రదాయములు ఆచార వ్యవహారములు దేవతలు వారి కథలు గలవు. హోమరు పుట్టుగ్రుడ్డి, మహాకవి. గ్రీసు దేశీయుడు. ఇలియడ్ ఒడిసి యను రెండు గ్రంథములను వ్రాసెను, ఇలియడ్ రామాయణము వంటిది. గ్రీకురాణి హెలన్. ఆమె నొక ట్రోజన్

వీరు డెత్తుకొని పోయెను. గ్రీకులకు ట్రోజనులకు పదేండ్లు యుద్ధము జరిగినది. ఒడిసియులిసిస్ వీరగాథ, దాదాపు భారతము వలె నుండును. రెండు గ్రంథములందు గ్రీకుల విశ్వాసములు దేవతలు ఆచారములు జీవితములు హృదయ గోచరములగు చుండును.

మిల్టన్ ఆంగ్లేయుడు కైస్తవ మతావలంబి. విద్వత్కవి. సేతను కథను తీసికొని పేరడైజు లాస్టు, పేరడైజు రిగైన్ అను పద్యకావ్యములనువ్రాసెను. సేతను దైవమును తిరస్కరించుట, స్వర్గమునుండి త్రోసివేయబడుట, తన జట్టును సమకూర్చుకొని మరల స్వర్గరాజ్యమును సంపాదింప యత్నించుట, అందలి యితి వృత్తము. వానియందు కైస్తవ మత స్వరూపము అవగత మగు చుండును.

షేక్స్పియరు పెక్కు నాటకములు విరచించెను. వాటిలో మర్చంట్ ఆఫ్ వెన్నిసు సుప్రసిద్ధమయినది. ఆ నాటకమున కున్న ప్రచారము మరే యితర నాటకమునకు లేదు. దానికి ప్రధాన కారణము అందలి కైస్తవ మత తత్త్వము. అంటానియో పర మార్థ జీవనము. షైలాకు దురాగతము, పోర్షియా బోధించిన దయా స్వభావ స్వరూపములు ఆ రూపకమున కొక విశిష్టత కల్పించినవి. హామ్లెట్టునందలి రాజభూతము కైస్తవుల విశ్వాసమును నిశ్వసించు చున్నది. మానవుడు మరణించిన తరువాత వాని యాత్మ దేవుని యొక్క తీర్పుదినము వరకు గాలిలో సంచారము చేయుచుండు నని వారి నమ్మకము. క్రీస్తు మరణించిన తరువాత మూడవనాడు వాని యాత్మ శిష్యులకు కనిపించినదని బైబిలు గ్రంథము చెప్పుచున్నది. ఇట్టి విశ్వాసములను మత తత్త్వములను రూపకములందు పొందుపరచి నాడు షేక్స్పియరు. కవి రచనలందు మత విశ్వాసములు సందర్భానుసారముగా నిమిడి యుండును. జాతి సాంప్రదాయములు పొందుపడి యుండును. జాతి మతము లంతరించినను కృతులు వాని ప్రతినిధులయి లోకమునందు నిలిచి యుండును.

భారతీయులకు వేదములు ప్రమాణములు. ఉపనిషత్తులు ఆరణ్యకములు వాని కనుబంధములు. హైందవ మత సాంప్రదాయములు వివిధ దేవతలు వారిని గురించిన స్తవములు వానియందు గలవు. బ్రహ్మ విష్ణు మహేశ్వరు లధిష్ఠాన దైవతములు. వేదములందు వారికి ప్రధాన స్థానము కలదు. ఇది వేద వాఙ్మయము. భారతీయులు త్రిమూర్తుల నీ కాలమునందు పూజించిరి. నుతించిరి. యజించిరి. వేదములం దర్థవాదములు కలవు. అవి కథలు. వానిని మార్చియు నూతన విషయములను చేర్చియు, మానవ జీవిత చరిత్రలతో పొందుపరచి ధర్మావబోధకముగా నుండునటుల ప్రాకృత జనోపయోగముకొరకు వ్యాస మహాముని పురాణములను రూపొందించెను. అవి వేదముల సారములు. పదునెనిమిది పురాణము లవి. ఉప పురాణములు పదునెనిమిది. వీనియందు శివుడు ప్రధానుడుగా చెప్పబడిన పురాణములు శైవములు. విష్ణువు ప్రధానుడుగా చెప్పబడిన పురాణములు వైష్ణవములు. ఇది పురాణ వాఙ్మయము.

యుగములు గడచినవి. వేద సాంప్రదాయముల కెట్టి విఘాతము కలుగలేదు. చరిత్ర కాలము వచ్చినది. మత విప్లవము బయలుదేరినది. జైనులు బౌద్ధులు వేద ప్రామాణ్యమును తిరస్కరించిరి. అవి చార్వాక మతములు. ఉత్తర భారతదేశమును ముంచెత్తినవి. దక్షిణ దిశాభిముఖములయి తీవ్రమగు ప్రచారము సాగించినవి. ద్రావిడ దేశమునందు పౌరాణిక మతములు పొడసూపినవి. నాయనారులను శివభక్తులు శైవమతమును ప్రచారము చేసిరి. ఆళ్వారు లను విష్ణు భక్తులు వైష్ణవ మతమును ప్రచారము చేసిరి. ఇట్లు వేద మతము విభిన్నము లైనది.

ఇది క్రీస్తు శకము ఆరవ శతాబ్దములోని సంగతి. అప్పుడు పల్లవులు రాజులు. వారు శైవులు. తిరుమళిశై ఆళ్వారు లీ కాలమునందు నివసించి యుండిరని ప్రతీతి. ఏడవ శతాబ్దమునాటికి శైవ వైష్ణవ మత ప్రాబల్యములు పెరిగిపోయినవి. వారికి కులభేదములు లేవు. తక్కువ కులమువారు సైతము భక్తులై అగ్రకులమువారి

పూజలను గౌరవములను పొందుచు వచ్చిరి. వైరాగ్యము శైవులకు ప్రధానము. భక్తి వైష్ణవులకు ముఖ్యము. స్కాంధాది పురాణములు శైవులకు ప్రమాణములు. భాగవతాది పురాణములు వైష్ణవులకు ప్రమాణములు. శ్రీరంగమునందలి విష్ణువును కృష్ణపరముగా నాళ్వారులు పూజించిరి. వానిపై తమిళ భాషయందు నుతులు ప్రబంధములు వ్రాసిరి. శఠకోపుడు, నాథముని, శ్రీరామమిశ్రుడు, యామునాచార్యులు మొదలగువారు విష్ణుభక్తులయిరి. వారు మహా పండితులు. వైష్ణవ మతమును మిక్కిలి ప్రచారము లోనికి తెచ్చిరి. జైన బౌద్ధ శైవ వైష్ణవముల నడుమ వేద మతము సన్నగిలిపోయినది.

కుమారిల భట్టు ఆంధ్రుడు. సకల శాస్త్ర పండితుడు. జైన బౌద్ధమత పండితులను వాగ్వాదమున నోడించెను. ఆ రెండు మతములను అడుగంట త్రొక్కివేసెను. వేదకర్మల ప్రామాణ్యము నుద్ధరించెను. జైమిని సూత్రములకు మహాభాష్యము వ్రాసెను. దానికి పూర్వ మీమాంస యందురు. ఆయన మతమునకు భాట్ట మతము లేక కర్మ మతమని పేరు.

ఎనిమిదవ శతాబ్దాంతమునందు శంకరుడు పూర్వ మీమాంస మతమును ఖండించి యద్వైత మతమును స్థాపించెను. వ్యాసుని బ్రహ్మ సూత్రములకు భాష్యమును రచించెను' దానిని ఉత్తర మీమాంస యందురు. జ్ఞానమువలన మోక్షము లభించునని శంకరుని మతము. మరణానంతరము జ్ఞానియైనవాని జీవాత్మ ఆవరణ భంగముచే పరమాత్మ యందు ఐక్యము నొందునని యాయన సిద్ధాంతము. శంకరుడు చిన్నతనముననే సన్యసించెను. మహాపండితుడయి సకల మతములవారిని వాగ్వాదములం దోడించెను. ఆసేతు శీతాచల పర్యంతము భారత దేశ మంతయు ప్రచారము గావించెను. మఠములను పీఠములను నెలకొల్పెను. వేదమతము నుద్ధరించెను. జగద్గురువను విఖ్యాతిని బొందెను. అంతటి మత ప్రచారము గావించినవారు భారతదేశమునం దింకొకరు లేరు. జైన బౌద్ధాది మతము లడుగంటి పోయినవి.

పదునొకండవ శతాబ్దమునందు రామానుజుడు జన్మించెను. ఇంతవరకు ఆళ్వారుల చేతియందు పౌరాణిక మతముగా వర్ధిలుచున్న వైష్ణవమును దేవ మతముగా రూపొందించెను. దానికి విశిష్టాద్వైత మత మని పేరు. దానినే శ్రీవైష్ణవ మనిగాని వీరవైష్ణవ మనిగాని యందురు. ఆళ్వారులు రచించిన ప్రబంధములకు ద్రావిడ ప్రబంధము లని పేరు. శ్రీ రామానుజులవారు ద్రావిడ ప్రబంధము లన్నియు సేకరించెను. వానికి వైష్ణవ మతమునందు ప్రధాన స్థాన మొసంగెను. అప్పటినుండియు వైష్ణవ మమితముగా ప్రచారములోనికి వచ్చెను. ద్రావిడ దేశము పొలిమేర లతిక్రమించినది. కన్నడ రాజ్యమున స్థిర నివాస మేర్పరచుకొన్నది.

తెనుగు దేశమునందు వైష్ణవమును మించి శైవ మతము మిగుల ప్రాబల్యము వహించెను. పండ్రెండవ శతాబ్దమునందు మల్లికార్జున పండితా రాధ్యులు శ్రీశైలమున ఘోరమగు తప మాచరించి వీరశైవ మతమునకు బీజములను వెదజల్లెను. కళ్యాణ పురాధీశుండగు బిజ్జలుని మంత్రి బసవేశ్వరుడు. అతడు నందీశ్వరుని యవతారమని లోకమునందు ప్రతీతి. బసవేశ్వరుడు వీరశైవ మతమును మిగుల వ్యాప్తిలోనికి తెచ్చెను. ఆ కాలమునందు నన్నెచోడుడు కుమారసంభవ మను కావ్యమును రచించెను. తరువాత పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర, బసవ పురాణములను ద్విపద చ్ఛందమునందు వ్రాసెను. కాల క్రమమున శివలింగ లీలలు, చెన్న బసవ పురాణాదులు వెలిసినవి. ఇవి వీరశైవ మత ప్రచారము కొరకు వ్రాయబడిన గ్రంథములు. వీనియందు శైవ మతాచార వ్యవహారములు సాంప్రదాయములు గోచరించును.

శ్రీనాథుడు రచించిన భీమఖండము కాశీఖండము హార విలాసాదులందు వీరశైవ మత తత్త్వము బహువిధముల నవగత మగుచుండును. పదునైదవ శతాబ్దాంతమువరకు గల తెనుగు దేశము నందలి కవులందరు దాదాపు శైవులనియే చెప్పవలయును. ఐనను వారికి విష్ణుద్వేషము లేదు. ఎఱ్ఱాప్రగడ శివపూజా ధురం

ధరుడు. నృసింహ పురాణము, హరివంశములను తెనిగించెను. పోతన శివ పంచాక్షరీ మంత్రోపాసకుడు. భక్తి వైరాగ్యముల స్వరూపమును చక్కగా నవగతము గావించుకొనిన శీరశైవ మతాచార పరాయణుడు. భాగవతమును తెనిగించెను. అది వైష్ణవులకు పరమ ప్రమాణ గ్రంథము. శ్రీకృష్ణతత్త్వమును బోధించు నుత్తమ పురాణము. ఎఱ్ఱాప్రగడాదులు తమ కావ్యములను కావ్యకళా దృష్టితో రచించిరి గాని మత దృష్టితో వ్రాయలేదు. కావుననే వారి రచనలు సర్వజనాదరణీయము లైనవి.

పదునారవ శతాబ్దము నుండియు వైష్ణవ మతాభివృద్ధితో పాటు వైష్ణవ కవులు తెనుగు దేశమునందు పొడసూపిరి. శ్రీకృష్ణ రాయలవారు విష్ణుచిత్తీయమును రచించిరి. అది వైష్ణవ మత గ్రంథము. ఆయన వైష్ణవుడు. వైష్ణవులా గ్రంథమును మిగుల గౌరవింతురు. దానికి కారణ మందలి వైష్ణవమత తత్త్వము. బసవ పురాణమునందు శివుడు బసవేశ్వరుని వీరశైవ మత ప్రచారము కొరకు ప్రోత్సహించెను. విష్ణుచిత్తీయమునందు హరి విష్ణుచిత్తుని వైష్ణవమత సంస్థాపన కొరకు నియమించెను. స్వ పరభేదములు లేక "శివస్య హృదయం విష్ణుః, విష్ణోశ్చ హృదయగ్ం శివః' అని వేదములచేత వినుతింపబడు పరతత్త్వ స్వరూపులు శివ కేశవులు. వారికి స్వమతాభిమానము పరమత ద్వేషము కల్పించినవారు మానవులు. మత ప్రభావము లటువంటివి. తెనుగు దేశమున వైష్ణవ కవుల రచనలందు కంటె దక్షిణ దేశమునందలి వైష్ణవ కవుల రచనలలో నీ ప్రభావము మిక్కుటముగా కనిపించును. వైజయంతీ విలాసకర్త సారంగు తమ్మయ. ఆయన వైష్ణవుడు. తనకు సాక్షాత్కరించిన శ్రీరామ చంద్రుడు

నగు మొగంబున నెలవంక నలిక మైన
తిరుమణి ధరించువాఁడు

అని వర్ణించినాడు. పోతనకు రాముడు సాక్షాత్కరించెను. ఆయన ముఖమున తిరుమణిగాని తిరుచూర్ణముగాని యున్నటుల వర్ణించ

లేదు. పోతనయే కాదు మరే యితర పూర్వ కవియు విష్ణువు ముఖమున పట్టెవర్ధనము లున్నవని వర్ణించినట్లు నేను తలంపను. విప్రనారాయణుడు

నడు వీధిగల నిల్వు నామంబు పట్టెలు
శోభితంబగు తిరుచూర్ణ రేఖ

కలవాడని వైజయంతీ విలాసమునందు కలదు. ఇది వైష్ణవమత సాంప్రదాయము. ఇట్టి సాంప్రదాయములు తంజావూరు కవుల కావ్యములందు సర్వసాధారణముగా కనిపించును.

రఘునాథ నాయక భూపతి వైష్ణవుడు. శ్రీరామ భక్తుడు. రఘునాథ రామాయణమునందు ఋశ్యశృంగు నొక వైష్ణవ భక్తునిగా నిరూపించెను. నొసట నూర్ధ్వ త్రిపుండ్రములు చెవులకు తులసి భూషలు. ఋశ్యశృంగుని చూచినారు వేశ్యలు

ఈ పట్టవర్ధనం బేటికి నుదుటికిఁ
దీరుగాఁ గస్తూరి దిద్దరాదె
ఈ తులసీ భూష లేటికిఁ జెవులకుఁ
గట్టాణి యొంటులు వెట్టరాదె

అని తలంచినారు. రామాయణ కథ త్రేతాయుగములోనిది. రాముని రాజ్య కాలమునందు వాల్మీకి కలడు. రాముని యశ్వమేధము నాటికి రామాయణము పూర్తియైనది. రాముడు పుట్టక పూర్వము ఋశ్యశృంగ మహాముని నివసించి యుండెను. రాముడు కాని ఋష్యశృంగుడు కాని పట్టవర్ధనములు ధరించి నటుల రామాయణమునం దెచ్చటను చెప్పబడి యుండలేదు. రఘునాథ నాయకుని స్వమతాభిమానము ఋశ్యశృంగుని వైష్ణవుని గావించినది. ఆయన ఆస్థాన కవి చేమకూర వేంకటరాజు. అతడు విజయ విలాస కావ్యము రచించెను. అందు గంగా తీరమునందు దాన లీలా పరుండయి యున్న సవ్యసాచిని చూచినది యులూచి.

సిగ సంపెంగ పూ లొసపరి
వగ కస్తురి నామ మొలపు వలెవా బారా!
సొగసిటు లుండగవలె నని
సొగసి లతాతన్వి యతని సొగసు నుతించెన్.

అని యర్జునుడు కస్తురితో నుదుట నామము ధరించి నటుల వర్ణించెను. అర్జునుడు శ్రీకృష్ణ భక్తు డనుమాట సత్యము. కాని పాశుపతముకొరకు శివునిగూర్చి తప మొనరించె నను మాట మరువ కూడదు. వేదకాలమునందు కాని పురాణకాలమందు కాని శివ కేశవుల యెడ భేదాభిప్రాయము మానవులందు లేదు. మానవులందే కాదు అవతార పురుషులయిన రామ కృష్ణులకు సైతము శివునియెడ విభిన్న ప్రవృత్తి లేదు. శ్రీరామచంద్రుడు రావణ సంహారమువలని కలిగిన బ్రహ్మహత్యా మహాపాపము తొలగించు కొనుటకొరకు రామేశ్వరమున శివ ప్రతిష్ఠ గావించెను. వేదముల సారము పురాణములు. వేదములు గాని పురాణములుగాని శివ కేశవులను విభిన్న మూర్తులుగా నంగీకరించినవి గాని విభిన్న హృదయులుగా నంగీకరింపలేదు. కావున శివ మయో విష్ణుః అని చెప్పబడినది. చరిత్ర కాలమువరకు వారి నట్లే మానవులు పూజించిరి, ఉపాసించిరి. వా రే తీరున తిలకమును ధరించినదియు నెవరును నిరూపింపలేరు.

శివు డగ్ని స్వరూపుడు. ఓషధులతో అశ్వత్థము నారాయణుడు. ఆ కారణముచేత రావి పుడకలు పవిత్రము లయిన సమిధలుగా నంగీకరించినారు మహామునులు. సమిధలచేత ప్రజ్వలింపబడిన అగ్ని శివమయ మయిన విష్ణుస్వరూపము. అందు రేతస్స్వరూప మయిన ఆజ్యము వేల్వగా పొడమిన భస్మము పవిత్రమయినది. దానిని ఆజ్య శేషముతో మిశ్రమము చేసి నుదుట ధరించినారు ఆహితాగ్నులు. ఇది అద్వైతులకు విశిష్టాద్వైతులకు సర్వ సాధారణ మయిన ఆచారముగా ఇప్పటికి నున్నది. వేద పురాణ కాలములందు నిదియే ఆచారమై యుండిన నుండవచ్చును. శైవ వైష్ణవములు పురాణ మతములు. పురాణములందు శివుడు

భస్మ ధరుండని వర్ణింప బడినది. కావున శైవులకు భస్మము పవిత్ర మయినది. దానిని వారు నుదుటను మేనను త్రిపుండ్రములుగా ధరింతురు. మూడు రేఖలు పశువు పాశము ఈశుడని వారి వ్యాఖ్యా నము. అది వారికి రక్ష. దానినే శ్రీనాథుడు 'పాండు రక్షా ధృతి' అని వాడినాడు. ఈ తిర్యక్త్రిపుండ్ర ధారణము కాళిదాసు కాలము నకు పూర్వమునుండియు నాచరణలో నున్నదని యూహింపవలసి యున్నది.

కాళిదాసు ఆరవ శతాబ్దములోనివాడు. ఆరవ శతాబ్దము నందు తిరుమళిశై ఆళ్వారులు జీవించి యుండిరి. అది దక్షిణ భారతమునందు పల్లవుల కాలము. పల్లవ రాజులు శైవులు. అంతకు పూర్వము ఒక శతాబ్దమునుండియు వైష్ణవ మతము ద్రావిడ దేశమునందు కలదు. వైష్ణవులకు శైవులతో పాటు శివుడు, శివుడు దాల్చిన భస్మము అనంగీకారమయినది.

సూర్యుడు నారాయణ స్వరూపుడు. సూర్యుని తేజముచేత తప్తమగునది మన్ను. కావున మృత్తును పవిత్రమగు వస్తువుగా మొదట నుదుటయందు మూడూర్ధ్వ రేఖలుగా వైష్ణవులు ధరించిరి. సచ్చిదానందమూర్తి శ్రీమన్నారాయణుడు. సత్తు, చిత్తు, ఆనంద రేఖలు మూడనియు వాని సంయోగము క్రింది పాదమనియు వారి వ్యాఖ్యానము. తరువాతి కాలమువారు దానిని విష్ణు పాదమని రూపించిరి. దానిని తిరుమణి తిరుచూర్ణముతో పెట్టుచు వచ్చిరి. తిరు అనగా శ్రీ యనియు మణ్ మణి మన్ను అనియు అర్థములు. అట్లే తిరు చూర్ణ మనగా శ్రీచూర్ణమని యర్థము. వీనితో శ్రీవైష్ణ వులు పట్టవర్ధనములు పెట్టుదురు. కావున నామములు వైష్ణవ మతముతో పుట్టినవి. దాదాపు ఐదవ శతాబ్దమునందు ప్రారంభింప బడి యుండవచ్చును.

అర్జునుడు కస్తురి నామము ధరించెననుట అప్పటి వైష్ణవమత ప్రభావమని యూహింప వలసి యున్నది. అంతే కాదు ఉలూచి అర్జునునితో నేను కన్నియఁ గాని వేరొకతెఁ గాను. 'నా వలపుఁ

కస్తురి నామము తోడు’ అని యొట్టు పెట్టుకొనినది. దీనివలన ఉలూచి నామము తాల్చినదని యూహింప వలసి యున్నది. వారు వైష్ణవులని నిరూపించుట వేంకటకవి యాశయము. అర్జునుడు ద్వారకకు బయలుదేరెను. సన్యాసి వేషము తాల్చెను.

మృగనాభి తిలకంబు భుగభుగల్ గల లలా
టముపై మృదూర్ధ్వ పుండ్రంబు తీర్చి
శరణాగతాభయ సంధాయకం బైన
దక్షిణ పాణిఁ ద్రిదండ మూని

నాడట. ఇది వైష్ణవ సన్యాసము అని వేరె చెప్పవలసిన పని లేదు. వైష్ణవ సన్యాసులకు శిఖా యజ్ఞోపవీతము నామములుండును. అద్వైత సన్యాసులకు శిఖా యజ్ఞోపవీతము లుండవు. విభూతి రేఖలు ధరింతురు. వారికి దండ మొక్కటే యుండును. వైష్ణవ సన్యాసులకు మూడు దండములు కలిసి యుండును. కావున వారిని త్రిదండు లందురు. చేమకూర వేంకటకవి అర్జునుని త్రిదండిగా రూపొందించినాడు. అట్లు చేయుటలో వైష్ణవ మతాభిమాన మటులుండ నింకొక కారణము కూడ కలదు. శిఖా యజ్ఞోపవీతములు తీసివేయ వలసిన పని లేదు. తేలికగా సన్యాసి వేషము వేయవచ్చును. అందుకనియే వివాహ సమయమున సుభద్ర నెయ్యంపు సఖు లర్జునుని

దండముఁ గాషాయంబును
గుండికయును మాని పెండ్లికొడు కైనా డా
ఖండలుని ముద్దు కొడుకు

అని పరిహాసము లాడిరి. భారతము నందు యతి వేషము తాల్చినట్లున్నది. అది పురాణ కాలపు వేషము. ఆశ్రమములు నాలుగు. వానిలో యత్యాశ్రమము చివరిది. యతులకు సైతము శిఖా యజ్ఞోపవీతము లుండును. వానిని పరిత్యజింప వలసిన పని లేదు. కాషాయము ధరించి యోగదండము జలకుండికయు పూనిన చాలును. తేలికగా యతి కాగలడు. పని తీరిన వెంటనే వానిని

పరిత్యజింప వచ్చును. ఆ కారణముచేత భారతమునందు యతివేష మూనె నని చెప్ప బడినది. వేద కాలమునందు కాని, పురాణ కాలమునందుకాని యిప్పటి అద్వైత విశిష్టాద్వైత సన్యాసులు లేరు. వ్యాసాదులు యతులు. వారు జటావల్కల ధారులు. వేంకటకవి కా విధ మంతగా నచ్చలేదు కాబోలు! అర్జునునకు మృత్తుతో లలాట మున నూర్ధ్వ త్రిపుండ్రములు పెట్టించినాడు. చేతికి త్రిదండ మిప్పించి నాడు. విశిష్టాద్వైత స్వాములను చేసినాడు. ఆకాల మటువంటిది. వైష్ణవమత ప్రభావము పురాణ పురుషుల మీదికి కూడా వ్యాపించినది.

మహారాజు రఘునాథ నాయక భూపతి వీరవైష్ణవుడు. సహజముగా వైష్ణవు లన్నను వైష్ణవాచార సాంప్రదాయము లన్నను మహారాజున కభిమానము మెండు. 'నాపాలిటి రామ భద్రు'డని వినయాతి వినయముగా వినుతించిన ఆశ్రితుడు వేంకట కవి. మహారాజు మీదను ఆయన మతము మీదను కల అత్యంతాభి మానము ఉలూచిని అర్జునుని వైష్ణవులుగా మార్చి వేసినది. రఘు నాథ నాయకుని వైష్ణవాభిమానము విజయ రాఘవ నాయక ధరణీ పతి రచించిన రఘునాథ నాయ కాభ్యుదయమునందు వర్ణింప బడినది. ప్రతిదినము

నిద్దుర మేల్కాంచి నిద్దంపు నిలువు
టద్దంబుఁ గని యిద్ద రయ్యగార్లఁ జూచి
బంగారు బిందెలఁ బాలు కన్గొనుచు
మంగళ ప్రదు గరుత్మంతు నీక్షించి

తరువాతి కార్యక్రమముల కుపక్రమించుట రఘునాథ నాయకున కలవాటు. అయ్యగార్లనగా వైష్ణవ స్వాములని యర్థము. వైష్ణవులు విష్ణు స్వరూపులు. శ్రీకృష్ణ రాయలవారు లేవగానే హజారు రామస్వామి యాలయ గోపురమును చూచెడి వాడని ప్రతీతి. తరువాత గరుత్మంతుని దర్శనము. గరుత్మంతుడు విష్ణు భక్తుడు. విష్ణు వాహనము. వైష్ణవుల గురు పరంపరలో నొకడని కొంద

రందురు. పిమ్మట స్నానము. ఆ స్నానము కూడ 'తంబుగల జలజాత్రు లందించు జలముతో' తంబుగ మెడ నిడివి గల వైష్ణవు లుపయోగించు ఒక రకమగు చెంబు. వైష్ణవు లందరు నదే రకపు చెంబులను వాడుదురు. మహారాజు స్నానాదికములకు వాడు పాత్రలు సైతము వైష్ణవీయములని తేలుచున్నది. ఆయన ఆభరణములలో రామభద్ర తాళి యొకటి. మందిరములందుమా! రామభద్రశాల లక్ష్మి విలాస మందిరము, అచ్యుత రంగకూటము ఇటువంటి విష్ణువు సంబంధమగు పేర్లు కలవి. స్నానానంతరము నామ తీర్థమునకు బయలు దేరును. అప్పుడు సైతము నిద్దరయగార్లను చూడవలయును. అది శుభ ప్రతిపాది యగు శకునము. పిమ్మట కపిల ధేనువునకు గ్రాసమర్పించును. కపిల గోవులం దుత్తమ జాతికి చెందినది. అది కామధేనువు సంతానమని పురాణములు చెప్పుచున్నవి. అట్టివి గోలోకమునందు కలవనియు వానిని శ్రీకృష్ణుడు పాలించు చుండుననియు బ్రహ్మ వైవర్తకమునందు కలదు. భాగవతమునందు కృష్ణు డాల మేపరి యని చెప్పబడుచున్నది. గోవు శ్రీకృష్ణునకు ప్రీతికరమయిన జీవి. కావున వైష్ణవుల కది పూజార్హమయినది. నిత్యము దానిని పూజించి వైష్ణవులు అద్వైతులు కూడ లేంబచ్చిక పెట్టుదురు. అది భారతీ యాచారము, లక్ష్మి విలాస మందిరమున రఘునాథరాయలు.

తిరుచూర్ణ రేఖతోఁ దిరుమణి నుదుట
ధరియించి మేన ద్వాదశ పుండ్రములను
సవరించి మౌక్తిక జప సరం బూని
ప్రవిమలాష్టాక్షరీ పరమ జపంబు

గావించునట. అష్టాక్షరి నారాయణ మంత్రము వైష్ణవు లందరు దాని నుపదేశము పొందుదురు.

ప్రకట వైభవ మొప్ప రాజ గోపాలు
నకుఁ దిరు వారాధనము సాంగముగను

భక్తితో నాచరించుట తరువాతి కార్యక్రమము. ఇది రఘునాథ నాయకుడు విష్ణువున కొనరించు నిత్య సేవ. అనంతరము విష్ణు కథా శ్రవణము. భాగవత రామాయణములను వినును. ఆచార్యుల వారి మంత్రాక్షతలు చివరికి శిరమున ధరించును. అంతటితో దేవతా ప్రసక్తి ముగియును. ఇది ప్రతిదినము జరుగు కార్యక్రమము. ఇది యంతయు వీరవైష్ణవ సంప్రదాయమును లోకమునకు ప్రచారము చేయుట కొరకు వ్రాయబడిన కథా భాగము. ఇంత విపులముగా వైష్ణవమును వర్ణించిన కావ్యములు తెలుగునందు కనిపించవు. విజయరాఘువుని మతావేశము అంతగా వ్రాయించినది. విజయ రాఘువ నాయకుడు తండ్రిని మించిన వీర వైష్ణవుడు.

ఇతర మతముల నిరసించి యిలను వెలయ
వైష్ణవ మతంబె నిలిపె శాశ్వతము గాఁగ

అని రంగాజమ్మ మన్నారు దాస విలాసమునందు నుడివిన మాట సత్యము. నాయక రాజుల కాలమునందు తంజావూరు రాజ్యములో వీర వైష్ణవము మహోన్నత స్థితికి వచ్చినది. రాజులు వీర వైష్ణవులు. వారి ప్రోత్సాహము వలన వీర వైష్ణవము బాగుగా ప్రచారము లోనికి వచ్చినది. వీర శైవ మడుగంటినది. విజయ రాఘువ భూపతి రాజగోపాలుని పాద భక్తుడు. స్వామి ఆలయమునకు ప్రాకార గోపురాదికములను నిర్మించెను. ఉత్తమ వైష్ణవ క్షేత్రముగా తయారు చేసెను. వైష్ణవ మతాభిమానముతో పాటు స్వామియందును దక్షిణ ద్వారకా క్షేత్రము నందును ఆదరాభిమానములు మించిపోయినవి. వైష్ణవముతో పాటు తన పేరును రాజగోపాలుని పేరును తన్నిలయు మయిన చంపకవన క్షేత్రనామమును శాశ్వతముగా భూలోకమం దుండవలయునని విజయరాఘువ నాయక నరపాలు డాశించెను. కావున రఘునాథ నాయకాభ్యుదయ కావ్యమునందు మొదట మన్నారు స్వామిని గురించి యంతగా పొగడినాడు. ఆయన కలలో కనిపించి

బాగుగా నిన్ను చేపట్టి మా పట్టి
వని యెంచి మీ తల్లి యరుణాబ్జ వల్లి
చనుబాలు గ్రోలించి చాల లాలించి

తి నని వచించెను.

'మా యవతారమై మహి నుదయించి'
'రఘునాధ మేదినీ రమణుని చర్య
ధీకౌశలము మించ ద్విపద గావించి
మా కంకితము సేసి మనుము వేయేండ్లు'

అని యాశీర్వదించెనని వ్రాసికొనినాడా మహారాజు. తాను తన తండ్రియు నవతారపురుషులమని, మహత్త్వముకలవారమని, లోక మెంచుకొనవలయునని ఆయన యూహ. దానితో తృప్తిపడలేదు.

రంగత్రైవిధిఁ బ్రబంధ మొక్కటి యొనర్పంగా వలె న్మత్కథన్
రంగాజీ! భవదీయ వాగమృత ధారా వైఖరుల్ మీరఁగన్

ఏతత్ప్రబంధంబునకు నత్యధిక మహాత్త్వంబు గలుగ మన వీటం జెన్నారు మన్నారుల ఫాల్గుణ మహోత్సవాది వైభవంబులు వర్ణింపు మని రంగాజమ్మ నర్థించెను. ఆమె విజయరాఘవులే మన్నారు రాజగోపాలునిగా చేసినది. మన్నారు దాస విలాసము వ్రాసినది. దానికిని మనోరథము తీరలేదు. అట్లు కాదని విప్రనారాయణ చరిత్ర తానె అందుకొని వ్రాసినాడు. రంగని కొదవిన ప్రతీతి మన్నారు రాజగోపాలున కొదవ వలయును. అందువలన తన పేరు ప్రతిష్ఠలు శాశ్వతముగా నుండవలయును. చంపక వనము దక్షిణ ద్వారక యని స్థల పురాణమునం దున్నది. దానికి శ్రీరంగమున కున్న గొప్పతనము రావలయును. అట్లు కావించుట వీర వైష్ణవ మునకే కాక విష్ణువునకును మహత్తరమగు సేవ కావించినవా డగును. అందుమూలమున జన్మసాఫల్యము నొందును. ఇన్ని కోరి కలతో విప్రనారాయణుని కథ మన్నారు రాజగోపాలుని సన్నిధిని

తన కాలమునందు జరిగినటుల మార్పు చేసినాడు విజయరాఘవ నాయకుడు. ఆ దినము లటువంటివి.

వైష్ణవము మహారాజుల యాదరాభిమానములను పొంది సుస్థిరముగా వేళ్లు పాతుకొనినది. తంజావూరు రాజ్యమునం దెల్లెడలను వ్యాపించినది. అచంచల మగు ప్రాబల్యము వహించినది. జనులందు వైష్ణవ స్వీకారము మోక్ష సంపాదనకు రాజమార్గ మను విశ్వాసము పొడమినది. విశ్వాసముమా టెటున్నను మహారాజు దయాదరములు సంపాదింపవచ్చును. వీరశైవుడయిన చెంగల్వకాళకవి వంటి సాహితీ వేత్తలు రాజగోపాల విలాసము వంటి విష్ణు కథలను ప్రబంధములుగా వ్రాసిరి. అది దక్షిణ ద్వారక నిలయుడయిన మన్నారు రాజగోపాలుని కథ. చంపక వన క్షేత్ర మహత్త్వము దానితో పొందుపరచినాడు కవి. విజయరాఘవ భూపతి దానిని వినినాడు. మనసునం దమితముగా నుప్పొంగినాడు. కృతికొని లక్షల కొలంది ధన మొసంగినాడు కవికి. ధన మూల మిదం జగత్—దాని నర్థించియే చేమకూర వేంకటకవి ఉలూచి సవ్యసాచులను వీర వైష్ణవులను గావించెను. మిగిలిన వైష్ణవకవు లందరు ఏదో విధమున తమ మతాభిమానమును కావ్యములందు చూపుచూ వచ్చిరి. శ్రీనివాస తాతాచార్యులవారు విజయరాఘవుని మన్నారు రాజగోపాలుని గావించెను. ఆచార వ్యవహారములందో మరే సంప్రదాయములలోనో వైష్ణవ చిహ్నము కనిపించకుండ వ్రాయుట కావ్యమునకు లోపమని కవులు తలంచిన కాల మది. మహారాజు విజయరాఘవ భూపతి వంటి వీర వైష్ణవుడు విప్రనారాయణుని కథ అట్లు మార్చుటలో నాశ్చర్యము లేదు. విప్రనారాయణుడు తొండరడిప్పొడి యాళ్వారు. వైష్ణవుల గురు పరంపరలో వానికి స్థానమున్నది. అతడు

ఆచార్యుచేత చక్రాంకితుం డౌచు
శ్రీచూర్ణ రేఖల చెలువు రాణింప

నురువు మీఱఁగ ద్వాదశోర్ధ్వ పుండ్రముల
ధరియించి దాసరి తావడా

లు తాల్చినాడట. చక్రాంకితు లగుట శ్రీ వైష్ణవమత స్వీకారము నకు చిహ్నము.

విష్ణు సాలోక్య సారూప్య వివిధ దివ్య
భోగ సామ్రాజ్య వైష్ణ వాభోగ మహిమ.

లలో సారూప్య దివ్యభోగ మది. దానికితోడు వీర వైష్ణవు లందరు శరీరముమీద నా యా ప్రదేశములందు పండ్రెండు నామములను ధరింతురు. శ్రీరంగమునందు పరమ భాగవతోత్తములు ఇటు వలెనే.

అలికాది కాంగంబు లనుగత శ్రీచూర్ణ
ధవళోర్ధ్వ పుండ్ర బాంధవము నెరప
వదనాంబుజములు దివ్య ప్రబంధాను సం
ధాన వాసనతోడ నంటు సేయఁ
గంఠ దేశంబులు కమలాక్ష తులసికా
మాలికా సౌహార్ద్ర లీల నడఁప
బాహు మూలములు శుంభ త్సుదర్శన పాంచ
జన్య లాంఛన మైత్రి సంఘటింప

విష్ణు పర్యాయ మూర్తులై వెలుగొందుచుందురని సారంగుతమ్మయ వర్ణించినాడు.

శ్రీరంగమునందే కాదు తంజావూరు మధుర రాజ్యములం దెల్లెడల పదునేడు పదునెనిమిది శతాబ్దములలో వైష్ణవ మంతులేని యభివృద్ధి నొందినది. పై వర్తన యందలి యంతరార్థము విష్ణు సారూప్యమును సూచించును. విష్ణుచిత్తుడు పెరియాళ్వారు. తనకు సాక్షాత్కరించిన విష్ణువునకు పల్లాండునందు 'ఇరువదియొక్క తర ములనుండి స్వామీ! సుదర్శన పాంచజన్యాంకితులమయి నీ పాద భక్తి కావించుచుంటిమి' అని మనవి చేసికొనెను. ఇది వైష్ణవ

మతములోని విశిష్ట సంప్రదాయము. ఆ ముద్రల కంత విలువ కలదు. ప్రహ్లాదుని వంటి విష్ణు భక్తు డింకొకడు లేడు. ఆయన శంఖ చక్రాంకితుడు కాలేదు. ద్వాదశోర్ధ్వ పుండ్రములు ధరింప లేదు. కావున ప్రహ్లాదుని వీర వైష్ణవులు తమ మతములోని వానినిగా నంగీకరింపరేమో. అది వారి మత సాంప్రదాయము. దాని కిచ్చిన ప్రాధాన్య మసాధారణమైనది. విప్రనారాయణుడు

'తిరు మంత్ర ద్వయమును దెలియ నూహించి
చరమ గీత శ్లోక జపము సేయుచును'
'వీర వైష్ణవ మతంబార మూర్తీభ
వించె నని జనులు పొగడ'

ద్వారకా నగరమునకు వచ్చినాడట. తిరు మంత్రము నారాయణా మంత్రము. ద్వయము రెండు వాక్యములు గల మరొక మంత్రము.

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

ఇది చరమ గీత శ్లోకము. వైష్ణవుల భక్తి తత్త్వ మంతయు దీనిలో నిమిడియున్నది. చక్రాంకితుడగు సమయమునందు గురువులు వీని నుపదేశింతురు. వీనితోపాటు గురు పరంపరను గూడ చెప్పుట వైష్ణవ గురువుల యలవాటు. విష్ణువు, లక్ష్మి, గరుత్మంతుడు, విష్వక్సేనుడు, ఆళ్వారులు గురు పరంపర. వైష్ణవకవులు అందరు నెవరిని నుతించినను నుతింపకపోయినను తప్పక మొదటి నలువురను తమ కావ్యములందు వినుతింతురు. రాజగోపాలుని చంగమల వల్లిని వినుతించి

అపశబ్ద గజముల నస్మత్కవిత్వ
విపులాద్రి గుహాలలో విహరింప కుండ
సూత్రవతీశ! నీ శుభకర కలిత
వేత్రంబు కదిలించి విదళింపనయ్య

అని విష్వక్సేనుని విజయరాఘవ భూపాలుడు రఘునాథనాయకాభ్యుదయమునందు వినుతించెను. రంగాజమ్మ 'వేత్రము కేలఁబూని' యను పద్యముచే సూత్రవతీ ప్రియునే కాక

పన్నగ శాయి చరిత్రము
పన్నగ ద్రవిడ ప్రబంధ ఫణితి నుడువు నా
పన్నిద్ద రాళువార్లఁ బ్ర
పన్నుల సన్నుతులు సేసి భావింతు మదిన్

అని మన్నారు దాస విలాసమునందును

సేవాధినాయకు సేవించి భక్తిని
బన్నిద్ద రాళ్వార్లఁ బ్రస్తుతించి

అని యుషా పరిణయమునందు నుడివెను. ఈ వైష్ణవమత ప్రభావము

శ్రీనివాసుఁడైన శేషుని భజియించి
ఘన శరీరుఁడైన గరుడిఁ బొగడి
యఘ విదారియైన హరి చమూ పతి నెంచి

అని రాధికా సాంత్వనమునందును గనిపించును. వైష్ణవమునకు జన్మస్థానము ద్రావిడదేశము. ద్రావిడుల భాష అరవము. వైష్ణవుల ప్రబంధములు వేదములు గురుపరంపర కథలు. సంప్రదాయములు పూజా విధానములు ద్రావిడ భాషయందున్నవి. వైష్ణవులు ద్రావిడ భాషను మిగుల గౌరవింతురు. అరవము వచ్చిన వైష్ణవులకు మాత్రమే దేవాలయములందు, సంఘమునందు గౌరవమర్యాదలు, పలుకుబడులు కలవు. అరవము రానివారిని తేలికగా చూతురు. తెనుగుదేశమునందు సైతమ మది పరిపాటియైనది. ప్రాచీన విష్ణు క్షేత్రములందు ద్రావిడ వైష్ణవులు అర్చకులు. వారు దేవతా సన్నిధిని అరవము తప్ప యితర ప్రాంతీయ భాష మాట్లాడుటగాని, యితర ప్రాంతీయ భాషయందు స్వామిని వినుతులు గావించుటగాని మహాపరాధముగా తలంతురు, విష్ణువు వైష్ణవుల దైవమని వారి

తలంపు. అరవము వారికి దేవభాష. ఆ భాషయందే స్వామిని వినుతింపవలయును.

తిరుపతి తెనుగు దేశమునందలి విష్ణుక్షేత్రము. అందలి యర్చకులు ద్రావిడులు. వారికి బాగుగా తెనుగు వచ్చును. దేవాలయమునందు వారు అరవమునే మాట్లాడుదురు. తెనుగు రానట్లు నటింతురు. తెనుగు మాట్లాడువారిని తేలికగా తీసివేయుదురు. తిరుపతి స్వామిని తెనుగు పద్యములలో వినుతింపబోయి అగౌరవము పలువురిలో పొందినవారిని నే నెరుగుదును. కావున అరవమునకు వైష్ణవమునందున్న ఘనత మరే యితర భాషకు లేదు. విజయరాఘవ భూపాలుడు విప్రనారాయణ చరిత్ర యక్షగానమునందు మన్నారు రాజగోపాలుని ఆలయములోని పూజారి ఎంబెరుమానుల సంభాషణ అరవమునందు నడిపెను. ఈ సంభాషణ హాస్యరసము కొరకు అరవమునందు వ్రాయబడిన దని ప్రకటనకర్త లభిప్రాయ పడుచున్నారు. అది కాదు. రాజగోపాలస్వామివారి ఆలయము మన్నారు క్షేత్రమునం దున్నది. అది దక్షిణ దేశము. అట్టి పరిస్థితి యందు కోవెలలో తెనుగు వాడుట విజయరాఘవ భూపతికి నపరాధముగా తోచియుండవచ్చును. ఆయన వీర వైష్ణవుడు. వైష్ణవులు ప్రత్యేకముగా గౌరవ మొసంగు నరవమును వాడినాడు. విశిష్టాద్వైత పండితుల కిప్పటికిని అరవము తప్ప విడిచినచో, పరదేశీయులతో సంస్కృతము మాట్లాడు నలవాటు కలదు. ఆంధ్రదేశమునందు పండితులకంటె దక్షిణదేశమునందలి పండితులు మృదు మనోహరముగాను ధారాళముగాను సంస్కృతము మాట్లాడగలరు. అందు వైష్ణవ పండితులు గణనకెక్కినవారు. ఇది లోకవిదితమయిన సత్యము. అరవము తరువాత వైష్ణవులు మన్నించు భాష సంస్కృతము.

విప్రనారాయణుడు మహాపండితుడు. దేవదేవితో సంస్కృతమునందు సంభాషణ మారంభించెను. విజయరాఘవ నాయకుడు ఏబది గ్రంథములు రచించెను. అవన్నియు దాదాపు శ్రీకృష్ణునికి సంబం

థించిన కథలు. మన్నారు రాజగోపాలుని పరముగా వ్రాయబడినవి. శ్రీకృష్ణవిలాస మను యక్షగానము రచించెను. అందు నాయకుడు మన్నారు రాజగోపాలుడు. రుక్మిణీ సత్యభామలు నాయికలు. విజయ రాఘవుని కుమారుడు మన్నారు దేవుడు. ఆయన హేమాబ్జనాయికా స్వయంవర మను యక్షగానము వ్రాసెను. అదియు మన్నారు పరముగానే వ్రాయబడినది. ఆళ్వారు లందరు రంగనిమీద ప్రబంధ ములు చెప్పి పూజించి, తరించిరి. విజయరాఘవ నాయకుడు వాని యాశ్రయులు మన్నారు పరముగా విష్ణు కథలను వ్రాసి తరింప నెంచిరి. వైష్ణవమన్నను, మన్నారు రాజగోపాలుడన్నను వారి కంత ప్రీతి.

ఆండాళు నాచ్చియార్ తిరుమొడి యను ప్రబంధము వ్రాసి నది. అందు విష్ణువు స్వప్నమునందు కనిపించి యామెను పరిణయ మాడినట్లు కలదు. దానిని చూచి రంగాజమ్మ మన్నారుదాస విలాసమునందు కాంతిమతి నిద్రించుచుండగా వేకువ జామున స్వప్నమున

విజయ రాఘవ మహీ విభుఁడు వేడుక వచ్చి
  శయ్యపై గూర్చుండి సరస మమర
నక్కునఁ దనుఁ జేర్చి చెక్కిలి నొక్కుచుఁ
  బుక్కిటి విడెమిచ్చి బుజ్జగించి
కురులు మెల్లనె దువ్వి కులుకు గుబ్బల మీఁద
  నందంబు గనుపించ గంథమలఁది
తావి గల్గిన తనదు కెమ్మోవి యాని
యే విజయరాఘవుఁడ నంచు నెలమిఁ బల్కి
చిగురు విల్తుని కేళికిఁ జేరి నపుడె
బాలికామణి యంతట మేలుకొనియె

నని వ్రాసినది. ఉషాపరిణయాదులందు నాయిక కలలో గాంచిన నాయకుని వరించుట కలదు. వరించిన వానిని కలయందు కనుట మన్నారుదాసవిలాసము నందు కలదు. దీనికి మూలము ఆండాళు

ప్రబంధములో నున్నది. అందలి చాయలు మన్నారుదాస విలాసము నందు కనిపించుచున్నవి.

రంగాజమ్మ వైష్ణవి. మన్నారు రాజగోపాలుని భక్తురాలు. వైష్ణవ మతాభిమానము, వైష్ణవ శక్తి ప్రభావము, ఉషా పరిణయమునందు చూపించినది. బాణాసురుడు శివభక్తుడు. శంకరుని గురించి ఘోరమగు తపము గావించెను. శంకరుడు నీ వాకిలి కాచి యుండెద నని వర మొసఁగెను.

పార్వతి వరమున బాణాసురేంద్రున
కల యుషా కన్యక యవతరించి

నది. ఆమె యౌవనవతి యైనది. శృంగార వనమందలి ముక్కంటిని గౌరిని చూచినది. పార్వతి వలన వరము పొందినది. ఇందు మూలమున ఉషయు శివునకు పార్వతికి భక్తురాలనక తప్పదు. ఆమె చెలికత్తెలు నట్టివారయి యుండవలయును. ఉష వనవిహార మొనరించి చెలికత్తెలతో జలక్రీడలాడినది. కొలను వెలువడినది. వారందరు

బొమ్మల పట్టు కోకలను బొంకము మీరగ గట్టిమేలిహా
సొమ్ములు మేనఁదాల్చి కడుసొంపమరన్ జడలల్లి వింతగా
నెమ్మిని గీఱు నామములు నీటుగ

దిద్దినారట. గీరు నామములు వైష్ణవాంగనలు లలాటమున తిలకముగా ధరింతురు. అది వైష్ణవాచారము.

నడి ముక్కుమీఁద సన్నపు నాభినామంబు
నడుమ మంజిడికావి నిడుద రేఖ

తాల్చిఁ దేవదేవి విప్రనారాయణు సన్నిధికి వచ్చినదట. రంగాజమ్మ వైష్ణవాంగనల నామము ఉషకు, నామె చెలికత్తెలకు దిద్దినది. అది మతాభిమానము. అంతేకాదు. కథా ప్రారంభమునందు వైశంపాయనుడు జనమేజయుని వైష్ణవాగ్రేసరా! యని సంబోధించినాడు. ఆ కాలముననే వైష్ణవ మున్నదని యామె తలంపు కావలయును.

అయిన కావచ్చును. ఇట్టి యభిప్రాయము వైష్ణవులకు చాల మందికి కలదు. అది యెంతవరకు నిజమో ఆలోచింపవలసి యున్నది. పురాణములు సమన్వయము చేసి చూచినచో సత్య మవగత మగును. రంగాజమ్మకు మతాభిమానముతో పాటు విష్ణుభక్తి రసావేశమున్నది. ఉషాపరిణయములోని మొదటి మూడాశ్వాసములలోని కైతకు శ్రీకృష్ణుని యుద్ధ ఘట్టము గల నాల్గవ యాశ్వాసములోని కైతకు చాల తారతమ్యము కలదు. శయ్యాధారాళమై బిగువు కలిగి వ్యర్థ పదములు లేకుండ నడచినది. యుద్ధ వర్ణన విధానమునందు రమణీయత కలదు. శివుని మూర్త్యంతరములయిన అగ్నులతోడి కృష్ణుని యుద్ధము.

స్థూణా కర్ణాస్త్రము హరి
తూణంబున దిగిచి రొమ్ము దూరఁగ నేయన్
శోణితము లొలుక నతడున్
ప్రాణంబులు తల్లడిల్ల వ్రాలె న్నేలన్

పదముల కొరకుగాని, ప్రాసము కొరకుగాని, తడుముకొన లేదు. మొదటి మూడాశ్వాసములందు పద్య పద్యమున వెనుకకు లాగిన లేఖని యుద్ధ ఘట్టమునందు ముందుకు సాగినది.

పరశుప్రాస కుఠార తోమర గదా పాశాంకు శేష్వాస ము
ద్గర శక్త్యృష్టి ముఖాయుధంబుల మహోగ్ర ప్రక్రియ న్దాల్చి భీ
కర బేతాళ పిశాచ భూతగణ రక్షః సంఘమున్ భూరి సం
గర కౌతూహల వృత్తి నార్చెఁ బెలుచన్ గ్రార్యం బవార్యంబు
గాన్

నన్నయగారి యడుగు జాడలలో నడిచినది పద్యము. కవితావేశము కలిగినపట్ల నన్నయగారి పద్యము లిట్లే నడచును. వైష్ణవావేశము రంగాజమ్మ నిట్టి కవిత వ్రాయించినది. పోను పోను

పక్షికులాధ్యక్షుఁడు సం
ధుక్షిత నిజపక్ష తీక్ష్ణతుండాగ్రములన్

రక్షో నివహంబుల ముఖ
వక్షంబుల నఁడచి వ్రచ్చి వందఱలాడెన్

ఇట్లు ఆవేశము పెరిగినది. విజయరాఘవ నాయకుని యాస్థాన కవులలో చెంగల్వ కాళకవి యిట్టి కైత వ్రాయగలడు. శివశక్తి విష్ణుశక్తుల పోరాటములో

పవి సమహస్తమ్మున వై
ష్ణవ బలములు మిగులఁ గూలఁ జఱచిన నదియున్
జవమరి బహువికృత స్వా
రవమున గావించె మిగుల రౌద్రము గాఁగన్

అంతఁ గోపము రెట్టింప నంత కోప
మాకృతిని వైష్ణవ జ్వరం బా జ్వరంబు
మస్తకంబులు నిజఘోర హస్తములను
జదియ మోఁదుచు మఱియు వక్షంబు నడచె

నని కవిత మరింత మనోహరముగా నడిచినది. ఇంత సరళమగు శయ్య ఆమె కావ్యములు రెండింటియం దెందును కనిపించదు. దానికి కారణ మామెకు గల వైష్ణవాభిమానము కావచ్చును. అది శ్రీకృష్ణ గరుత్మంతుల పరస్పర వినుతి విధానములందు విశదముగా స్ఫురించును. గరుత్మంతుండనిన వైష్ణవుల కభిమానమెందు. ఆయన విష్ణుభక్తుడు. విష్ణువాహనము. వానిని గురు పరంపరలోని వానినిగా కొందరు పాటింతురు. కావుననే దాక్షిణాత్యులగు కవులందు వైష్ణవులు గురు పరంపరలోని వాడగు విష్వక్సేనునితో పాటు గరుత్మంతుని కూడ కావ్యములందు నుతించిరి.

స్థూల దృష్టితో పరిశీలించినచో వైష్ణవమంతయు నొక్క మతముగా గోచరించును. అంతః ప్రవృత్తులను చక్కగా పరిశోధించి చూచినప్పుడు నాలుగు ప్రధాన శాఖలుగా నగుపించును. వైష్ణవ మతతత్త్వము భక్తి. అది పురాణ పురుషుడయిన విష్ణువునందు కేంద్రీ భావము నొందుటచేత వైష్ణవమయినది. దాని నవ

లంబించినవారు వైష్ణవులు. పురాణమునందలి విష్ణు భక్తులకు వీరికి చాల తారతమ్యమున్నది. అది వైదికము. ఇది పౌరాణికము. దీనిని వివరించవలసి వచ్చినచో చాల పట్టును. అది ప్రకృతము కాదు. ఈ పౌరాణిక వైష్ణవము పౌరాణిక శైవముతో పాటు తిరుమళిశై ఆళ్వారులకంటె ఒకటి రెండు శతాబ్దములు ముందు జన్మించి యుండును. తిరుమళిశై ఆళ్వారులు ఆరవ శతాబ్దములోని వారు. కావున వైష్ణవము నాల్గవ శతాబ్దమునందు ప్రారంభించి యుండ వచ్చును. ఆ కాలపు వైష్ణవము విష్ణుభక్తి ప్రధానముగా గలది. విష్ణు పురాణాదులు రామాయణము వారికి ప్రమాణములు.

ఆళ్వారుల కాలమునందు శ్రీకృష్ణతత్త్వము ప్రచారము లోనికి వచ్చినది. వారికి నీలాకృష్ణు లుపాస్యదైవతములైనారు. నీల ఆది గోపిక. ఆళ్వారులు విష్ణువును శ్రీకృష్ణపరముగా నుపాసించిరి. వారికి భాగవతము ప్రమాణ గ్రంథము. ఇది భాగవత మతము. గోపికా కృష్ణుల ప్రణయ భక్తితత్త్వము వారిది. దీనినే ఆళ్వారుల మతమందురు. దీనిని గురించి యదివరకు ప్రస్తావించితిని. శఠకోపుడు నాథముని, శ్రీరామ మిశ్రాదులు ఈ మతమువారు. రామానుజుల ప్రబోధమువలన మరొక శాఖ యుత్పన్నమయినది. పౌరాణిక మయిన వైష్ణవమునకు వేదములతోడి సన్నిహిత సంబంధము కూర్చి గీతలతో చుట్టరికము కలిపినవాడు రామానుజుడు. అది విశిష్టా ద్వైతము. పండితాదరణము కలది. భాట్ట శాంకరమతాను యాయులైన మహాపండితు లాదారి నంగీకరింతురు. శ్రీధరస్వామి యద్వైతి, విశిష్టాద్వైతమత మంగీకరించినాడు. మధుసూదన సరస్వతి అద్వైతసిద్ధి వ్రాసిన లోకోత్తర పండితుడు. రామానుజుని బోధకు తల యూచినాడు. అట్లే విశిష్టాద్వైతులు శంకరుని అద్వైతమతమును ప్రశంసించినవారు కలరు. పరవస్తు రంగాచార్యుల వారిని గురించి మా తండ్రిగారు ఉభయవేదాంత భాస్కరులు శిష్టా నరసింహ శాస్త్రిగారు ప్రశంసింపగా వినియుంటిని. రంగాచార్యులవారు విశిష్టా ద్వైతమత ప్రచారము గావించుచు దేశమంతయు తిరిగిరి. అద్వైత

పండితుల నందరిని జయించిరి. గుంటూరు వచ్చిరి. అద్వైత మహా పండితులెవ్వరైన కలరేని నన్ను జయింపుడని ప్రకటించెను.

మాడభూషి వేంకటాచార్యులవారు విశిష్టాద్వైత మతస్థుడు. సకలశాస్త్ర పండితుడు. ఆ రోజులలో మా నాయనగారు వేంకటాచార్యులవారి యొద్ద శ్రీ భాష్యము చదువుచుండిరి. రంగాచార్యుల వారి ప్రకటన వినినారు వేంకటాచార్యులవారు. అద్వైతుల పక్షమున వాదించుటకు నిర్ణయించుకొని పత్రిక పంపినారు. పత్రిక నందుకొనినారు రంగాచార్యులవారు. ఆయనకు వింతగా తోచినది. అట్టి ప్రయత్నము విరమించుకొనుట మంచిదని రంగాచార్యులవారు వేంకటాచార్యులవారికి కబురంపిరి. ఆయన లక్ష్యము చేయలేదు. సభ నిర్ణయమైనది. దిగ్దంతుల వంటి మహాపండితులు హాజరయినారు సభకు. అందరికి విచిత్రముగా తోచినది. కాదా మరి విశిష్టాద్వైత మతస్థుడు వేంకటాచార్యుల వారు. అద్వైత మతసంస్థాపన చేయుదురట. ఎచ్చటను కని విని యెరుగని సంగతి. సభ ప్రారంభమయినది. రంగాచార్యులవారు అద్వైతమత ఖండనకు పూనుకొనిరి. మొదటి మూడు దినములు నూరు దోషములను నిరూపించిరట రంగాచార్యుల వారు. వారి వాదన మనన్య సామాన్యము. అందరు నాశ్చర్యపడిరి. వైష్ణవుల సంస్కృత భాష గంగావాహినివలె సాగిపోవును. పూర్వ పక్షము ముగిసినది.

నాల్గవనాడు వేంకటాచార్యుల వారు వాద మందుకొనిరి. ఆయన ఏకసంథాగ్రాహి. సంస్కృతమునం దెంత పండితుడో తెనుగునందంత పండితుడు. భరతాభ్యుదయ కృతికర్త. శతావధానమునకు దారి చూపినవాడు. నూరు దోషములను ఖండించుటకు చాల దినములు పట్టును. అసాధ్యములని తమకు తోచిన మూడు వాదములు నిరూపింపుడు. వానికి ప్రతివాదము తెలిపి సిద్ధాంతము చేయుదును అనినారట రంగాచార్యులతో వేంకటాచార్యులవారు. అంత వరకు శతదూషణి పైన ఖండన చెప్పినవారు లేరు. రంగాచార్యుల వారు ముఖ్యముగా మూడు దోషము లసాధ్యములయినవి తెలిపిరి.

వేంకటాచార్యుల వా రారుదినములు ఖండన ప్రతిపాదించిరి. అద్వైత మత స్థాపన గావించిరి. పండితులందరు చేయెత్తి నమస్కరించినారు. రంగాచార్యుల వా రోటమి నంగీకరించిరి. సాష్టాంగ మొరగిరి. పండితులు మహామేధావులు. వారి కపూర్వ శక్తి కలదు. వారి యాలోచనలు కడు గంభీరములు. వారివి హేతువాదములు. ఆ కారణము వలన రామానుజ భాట్ట శంకర మతములు సుస్థిరములయినవి. వానిని పండితులందరు నామోదింతురు. అవి వేదప్రమాణము లయిన మతములు.

రామానుజుల వారి శిష్యులలో నొకరు రామతత్త్వమును ప్రచారములోనికి తెచ్చిరి. వారికి శ్రీరామచంద్రు డుపాసనా దైవము. తారక మంత్రము వారు జపింతురు. వల్లభస్వామి యాంధ్రుడు. ఆయన రాధాకృష్ణమతమును బోధించెను. వారికి శ్రీకృష్ణుడు పరతత్త్వము. రాధ కృష్ణుని భార్య. రాధాకృష్ణులకు గోలోకము నివాసము. బ్రహ్మవైవర్తకపురాణము, భాగవతము, రాధామాధవ మతానుయాయులకు ప్రమాణగ్రంథములు. వైష్ణవమునం దీ నాలుగు ప్రధానశాఖలు. వీ రందరికి శంఖచక్రాంకములు ద్వాదశోర్ధ్వ పుండ్రము లుండును. జయదేవ చైతన్యాదులు రాధాకృష్ణోపాసకులు. ముద్దుపళనిది రాధాకృష్ణమతము. ఆమె వేశ్య. వేశ్యలలో చాలమంది రాధాకృష్ణ మతస్థులు గలరు. భక్తి సాంప్రదాయ మన్ని శాఖలవారికి నొకటే. రామానుజులవారు శంకరాచార్యులవారి విజ్ఞానమును భక్తి పరముగా నంగీకరించిరి. భాగవత తత్త్వమును బాగుగా పరిశీలించి చూచినచో భక్తి రెండువిధములుగా గోచరించు చున్నది. దాసభక్తి, మధురభక్తి. వీనిని గురించి యదివరకు నుడివి యుంటిని. అవి యొకొక్కటి నవవిధములు.

తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం

బనునవి. ఈ తొమ్మిది విధములను భక్తి నెరపి భాగవతమునందు గోపికలు శ్రీకృష్ణుని యనుగ్రహము సంపాదించుకొనగలిగిరి. అందు మూలమున తరించిరి. శ్రీకృష్ణుడు వారి యభీష్టములు దీర్చెను. భాగవతము దశమస్కంధము నందలి పూర్వభాగములోని ఎనిమిది వందల పదునొకొండవ పద్యము గోపికా వస్త్రాపహరణము మొదలుకొని పదునొకొండువందల యొకటి గోపికా గీతముల చివరివరకు గల మూడువందల పద్యములను పరిశోధించి చూచిన చో పైనుడివిన నవ విధముల భక్తియు నగతమగును. అది శృంగార సమాహితము. సృష్టిస్వభావ మటువంటిది. శ్రీకృష్ణుడు భక్తి పరాధీనుడగు పరమ పురుషుడు. గోపాలురు కృష్ణభక్తులు. వారి కోరిక వెంబడి గోపాలురతో నాడినాడు, పాడినాడు, చలుదులారగించినాడు. వారితోడివాడయి గోవులను పాలించినాడు. ఇంటింటం దిరిగినాడు. శ్రీరామచంద్రునకు శ్రీకృష్ణున కిదియే తారతమ్యము. రాముడు రాజకుమారుడు. ఆయన భక్తు లాయనయెడ గౌరవమర్యాదలు చూపించిరి. శ్రీకృష్ణ భక్తు లాయనయెడ చనువు చూపించిరి. గోపికలు స్త్రీలు. వారి యభిమతముల ననుసరించి రాసక్రీడ జలక్రీడాదులు గావించినాడు. మరు కేళియందు మనసు మలపించినాడు. అది వారి కానందము. వారి వారి ప్రకృతులను చక్కగా నవగాహము చేసికొనినది పళని. ఆమె స్త్రీ. స్త్రీల స్వభావ మామెకు తెలియును. వేశ్య నాయకుని చిత్తవృత్తి బాగుగా గ్రహింప గలదు. అందుక నే

వింత వింతగఁ గలిసిన యంత సరియె
యెమ్మెకాని మనోభావ మెఱుఁగ వలదె

యనినది. రాధను నాయకురాలినిగా చేసినది. రాధగోపిక. గోలోకమునందు శ్రీకృష్ణుని దేవేరి. వల్లభస్వామి మతానుయాయులకు శ్రీకృష్ణుడు పరతత్త్వము. ఆయన బాల కిశోరమూర్తియై గోలోకమునందుండును. తన భక్తుల కా రూపముననే దర్శన మొసంగును. కావుననే

రాధికా మణి కైదండ రమణఁ బూని
చిన్నికృష్ణుండు కలను బ్రసన్నుఁడయ్యె

నని నుడివినది పళని. ఈ కృష్ణుడు బ్రహ్మవైవర్తకము నందలి కృష్ణుడు. లీలాశుకాదులు వీనినే యుపాసించిరి, నుతించిరి. ఆళ్వారుల కృష్ణుడు భాగవత కృష్ణుడు. ఆయన అవతార పురుషుడు. గోలోకము నందలి కృష్ణుడే భాగవత కృష్ణుడని వల్లభస్వామి మతము. రాధ యందు నవవిధములగు భక్తిభావము లారోపించి పళని రాధికా సాంత్వన మను శృంగార కావ్యమును రూపొందించినది. ఆమె కృష్ణ భక్తురాలు. భాగవత తత్త్వమును బాగుగా నవగాహన చేసికొనిన యువతి. వైష్ణవ భక్తి స్వభావమును చక్కగా ననుభవమునకు తెచ్చుకొనినది. ఆళ్వారుల ప్రబంధము లామెకు మార్గదర్శకము లయినవి. తాను రాధయయి కావ్యమునందు స్వానుభవములను వెల యించినది. ఆళ్వారులు పురుషులు. తాము గోపికలయి యెంత ఊహా ప్రపంచమునందు సంచారము గావించినను స్త్రీలు కాలేరు. స్త్రీల చిత్తవృత్తి వారి కలవడదు. కావున వియోగానుభవములను కొంత వరకు మాత్రమే వారి ప్రబంధములందు వర్ణింపగలిగిరి. అదియు నాండాళు విరచించిన తిరుప్పావై నాచ్చియార్ తిరుమొడి ప్రబంధ ములలోని యందచందములకు సరితూగ లేదు.

ఆమె స్త్రీ, స్త్రీస్వభావము వానియందు చక్కగా నిరూపించ గలిగినది. కావుననే నమ్మాళ్వారులు ఆండాళు రచన నంతగా పొగ డిరి. ఆయన సంస్కృత తమిళ భాషల యందు మహాపండితుడు. ఆళ్వారులలో నగ్రగణ్యుడు. మహాకవి. ఆ సంగతి యదివరకు సూచించితిని. ఆండాళు కన్యక వియోగ శృంగారానుభవములను మాత్రము నైసర్గికముగా తాననుభవించిన దంతయు నాచ్చియార్ తిరుమొడియందు ప్రదర్శింపగలినది. అనుభవముమీద వ్రాసిన కైత మహా రసవంతముగా నుండును. కావుననే నన్నయ, తిక్కన, శ్రీనాథాది కవుల రచన లంత రమణీయముగా నున్నవి. ఆండాళు అనుభవ మంతవరకే కలదు. ఆమెకు సంభోగ శృంగారానుభవము

లేదు. ఆమె ఆ దారి త్రొక్కలేదు. పళని కా యనుభవ మున్నది. ఆమె మహా రసికురాలు. రాధ చిత్తవృత్తి స్వానుభవము వలన అవగాహన చేసికొనగలిగినది. రాధా మాధవ, రాధామాధవ సంవాదకావ్యములలోని వృత్తాంతములను పరిహరించినది. తన కావ్యమునకు ఇళాపాత్రను సృష్టించి నూతన స్వరూప మొసంగినది. వారివి పాడిన పాటలే. వానియందు శృంగారము ప్రధానము. రాధ భక్తి స్వభావము వారి కర్థము కాలేదు. స్త్రీ స్వభావ మంతకంటె అర్థము కాలేదు. తన కావ్యమును ఆళ్వారులకంటె ఆండాళుకంటె విభిన్నముగా సంభోగ శృంగారముతో ప్రారంభించినది. దానికి భక్తి జోడించినది. రాధ సుధాముని చేత శపింపబడి భూలోకమున గోపికయై జన్మించినది. ఆమె ప్రకృతి స్వరూపిణి. శ్రీ కృష్ణుడు పరతత్త్వము. ఆ సంగతి యామెకు తెలియును.

ఎల్ల జగంబుల న్మనుచు నేలిక కంజభవాది మౌని హృ
త్ఫుల్ల సరోజ రాజములఁ బూని వెలింగెడు తేజ

మని రాధ యెఱుంగును.

తీర్థపాదుని శ్రీపాద తీర్థమందుఁ
గల కమర నక్రములు దేలి వెలికివచ్చె

నని శ్రీకృష్ణుని మీఁగాళ్లఁ జిఱుతొడలు వర్ణించినది.

ముజ్జగంబులు వెన్నని బొజ్జనున్న
తెఱగు వివరించు దారి నా త్రివళులమరు

నట. శ్రీ కృష్ణుండు మందాకినీ పాదుడును, త్రిజగంబులు కుక్షియందు ధరించినవాడనియు. నీ వర్ణనలచేత నామెకు విశదముగా తెలియునని యవగత మగుచున్నది. యశోదకు ముల్లోకములు నోరు తెరిచి చూపించెనని భాగవతము. శ్రీ కృష్ణుని వర్ణించిన ప్రతిపద్యమునం దీ తత్త్వము స్ఫురించును. అంతేకాదు

మును నిన్నుఁగోరి చేరిన దను జాంగన ముక్కుపోయె

నని శ్రీకృష్ణుని దెప్పినది రాధ. ఇది రామావతారములోని సంగతి. 'వాలిం జంపెను వేటకాని పగిదిన్ వచించి దైత్యానుజన్ లోలంబట్టి విరూపఁ జేసెను' అని భ్రమర గీతము. ఇంత యెరిగినది కావుననే శ్రీకృష్ణుడు తన భర్తయని గుర్తించినది. కదియరాదీసినది. పెంచినది రాధ. పరమ భక్తురాలు. ఆమెది ప్రణయభక్తి. యశోదానందులది వాత్సల్య భక్తి అని వైష్ణవు లందురు. తిరుప్పాణి ఆళ్వారు శ్రీకృష్ణుని వత్సల భక్తితో పూజించినాడు. వినుతించినాడు.

పెంచిన దానవు దానిఁ గ
దించిన దానవును నీవె తెగి మమ్మాటకుం
బంచిన దానవు నీవే.

యనినాడు రాధతో శ్రీకృష్ణుడు. రాధ నందనందనుని లాలించినది. ఊరించినది. మనోవాక్కాయములచేత ప్రేమించినది.

మనకిద్దరికి మున్ను మఱుఁగుగా నడిచిన
మరుని ముచ్చటలన్ని మఱచినావె.

అని శ్రీ కృష్ణుని మాటలందు రాధ చర్యలు స్ఫుటముగా తెలియును. చివరకు కార్యరూపమున తన్నుతా నర్పించుకొన్నది. పరమాత్మయందామె భక్తి ప్రగాఢమయినది. సర్వేంద్రియములు అతని యందు కేంద్రీకరింపబడినవి. కావున

కనుఁగవ హరిమోము గనుఁగొనఁగనే కోరు
వీనులు హరిమాట వినఁగఁగోరు
నాసిక హరిమేని వాసన ఘ్రానఁగోరు
నధరంబు హరిమోవి యానఁగోరుఁ
జెక్కిలి హరిగోటి నొక్కు లెక్కలె కోరు
గుబ్బలు హరి ఱొమ్ముఁ గ్రుమ్మఁ గోరుఁ
గరములు హరి నెంతొ కౌఁగలింపఁగఁ గోరు
మేను శ్రీహరి ప్రక్క మెలఁగఁగోరు.

అనినది చిలుకతో రాధ. "కమలాక్షు నర్చించు కరములు కరములు, కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే" అను రెండు సీసపద్యములు భక్తికి లక్షణములుగా ప్రహ్లాదుడు నుడివెను. పై పద్యము వీనికి లక్ష్యము. అందు భక్తి శృంగారాంతర్గతమయి గోచరించును. అది మోహము వలన పొడమిన శృంగారేచ్ఛ కాదు. శ్రీకృష్ణుడు పరంధాముడని చిత్తశుద్ధిగా నెఱింగి సర్వాంగముగా తన్నుతా నర్పించుకొనిన భక్తి శృంగారము. కావుననే ప్రతివాక్యమునందు హరియని వాడినది పళని. సర్వావయవములు నంతరంగము శ్రీహరి యందు కేంద్రీకరించిన భక్తిభావము కలది రాధ. ఆ కారణము చేత హరిని తనయందును సర్వత్ర చూడగలిగినది.

హరి యిదో నాదు లో వెలి నహర్నిశముం గనుపట్టు
చుండెడిన్.

అన్నది చిలుకతో రాధ.

ఇందుఁగలఁ డందు లేడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం

డని భాగవతము. 'విష్ణుమయం జగత్సర్వం' అను సంగతి పరిపూర్ణ ముగా ననుభవమునకు తెచ్చుకొనిన పరమభక్త యోగిని యామె. కాని

విరహ మిదేలనో మిగుల వేదనబెట్టు దురాగతంబుగన్

అన్నది. అది మానవప్రకృతి. స్త్రీ జాతికి స్వభావము. ఇచటనే అద్వైతమునకు, వైష్ణవమునకు భేదము కనిపించుచున్నది. మానవుడు ప్రగాఢముగా ప్రేమించు వస్తువునుగాని, రూపమునుగాని, చూచి ఆంతరంగికముగా ననుభవించు ఆనందము ఆంగికసుఖసాధనముచేత పరిపూర్ణత్వము పొందును. ఇది వైష్ణవ తత్త్వము. శ్రీరాముడు దండకారణ్యమున ప్రవేశించెను. అచటి మునులు రామచంద్రుని

గనులార చూచిరి. ఆనందించిరి. వాని యంద చందములకు పరవశత్వము నొందిరి. వానిని నిండార కౌగలించుకొన నభిలషించిరి. శ్రీరామచంద్రు డది గుర్తించెను. నేనిపు డేక పత్నీవ్రతుడను. ముందు కృష్ణావతార మెత్తుదును. అపుడు మీ కోర్కె తీర్తును. అనినాడట. ఈ సంగతి రామాయణమునం దెచ్చటను కనిపించదు. బ్రహ్మవైవర్తక పురాణమునం దున్నది. ఆ మహామునులు గోపికలై జన్మించిరట. ఈ విషయమున భక్తుల యభీష్టము నెరవేర్ప నిచ్చగింపనివాడై నాడు రాముడు. కావున రాముడనిన ఆళ్వారుల కేవగింపు. అందుకనే రంగని శ్రీకృష్ణపరముగా సేవించిరి, తమ యందు గోపికాత్వ మారోపించుకొనిరి. గోపికా గీతములవంటి వియోగ శృంగార ప్రబంధములు రచించిరి.

ఆండాళు సైతము తాను గోపికయై తిరుప్పావై యను ముప్పది పాశురములు రచించినది. తానభిలషించిన పరమాత్ముడు తనకు లభింపనప్పుడు విరహవేదన తప్పనిది. భాగవతమునందు గోపిక లనుభవించినదియు నదియే. దానినే ఆండాళు అనుభవించినది. ఆమె పడిన యా వేదన చక్రవాకములను హంసలను అడిగిన ప్రశ్నలు తాను కనిన కలలు రంగనితోడి పరిణయము నాచ్చియార్ తిరుమొడి, యను పేర రచించినది. అదియే రాధ యనుభవించినది. అది శారీరకము. అది అంగాంగ సంయోగముచేతగాని తీరదు. అదియే రతి. మధురభక్తికి స్థాయీ భావము. దానినే అభిలషించినది రాధ. అది లభించలేదు. అందుకనే వేదన అనుభవించినది. శ్రీకృష్ణుడు గోపికలనుఅంగజకేళీ వినోదముల చేతసంతుష్టిపరచినాడు. 'హరిని సోకిన స్థావరంబయిన ముక్తంబగు' నని భాగవతము నుడువుచున్నది. హరి సంపర్కముచేత గోపికలు కృతార్థులయిరి. కావున రాధయు ముక్తి బడయనెంచి శ్రీకృష్ణుని సంపర్క మభిలషించినది. ఈ సందర్భమున భాగవతమునందు వలెనే పళని 'కనుఁగవ హరి

మోము కనఁగోరు' ఇత్యాదులందు హరి యని వాడుటలో విశేష మున్నది. హరి యను శబ్దమునకు పాపములు హరించువాడని యర్థము. అగ్నితోడి సంబంధమువలన బంగారము మాలిన్యమును బాసి పరిశుద్ధమగునట్లు, హరి సంపర్కము వలన సకలపాపములు క్షయించును. పాపక్షయము పొందినవానికి మోక్షమును ప్రాప్తించును. చట్రాయి అహల్యయగుట, మద్దిచెట్లు గంధర్వులగుట, దీనికి తార్కాణములు. అందు మూలమున హరితోడి సంయోగమును బొంది గోపికలు అభీష్టసిద్ధిని పొందిరి. రాధ గోపిక. హరితోడి సంబంధ మభిలషించినది. అది లభించినది. కృతార్థురా లయినది. మనోవాక్కాయ కర్మంబులచేత హరియందు నిరంతరము భక్తి చేయు జీవి అన్య మభిలషింపదు. కావున రాధయు

వీడుదు బంధుల మగనిన్
వీడుదు ధన ధాన్య గేహ విభవము లెల్లన్
వీడుదు ప్రాణము లోడలన్
వీడంగాఁ జాల హరిని వే యననేలా?

అన్నది రాధ. అవును, మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు మదనములకు బోనొల్లదు. ఇట్లే గోపికలు

మరలఁగ లేము, మామ గల మాటల నొల్లము, పద్మగంధముల్
మరగిన తేటు లన్యకుసుమంబుల చెంతను జేర నేర్చునే.

అని శ్రీకృష్ణునితో పలికిరి. అంత నిరంతమును ప్రగాఢమునయినది ఆ భక్తి.

నను సేవించుచు నున్నవారలకు నే నా రూపముం జూపఁ జూ
చినఁ జాలించి మదించి వారు మఱినన్ సేవింపరో యంచు, ని
ర్ధనికుం డాత్మధనంబు సెడ్డనెపుడుం దత్పారవశ్యంబుఁ దా
ల్చిల భంగిన్నను బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు

నారూపమున్

అంగనలార! పరమకారుణికుండఁ...
మానస బంధుఁడ నిత్య
ధ్యానము మీకొసఁగవలసి తలఁగితిఁ జుండీ

అనినాడు శ్రీకృష్ణుడు గోపికలతో, ఈ భాగవత వాక్యము చిత్తమం దుంచుకొని శ్రీకృష్ణునితోడి వియోగము కల్పించినది రాధకు పళని. అది సంయోగానంతర వియోగము. భాగవతములోని గోపికా గీతముల కనుకృతి. రాధ శ్రీకృష్ణుని తలంచి విరాళి పొందినది.

రాశిఁ జేసిన శృంగార రసమనంగ
నొకటి యైనట్టి మన్మథాయుత మనంగఁ
జక్షులకుఁ దోఁచు కరుణాతిశయమనంగఁ
బొలుచు గోపాల రూపంబు

ముప్పది నాలుగు పద్యములలో చక్కని యుపమాద్యలంకార సహితముగా వర్ణించినది. ఆ వర్ణన రాధది కాదు. ఏకాగ్రమగు చిత్తముతో భక్తి పరవశమున తాను రాధయై శ్రీకృష్ణ పరమాత్ముని కనుల యెదుట నిలుపుకొని పళని వర్ణించిన వర్ణన. ఆ దీక్ష వాని యందు కనిపించును. తిరుప్పాణి ఆళ్వారులు రంగని దర్శించినాడు. ఒడలు తెలియని యానందము ననుభవించినాడు. భక్తి యంతరంగమున నిండారినది. కవిత పొరలుకొని వచ్చినది. 'అమల నాథపిరాన్' అను పది పద్యముల ప్రబంధము చెప్పినాడు. త్యాగరాజు తిరుపతి స్వామిని చూచినాడు. పులకితాంగుడైనాడు. 'శివుడవో మాధవుడవో ఎవరని పొగడుదు' నని యెత్తుకొనినాడు. అన్నమాచార్యుల సంగతి చెప్పనక్కరలేదు. ప్రథమ దర్శనమున స్వామిని గురించి భక్తి రసావేశమున పదిపాట లాశువుగా పాడినాడు. ఆవేశమంతరంగమున నిలువనీయదు. శమించునంతవరకు తరంగ పరంపరవలె నేక ధాటిగా వెలువడును.

పళని యట్టి మహత్తర రసావేశము నొంది యీ పద్యములు వ్రాసినది. ఆ పద్యములే కాదు; ప్రబంధమంతయు శ్రీకృష్ణ భగవానుని భక్తి సమాంతరిత చిత్తమునందు నిలుపుకొని అన్య చింతనములేని రసావేశమున తాను రాధయై యీ యీ ఘట్టముల ననుభవించుచు ప్రబంధించిన కావ్యము రాధికా సాంత్వనము. కావుననే అంత ప్రగాఢముగాను, మనోహరముగాను, ప్రతిఘట్టము వ్రాయగలిగినది. ఆమెది వైష్ణవతత్త్వము. గోపికల భక్తి పరిస్ఫుట ముగా నర్థము చేసికొనినది. శ్రీకృష్ణతత్త్వము ననుభవమునకు తెచ్చుకొనినది. ఆండాళు చిత్తప్రవృత్తి పరిపూర్ణముగా గ్రహించు కొనినది. వైష్ణవ సాంప్రదాయము నడుగు జాడ లవలంబించినది. రాధికా సాంత్వన కావ్యము రచించినది. భాగవత స్వరూపము, శ్రీకృష్ణతత్త్వము, వైష్ణవ మతము, తెనుగు సంస్కృత సారస్వత ముల స్వభావము, తెలియక పళని వేశ్య యనియు, సిగ్గువిడిచి పచ్చిశృంగారము వ్రాసినదనియు, నామెను నిందించుట అతి సాహసము. తెనుగు దేశమున వేమన పద్యములు చదువని వారుం డరు. వానితో నవినీతికరము లనిపించు జుగుప్సాకరములగు పద్య ములు చాల కలవు.

వేమన మహాకవి యనియు, వేదాంతియనియు, జగము నుతించుచున్నది. క్షేత్రయ్య మహాభక్తుడని ఆబాలగోపాల మెరిగి నదే. ఆయన పదములలో పచ్చి శృంగారపదము లెన్ని లేవు? గార్గ్య భాగవతమునందు రాధా మాధవుల సంభోగ శృంగారము పురు షాయితాదులతో వర్ణింపబడినది. వ్యాసభాగవతమునందు గోపికల వృత్తాంతము శృంగార రసకలితముగా వర్ణింపబడినది. వీని నన్నిటిని దృష్టాంతపూర్వకముగా వ్రాయవలయుననిన చో గ్రంథము విస్త రించును. వలయువారు 'పళని పచ్చిశృంగారము' అనునావ్యాసము నందు విపులముగా చదువఁగలరు. పురాణ విషయములకు కావ్య

స్వరూప మొసగినది పళని. అవి యన్నియు నింద్యములు కాక రాధికా సాంత్వన మేల నింద్యము కావలయునో తెలియకున్నది. సరిగా అర్థము చేసికొనని వారి కన్నియు పచ్చిశృంగారము లే. అర్థము చేసికొనగలవారికన్నియు నాహ్లాదకరములుగా నుండును. శ్రీకృష్ణతత్త్వము చక్కగా అనుభవమునకు తెచ్చికొనినవారు ఆళ్వారులు. వారి యనుయాయులు వైష్ణవులు. పళని వైష్ణవి. ఆమె శ్రీకృష్ణ భక్తురాలు. శ్రీకృష్ణుడు సంపూర్ణ పరతత్త్వ స్వరూపుడని రాధ పరిపూర్ణ ప్రకృతి స్వరూపురాలనియు పళని యెరుగును. ఆ రెండు నామములకు గార్గ్య భాగవత, బ్రహ్మకైవర్తక పురాణములు బహువిధముల వ్యుత్పత్తి అర్థములను ప్రతిపాదించినవి. కావున

అధరామృతంబు నీవానితివో కృష్ణ
అది లేఁ జిగురు వగ రంతె రాధ

ఇత్యాది పద్యములందు పళని యానామములటులనే వాడినది. ఇతర పర్యాయ పదములేవి వాడినను ఆ యర్థము రాదని పళని యెఱుఁగును. ఆమెకు విశిష్టాద్వైతమత తత్త్వము బాగుగా తెలియును. కావ్యమయిన తెల్లవారి

శౌరి సారూప్యమంది తన్ చేరవచ్చు
నిళను

గనుగొనినారట యలివేణులు. పాదము చిన్నది. భావ మనంతమై యిమిడి యున్నది. మృత్తునుండి సృష్టింపబడిన ఘటము విభిన్నమయి మృత్తునందు కలిసిపోవునట్లు, పరమాత్మ నుండి పొడమిన జీవుడు పుణ్యాకర్మ లాచరించి చివరకు పరమాత్మయందు నైక్యము పొందునని అద్వైతమతము, శంకరుని వాదము. జీవుడు సత్కర్మల నాదరించి తరతమాధిక్యతల కనుగుణముగా సాలోక్యము, సామీప్యము,

సారూప్యములను పొందునుగాని, బ్రహ్మమునం దైక్యము పొందదని విశిష్టాద్వైతము. రామానుజులవారి వాదము. ఇళ శ్రీకృష్ణునితోడి పొందికచేత శౌరి సారూప్యమును పొందినదట. 'హరిని సోకిన స్థావరంబయిన మకంబగున్' అని భాగవతము. శ్రీహరి యగు కృష్ణునితోడి సమాగమమున ఇళ సారూప్యము పొందినది. అదియే ముక్తి. అందు ఇది జీవన్ముక్తి. హరి కరుణామయుడు. తన్ను సేవించువారికి దురితము లడంచి పరమపద మొసంగును. గీత చరమ శ్లోకార్థమదియే. కావున ఇళకు తన సంయోగము చేత సారూప్య మొసంగినాడు శ్రీకృష్ణుడు. అదియే జనన మరణ విరహితమగు ముక్తి యను భావము, ఆ పద్య పాదమునం దిమిడి యున్నది. అది వైష్ణవ మత తత్త్వము. ఆ రూప సాదృశ్యము సీస పాదములందు వర్ణింప బడినది.

మహిత గండస్థలీ మకరికా పత్రికల్
        మొసలి వాహోగుల పసలు దెలుప
మెఱుఁగు చన్మొనఁ గ్రమ్మి మెరయు తమ్మరసంబు
        పటుతర కౌస్తుభ ప్రభ ఘటింపఁ
దలిరు వాతెఱనొప్పు బలు కెంపులలవేణు
        వివరంపు నొక్కుల విధ మొసంగ
నలిగి వెన్నునఁ గుల్కు తెలిముత్తియపు జడ
        పన్నగ తల్పంబు చెన్ను దనర
హారగతి మణి శ్రీవత్స సారకాంతి

దశ దిశలు నిండి వెలింగినదట. ఇది సురతాంతమునం దిళా దేవి రూప వర్ణనము. శ్రీకృష్ణ రూపమును బోలియున్నదట. ఈ పద్యము నందు విశిష్టాద్వైతమత తత్త్వాంతర్గతరతి శృంగారము వర్ణింప బడినది. పళని భక్తి స్వరూపము బాగుగా నెరిగిన యంగన. వియోగానల సంతప్తములయిన రాధ శరీరాంగముల నరసిన చెలికత్తెలు

అల జక్కవల పెక్కువలఁ ద్రొక్కు బలునిక్కు
గల గుబ్బ పాలిండ్లు గలఁ గెనమ్మ

అని యిట్లు పలు విధముల నోదార్చిరి. అందుకు రాధ

తనివార హరిమోము గనలేని కన్నులు
కలఁగిన నేమాయెఁ గాంతలార
చెలువుని కౌఁగిట మెలఁగని దేహంబు
చిక్కిన నేమాయెఁ జెలియలార
గోపాలకస్వామి గ్రోలని కెమ్మోవి
స్రుక్కిన నేమాయె సుదతులార
యెమ్మెకాని యురమ్ము గ్రుమ్మని పాలిండ్లు
కమలిన నేమాయె రమణులార

యెఱిఁగి యెఱుఁగక పలికెద రింతె కాని
యెడవిడని బాళి రతికేళి నెలమి నేలి
నట్టి నా దేవు నెడఁబాసినట్టి వెనుక
జీవనంబేల తనువేల జీవమేల

అని సమాధానము చెప్పినది. ఇది శృంగార రసము ప్రధానముగాఁ గల పద్యము. ఇందు భక్తితత్త్వ మంతర్గతమయి వైష్ణవమత సాంప్రదాయమును ప్రదర్శించుచున్నది. శ్రీకృష్ణ భగవానుని సేవ కుప యోగించని యవయవములు ఉన్నను ఉడిగినను ఒకటేయని యందలి ఫలితార్థము. 'గ్రుడ్డికన్ను దామూయఁక విచ్చిన న్మరచి మూసిననేమి' అని పళని యభిప్రాయము. హరికి నుపయోగించని యవయవములు నిష్ప్రయోజనములు. ప్రహ్లాదుడీ భావమునే

కమలాక్షునకుఁగాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మ భస్త్రిగాక

ఇత్యాది పద్యములందు నుడివెను. ఇది దాసభక్తి. పైది మధుర భక్తి; లేక ప్రణయభక్తి. గోపికలు

నీ యధరామృత నిర్ఝరంబుల నేడు
సేరి వా తెరలపై జిలుకకున్న
నీ విశాలాంచిత నిర్మల వక్షంబుఁ
గుచ కుట్మలంబులఁ గూర్పకున్న

అను పద్యమునందు పై భావమునే వ్యక్తీకరించిరి. వారు స్త్రీలు, వారి సకలాంగములు శ్రీకృష్ణపరముగావించి సఫలము గావించు కొనుట వారి యభిమతము. త ద్విధమగు సేవ వారికానందము. అందుమూలమున ముక్తి లభించుననుటలో సందేహము లేదు.

ఏ వేదంబులఁ గానని
దేవోత్తము గాంచి ముక్తి తెరువడుగక రా
జీవేక్షణ రతి యడిగెను

శ్రీకృష్ణు నంగరాగాదుల నర్చించిన కుబ్జయామె. ఆమె యభిలాష స్త్రీ సహజము.

కారుణ్యంబున కృష్ణుఁడు
తారుణ్యము మెఱసి మదన తంత్రంబుల లీ
లారణ్య వీధిఁ దేల్చెను.

పరమ పురుషుడు శ్రీకృష్ణుడు.

ఏ యే వేళల నే సరోజముఖి యే యే లీలలం గోరుఁదా
నా యా వేళల నా సరోజముఖి నా యా లీలలం దేల్చి

పరమపద మొసంగును. అది ఆయనకు సహజ గుణము. కుబ్జ పరమ భక్తురాండ్ర జాబితాలో చేర్చబడినది. ఆమెకు మోక్షమిచ్చినాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణతత్త్వోపాసకులయిన వైష్ణవసాంప్రదాయములో నున్న విశేషమే యది. రాముడు శబరికి మోక్ష మిచ్చినాడు. ఆ తత్త్వము వేరు. ఈ తత్త్వము వేరు. శ్రీకృష్ణ తత్త్వమునందు సంయమన పరిత్యాగ మొక దోషము కాదు. 'సర్వధర్మాన్ పరి

త్యాజ్య' అను గీత శ్లోకములోనే యున్నది. దాని కే యితర అర్థము చెప్పినను లక్ష్యము సరిపోదు. విప్రనారాయణుని కథ దృష్టాంతము. రెండు తత్త్వములందు ఫలిత మొకటే. 'రామో విగ్రహవాన్ ధర్మః' రాముడు ధర్మస్వరూపుడు. కృష్ణుడు ప్రేమ స్వరూపుడు. ప్రేమ జగమునం దెల్లెడలను వ్యాపించి యున్నది. అది పిన్నల యందు వాత్సల్య రూపము వహించును. భార్యా భర్తల యందు ప్రణయాకృతి తాల్చును. పరమేశ్వరుని యందు భక్తిగా పరిణమించును. రాధ శ్రీకృష్ణుని భగవంతుడని యెరుగును. కావున చిత్తశుద్ధి కలిగి పరమమగు భక్తి నెరపినది. ఆమె స్త్రీ. శ్రీకృష్ణుడు పరమపురుషుడు. స్త్రీసహజమగు నకలంకమయిన ప్రణయము ప్రదర్శించినది కృష్ణునియందు. రాధది ప్రణయభక్తి. అది వైష్ణవ సమ్మతము. మొదట సంభోగ శృంగారముగా నారంభించి వియోగ రూపమును వహించి తరువాత నసూయగా పరిణమించి చివరకు రోషముగా మారినది. ప్రతి ఘట్టమునందు రాధకు నందనందనుని యెడగల నిరంతర భక్తి ప్రణయములు తొణికిసలాడుచుండును. పళని ప్రజ్ఞా విశేషములు గోచరించుచుండును. చివరి ఘట్టమునందు శ్రీకృష్ణుని రాధ దెప్పుచు పలికిన మాటలలో స్త్రీ హృదయము మూర్తులను గోచరించును. వానిని చదువునప్పుడు ఎంతవారి కయినను హృదయము కరిగి ద్రవీభూతమయి కనుల వెంట నీరుగా దిగజారుననుటలో నతిశయోక్తి లేదు. ఒక విధమగు నిస్పృహ, విరాగము భక్తి ప్రణయము పద పదమునందు పరవడులు త్రొక్కుచుండును. ఆ పద్యము లటువంటివి. వానిలో రసభావములు తొణికిసలాడుచుండును. నైసర్గికమగు స్త్రీ చిత్తవృత్తి గోచరించును. పళని తన స్త్రీత్వమంతయు వానిలో పిండిపోసినది.

సొరిది నిందరి కనుకట్టి సున్నఁ బెట్టి
నేను నిను చేర నీవందు దానిఁ గోరఁ
బ్రతుకు బాగాయె ధూర్త గోపాలరాయ

అన్నది రాధ. ఎంత స్వభావసిద్ధమగు రచన! ఎటువంటి వ్యావహారిక పదజాలము! "ముప్పున జవ్వనంపు సుఖముల్ దలపోసిన నేమి శ్రీహరీ!" యట. నిన్ననఁ బనియేమి కలికి కృష్ణ! ఎంత చక్కటి సంబోధన? దానిలో ప్రణయ మొలికిసలాడుచున్నది. వలపు పగవారికైన వలదు కృష్ణ. ఎంత చక్కని జాతీయతభావము. నవ్వు పుట్టించును. జాలి కలిగించును. ఆ నిస్పృహాలో విరాగము రాగము నుత్తరంగితములగు చున్నవి. రసగ్రహణ పారీణులగు సాహితీవేత్తల మనస్సు నుబ్బించు చణుకులిట్టివి ప్రతి పద్యమునందు కలవు. అవి మిలమిల మెరయు చుండును. వాని నన్నిటిని వివరించుటకు గ్రంథము చాలదు. వ్యావహారిక పదజాలములో రస మొలికిసలాడించు మేలుకవనంపు రచనల నారితేరిన రసికురాలు పళని. కవితాలోకమునం దామె జన్మము ధన్యమయినది. భాగవతమునందు గోపికలు కృష్ణుని దెప్పుచు పలికిన పద్యములు పదికలవు. వానియందు కావ్యత్వమేకాని స్త్రీ మానసిక ప్రవృత్తి అంతగా కనిపించదు. ఇట్లనుటచేత పళని పోతనగారికంటె ఘటికురాలని నాయభిప్రాయము కాదు తెనుగు సారస్వతమునందు పెక్కు కావ్యములు గలవు. వానిలో స్త్రీ నైసర్గిక చిత్తస్వభావము నెలకొల్పినవారు మొల్ల, పళని. వారి రచనలు తెలుగువాణికి చరణ మంజీరములు. వానిలో పొదిగిన రత్నసంపద అమూల్యమయినది. విజ్ఞానవంతులు వాని జాతీయత గ్రహించుకొనగలరు.

పళని బ్రహ్మవైవర్తక పురాణము గార్గ్యభాగవతము వ్యాస భాగవతము, ద్రవిడ ప్రబంధములు చదివి సమన్వయము చేసికొనిన పండితురాలు. గొప్పకవయిత్రి; ఆమె రాధికా సాంత్వనము వైష్ణవ తత్త్వప్రతిపాదకమయిన గ్రంథము. ప్రతిఘట్టమునందు నిర్మలమగు మంచునీటి ప్రవాహమునందు మిలమిల మెరయు నిసుక మట్టమువలె శృంగార రసాంతరితమయి భక్తి కనిపించుచుండును. చివరికి 'సరస భాండీరవట తరుచ్ఛాయలందు రాధాకృష్ణులు కూడి' విహరించిరట. పళని విజ్ఞానము తెలుపుట కీ పద్యపాద మొక్కటి చాలును. భాండీర వట విటపి బృందావనములోనిది. రాధ యొకనాడు బృందావనము

నకు వచ్చినది. భాండీరవట వృక్షచ్ఛాయకు చేరెనట. అచట ఆమెకు దివ్యశరీరము వచ్చినది. బ్రహ్మాది దేవత లచటకు చేరిరి. ఆమెను పలువిధముల ప్రకృతి స్వరూపిణిగా వినుతించిరి. నందుడు బ్రహ్మ యానతి ననుసరించి బాలకృష్ణుని రాధచేతి కొసంగెను. శ్రీకృష్ణుడు యౌవనవంతుడయ్యెను. గర్గుడు పురోహితుడు. బ్రహ్మసమక్షము నందు రాధా మాధవులకు పరిణయమొనరించెను. ఆ చెట్టునీడ లతానికుంజాంతరములందు రాధా మాధవులు వివిధ కేళీవినోదగతుల విహరించిరి. రాసక్రీడలు సలిపిరి. మరల శ్రీకృష్ణుడు బాలుడయ్యెను. రాధ పలు విధముల వాపోయెను. ఆకాశవాణి మాటల కామె ఊరడిల్లెను. రాధ శ్రీకృష్ణు నెత్తుకొనిపోయి యశోదకొసంగెను. ఇది పరమ రహస్యము. అన్యులకు తెలియరాదని బ్రహ్మయానతి. ఈ సంగతి వ్యాసభాగవతమునందు లేదు. గార్గ్యభాగవతమునందు విపులముగా కలదు. పళని పై పద్యపాదమునందు 'భాండీరవట తరుచ్ఛాయలందు' అని నుడువుట చేత ఈ కథ సూచించినది. ఇట్టి వైష్ణవ పురాణ విషయములు రాధికా సాంత్వనమునందు అంతర్గతములయి అందందు కనిపించును. శ్రీకృష్ణ తత్త్వప్రతిపాదకమయినది రాధికా సాంత్వన కావ్యము.

పదునేడు పదునెనిమిది శతాబ్దములందు తంజావూరు రాజ్యమున వైష్ణవమతము ప్రాబల్యము వహించినది. వైష్ణవస్వాములు మతగురువులు. వారి మాట రాజుల యొద్ద, దేశమునందు చలామణి యగుచుండెను. వైష్ణవ మతసాంప్రదాయము లెల్లెడల ప్రాకిపోయినవి. కవులు వైష్ణవులు. కావ్యమునందలి యితివృత్తములు విష్ణు సంబంధములగు కథలయినవి. వైష్ణవసాంప్రదాయములు కావ్యముల లోని కెక్కినవి. పాత్రల మీద ప్రసరించినవి. పదముల మీద వ్యాపించినవి. వైష్ణవ మతమునకు తమిళము జీవము. వారి మత గ్రంధములన్నియు తమిళ భాషయందున్నవి. సంస్కృతభాష కంటె కూడ తమిళమును వైష్ణవు లెక్కువ గౌరవింతురు. వైష్ణవ మత సాంకేతిక పదములన్నియు తమిళమందున్నవి. తమిళము రాక

పోయినను ఆ పదములను వైష్ణవులందరు నట్లే వాడుదురు. అవియే కావ్యములలోని కెక్కినవి. సారంగు తమ్మయ వైజయంతీ విలాసము నందు తిరువడిగళ్, కైంకర్యము, సాపాటు, తిరుకట్టె, తిరుమాళిహా, తిరువంజనము, తిరుపుట్టము, ఇటువంటి యరవ పదములు వాడినాడు. అవి వైష్ణవ ముద్రకల పదములు. వానిని మార్చుటకు వీలులేదు. వైష్ణవము మార్చుట కొప్పుకొనదు. మార్చుట సాంప్రదాయ విద్రోహము. తంజావూరు నాయక ప్రభువులు వీరవైష్ణవులు. వారి యాశ్రితులగు కవులు వీరవైష్ణవులు. విజయరాఘవ నాయకాదులు తమ కావ్యము లందు పై పదములే కాక తిరుమాళిగలు మన్ననారు, కోవెల, మణుగులు, మళిగలు, కోణె, ఉప్పవడము, తిరుమణి, తిరుచూర్ణము. తిరువారాధన యిటువంటి పదము లందందు వాడిరి. విప్రనారాయణ చరిత్ర యక్షగానమునందు సంపూర్ణముగా పూజారుల సంభాషణ యందరవమే వాడబడినది. ఏమయిననేమి తెనుగు కవనంపుం బూంబోణి దక్షిణాత్యులగు వైష్ణవ కవుల సంగాతము వలన నలవరుచుకొనిన శృంగారపు బోకడలు తంజావూరు కవుల చేతిలో పరిపూర్ణతనొంది వ్యావహారిక భాషాపాండిత్యంపుం బొందికల నవీన వికాసములతో నందచందములు గలిగి సర్వజన సామాన్యమై భావి కవుల రచనలకు దారి పరపించినది.



# మావద్ద లభించు
# మాస్వంత ప్రచురణలు

1. సుందరకాండము (టీకా) రు. 25-00
2. సుందరకాండము (మూలము) రు. 12-00
3. తిరుపతికవుల సాహిత్య సమీక్ష రు. 36-00
4. తంజావూరు తెలుగు కవులు రు. 36-00
5. కలలు వాటి ఫలితాలు రు. 10-00
6. అరుణా ఆంగ్లభాషా స్వబోధిని రు. 17-00